# ముగ్గురు మిత్రులు

(మాక్సిం గోర్కీ)



అనువాదము :

గద్దె లింగయ్య

సా పబ్లిషర్సు

విజయవాడ—1

# పాఠకులతో....

విశ్వవిఖ్యాతి చెందిన రష్యన్ రచయిత మాక్సిం గోర్కీ ఆంధ్ర సోదరీ సోదరులకు చిరపరిచితుడే.

ఇది గోర్కీ నవల 'THREE OF THEM'కి అనువాదము. ఈ 'ముగ్గురు మిత్రులు' పందొమ్మిదో శతాబ్దంలోని రష్యన్ సమాజాన్ని చిత్రించిన సాంఘిక నవల. ఇది ఆనాటి రష్యన్ సమాజములోని కుళ్లును బహిర్గతం చేయడానికే రచింపబడినా—దేశ—కాల పరిస్థితుల్లో కొద్దిపాటి వ్యత్యాసమున్నా నేటి మన హెచ్చుతగ్గుల సమాజంలోని కుళ్ళును నగ్నరూపంలో మన కళ్ళకు చూపెడుతోంది.

గోర్కీ శైలిని అతి సహజంగా వుంటుంది. ఈ నవలలో ఆయన సృష్టించిన పాత్రలలో ప్రధానమైనవి మూడు: ఇలియా, జాకోబు, పాష్కా. మానవుని మనశ్శరీరాలపైన పరిసర ప్రభావ మెల్లా పనిచేస్తుందో ఆ ముగ్గురి జీవితాలను బాల్యమాదిగ వర్ణించి కథాసంవిధానమును నడిపాడు. రచయిత స్వయంగా పేదకుటుంబములో జన్మించి కడుపు చేత్తో పట్టుకొని వాడవాడల గ్రుమ్మరిన అనుభవాన్ని యిందులో గుప్పించాడు. హెచ్చు తగ్గుల సమాజంలో దారిద్ర్య హేతువుచే మానవు లెట్లు పతనమై నశించుచున్నదీ తేటతెల్లంచేశాడు.

ఈ యిరవయ్యో శతాబ్దంలో కూడ సంఘంలో మితిమీరియున్న తాగుడు, వ్యభిచారము, మోసము, వంచనల కెట్లు మానవులు పాల్పడుచున్నదీ, వృద్ధ—బాల్య వివాహాలు, న్యాయవిచారణ, మాయా నాటకము, పగలంతా దుర్నీతి కొడిగట్టి సాయంత్రం దేవునిముందు సాష్టాంగ ప్రణామాలతో పాప పరిహారం కోరడము, యింకా యిల్లాంటి అవకతవక లెన్నిటినో గోర్కీ యీకథలో విస్పష్టం గావించాడు.

నీతి, నిజాయితీగల వ్యక్తికీ సంఘంలో స్థానం లేదని ఋజువుచేశాడు. సమాజంలో పరస్పర ప్రేమ, సహకారాలకు బదులు యీర్ష్య, స్పర్థలు బలిసి మానవత్వమే అడుగంటి పోతోందన్న నగ్న సత్యాన్ని బయటపెట్టాడు.

ఇందలి ప్రతి సమస్య ప్రస్తుత నాగరికతా [illegible] నూటికి తొంభైమంది ప్రజల నెదుర్కొంటున్నదే. ఈ [illegible], [illegible] నానికి సంఘంలోని అవకతవకలే — దారిద్ర్యమే [illegible] తోంది. ఇలియా నిజాయితీగా బ్రతకాలనుకున్నాడు. [illegible] చేయడం గిట్టనివాడు. సత్యంకోసం నిలబడి మిన్ను [illegible] తొణకని దిట్ట; కాని, జీవితంలో అడుగడుగున [illegible] తిన్నాడు. నైతిక పతనానికి దిగజారాడు. తుదకు సంఘానికి [illegible] అతని మిత్రులు పాష్కా-జాకోబులూ అంతే. అధఃపా[illegible] వేయబడ్డారు. ఇలియా బలి మానవుడనుకొనే ప్రతివాడికి - నాగరిక[illegible] సమాజానికే సవాలు !

నేటి మనసంఘంలో వున్న కుళ్ళునుకడిగి, దురాచా[illegible]లను-[illegible] పారద్రోలి, అవకతవకలను - హెచ్చుతగ్గులను [illegible] సృష్టికిచేసే కృషి కిది యేమాత్ర ముపయోగపడినా [illegible] ఫలప్రదమయినట్లే భావించుతాను.

ఇంకొక్కమాట.

తొలిముద్రణ ఒక యేడాదిలోనే అయిపోయిందంటే దీని[illegible] ఆదరణ లభించిందీ వేరేచెప్పనక్కరలేదు. ఈ ద్వితీయముద్రణకూ [illegible] ఆదరణే లభిస్తుందని ఆశించుతాను.

ఇట్లు,

విజయవాడ.

అనువాదకుడు.

# ప్రవేశిక.

కర్జనారణ్యాలలో పెద్దలనాటి సమాధు లిప్పటికీ శిథి లావస్థలో కనపడుతాయి. వాటిలోకొన్ని ప్రాచీన ధర్మాల యందు కలిగివున్న అచంచల విశ్వాసమే కారణంగా మరణ శిక్షకు గురియైన వారి సమాధులు. అల్లాంటివాటిలో సాధు 'అంటాయిప్'ది ఒకటి. పల్లెసీమల్లో నేటికీ అంటాయిప్‌ను గూర్చి అనేక రకాలుగా కింవదంతులు వ్యాప్తిలోవున్నాయి.

అంటాయిప్ పూర్తిపేరు అంటాయిప్ లూనఫ్. అతడు ధనికుడై తేగాని, పరమలోభి. అయిదోపడి నిండే దాక సంసార తాపత్రయంలోపడి కొట్టుకున్నాడు. భోగ లాలసుడై ఆముష్మిక చింతనమునె మరిచాడు. వయసుమళ్లి, కాళ్లుచేతు లుడిగిన తర్వాతమాత్రం సాంసారిక బంధనాలను తెగద్రెంచుకొని భగవన్నామ సంస్మరణలో నిమగ్నుడై నాడు; అయినా అంతమాత్రమున దుఃఖ-సంతాపాలతడిని విడిచిపెట్టలా. పైగా రోజూ యేదోఒక తగులాటం యెదు రయి ఆతణ్ని పీడించసాగింది. అందుచేత సన్యసించి యిల్లు-వాకిలి వదలి అరణ్యానికి వెళ్ళిపోయాడు. అక్కడే ఒక కుటీ రాన్ని నిలబెట్టి వుండసాగాడు. ఆ విధంగా కుటుంబ సంబం ధాన్ని తెగ తెంపులు చేసుకొని, చుట్ట-పక్కములు, మిత్రుల వ్యామోహాన్ని త్యజించి యెవరితోను మాట్లాడకుండా మౌన

ముద్రవహించి నిండా యెనిమిదేండ్లు ఏకాంత వాసియై భగ
వద్ధ్యానంలో వుండిపోయాడు. అప్పుడప్పుడు దారితప్పి ఆ
వేపుకు వెళ్లిన వారికి సర్వదా నిమీలితనేత్రుడై ధ్యానంలో
లీనమైవుండో, దైవోపాసనా తత్పరుడుగానో కన్పించేవాడు
అంటాయిప్. అట్టివారి కతడు పెదవివిప్పకనే చేసైగతో
మార్గమును నిర్దేశించేవాడు. అంటే, ఆ తర్వాత ముకుళిత
హస్తుడై కుటీరంలో దొరబడేవాడు. ఆ ఎనిమిదేళ్ళలోను
అత డెవరితోను నోరు తెరచి మాట్లాడనేలేదు. సతీ-సుతు
లనేక పర్యాయాలు ఆహార-వస్త్రాదులు తీసికొని ఆతని వద్దకు
వెళ్ళారు. కాని, అంటాయిప్ వారినొక్కతడనైన పల్లెత్తి
పల్కరించి యెరుగడు. నిరంతర దీర్ఘకాలోపవాస, ధ్యాన
ములవల్ల అతని దేహముచిక్కి శల్యము కాజొచ్చినది.
క్రమంగా కాయమెండి పుల్లయి కేవల యెముకలగూడు
మాత్రమే మిగిలింది. తలవెంట్రుకలు జడలుకట్టి అతని
రూపము చూపరులకు భీతిని గొల్పునదిగా తయారయింది.

ఒకనాడాకస్మికంగా రాజ్యంలోని గుళ్లూ-గోపు
రాలు, మఠాలు-అశ్రమాలను కూలద్రోసి, కపట సన్యాసు
లను చావగొట్టుమని రాజుగారి ఫర్మానా జారీఅయింది.
ఇంకేముంది-రాజభటులు మఠాలు, మందిరాలు, మునుల
ఆశ్రమాలపైన విరుచుకొని పడ్డారు. రాజ సైనికులు అంటా
యిప్ పటకుటీరానికూడా వెళ్ళారు; అప్పు డంటాయిప్
తదేక ధ్యానంలో లీనమైయున్నాడు.

"ఏయ్ సన్యాసీ! వెంటనే యిక్కడినుంచి పారిపో. మేమీ గుడిసెను కూల్చివేయాలి" అన్నాడు సైనికుల సరదారు.

అంటాయిస్ బాహ్యజ్ఞాన శూన్యుడై భగవద్ధ్యానంలో లీనమయ్యున్నాడు. అందుచే వారి కతడు ప్రత్యుత్తర మీయనేలేదు. సరదారుడు మళ్ళీ పైమాటలనే రెట్టించాడు; అయినా అందుకూడ అంటాయిస్ నోరు మెదపలేదు. ఆ నిర్లక్ష్యంతో సరదారుకు ఒళ్ళు మండింది. క్రోధోన్మత్తుడై "జుట్టు పట్టుకొని బయటి కీడ్వండి" అని అనుచరుల నాజ్ఞాపించాడు. అయితే అంటాయిస్ భక్తి తత్పరత, ధ్యాన నిమగ్నతలను గాంచి భటులాతని వంటిమీద చేయి వెయ్యడానికి తటపటాయించారు. ఏకాగ్రచిత్తుడగు ఆ సాధుపుంగవుని తాకటానికి వారు సాహసించలేకపోయారు.

"మీరా బడుగును ముట్టుకోటానికి సందేహించితే కుటీరాన్నే నేలమట్టం గావించండి" అని సరదారు హుంకరించాడు.

భటులు వెంటనే పైకప్పూ, వాసాలూ లాగివేశారు. దడులు పడద్రోశారు. ఆ హంగామాకు చుట్టునున్న చెట్లమీది పిట్టలు భీతిచెంది యెగిరిపోసాగాయి; కాని, ఆ బీభత్సానికి అంటాయిస్ ఏమాత్రం చలించలా. తన ధ్యానంలో తా నుండి పోయాడు.

కుటీరం కూలబడి భూపతనం చెయ్యబడింది. పైన కప్పబడిన ఆకలములు చెల్లాచెదరు చేయబడినయి. ఇంత జరిగినా ఆ బక్కబడుగు కదలక మెదలక వుండటం చూచి సరదారు ఉగ్రుడై మండి పడుతూ అంటాయిస్ను సమీపించి జడలుకట్టిన జుట్టు లంకించుకొని యీడ్చి గుంజాడు. ఆ కుదుపుతో అంటాయిస్ కళ్ళు విప్పి చూచాడు. క్షణమాత్రం సరదారు వంక చూచి కళ్ళు మూసుకున్నాడు. 'దయామయా! వీరిని క్షమించు!' అని హీనస్వరంతో ప్రార్థించి నేల కొరిగి పడిపోయాడు. మరుక్షణంలోనే అతని ప్రాణవాయువు వా పాత బొంతను విడిచి లేచిపోయింది.

---

# 1

అంటాయిప్‌కి వున్నదల్లా యిద్దరు కొడుకులు. పెద్దవాడు జాకోబుకి యిరవై మూడేళ్లు. చిన్నకొడుకు పెరెన్సు పద్ధెనిమిది సంవత్సరాలవాడు. జాకోబు కండపుష్టి కలవాడు, బలశాలి, అందగాడూను. అతడు దుండగీడని వూరంతా పేరుమోగాడు. వాడి మొరటుతనము, పొగరుబోత్తనం అందరి గుండెల్లోను అదురు కలిగించేవి. తండ్రి చనిపోకముందే వాని గూండాగిరితో వూరిలోని జనం యావన్మందీ విసిగి వేసారిపోయారు. ఎన్నోసార్లు శిక్షింపబడి జాకోబు కారాగృహంలో కుక్కబడ్డాడు. కొరడా దెబ్బలు రుచి చూచాడు; కాని, వాటివల్ల వాని ప్రవర్తనలో ఏ మాత్రం మార్పు కలగలా. గ్రామంలోని సనాతన ఛాందసుల ఆచార - వ్యవహారాలు వానికి గిట్టవికావు. వారేమో ఆధునిక భావాలకు ప్రబల వ్యతిరేకులు. జాకోబు సురాపాన ప్రియుడు, ధూమపానాసక్తుడు. అతని వుడుపులు జర్మను ఫాషనులో వుండేవి. పూజా పునస్కారాలంటే ఏవగించుకునేవాడు. వాని నాస్తిక భావాలు, దురాచారాలు సహింపలేక యెవరైన యేమేనంటే "ఓపిక పట్టండోయి! త్వరపడి నా జోలికి రాకండి. దేనికైనా అంతుంటుందిగా. నా పాపంకూడా హద్దును చేరుకున్నాక ప్రాయశ్చిత్తం చేసుకుంటాలెండి.

ఇప్పటికి నేను చేసినదిమాత్రం యెంత! మీరంతా మా నాన్న పేరు నంత భక్తితో తలుస్తా రెందుకు? వయస్సు మళ్ళేవరకు ఆయన చెయ్యాని పాపమేముంది? అన్నిటికి బదులు ఆయన ప్రాయశ్చిత్తంగా తపస్సు చేసింది ఎనిమి దేండ్లేగా! మరి నా పాప మిపుడు ఆరంభదశలోనే వుంది! నా దురాగతంకూడా శృతిమించితే నా ప్రాయశ్చిత్తానికి సమయ మాసన్న మవుతుంది. ప్రాపంచిక నియమ మిదేగా!'' అనేవాడు జాకోబు.

గ్రామస్తులందరు అతణ్ని నాస్తికుడనేవారు. ఏవగించు కునేవారు. జాకోబు తన తండ్రి కష్టార్జిత ధన-సంపదలను భోగ-విలాసాలకు మంచినీళ్ళప్రాయంగా వాడేవాడు. అందువల్ల వానికి పిల్లనివ్వడాని కెవ్వరూ సాగిరాలేదు. దైవికంగా తుదకు దూర గ్రామంలోని ఒక అనాధ బాలికతో జాకోబుకు పెళ్ళయింది. దిక్కులేని ఆపిల్ల సంబంధం కుదుర్చు కోటానికి అతడు చాలా ధనం ముడుపు చెల్లించాల్సి వచ్చింది.

జాకోబు తమ్ముడు నెమ్మదయినవాడేగాక, వెఱపు గలవాడు. అన్నగారి మార్గంలో అడ్డు తగలటానికి వాని కిష్టముండేదిగాదు. తానస లాతడి ప్రమేయమే పట్టించు కోనేవాడుగాదు. వాళ్ళముసలితల్లి భర్తృ వియోగార్తిచే కృంగి కృశించి మంచమెక్కింది. పెద్దకొడుకు దుర్నడవడి ఆమెకు మరింత మనోవ్యధను కల్గించింది. అప్పుడప్పు డావిడ

జాకోబును చివాట్లు పెడుతూండేది. అందుకతడు నవ్వుతూ "అమ్మా! నాగురించి నువ్వేమీ విచారపడబోకు. నాన్న నావిషయంలో దేవునికి సిఫార్సు చేస్తాడులే" అనేవాడు.

పెళ్ళయిన దర్మిలా ఒక యేడాదిపాటు జాకోబు జీవితము ఒడుదుడుకుల్లేకుండా సాఫీగానే గడిచిపోయింది. పని-పాటుల్లో కూడా పాల్గొంటూండేవాడు. సంవత్సరం తిరిగిపోయినతరువాత మళ్ళీ పాతదారినే తొక్కాడు. విలా సాలు మితిమీరినయి. ఒక్కొక్కసారి నెలల పర్యంతం యింటిముఖం చూచేవాడుకాడు. వచ్చినప్పుడు ఆకలి దప్పు లతో చింపిగుడ్డలతో కొంపకు చేరుకునేవాడు.

వాని జననికూడా మనోవ్యాధితో చిక్కి, శల్యమై యిహలీలను చాలించుకుంది. జాకోబామెకర్మనాడు ఆచారం విషయంలో గ్రామ పెత్తందారుతో పేచీ పెట్టు కున్నాడు. ఆపేచీ తగూగా మారింది. జాకోబు వుద్రేకంలో మైమరచి గ్రామ పెద్దని చితగ్గొట్టాడు. తర్వాత కేసు నడిచింది. జాకోబుకు శిక్షపడింది. కఠినవరకం పూర్తిచేసి బోడిగుండుతో స్వగ్రామానికి తిరిగి వచ్చాడు. అతడప్పటి నుండి మరింత మొండిగా తయారయ్యాడు. అంతకు పూర్వమే వానిని ద్వేషించే గ్రామస్తులు ఇప్పుడింకను అసహ్యించు కోసాగారు. తదాదిగా ఏ అన్నెంపున్నెమెరుగని తెరెస్సు కూడా అన్నతో జతచేయబడ్డాడు. పరిజల పరుష వాక్యాల కతడును గురికావాల్సివచ్చింది. నిజానికతడు తిన్నసైన

వాడు–సాత్వికుడూను. ఎవ రెన్ని తిట్టినా కిక్కురు మనకుండా సహించేవాడు. వాని ఓర్పుని చూచి "ఓః వద్దన్న! ఇంత పిరికిపంద వేం? చూస్తుండు, నేనొక్కడినే వాళ్ళ దుంప తెంపుతాను." అనేవాడు అన్న.

కొన్నాళ్ళకు ఆవూళ్ళో నిప్పంటుకుని కొన్ని యిండ్లు తగులపడి పోయినవి. నిప్పంటించినది జాకోబేనని రుజువు పడింది. పర్యవసానంగా నిర్వాసశిక్ష విధింపబడి జాకోబు వెంటనే సైబీరియాకు పంపబడ్డాడు. వాని పత్ని నాస్తని వియోగానలజ్వాలలకు తాళలేక వున్మాదిని అయిపోయింది. వారి యేకైక బిడ్డడు ఇలియా సిగ్గు బిడియములచే యిల్లు విడిచి బయటకు రాలేకపోయేవాడు. కర్మంబాలక వీధిలోకి వచ్చినా పిల్లలు చుట్టూమూగి గడ్డలు విసిరేవారు. "వీడు కాడీగాడి కొడుకురోయ్!" అని చప్పట్లు కొట్టేవారు.

ఇలియా పదేండ్ల బాలుడు. అయినా పై సంఘటనల ప్రభావం అమాయిక ఇలియా పసిహృదయం మీద పనిచేసింది.

•

టెరెన్సు బద్ధకస్తుడు; పనికి దొంగ. గ్రామస్తులు వానిని వెలివెట్టారు. ఊళ్లో యిళ్ళు దహనమైనప్పుడు వీరి కొంప కూడ పరశురామప్రీతి అయింది. ఇక నా గ్రామంలో బ్రతుకు తెరవు గానక టెరెన్సు వదిన నాక స్నేహితుని ప్రాపున వదలి ఇలియాతో పట్నం చేరుకున్నాడు.

ఊళ్లో యెవరికీ తెలియకుండ ఒకనాటి నడిరేయిని టొరెన్ను స్వగ్రామాన్నుంచి ప్రయాణించాడు. ఊరు మాటు మణగిన తర్వాత వున్న కొద్దిపాటి సామాను ఒక కిరాయి బండిమీద సర్దుకొని, నిద్రపోతున్న ఇలియాను కూడ యెక్కించుకొని బయలుదేరాడు. కొంత దవ్వేగిన తర్వాత యేదో చప్పుడవగా ఇలియా వులిక్కిపడి లేచి కూచున్నాడు. అటునిటు చూచి "బాబాయ్! మన మిపు డెక్కడున్నాము?" అనడిగాడు.

టొరెన్ను వానిని బుజ్జగించుతూ "భయంలేదు లే, పడుకోరా" అన్నాడు.

ఇలియా తలెత్తి మరొకసారి నల్దిక్కులా పారజూచాడు. ఆ అర్ధరాత్రివేళ చిమ్మచీకటి, నిస్తబ్ధత లాలేత హృదయాన్ని కంపింప జేశాయి. భీతిగొని నాకు భయ మేస్తోంది బాబాయ్!" అన్నాడు.

"ఇదు యెందుకు? నేనుండగా నీ కేంభయం? అన్నాడు టొరెన్ను.

"మరింతకుముం దేదో పెద్ద చప్పు డయిందిగా."

"నీకు కల వచ్చి వుంటుంది."

"కాదు బాబాయి! ఆధ్వని యింకా నా చెవుల్లో గింగురుమంటూనే వుంది."

"దూరాన యెక్కడో తోడేలు అరుస్తోంది; అంతే, యిక పడుకో" మన్నాడు టొరెన్ను.

కాని, ఇలియాసు కళ్ళు మూతపడలా. ఆ నిశ్శ నీరవ వాతావరణము వానికి జంకు పుట్టిస్తోంది. తోడేలు అరపు కా అర్భకుని గుండె లవిసిపోతున్నాయి. ఇలియా గొంతుకూచునే పినతండ్రివంక చూస్తున్నాడు. వాన్కా వెనుక దిగవిడిచివచ్చిన పాదికీగుడివేపు రెప్ప వాల్చకుండ చూస్తుండడం కుర్రాడు గమనించాడు.

"మన మింకా చాలాదూరం రాలేదన్లే వుంది" అన్నాడు ఇలియా.

"ఏమిటి?"

"ఇంకా వూరికి దాపులోనే వున్నాము. గబ గబ వెళ్తే మంచిదిగా."

"చీకటిగా వుంది. కాస్త నిమ్మళంగానే వెడదా ములే."

ఇలియా మరి మాట్లాడలా. అంతటా నిబ్బరం మావరించి వుంది. తానుకూడ పిన్నబ్బ చూస్తున్న వేపుకే చూడసాగాడు. ఎల్లెడల నిశాదేవి రాజ్యమేలుతోంది. కన్ను పొడుచుకున్నా నెటూ యేమీ కన్పించటం లేదు; కాని, ఇలియాకు తమవీధి నూతి ప్రక్కన నేలమీద తన తండ్రి పడివున్నట్టు, వాని రెక్కలు వెనక్కి విరిచి కట్టబడి యున్నట్టు, కాళ్లు కూడ త్రాళ్లతో కట్టివేయ బడినట్టూ, అతని చుట్టూ పిల్లలు, పెద్దవాళ్ళూ చేరి వున్నట్టూ తోచింది. ఈ దృశ్యం తలపుకు రాగానే వ్యాకులచిత్తుడై

సంతప్త హృదయంతో క్షోభించిపోయాడు. బిగ్గరగా ఏడవా లనుకున్నాడు; కాని, పినతండ్రి శాంతికి భంగము కల్గించ రాదని హృదయ దౌర్బల్యాన్నణచుకొని, దుఃఖాన్ని దిగ మ్రింగి వూరుకున్నాడు.

అప్పుడొక శకునపక్షి కూతవేసింది. అదే సమ యంలో వేదనా భరితమగు నిట్టూర్పుకూడ వినపడింది. ఒక టొకటిగ నిట్టూర్పులు వెలువడుతోనే వున్నయి. ఇలియాకు వణకు పుట్టింది. ఎట్టెట్టో గుండె గూడబెట్టుకొని "బాబాయ్! నువ్వేడుస్తున్నావా?" అనడిగాడు.

ఓరెన్సు కదల్లేదు, మెదల్లేదు. పిన్నబ్బ మాట్లాడక పోవటంవల్ల ఇలియా ధైర్యం దిగజారిపోయింది. మెల్లగా లేచి ఓరెన్సు ప్రక్కకుపోయి అతణ్ణి కావిలించుకుని గావురుమన్నాడు.

ఓరెన్సుక్కూడా దుఃఖం పొంగి పొర్లివచ్చింది. గద్గద కంఠంతో "ఆ దుర్మార్గులు మనల్ని వూళ్లో వుండ నీకుండ తరిమివేశారు. మనకి తలదాచుకునేందుకెక్కడ యెక్కడా తావులేదు" అని చెప్పాడు.

"బాబాయి! ధైర్యం వహించు. నేను పెద్దవాడి నయిన తర్వాత యీ అవమానానికి ప్రతిక్రియ చేసితీరు తాను." అన్నాడు ఇలియా బింకంగా.

ఏడ్చి ఏడ్చి ఇలియా సొమ్మసిలి కునుకుపాట్లు పడ సాగాడు. కెరెన్సు వాడిని పడుకోబెట్టి నిద్రపుచ్చాడు. తాను కుమిలి కుమిలి యేడుస్తూనే వున్నాడు.

తెల్లవారిన తరువాత నిద్రనుంచి మేల్కొనేటప్పటికి ఇలియా తానొక అపరిచిత విచిత్ర ప్రదేశంలో వున్నట్టు తెలుసుకున్నాడు. ఎదురుగా పెద్ద నదియొకటి ప్రవహిస్తు తోంది. నది కవతలివేపున విశాలోన్నత సౌధహర్మ్యలు తళ్కు బెళ్కులతో విరాజిల్లుతున్నవి. నగరాంతర్భాగాన క్రైస్తవమత ప్రార్థనామందిర శిఖరాలు తళ్కుతళ లీను తున్నవి. బాలార్కుని స్వర్ణ కిరణ కాంతిలో ప్రతిదీ బంగారు మలామా వేయబడినట్టు ధగధగలాడుతోంది. ఇలియా నలుదిక్కుల విస్మిత దృక్కుల బరపి "ఈ నూతన ప్రపంచంలో మాబోటి పేద-సాదలు జీవించే దెలాగు! ఈ చింపిరి గుడ్డలతో ఎవరు గడప త్రొక్కనిస్తారు. ఈ కాని చోట మా కాదరు వెవరు?" అనుకున్నాడు తనలో. దరిద్రుల కా నగరంలో మనుగడ లేనందువల్లనే తమబండి పట్టణానికి వెలుపలనే ఆపబడింది కాబో లనుకున్నాడు.

ఇలియా భయంతో గజగజలాడుతూ పినతండ్రి కోసం దృష్టిని నాల్గుదిశలకు పరుగెత్తించాడు. చేరువలో విడిసియున్న అనేక బండ్లు కనపడినవి. ప్రతిబండికి దను స్త్రీ-పురుషులు కులాసాగా మాట్లాడుకుంటున్నారు. వారి దుస్తుల్లో, వేషాల్లో యేదో ప్రత్యేకత కన్పించింది. వాళ్ళందరూ

తమకంటె ఘరానా వ్యక్తులుగా కనపడుతున్నారు. వారి నిశ్చింత, నిర్భయ, స్వేచ్ఛా స్వభావాలు ఇలియా కెంతో నచ్చినవి. వారిని తదేక దృష్టితో పరికించుతూ తానున్న వారివలె విలువగలిగి అందంగావుండే వేష-భూషణాలంకార ములతో విహారానికి బయలుదేరే సుదినాన్ని గూర్చి ఇలియా స్వాప్నప్రపంచంలో తేలిపోతూండగా పెరెన్ను వచ్చాడు. అతని వదన మానందముతో దీప్తివంతమై కళకళలాడు తోంది. వస్తూనే ఇలియాతో అన్నాడు—"దేవుడు మన యందు దయ తలిచాడు. మనకీ పట్నంలో మంచి వారి ప్రాపకము లభ్యపడింది. కొన్నాళ్లపా టిక్కడ వారి ఆశ్రయంలోనే వుందాం."

"మరి మన మక్కడికి వెళ్ళే దెప్పుడు బాబాయి?" అని ఇలియా వుబలాటంతో అడిగాడు.

"కొంచెంసేపట్లో పడవ వస్తుంది. దానిమీద నదిని దాటి పట్టణంలోకి వెళ్గాం."

"మన మసలు పట్నంలోకి పోరాదేమోనని నేను భయపడ్డాను."

"ఈశ్వరుడు సర్వజీవులకు సంరక్షకుడు. ఆయనే మనకి దారి చూపుతాడు."

"మన ముండబోయే దా యెర్రమేడలో నేనా?"

"కాదు. అది సైనికులుండే కోట."

"మరి మనముండేది మేడలో కాదూ?"

"అవును, అదీ చాలా పెద్దదే" అని తెరెన్సు మందహాసం చేశాడు.

"బలే!" ఇలియా సంతోషంతో ఉప్పొంగిపోయాడు. "మేడలో ఏం చక్కగా వుండొచ్చు! మనం అక్కడికి రావటానికి కృషి చేద్దాం" అన్నాడు.

తెరెన్సు మెల్లగా బండివెనక్కిపోయి ఒక పేద నిట్టూర్పు విడిచాడు.

# 2

ఇల్లెల్లాంటిదో తెరెన్సు కాశ్రయమిచ్చిన హోటలు యజమానికూడ అట్టివాడే. బలంలేని దొంద శరీరంగల లావుపాటి ఆ ఖామందు దేహం వాని సౌధపు విశాల, శిథిలావస్థలకు అనుకృతిగానేవుంది. వాని పొగరంగు కళ్ళు ఆ పెద్దభవంతిలోని తలుపులూడి, చువ్వలు విరిగిన కిటికీలను తలదన్నుతున్నాయి.

తెరెన్సు కీయబడిన గది—గది కాదు, కొట్టు—కళ్ళలాని కొటపట్టు, పట్టణమందలి గలీజంతా అక్కడే పోగుపడిందేమో ననిపించుతుంది. ఆ కొట్టునందె తెరెన్సు ఇలియాలు తలదాచుకుంటున్నారు. ఏ శృక్కడికి చేరిన

మూడోనాడు హోటలు యజమాని కర్రను నేలమీద టకటక పొడుచుకుంటూ అక్కడికొచ్చాడు. వానిఅడుగుల సవ్వడి చెప్పులపడగానే ఇలియా ప్రక్కనే వున్న పెంటపోగు చాటున నక్కాడు. భయంతో వా డక్కడినుంచి యజమానిని నిక్కి చూస్తున్నాడు. క్రూరమైన నిశితదృష్టి వాడిపైన పడనేపడింది. అతడు కర్రతో ఇలియాను చూపుతూ "ఆ కుర్రకుంకెవడు? ఇక్కడికెల్లా వచ్చాడు?" అని గద్దించాడు.

పాపం! ఇలియా గుండె గుభేల్ మన్నది. నఖశిఖపర్యంతం కంపించిపోతున్నాడు.

"మాట్లాడడేం? వీణ్నిక్కడినుంచి తరిమేసెయ్యండి .........ఏమిటీ! పెరెన్సు అన్న కొడుకా? ఆ వెధవ తనతో ఒక బుడుతడు కూడ వున్నాడని ముందే యెందుకు చెప్పలా? మొదటే నన్ను దగా చేశాడన్న మాట. ఊం, గెంటెయ్యండా గుంటణ్ని" అని యజమాని కూకలేశాడు.

అంతలో సారానమ్మే పెట్రుహా కిటికీలోంచి తల యివతలికి పెట్టి యజమానితో చెప్పాడు— "దిక్కులేని పిల్లాడులెండి. నాలుగైదురోజుల్లో వెళ్లిపోతాడు. పెరెన్సు ముందుగా నాతో చెప్పే తీసుకొచ్చాడు. మీరు గట్టిగా వెళ్ళగొట్టమంటే యిప్పుడే పంపేస్తాను."

ఇదంతా చూచి ఇలియా గాభరాపడి ఆవురు బావురుమని యేడ్పు సాగించాడు. వృద్ధుని వుడుములతో

వాడు బేజారయిపోయాడు. యజమాని వెళ్ళిపోయింతర్వాత పెరెన్నువచ్చి ఇలియాను చేరదీసి వూరడించ సాగాడు. "పర్వాలేదులే, యిక వూరుకో. ఆ ముసలాయన అలాగే కేకలేస్తుంటారు; అంతే. ఇక్కడి వ్యవహారమంతా స్ట్రుబా చేతిలో వుంది. ఈయన కాదన్న దేమీ యజమాని చేయరులే" అని ఇలియాను సముదాయించాడు.

ఈ క్రొత్త ప్రదేశానికి పరిచితుడయ్యేకొద్దీ ఇలియా ప్రతివిషయాన్ని పరిశీలనాదృష్టితో చూడసాగాడు. తను స్వంతయింటికంటె ఇలియాకీ విశాలమైన భవంతి ఎంతో ముచ్చటగావుంది. తమ వూరిల్లిసాది కలిసినా లేనంతవుంది రకరకాల మనుషులతో కిక్కిరిసి వుందీ భవనం. ఇది పల్లెటూరి సంతవలె నిత్యము కళకళలాడుతోంది. పై అంతస్తులోని హోటలు నిరంతరము పూటకూళ్ళకు వచ్చే జనంతో కిటకిటలాడుతూంటుంది. వరండావైపు గదుల్లో కొందరు స్త్రీలు అద్దెకుంటున్నారు. మొత్తంమీద అక్కడున్నవాళ్ళందరూ తాగుబోతులే. వాళ్ళలో మతిస్సాముఖం క్రూరమై భయంకరంగా ఉంటుంది. క్రిందిభాగంలో చెప్పులుకుట్టే ఫర్షిషాక్ భార్య, కూతురుతో కాపురముంటున్నాడు. వారి ప్రక్కనే జర్మియా అనే ముసలివాడొక డుంటున్నాడు. ఇంటిముందు గది నానివున్న రేకువసారాలో కమ్మరి కొలిమి తిత్తి అస్తమానం 'వుఫ్ వుఫ్' అని రొద తెరిపి లేకుండా బుసకొడుతూంటుంది. సావెలు – అంటే

కమ్మరి మహాఅహంభావి. అతడు పగలంతా సణుక్కుంటూ గొణుక్కుంటూ పని చేసుకుంటుండేవాడు. వాని పెళ్లాము చక్కని చుక్క. ఆమె ముఖ మెప్పుడూ నవ్వుతో కళకళ లాడుతూండేది. విధాత వాళ్ళిద్దరినీ పరస్పర విరుద్ధంగా సృష్టించాడు.

ఈవిధంగా ఆమేడలోని ప్రతి గజం మేర స్త్రీ-పురుషులతో నిండివుంది. అది అస్తమానం పెనంలో కళపెళ వుడుకుతున్నట్టు అతి కోలాహలంగా వుండేది. పనిపాటుల నుంచి విముక్తులై సాయంత్రం బసకు చేరుకున్నవాళ్ళందరూ వరండాల్లోను ఇంటిముంగలా గుమికూడి యిచ్ఛవచ్చిన ఆమోద-ప్రమోదాల్లో మునిగి తేలుతూండేవారు.

సంజవేళల పెండలాడే బువ్వతిని పిల్లమూక కతలు చెప్పమంటూ జర్మియాచుట్టూ మూగేవారు. పిల్లలు తన్ను చుట్టవేసినప్పుడు వాళ్ళని చూచి ఆ ముసలాడేదో ఆంతరంగిక వ్యథ ననుభవించుతూ గద్గదకంఠుడై కంట నీరు పెట్టేవాడు; కాని, మరుక్షణంలోనే తెప్పరిల్లి పిల్లలకు కథలు విన్పించటంలో తత్పరుడయ్యేవాడు. బాలబాలిక లాతడు లబ్బుగా చెప్పే కథల నాలకించేందుకు చెవికోసుకునేవారు. అందరిలోను పెట్రిహకోడుకు యాష్కా జాకోబు జర్మియా పట్ల భక్తి ప్రపత్తులు కలిగివుండేవాడు. పెద్ద తల, నిడివైన నాసిక, సన్నని మెడ కలిగి జాకోబు అందంగా వుండేవాడు. వాని చంచల దృక్కులు నిలకడేమాత్రం లేనట్టు ఎప్పుడూ

అటునిటు పరుగులుతీసేవి. ఆ దృశ్యం దేనినైనా చీల్చుకుని లోపలికి దారి చేసుకొని ప్రవహిస్తున్నట్టుండేది. ఉజ్వల ముఖము, [illegible] వాని చురుకుతనాన్ని వెల్లడించుతుండేవి. క్రమంగా వాడికి ఇలియాతో నేస్తమేర్పడింది. ఒకనాటి జాకోబు "మీవాళ్ళలో మంత్రగాళ్ళున్నారా?" అనడిగాడు ఇలియాను.

"ఆఫ్ఘానీలు, మంత్రగాళ్ళు వున్నారు" అని ఇలియా చెప్పాడు.

"వాళ్ల జుట్టు ఎర్రగా వుంటుందా?"

"ఊహుఁ, తెల్లగా వుంటుంది."

"అయితే పర్వాలేదులే. తెల్లజుట్టున్న వాళ్ళకి జాలి వుంటుంది. ఎర్రటి వెంట్రుకలవాళ్ళు పచ్చిరక్తం తాగుతారట."

మిత్రులిద్దరూ యిలాంటివే ఎన్నో కబుర్లు చెప్పుకునేవారు. కులాసాగా కబుర్లతో కాలక్షేపం చెయ్యటానికని వాళ్ళిద్దరూ యింటిముందొక మూల మరుగుస్థలాన్ని వెతుక్కున్నారు. అక్కడికి పెద్దవాళ్ళు పోశక్యంకాని యిరుకు సందుగుండా వెళ్ళాలి. అక్కడొక వేప చెట్టుంది. దాని మొదట్లో కూచుని స్నేహితులిద్దరూ బాతాఖానీ వేసేవారు.

పగటిపూట కనపడిన దృశ్యాల ప్రభావం ఇలియా మీద బాగా పనిచేసేది. విచిత్రము, రహస్యమయము నైన

జీవిత ప్రవాహంలో పడి వాడు విహ్వలహృదయుడయ్యే వాడు. హోటలుదృశ్యాన్ని చూచి వాని మనసు కలత చెందేది. భిన్న భిన్న స్వభావాల వ్యక్తులక్కడికి చేరుతూండడము, వేర్వేరు వినోదాల్లో పాల్గొనటము చూచినప్పుడు వాళ్ళందరినీ వున్మాద మావేసించినట్టుగా భావించుకొనే వాడు.

ఇలియాం యెప్పుడైన హోటలుహాల్లోకిగాని, గదుల్లోకి గాని, వెళ్తే టెరెన్సు చూచిన తక్షణమే కసురు కుంటూ వచ్చి "ఒరే అబ్బీ! ఇక్కడి కొచ్చావెందుకు? నీ కిక్కడేం పని? పో, పరుగెత్తి బయటికెళ్ళి ఆడుకో. నిన్ను యజమాని చూస్తే చిర్రు బుర్రు మంటాడు." అని తరిమేసే వాడు. పాపం! దిక్కు మొక్కు లేని ఆ గుంటడు నుదురు బాదుకుంటూ, తూలుకుంటూ అక్కడనుంచి జారుకునేవాడు.

మేడముందరి గలభాతో చెవులు చిల్లులు పడతా యేమోననిపించేది. ఒకవేపున సావెలు సమ్మెట నెత్తి ధనాధన్ మంటూ కొడుతూనే చేతిక్రింది పనివాళ్ళను నోరుచించుకుని చివాట్లు పెడుతూండేవాడు. మరో ప్రక్కన ఫక్ ఫిషా క్రౌర్యకంఠంతో కూనరాగం తీస్తుండేవాడు. వరండాగదుల్లోంచి ఆడవాళ్ళ ఏడుపులూ, పెడబొబ్బలూ తిట్లూ, గావుకేకలూ వినవచ్చేవి. సావెలు సుతుడు పాషా కొయ్యగుర్రమెక్కి "చల్ చల్ గుర్రం, చలాకి గుర్రం" మంటూ యింటిముంగల ఆవరణలో నాలుగు ప్రక్కలకు స్వారీ చేస్తూండేవాడు.

పాష్కా వచ్చి పోకిటీ. [illegible]. ఆ గడుగ్గాయి ఒకటి [illegible] దెబ్బలు [illegible] కూడాను. ఇలియా [illegible] చేసుకున్నాడు. "ఏంచేస్తాం బాబు! అన్నిటికి సహించి [illegible] కోవాల్సిందే" అని పెరెన్సు వుసలాయించాడు.

అందుకు "విరగబడి నేనూ కొడ్తా" అన్నాడు ఇలియా ఆత్మాభిమానంతో.

"కొంపతీసి అంతపని చేశావు!"

"ఏం, ఎందుకనే? వాడు దుత్తపుణ్యానికే నామీద పడి కొడుతూంటే నేను నోరుమూసుకుని పడుండాలా?"

"అవును. వూరుకోవాలి. వాడిక్కడివాడు. నువ్వు పొరుగూరివాడివి. పొట్ట చేత్తో పట్టుకొచ్చినవాళ్ళం మనమేమి చేయగలంరా బాబూ?" అని పెరెన్సు తమ అసహాయస్థితిని వెల్లడించి తల దించుకున్నాడు.

ఇలియా పినతండ్రి కిక ఎదురు చెప్పలేకపోయాడు. కాని, వాని నాసమాధాన మెంతమాత్రం సంతృప్తిపరచలేకపోయింది. తరవాత అవకాశం చిక్కినప్పుడెల్ల ఇలియా పాష్కాని దబాయించుతూనే వుండేవాడు. ఒకనాడది గాంచి పెరెన్సు ఇలియాని ముఖం వాచేటట్టు కూకలు వేశాడు. దాంతో వాడు కళ్ళు తెరిచాడు. తనకూ తనివ్వా

పిల్లలకీ తాహాతులో తేడా వున్నట్టు గ్రహించుకున్నాడు. తదాదిగా వానికి పాషా మీద ద్వేషమూ, జాకోబు నం దభిమానమూ యినుమడించినాయి.

జాకోబు శాంతస్వభావి; గంభీర హృదయుడు. వా డెన్నడు యెవరితోను గిల్లి కజ్జా పెట్టుకునేవాడు కాడు. ఒక రితో మాటపడి యెరుగడు. అవాకులు చెవాకులంటే వాని కసలే యిష్టముండదు. వానికి విశాలోద్యానవనాల్లో ప్రఫుల్ల వదనాలతో వింత వింత కొత్తాటలాడే గొప్పింటి కుర్రకా రును గూర్చి చెప్పుకోవటమంటే మహా సంబరంగా వుండేది. ఇలియా తప్ప జాకోబు కింకొక స్నేహితుడుగాని, సహా చరుడుగాని లేడు. వాని కోమల హృదయంలో ఫర్ఫిషా తనయ మాషా మాత్రం స్థానం సంపాదించుకుంది. ఆ పిల్ల కూడా పగలంతా వీళ్ళతోనే ఆడుకుంటూండేది.

మాషా తల్లి శాంతిప్రియ. ఆబిడ స్వభావ మతి సరళం. మితభాషిణి కూడాను. ఆమె తమ వాకిట్లో కూచుని యేకాగ్రచిత్తంతో యెప్పుడూ యేదో ఒకపని చేసుకుంటూం డేది. ఎవరితోను మాట్లాడేది కాదు. కూతురు మాషాని గూడ చేసన్నతోనే పిలిచేది.

ఇలియా కామెపట్ల అత్యంత గౌరవం. అయితే మూడుసంవత్సరాల క్రితం పక్షవాతంవల్ల ఆమెకాళ్ళు వశం తప్పిపోయాయని, ఇంకెన్నో రోజులు జీవించదనీ విన్న లగా యతు ఇలియా భయపడి మాషాతల్లికి వైదొలగి దూరంగా వుండసాగాడు.

ఒకరోజున ఇలియా ఆమె వాకిలి ముందుగా వెళు తున్నాడు. ఆమె వాని చేయిపట్టుకొని "నా చిన్నాయి! మమ్మాయిని దయగాచూస్తుండేం. దాన్నెప్పుడూ తిట్టాలు పెట్టమాకు. మాషాకోలికి పోవుకదూ?" అన్నది. దీనంగా ఇలియా కళ్ళల్లోకి ఒకసారి చూచి చెయ్యి కదిలించింది.

అదిమొదలు ఇలియా జాకోబులు మాషాపట్ల మరింత అనురక్తులయ్యారు. ఆమెమీద ఈగనైన వాలనిచ్చే వారు కారు. ఆపడతి వినతి ఇలియాను మంత్రముగ్ధునిలా చేసింది. అంతకు పూర్వమెన్నడు, తనకంటె పెద్దవాళ్ళనూ ఇలియాను దయాభిక్ష నడిగియుండలేదు. ఎవరిని చూచినా తిట్టి, కొట్టి పిల్లలమీద పెత్తనం చలాయించేవాళ్ళే. ఒక్క జర్మియామాత్రం చిన్నపిల్లలమీద చేయి చేసుకునేవాడు కాదు. కళ్ళెర్రచేసి పిల్లల్ని బెదరించటము, కసరటము అందరికీ మామూలే.

క్రమక్రమంగా ఇలియాకు పట్టణవాసంకంటె పల్లె జీవితమె ఆనందదాయకము, సుఖప్రదము నని తోచసాగింది. తమ వూళ్ళో యిష్టం వచ్చినట్లు విచ్చలవిడిగ తిరుగుతూం డేవాడు, కాని యిక్కడో! పినతండ్రి వాని నెన్నో కట్టు దిట్టాల్లో పెట్టాడు. ఈవేపుకు రాకు, అగదిలోకి పోవద్దు. అని అన్నీ ఆంక్షలే. పల్లెటూళ్ళో తింటానికి లభించే పండ్లు, కాయలూ, పదార్థాలు యిక్కడ కలనైన ప్రాప్తించటం లేదు. ఇంతెందుకు? పట్నంలో మట్టికీ, నీటికీకూడ డబ్బిచ్చి

కొనుక్కోవాల్సి వస్తోంది. గ్రామీణుల్లో వున్న కలుపుగోలుతనం నగరవాసుల్లో మచ్చుకైన కన్పించకున్నది. పట్టణంలోని స్వార్థమయ పోటీజీవితం చూచి ఇలియూ హృదయం వికలమయిపోయింది.

ఒక రోజున భోజనసమయంలో పినతండ్రి వేదనా సూచక స్వరంతో "మన యీ దుర్దినాల కంతెప్పుడో? పెట్రుషా వాళ్ళబ్బాయితోపాటు నిన్నుకూడా చదవేద్దా మన్నాడు. నీకు బడికి వెళ్ళే యీడొచ్చింది కూడాను. చదువురానివాడు గుడ్డిగవ్వకు కొరగాడు. నా భవిష్యత్తు, ఆశ నీమీదనె ఆధారపడిఉన్నై; అయితే స్కూలుకు పంపాలంటే నీకు లాగులూ, చొక్కాలూ, జోడు వగైరా వుండాలి. కాని వాటన్నిటిని కొనడానికి తగ్గ జీతం కూడ నాకు రాదాయె" అని నిట్టూర్చాడు.

ఇలియూ పసి హృదయం కకావికసపడింది. కంఠం రుద్ధమయింది. బిక్క మొగం పెట్టి జలదరించుతున్న కంఠంతో "మన మస లిక్కడనుంచి వెళ్లిపోదాం బాబాయి!" అన్నాడు.

"ఎక్కడికి వెళ్తాము? మన కాశ్రయ మెవరిస్తార్రా అబ్బాయి!" ఔరెన్ను జాలిగా అన్నాడు.

"అడవిలోకి పోదాం; అక్కడేగా తాతయ్య అనేక సంవత్సరాలు గడిపింది. మనంకూడా ఆకులూ, అలమూ,

కాయలూ, దుంపలూ తినేవాళ్ళం [illegible]. ఇప్పుడైతే కొట్టి, జంతువులను వేటాడేందుకు ప్రోత్సహించారు. అందుకే మనజీవితాలు సుఖంగా గడిచిపోతాయి."

ఒరెన్సు (ప్రేమార్ద్ర) దృష్టితో అన్నకొడుకువంక చూచి వీపుపై తట్టి "అడవిలో [illegible] కథ మొక్కవ నాయనా!" అన్నాడు.

మనవద్ద ఆయుధా లుంచుకుందాం. నేనిప్పుడు కాస్త పెద్దవాణ్ణయానుగా. మృగాలంటే యిప్పు డింతగా భయం లేదులే. మనం ధైర్యంతో వాటిని తెగటార్చుతాము. ఎట్టి పరిస్థితిలోను యిక్కడి నికృష్ట జీవితంకంటె అక్కడే సుఖం. ఈ జీవితము దుర్భరము, అసహ్యమునై దుస్సహభారంగా వుంది. ఇక్కడ యెదుటివాడిని ప్రేమించేవాడే లేడు. ప్రతి వ్యక్తి ఎవడినో ఒకణ్ణి దోచుకుంటానికే ఆలోచించుకుంటాడు. పరస్పర జీవిత సంఘర్షణే యిక్కడి జీవిత పరమావధి. జగడము, కొట్లాటలూ నిత్యకృత్యాలే.

ఆనాటి సాయంత్రం జర్నియా బసకు చేరుకొన్న తర్వాత ఒరెన్సు తన దుస్థితిని యేకరువు పెట్టుకున్నాడు. ఆ వృద్ధుడు మొదటినుంచీ ఒరెన్సుపట్ల సానుభూతి కలిగి వున్నాడు. వాని గోడంతా విన్నాక దిలాసా కల్గించుతూ "ధైర్యంగా ఉండు. ఈవిధంగా బెంగగొని అలమటించి ప్రయోజనం లేదు. దేవుడి ఘనత, మహాత్ములలో విశ్వాసం కలిగిఉండాలి. ఈ విశాలవిశ్వంలోని సర్వము సర్వేశ్వర

సృష్టే. సుఖ దుఃఖాలు రెండూ ఆయన లీలా విలాసాలే. ఆయనేది చేసినా మానవుల సుఖసౌభాగ్యాల నిమిత్తమే. కాబట్టి ఎప్పుడెవరికే యిబ్బంది వచ్చినా తాల్మి కలిగి సానందంగా అనుభవించాలేగాని బెంబేలుపడి లాభంలేదు. ఎల్లకాలం ఒకేరీతి నుండదు. నీకూ మంచిరోజులు రాక పోవు" అన్నాడు.

"నాఆశ అంతా ఆ దేవదేవునిమీదనే బాబా! భగవదనుగ్రహానికి చెయ్యిచాచాను. భగవదభీష్ట మెలా వుందో" అని టిరెన్సు పైకి చూచాడు.

"ఈశ్వరుడు సర్వజీవరాసుల్ని కన్పెట్టి వుంటాడు. ఆయన చూపు కందనిది లేదు. ఎవరి శ్రమకు తగ్గ ఫలితాన్ని వారికి ప్రసాదించుతాడు. నువ్వూ ఆ పరమ పిత బాలుడవే. నిన్ను తప్పక కృతార్థుని చేస్తాడు. ఇలియా దుస్తుల్ని గురించి నువ్వేమీ చింతించకు. నేను కొంత పైకం బదులిస్తాను. ఇలియాకి కావలసిన దుస్తులు వగైరా కొంను. నే నా డబ్బుకోసం వత్తిడి పెట్టనులే. నీవద్ద దస్తు చేరినప్పుడే యివ్వవుగాని."

టిరెన్సు ముఖం సంతోషంచే వికసించింది. కృతజ్ఞతాభరితాత్ముడై "తండ్రీ జర్మియా!" అన్నాడు.

జర్మియా వాని నోరుమూస్తూ "చాల్లే వూరుకో. నీ అవసరం గడుపుకో. రేపట్నుంచి కొన్నాళ్ళపాటు ఇలియాను నా వెంట తీసుకెడుతుంటాను. నాకు చేదోడు వాదోడుగా వుంటాడు" అని చెప్పాడు.

“బాబా! నువ్వు నన్ను వ్యక్తిని చేశావు. నీకే మాటలతో కృతజ్ఞత తెలుప గలను? నిన్నే విధంగా ప్రశంసించ గలను?” అని కన్నీళ్ళ నిండిన చెయ్యి స్పృశించాడు.

“పిచ్చివాడా! ఎవరూ ప్రదాతను కాను. ఒకని కిచ్చేవాడింకొకడు లేడు. నేను నీకిస్తే నీవింకొకనికి సహాయ పడతావు. వాడు మరొకడికి తోడ్పడతాడు. ఇదే సృష్టిలో భగవత్ప్రేరణచే యీ ప్రాపంచిక రథం నడుస్తూవుంటుంది. అన్నిటికి కర్త ఆ దేవదేవుడే” అని జర్మియా నిమీలిత నేత్రుడయినాడు.

# 3

ఇలియా పక్కమీద పడుండి యిద్దరి సంభాషణ నాలకించాడు. జర్మియా తుదిపల్కులు వాని కత్యంతానం దాన్ని కల్గించినయి. ఆ సంతోషంతోనే వాడు నిద్రా దేవిచే ఆవహింపబడ్డాడు.

జర్మియా దయవల్ల ఇలియా రోజులు జాలీగా గడుప సాగాడు. జర్మియా ప్రొద్దుపొడిచినతరువాత ఇలియాను తోడ్కొని యిల్లు విడచి బయలుదేరేవాడు. పగలంతా పట్టణమందలి వీధులు, సందు-గొందులు గ్రుమ్మరుతూ పార

వేయబడ్డ చింపిగుడ్డలు, మేకులు, లోహపుతునకలు వగైరా యేరుకునే వారు. నగరంలోని వివిధ ప్రదేశాల్లోని చిత్ర విచిత్ర వస్తువులను, మనోహర దృశ్యాలను గాంచినప్పుడు ఇలియాహృదయం కుప్పిగంతులు వేసేది. ఒక్కొక్క దృశ్యాన్ని చూచినప్పుడు జర్మియాపైన ప్రశ్నపరంపరను గుప్పించేవాడు. ఇలియాసందేహాలను తీర్చుటతోను, వానితో మాట్లాడుటతోను, వేర్వేరు ప్రదేశాలను వర్ణించుటతోను జర్మియాకపూర్వ సుఖానుభూతి కలిగేది.

ఒక రోజున బజారులో శకలాలేరుకుంటూ పోతూండగా యెట్టయెదుట కానవచ్చిన భవ్యహర్మ్యానికి యజమాని యెవరని ఇలియా అడిగాడు.

‥ ఇదా? ఇది పచేలిన్ ది. అతడీ పట్టణంలో గొప్ప భాగ్యవంతుడు '' అని చెప్పాడు జర్మియా.

‥ ఎవరయినా అసలంతంత మోతుబరులెల్లా అవుతారు తాతా?''

" డబ్బును కూడబెట్టడానికి మనుషులు రేయింబగళ్లు చెమటోడ్చి కష్టపడుతారు. ధనమార్జించిన పిమ్మట పెద్దపెద్ద యిళ్ళు, భవంతులు కట్టించుకొని దాస-దాసీజనాన్ని పెట్టుకుంటారు. అప్పుడానంద మనుభవించుతూ సుఖంగా జీవితం గడుపుతారు. అల్లాంటప్పుడు లోకులు 'ఫలానా మనిషి కష్టించి కూడబెట్టిన సంపాదన ననుభవించుతున్నా' డని చెప్పుకుంటారు; కాని, వాస్తవంలో అల్లాంటివాళ్ళు చాలా

పాపంపండేనరకు ఎవరికైనా తగినఫలితం ముట్టదు. పాపం పండినాక దేవుడు కట్టికుడుపకమానడు. పావొలిచ్ పాపం పండింది. ఈశ్వరుడు వానిని దండింప నారంభించాడు. మొదట పావొలిచ్ చెవిటివాడయ్యాడు. తరువాత వాని కొడుకు గుర్రంమీద స్వారిచేస్తూ క్రిందపడి చచ్చాడు. మరి కొన్నాళ్ళకు ఆతని కూతురు వంశానికి కళంక మాపాదించి ఎవడితోనో లేచిపోయింది.''

జర్మియా జు ట్రీ నగరంలోనే పెరిగింది. అతని కిక్కడి ఇంటింటి చరిత్ర కొట్టినపిండి. వృద్ధుడా విషయాలన్నీ తప్పీ లుగా చెపుతూంటే శ్రోతలహృదయా లూగిసలాడుతాయి. అయితే జర్మియా మాటల్లో యీర్ష్యా - ద్వేషా లేమాత్రం పొడకట్టివికావు.

ఇలియా జర్మియా ముఖంలోకి చూస్తూ అతను చెప్పేది చాలా ఆసక్తియంగా వింటూండేవాడు. ఎప్పుడైనా " నే నా సౌధాంతర్భాగాలు చూడగలనో లేదో!" అంటూండేవాడు.

ఆమాటకు " బిడ్డా! ఆయుర్దాయముంటే అన్నీ చూస్తావు. నువ్వుకూడ శ్రీమంతుడివి, భాగ్యశాలివి కావచ్చు. కృషిచేస్తే కాని దేముందీ? నా యీ కళ్ళతో యెన్నెన్ని చూచాను! మానవజీవితావస్థలను గమనిం చుతూ యెన్నికన్నీళ్ళు కార్చామో వీటినుంచి! ఈ తనువు

లోని జీవరసమంతా కన్నీరై ప్రవహించి పోగా [illegible]! బొంది మాత్రం మిగిలింది." అన్నాడు జర్మియా [illegible]గా.

భగవంతుని కృపా కటాక్షాలను [illegible] జర్మియా వర్ణించుచుండగా ఇలియా పండుగ భవిష్యత్కాలాన్ని గూర్చిన పుష్పాలానంద సందేశాన్ని [illegible]. ఎంతో వుత్సాహంతో శ్రమపడి కృషితో సంపాదించేవాడు. చిత్తు పోగులు, మురికి గుంటలు, కాల్వలు వెదికి వెదికి యినప ముక్కలు, రాగి రేకులు, గాజు పెంకులు వగైరా ఏరి తీసి జర్మియా కందించుట కెంతో ప్రయాసపడేవాడు. ఎప్పుడైనా యేదేని కాస్త విలువైన వస్తువు దొరికితే జర్మియా [illegible] గంతేసి అందిపుచ్చుకొని అటునిటు [illegible] గా దాన్ని జోలిలో వేసుకునేవాడు.

ఇలియా రంగురంగుల గాజుపెంకుల్ని యేరి జోలి నింపుకుని భుజాన వేసుకుని స్వయంపోషకుడిలాగ సంతృప్తితో యింటిముఖం పట్టేవాడు. దారిలో "అన్నా! వాటిని తలాఒకటి పంచిపెట్టు. పిల్లలు సంతోషిస్తారు. చుట్టూవున్న వారిని సంతోషపెట్టేవారిపట్ల భగవంతుడుకూడా ప్రసన్నుడవుతాడు. అందరూసుఖపడాలనీ, ఆనంద మనుభవించాలనీ దేవులాడుతారు; కాని, యీలోకంలో అందరికీ ఆనంద మెక్కడ రాసిపెట్టివుంది! నిర్భాగ్యులెందరో జీవితాలన్నైతే వెళ్ళబుచ్చుతూనే వున్నారు; కాని, వాళ్ళకి సుఖం దర్శన మయినా యిస్తేగా!" అని జర్మియా బోధించేవాడు.

పగలస్తమానం యింటిముందర తారాడుతూ వీళ్ళ వాళ్ళ తిట్లు, యీసడింపులు పడేకంటే సందుగొందుల్లోను, పెంటకుప్పల్లోను మురుక్కాల్వల్లోను పారవేసిన పాత సామానుల్ని గాలించి యేరుటలోనే ఇలియా కానందం లభించుతోంది. ఆ సందుగొందుల్లో జర్మియాలాంటి వయ సుడిగిన యే ఒకరిద్దరు వృద్ధులతో తప్ప పాష్కావంటి రాలు గాయి-యెటునుంచో అనూహ్యంగావచ్చి మీదపడి తన్ను ఒకటి, రెండు పిడిగ్రుద్దులు గ్రుద్దేవాడుగాని, అమ్మనాలి బూతులు కూసేవాడుగాని యెవడూ కన్పించడుగా మరి!

ఒకటి రెండుగంటలసేపు అదీయిదీ యేరుకొని యిద్దరూ పోయి యేచెట్టునీడనో చతికిల బడేవారు. బొక్కసాలోనుంచి చద్దిరొట్టెలు తీసి తాపీగా తినేవారు. తిని రెండుగుక్కల నీళ్ళు తాగిన తర్వాత జర్మియా చెప్పేవాడు—"నాయినా! ఈ విశ్వం యెంత విశాల మయిన దనుకున్నావు! అయినా కూడా తమ కిది చాలదన్నట్లు మానవు లిందలి ప్రత్యణువు కోసము గ్రుడ్డిగా దెబ్బలాడుకుంటారు. పరమేశ్వరుడు వీరి మూఢత్వానికి జాలిగా నవ్వుతాడు. ఆయన స్వస్థానంలో వుండే మానవుల హృదయస్థభావాలన్నిటినీ ఆకళింపు చేసుకుంటాడు. అందువల్లనే ఆయన్ను సర్వజ్ఞుడనీ సర్వ వ్యాపితు డనీ అంటారు. ఆయనకంతా కనపడుతూనే వుంటుంది. ఎల్లరి కర్మలను చూస్తూ పాపపుణ్యాలను తూస్తుంటాడు. నువ్వు నీ పాపాలనుంచీ మానవుల కన్ను

గప్పగలవేగాని, ఈశ్వరసృష్టిమంతటి నడుపుచున్నదేవు, మానవుడు పాపాచరణతో ప్రవర్తిస్తూ కాగానే భగవంతుడు 'రే దుష్టా! ఆగు నాగు' అని హెచ్చరిస్తాడు. అప్పటికీ దారిలోకి రానివాని పాపం బ్రద్దలవుతుంది. భగవంతుడు వాడిని శిక్షించడానికి ప్రయత్నిస్తాడు. ఎట్టి కఠినశిక్ష విధించుటకును ఆయన వెనుదీయడు. మనం పశ్చాత్తాపంతో క్రమించు కోవాలన్నదే ఆయన యింగితము. అవిశ్వాసంగా ప్రవర్తించిన వ్యక్తి యావజ్జీవితము యమయాతన లనుభవించుచూ కష్ట జీవితమును గడపాల్సివస్తుంది.''

ఇలియా పుడమిమీద పడుకొని అర్ధనిమీలిత నేత్రుడై వృద్ధ జర్మియా చెప్పిన విషయాలనుగురించి ఆలోచించుకునేవాడు. ఏదో విచిత్రమైన వుదాసీనభావ మేర్పడి గుండె బరువెక్కినట్టయి కళ్ళముందేవో అస్పష్టాకారాలు మెదిలేవి. అంతులేని బ్రహ్మాండమగు ఆకృతి-ఎవని దివ్య తేజస్సుచే దిక్కులన్నీ, దీప్తివంతము లవుతున్నవో ఎవని కృపాంబుధికి పారములేదో, ఎవడు నిర్మలాంబర వీధిని తేజరిల్లుచున్నాడో, సర్వప్రాణు లెవని స్వచ్ఛంద పవిత్ర జ్యోతివంక పరుగులిడిపోతున్నవో - అట్టి దివ్య మంగళ తేజోమూర్తి కనపడుతూన్నట్టు తోచేది. అప్పుడు ఇలియా ఆనందోద్రేకంతో చటుక్కున లేచి కూచునేవాడు. సందేల ఇలియా యింటికి తిరిగి వచ్చేవాడు. అప్పుడు వాని ముఖం ఏదో ఘనకార్యం చేసివచ్చినట్టు ఆత్మాభిమానంతో

కళకళలాడుతూంటేది. వాని మన సిప్పాను సామాన్య బాలకుల భాంతి ఆటపాటల్లో లగ్నమవటంలేదు. అల్లా చేయటం తనకి న్యూనతగా భావించుతున్నాడు. ఇంటికి రాగానే ముసలివా డనేవాడు— "పగలంతా తిరిగి తిరిగి చీకటిపడేవేళకి ఇలాగో కూటికి చేరుకున్నాము. బిడ్డా, ఇలియా! కాళ్ళూ చేతులూ కడుక్కొని హోటల్లోకి రా. కాస్త తిని మరీ పో జతలకి."

ఇలియాను చూచీ చూడటంతోనే పిల్లకారంతా వచ్చి వానిచుట్టూ మూగేవారు. చూడాలనే కుతూహలం కొద్దీ వాని జోలి నుండలాగేవారు. పాష్కా ఇలియాను దారిలోనే అడ్డగించి "జోలిలోవన్నీ నాకు చూపించి కదలు" మని జబర్దస్తీ చేసేవాడు.

"ఆగవోయ్! నన్ను కాళ్ళూ, చేతులూ కడుక్కోనీ యురా" అనేవాడు ఇలియా.

ఒక వేపునుంచి పెరెన్సు వచ్చి ఇలియాపైపుమీగ చెయ్యేసి తట్టి "ఏమోయ్ పనోడ! పనిలోనుంచి తిరి గొచ్చావు!" అని ప్రేమతో పల్కరించేవాడు.

పిత్రుప్పసి మాటలకు ఇలియా పొంగిపోయేవాడు.

క్రమంగా అక్కడి వారందరు ఇలియాను శ్రమశీలిగా పరిగణించసాగారు.

ఒకనాడు కొడుకుఆగడాన్ని సహించలేక సావెలు పాష్కాను తాటితో కట్టేసి చితగ్గొట్టాడు. కోపంపట్టలేక

నోరుచించుకొని నానాదివాళ్ళు పెడుతున్నాడు. "పనికి మాలిన చవట! నీ యీడువాళ్ళు కష్టపడి డబ్బువాళ్ళు సంపాదించుకొస్తూంటే నువ్వు తినటానికి పోటీగా తినటమే కాక అస్తమానూ రద్దీ చేస్తున్నావా? నిన్ను మందలించక యింట్లో లేమిటి? నీ పుచ్చి పగులకొడ్తానుండు" అని తిట్టి అనేకంతో మళ్ళీ మోదసాగాడు.

పాష్కా లబోలిబోమని యేడుస్తున్నాడు. ఇలియూ యిదంతా చూస్తూనే వున్నాడు. సావెలు అన్నమాటలు తన్ను ద్వేషించేనని వుబ్బిపోయాడు; కాని మరుక్షణంలో పాష్కాస్థితి తలచుకొని జాలిపడ్డాడు. తన చోటునుంచి పరుగెత్తి వెళ్ళి 'సావెలు బాబాయి! పాష్కా అన్నయ్య నిక వొదిలిపెట్టు. ఇంకెప్పుడు అల్లరిచేయడులే' అని బ్రతిమాలాడు.

సావెలు కోపంలో కన్నూ మిన్నూ తెలియకుండా వున్నాడు. ఒక బుడ్డాడొచ్చి తన్ను మందలించటం నామర్దాగా తోచింది. "ఊఁ, మహా చెప్పొచ్చావు లేవోయ్; పో యిక్కడనుంచి, లేకపోతే నీ తిక్క వొదిలిస్తా"నని హుంకరించాడు.

పాపం! ఇలియూ తెల్లపోయాడు; నోరు మూతపడింది. అయినా యింకేమనగలడు!

తండ్రి విడిచిపెట్టేసిన తర్వాత పాష్కా పడుతూ లేస్తూ పోయి ప్రాంగణంలో ఒకమూల కూచుని వెక్కి వెక్కి యేడుస్తున్నాడు. ఇలియాకు మళ్ళీ జాలివేసింది. వాడి

దగ్గరకు చేరి "ఎక్కడెక్కడ తగిలినయి? బాగా నొప్పిగా వుందా?" అని పరామర్శ చేశాడు.

పాష్కాకి కోపం పొడుచుకొచ్చి "పోవోయ్, నా జోక్యం నీ కెందుకు?" అన్నాడు తలెత్తి చూడకుండానే.

ఇలియా చిన్నబుచ్చుకున్నాడు. జాలి కోపంగా మారింది. "నువ్వు రోజూ అందర్ని కొడ్తావే; ఇప్పుడు తగిన శాస్తి జరిగిందిలే" అని దీర్ఘంతీశాడు. పాష్కా గబుక్కున ఇలియాపైకి లంఘించి మీదెక్కి కూచున్నాడు. ఇలియా కోపంతో భగ్గుమన్నాడు. ఒక విదిలింపుతో లేచి పాష్కాపైకి దూకి వాణ్ణి పీచీమన్ను చేశాడు. కాస్సేపిద్దరూ పెనగులాడారు. పాష్కా వుక్రోషం పట్టలేక ఇలియాను కొరికి రక్కాడు. ఇలియా తీసిపోక వాడి తలకాయని నేలకేసి కొట్టాడు. చివరికి పాష్కా ఓడిపోయి విడిచిపెట్టుమని బ్రతిమాలుకున్నాడు.

ఇలియా తక్షణం వదిలేసి "జాగ్రత్త! మళ్లీ నామీదికెప్పుడైన వచ్చావంటె నా తడాఖా చూపిస్తా."

పై మాటలని ఇలియా తన చేతిదంపనుండి కారుతున్న రక్తాన్ని తుడుచుకుంటూ వెళ్లిపోయాడు. దారిలో సావెలు యెదురొచ్చాడు. పొత్తుల్లాంటి వాని కళ్లు చూచి ఇలియా గజగజలాడాడు. పాష్కాని కొట్టి వచ్చినందుకు తన్నాతడు బాదకమానడనుకున్నాడు. తాయమని పక్కకు తప్పుకొని సావెలువంక చూచాడు. సావెలుప్రగసాప

మింకా అలాగే వుంది. "ఏమిటి, గుడ్లు మిటకరించి చూస్తున్నావు? నన్నెప్పుడూ చూళ్ళేదా? పో, పో," అని వురిమాను.

చీకటి పడినాక సావెలు మరొక తడవ కొనసిల్లాను. అతడు ప్రేమతో ఇలియాను దగ్గరకు లాక్కొని తల నిమురుతూ "నీ వృత్తి చక్కగా సాగుతోందా!" అనడిగాడు.

ఇలియా వుబ్బి తబ్బిబ్బయ్యాడు. నేడా యింటిలోని వారందరిలోను క్యారాతి క్యాదను తనతో నవ్వుతూ మాట్లాడుతున్నాడు. ఇది ఇలియా అనుభవంలో సామాన్య విషయం కాదు. పైగా సావెలు "నువ్వు పెద్దవాడివవుతున్నావు. దుక్కలాగున్నావు. మరి కొన్నాళ్ళు పోతే నిన్ను నా కార్ఖానాలో వుంచుకుంటాన్లే" అన్నాడు కూడాను.

ఇలియా కంఠం రుద్ధమయింది. రెండు చేతులతో సావెలు పాదాలంటి కళ్ళ కద్దుకున్నాడు. సావెలు వాని మూపు తట్టి నదిలేశాడు.

మర్నాడు పొద్దుగూకుమాటు ఇలియా తన జోలి దించి, సామాను క్రింద పరచి చూచుకున్నప్పుడు వాని చిత్త ముల్లాసంగా వుంది. యథాప్రకారం పిల్లలు చుట్టూ చేరారు. తలొక వస్తువును చేతపట్టబోతూంటే "ఆగండాగండి. మీ రన్నీ తీసికెళ్ళిపోతే నే నేం కావాలి? నేను వీటిని అమ్ముతాను. మీరు కావలసినవి కొనుక్కోండి" అని చెప్పాడు ఇలియా.

జాకోబు జేబిలోంచి చిన్న నాణె మొకటి తీసిచ్చి ఒకటి తీసుకోబోయాడు. ఇలియా అడ్డుతగిలి "ధర అడక్కుండానే తీసుకుంటా వేమిటోయ్! జేబులో నుంచి డబ్బు తీసిస్తేనే సరిపోతుం దనుకున్నావా?" అన్నాడు.

తర్వాత బేరమాడటము, కొనటము జరుగుతోంది. బేరంలో వాగ్వాదం కూడ సాగింది. ఆ దేసమయంలో మెల్లగా పిల్లికిమల్లె పాష్కా వచ్చి అదాటుగా ఒకటి రెండు వస్తువులు లంకించుకొని వుడాయించాడు. అందరూ తెల్లపోయారు. వాడి కొంటెపనికి చిన్నపిల్లలు బిక్కమొగాలు పెట్టారు. ఇలియా జాకోబులు వాణ్ని పట్టుకోటానికి వెంటబడ్డారు; కాని లాభంలేకపోయింది. వారి కిది కొత్తేమీ కాదు. పాష్కా నిత్యము చేసేదే. అందువల్లనే పిల్లలందరు వాడిని యెబ్బెట్టుగా చూస్తారు. వానితో ఆడుకునేందు కెవరూ యిష్ట పడరు. ఎవరికి వారు వాడికి దూరం దూరంగానే వుంటారు.

జాకోబు తరుచుగా మాషాతో కలిసి ఆడుకునేవాడు. ఆమె మీద మాట పడనిచ్చేవాడు కాడు. ఇలియా వద్ద తమాషావస్తువులు పట్టుకెళ్ళి యిచ్చి మాషాని సంతోషపెట్టే వాడు. జాకోబు ఇలియా లిద్దరూకూడ జతగా వుండేవారు. ఇద్దరూ వినోదవిషయాలు చెప్పుకుంటూ కాలక్షేపం చేసే వారు. ఇద్దరూ మాషాని ఆనందింపజేయటానికి ప్రయత్నించే వారు. జాకోబు విచిత్ర విషయా లెన్నో చెప్పేవాడు. వాని

చమత్కారపు మాట లాలకించుతూ ఇలియా నిద్ర సంగతే మర్చిపోతూండేవాడు. ఒక్కొక్కప్పుడు జర్మియా వచ్చి వాడిని లేవదీసుకొని పోవాల్సి వచ్చేది. ఇలియా నవ్వుకుంటూ వృద్ధు ననుసరించి పోయి సుఖనిద్రపోయేవాడు.

# 4

జర్మియా ఇలియాకి చొక్కాయి, షరాయి, టోపీ, కాలి జోడు కొనిచ్చాడు. ఇలియా యిప్పుడు విద్యార్థి అయాడు. తొలినాటి సాయంత్రం బడినుంచి తిరిగి వచ్చినప్పుడు వాని మోము మ్లానమై, విషాదభరితమై వుంది. కంట నీరుపెట్టి "బళ్లో నన్నందరు వుడికిలించారు. నన్ను చూచి వాళ్ళు ముక్కులు మూసుకొని, మూతులు ముడుచుకున్నారు. నా ఒంటినుంచి గబ్బు వస్తోందన్నారు. వాళ్ళు నన్నెందు కేడిపించాలో? పెంటకుప్పల్లో పారేసినవాటిని యేరుకుంటే తప్పా?" అని మొరపెట్టుకున్నాడు.

ఓరెన్ను వాని వెంట్రుకలు జీరుతూ "పిల్లలు కొత్తవాళ్లని వేళాకోళంచేసి వెక్కిరిస్తారు. ఉడికిలించటం

వారిస్వభావమే; కాని, బుద్ధిమంతులు వాటిని సరకు చెయ్య కూడదు. నాలుగురోజులు పోతే అన్నీ తగ్గిపోతయ్'' అని బుజ్జగించాడు.

''అందరూ నా వస్త్రుల్ని చూచి యెద్దేవ చేశారు కూడాను.''

జర్మియా నవ్వి ''బిడ్డా! భగవంతుని నమ్ముకో. ఆయనే నీకు మేలుచేస్తాడు'' అని సముదాయించాడు.

జర్మియా భగవన్నామ సంస్మరణనిగూర్చి చెపుతూంటే కోపం చల్లారి ఇలియా శాంతించేవాడు; కాని, మర్నాడు పాఠశాలలో విద్యార్థుల మాటలతీరు, పరుష వాక్యాలు మళ్ళీ వాని నుద్విగ్నమానసుణ్ని చేసేవి. ఇలియా తన్ను తా గుర్తించుకోసాగాడు. సావెలునంటి కఠినాత్మునిదృష్టిలో సైతం తన కొకవిధమైన గౌరవ మేర్పడింది; కాని, బడిపిల్ల కాయలు తన్ను చులకనగా చూస్తున్నారే! ఇలియా కది దుర్భరమయింది. స్కూలులో తనకి జరుగుతున్న అవమానము, పట్టిన గతీ వాని హృదయా న్నటమటింపజేసేవి. బడి వాని కొక బ్రహ్మరాక్షసిలాగుంది. పాఠశాలపేరు విన్నంతనె వాని తల బరువెక్కేది. సహాధ్యాయుల్లో యెవరితోను వానికి పొత్తేర్పడలేదు. అందరితోను యెడాముటిగా వుండే వాడు. ఇలియా కుశాగ్రబుద్ధి, శ్రద్ధ సహపాఠుల కసూయను కలిగించినయి. వాళ్ళు ఇలియాను మరింత ద్వేషించసాగారు. వానితో చదువులో పోటీచేయలేక చదువురాని వాజమ్మలు

కుటిలోపాయాలు పన్ని వానిని కించపర్చుతూండేవారు. జాకోబుకూడ ఆ బళ్ళోనే చదువుకుంటున్నాడు. వాడొక మందమతి. అందుచే వానికి దెబ్బలు దండిగా ముట్టుతూండేవి. తతిమ్మా బాలురు వానినికూడ ఎత్తిపొడుపులతో ఏడ్పించేవారు. 'గబ్బిలాయి' అని పేరు పెట్టారు జాకోబుకి. అయినా వాడు తన్ను కాదన్నట్టు పట్టించుకునేవాడు కాదు. బడిలో ఎవరితోను కలసిమెలసి తిరిగేవాడు కాదు. ఇంటివద్ద కూడ ఒంటరిగా నుండ నభిలషించేవాడు. అప్పుడప్పుడు ఇలియా, మాషాలతో మాత్రం కాలం గడిపేవాడు. వాడి కెక్కడలేని విచిత్ర సందేహాలు పుట్టుకొచ్చేవి. ఒక తేప "ఇంత చిన్ని కళ్ళతో మానవులు పెద్ద పెద్ద వస్తువులను ఎలా చూడగలుగుతున్నారో!" నని ఇలియాను ప్రశ్నించాడు.

మరొకతడవ దినకరునిగూర్చి మాట్లాడుతూ జాకోబు మరింత విస్మయం వెలిబుచ్చాడు. "సూర్యుడు అంత వెచ్చగా కాగిపోవటానికి కారణమేమిటో?" అనడిగాడు.

ఇలియా నవ్వాడు. అందుమీదట జాకోబు "నా వుద్దేశ మేమిటో తెలుసా? సూర్య చంద్రులు భార్యా భర్తలనీ, వారిద్దరి సంయోగంవల్లనే ఆ తారాగణ మంతా వుద్భవించిందనీ అనుకుంటున్నాను. నువ్వేమంటావు?" అన్నాడు.

మొదట్లో ఇల్లాంటి చిత్రవిచిత్రవిషయాలనుగూర్చి ఆలోచించడము ఇలియా కానందంగానే వుండేది; కాని, అందువల్ల తన చదువుకవాంతరం యేర్పడుతోందని క్రమంగా గ్రహించుకున్నాడు.

ప్రతిదినము తనకళ్ళముం దెన్నో సంఘటనలు జరుగుతుండేవి. ఇలియా వాటన్నిటిని గురించి ఆలోచించు టవసరమే ననుకునేవాడు. ఒకనాడు బడినుండి వచ్చి జర్మియాతో అన్నాడు— "తాతా! మా మాష్టారు బలే చిత్రమయిన మనిషి. నిన్న మిఠాయి కొట్టువారబ్బాయి కిటికీఅద్దం పగులగొడితే నాలుగు పీకలేసి తమ డబ్బుతోనే మళ్ళీ అద్దం వేయించాడు."

"అయితే మీ పంతులయ్య చాలా మంచివాడన్న మాట" అన్నాడు జర్మియా.

"నే నల్లా అనుకోవటంలేదు తాతా! ఈ మధ్యనె ఇంకో విద్యార్థి చెయ్యి తగిలి అద్దం చిట్లితే వానితండ్రివద్ద రెట్టింపు కిమ్మతు వసూలు చేశాడు. మరదేం న్యాయం?"

"బిడ్డా! నీ విల్లాటి విషయాలన్నీ బుర్రకి పట్టించుకోకూడదు. ఒకరి తప్పొప్పులను పరిశీలించటం మన పని కాదు. పరమేశ్వరుడే యెల్లరి కర్మలను పరీక్షించుతాడు. మనం యెప్పుడూ మాయలో పడిపోతాము. మంచి మనకళ్ళకి కనపడదు. మనం రంధ్రాన్వేషణమాత్రం చేస్తుంటాము; దేవుడలాగాక సమదృష్టితో చూస్తాడు. నాకు యెనభై

న్మోల్లోచ్చాయి; గాని, యింత వయస్సులోనూ నే నెవర్నీ సత్కార్యం చేస్తుండగా చూళ్ళేను. అయితే యింతమాత్రాన యిన్నాళ్ళనుంచి నాకళ్ళముం దే మంచిపనీ జరగనే లేదని తలచకూడదు. తప్పకుండా జరిగే వుంటాయి. కాని, అవి నా దృష్టిలోమాత్రం పడలేదన్నమాట. అంటే నేను వాటిని గుర్తించలేకపోయాను; అంతే.''

''కాని, యిందులో యేమంత సూక్ష్మ విషయం లేదే! ఒకే అపరాధానికి ద్వివిధ శిక్షావిధానం న్యాయసమ్మత మెల్లా అవుతుంది? రెండో అపరాధినుంచికూడ మొకటి పిల్లవానివద్ద వసూలుచేసినట్టే నష్టపరిహారం రాబట్టుకో వాలి గద?''

ముసలాతడు ఇలియాతో యేకీభవించలా. ''మనకి సరియైన న్యాయం జరగాల్సిన యోగ్యత లేదు; కాబట్టి మన మా విషయంలో నోరెత్తరాదు. భగవంతుడే గట్టి తనిఖీచేసి నిర్ణయించుతాడు'' అని నొక్కి చెప్పాడు.

ఇలియా యిక మాట్లాడలా; కాని, జర్మియా వాదము వానికి మనస్కరించ లేదు. వాని వదనమండలాన్ని విషాద చ్ఛాయ లలముకున్నై. కొంతతడవాగి తటాలున అడిగాడు— ''తాతా! మనందరిని విచారించడానికి భగవం తుడు కచేరి నెప్పుడు ప్రారంభించుతాడు?''

అది ఒకరు చెప్పేదికాదు. ఎప్పుడో ఒకనాడు హఠా త్తుగా హెచ్చరికగంట మ్రోగుతుంది. ఈశ్వరుడు కిందికి

దిగివచ్చి విచారణ ప్రారంభించుతాను. నువ్వుకూడ నాతో చర్చికి వస్తుండు. అక్కడనే సందేహాలన్నీ నివృత్తి అవుతాయి."

ఇలియాసా వృద్ధునితో చర్చికి వెళ్ళాను. జనం తండోప తండాలుగా వచ్చారు. ప్రార్థనామందిరం కిటకిటలాడు తోంది. కాలుమోపేసందు లేదు. పట్టణంలోని కులీనులు, సామాన్యులు, సన్యాసులు, గృహస్థులు అన్ని తరహాల మనుషులు అక్కడ చేరారు. ఎల్లరి హృదయాలు పవిత్రమై నిర్మలంగా వున్నట్టు తోస్తోంది. ప్రతివానిముఖంలోను శాంతిచిహ్నాలు ప్రతిబింబించుతున్నై. చెడుగు మానవు లను వదలి పారిపోయిందా అన్నట్టు తోచింది. ప్రతివాని వదనము వికసించి వుంది. ...వస్తుంది యేకాగ్రచిత్తులై ప్రార్థనలో లీనమయ్యారు. ఇలియూ తన్ననుదినము బడిలో కొట్టి, తిట్టుతుండే తుంటరి బాలుర లిద్దరినీ అక్కడ చూచాను. వాళ్ళని చూచినందువల్ల ఇలియాస్వాంతమెట్టి వికారమును చెందలేదు. వాళ్ళను క్షమించి యిక నా యిద్దరి తోను సఖ్యతగా వుండాలని ఆత్రపడ్డాను; కాని, స్కూలుకు వెళ్ళిం తర్వాత ఆ భావనలన్నీ నశించిపోయినై. ఇలియా యెప్పటి మోస్తరుగా వ్యథితహృదయుడై మ్లానముఖం తోనే బడినుండి తిరిగి వచ్చాడు. ఏ సమాజంలోగాని, సభా సంఘాలలోగాని ఒకరో యిద్దరో తతిమ్మావారి పోకిళ్ళతో అసంతృప్తి చెంది ఖేదించినవారు కనపడుతూనే వుంటారు.

వాళ్ళు మిగతావారికంటె మంచివాళ్లూ కావచ్చు, చెడ్డ వాళ్లూ కావచ్చు. వారిలో చెప్పుకో దగినంతగా లేకపోయినా ఒక్కొక్క వ్యక్తిని సంఘం అనవసరంగా అణచివేయకూడదు కదా. ఈ సమాజంలో ఇలియా అట్టివాడే. క్రమక్రమంగా వాడు సమాజాని కనుగుణంగా మారిపోవటము, ఇలియా వ్యక్తిత్వము పరివర్తనం కావటంకూడ సంభవమే; కాని, అకారణం లోనే గుండెను పిండిచేయగల ఓ సంఘటన జరుగుటవల్ల వాని జీవితక్రమమె అన్యమార్గంలో పడింది.

ఒకనాటి సంగతి: ఇలియా జాకోబులు భోజనానికి వెళుతున్నారు. ఇంటిముందేదో గలభా వినబడింది. ఇలియా గిరుక్కున వెనక్కి తిరిగి అటువేపుకు పరుగెత్తాడు. ముందా వరణలో జనం గుమికూడి వున్నారు. ఏమేమో వాగుతున్నారు. ఇలియా గుంపును చీల్చుకుంటూ యెట్టకేలో లోపలికి చొరబడ్డాడు. కమ్మరి కార్ఖానాముందు ఒక స్త్రీ శవము పడివుంది. సావెలు గుమ్మంలోకూచొనివున్నాడు. వాని పెదిమలు అదురుతున్నాయి. కన్నులు జొత్తుల్లా గున్నవి. ముఖం వికృతమై భయం కల్గిస్తోంది.

"చప్పున పోలీసుల్ని పిలవండి. ఈ దుర్మార్గుణ్ని వూరకే వదలకూడదు" అని విన్పించింది గుంపులోనుంచి.

జనం ఆగ్రహావేశంతో పళ్లు నూరుతున్నారు. అంతలో జర్మియా అక్కడికొచ్చాడు. అతని నెరిసిన వెంట్రుకలు చెదిరివున్నాయి. చెమట కాల్వలు కడుతోంది. కుడిచేత్తో

నీళ్ళగ్లాసు పట్టుకొచ్చాడు. ఆగ్లాసును సావెలు కందించుతూ "కొంచెంనీళ్ళు తాగు నాయనా!" అన్నాడు జాలిగా.

"ఈ ఛండాలుడిని దయతలచకూడదు. వీణ్ని వురికంబ మెక్కించాల్సిందే" నన్నాడు గుంపులో ఒకడు.

సావెలు మెదలకుండ గ్లాసందిపుచ్చుకొని నీళ్ళన్నీ గటగట త్రాగేశాడు. కొంచెమాగి కర్కశస్వరంతో చెప్పాడు— "నేను దీని కెన్ని తడవలో చెప్పాను; కాని, నా మాటల్ని కించిత్తైనా లక్ష్యపెట్టిందికాదు. తన గొయ్యి తానే త్రవ్వకుంది. నే నేం చేస్తాను? పాష్కాకి దిక్కులేదని మాత్రం నాకు దిగులుగా వుంది. బాబా జర్మియా! దిక్కులేని పాష్కాని కాస్త కనిపెట్టి చూస్తుండు. దేవుడు నీకు మేలు చేస్తాడు."

వృద్ధుడు వానిని ఓదార్చసాగాడు. అంతలో గుంపులోనుండి యెవర్లో అన్నారు— "ఓరి లుచ్ఛా! భగవంతుని పేరుగూడా వుచ్ఛరించుతున్నావుగా!"

ఈ మాటలు విని సావెలు తలెత్తి గ్రుడ్లురిమి గుంపువంక చూచాడు. "మీరంతా యిక్కడి కెందుకొచ్చారు? మీ కిక్కడేం పని? పో, పొండి" అని గదమాయించాడు.

వాని గంభీరగర్జనతో జనంలో కలవరంపుట్టింది. ఒక్కొక్కరె అక్కడనుంచి చల్లగా జారుతున్నారు. సావెలు కూర్చున్నచోటునుండే చనిపోయి పడియున్న తన భార్యవైపోసారి చూచాడు! తర్వాత లేచి కార్ఖానాలోకి

వెళ్ళిపోయాడు. అందులో ఒకమూల నున్న దివ్వమీద కూచుని చేతుల్తో నెత్తి నదిమిపట్టుకున్నాడు.

సావెలుదుర్గతికి ఇలియా కళవళపడ్డాడు. వాని కోమలహృదయం దయార్ద్రమయింది. ఇక నక్కడ నిలుచుండలేకపోయాడు. ఆవరణలో జనసమ్మర్దం లేనిచోటుకు వెళ్ళాడు. మళ్ళీ అక్కడినుంచి గుంపురెండోవేపుకు నడిచాడు. ఎవరేమి చెప్పుకుంటున్నదీ శ్రద్ధగా ఆలకించాడు; కాని, వానికేమీ బోధపడలా. వాని హృదయమే శూన్యమై పోయింది.

పోలీసులు వచ్చారు. కదంతొక్కుతూ లాఠీలు త్రిప్పుతూ జనాన్ని చెదరగొట్టారు. ఏమేమిటో అడిగి రాసుకుని సావెలును అరెస్టుచేసి తీసుకెళ్ళారు.

సావెలు వెళ్తూ వెళ్తూ జర్మియాకు వంగి నమస్కారం చేశాడు. తర్వాత పోలీసుకట్టడిలో ముందుకు సాగిపోయాడు. అక్కడ పోగైన అంతమంది జనంలోను సావెలుకోసం జాలి పడింది జర్మియా ఒక్కడే.

జన మింకను జట్లు జట్లుగ యింటిముంగల నిలబడి పై సంఘటనను గూర్చి తర్కవితర్కాలు చేస్తూనేవున్నారు. ప్రేతం యథాస్థానంలోనే పడివుంది. గడపముందొక కానిస్టేబిలు పహరాయిస్తున్నాడు. వాడు మండిగముమీద కూచుని దమ్ములాగుతున్నాడు. ఉండుండి తుపుక్కున వుమ్మేస్తూ జర్మియామాటల నాలకించుతున్నాడు.

జక్రియా అక్కడున్నవారితో యిల్లా చెపుతున్నాడు—మీరీ హత్యను సావెలే చేశాడనుకుంటున్నారా? కాదు, మానవుడెన్నడు మరోమనిషిని చంపలేదు. ఇల్లాంటి పైశాచికము, హేయము నైన పని మానవునివల్ల జరుగుతుందా? అల్లా ఎన్నటికీ జరుగదు. అతని హృదయంలో సైతాను ప్రవేశించి యీ అనర్థం చేశాడు, అంతే."

ఇంతవరకు చెప్పి తన గుండెలో నుంచి యేదో త్రోసివేయబడుతుంటే ఆపబోతున్నట్టు రెండు చేతులతోను గుండెను గట్టిగా అదుముకున్నాడు. ఒకసారి కాండ్రించి దగ్గి మళ్లీ ప్రారంభించాడు— "సైతాను యెడతెగకుండ సావెలుచెవిలో 'దాన్ని చంపు, అనుమానం లేకుండా చంపెయ్యి' మని చెప్పాడు."

"చాలా రోజుల నుంచేనా?" పహరా జవానడిగాడు.

"అవును, చాలారోజులనుంచీను. సైతా నింకేమి చెప్పిం దనుకున్నారు? ఆమె నీది. నీ వామెను హతమార్చవచ్చు. 'చంపేసెయ్యి' అని వూదింది; కాని, అది పూర్తిగా భ్రమ. గుర్రం మనది; కుక్కా మనదే; కాని స్త్రీపైన మన కెట్టి అధికారమూ లేదు. స్త్రీ భగవంతుని వస్తువు. ఆమెలో మానవాత్మ వుంది. సృష్ట్యారంభం నుండి విధాత స్త్రీ నెన్ని ఇడుమలపాలు గావించినా భూదేవిలా ఓరిమితో సహిస్తూ వచ్చింది. సైతాను మనల్ని భగ

వంతునికి వ్యతిరేకంగా రెచ్చగొట్టడానికి ప్రయత్నించుతుంది. సైతాను దేవునికి బద్ధవిరోధి. మనల్నికూడా తనకి తోడు చేసుకుంటానికే చూస్తుంది. ఆ సైతానే సావెలు నావేశించి యీ హత్య చేయించింది.

పోలీసుజవా నన్నాడు—"కాని, ఆ సైతాన్నెవరూ చూళ్ళేదే. సావెలే ఆమెని చంపేశాడు."

"సరే, మరి అతన్ని రెచ్చగొట్టిం దెవరో ఆలోచిం చొద్దూ? ఈ పాపం చేయమని వానిని ప్రేరేపించిన దెవ రంటావు?"

కానిస్టేబులు కళ్ళెర్రజేసి "ఇంతకూ యీ కమ్మరి నీ కేమవుతా డేమిటి?" అనడిగాడు.

"ఏమీ అవడు" అని జర్మియా చెప్పాడు.

"మరి నీ కీ వాగుడంతా దేనికి?"

"దేవుని పేరుతో."

"ముసలాళ్ళకు మతిపోతుంది. అవాకులు చెవాకులు వాగటం మాత్రం మిగాను అలవాటవుతుంది. చాల్లే, ఇక పో."

ఆవిధంగా కసరి పోలీసు జర్మియావేపునుంచి ముఖం త్రిప్పేసుకున్నాడు. జర్మియా వాగ్ధోరణి సాగుతూనేవుంది. సావెలు దేమీ తప్పులేదనీ, అతడు సైతాను ప్రేరణవల్లనే భార్యను చంపుకున్నాడనీ అందరికీ నచ్చజెప్పాలని వృద్ధుని పట్టుదల.

ఇలియా స్రూాన్వడి చూస్తూ అందరిమాటలు వింటు న్నాడు. అక్కడ విసుగెత్తి ఆడవాళ్ల వేపు వెళ్లాడు.

"పెళ్ళికి ముందునుంచి అది చెడిన ముండే. పాష్కాగాడు మాత్రం సావెలుకు పుట్టాడాయేం? వాడు పుట్టకపూర్వమే అది ఆ తాగుబోతుపంతులుమచ్చికలో పడింది" అన్నదొక సెరజాణ.

"ఆత్మహత్య చేసుకొని చచ్చాడే-ఆ మాష్టరేనా?" అనడిగింది మరొకతె.

"అవును, వాడే."

అప్పుడే అక్కడికొచ్చిన మాకర్ అందుకు న్నాడు — "ఏమయినప్పటికి సావెలు చేసింది వెధవపని. ఆవిధంగా హత్యచేసి యీ రీతిని స్త్రీపైన దోష మారోపించడం గర్హనీయం."

"నాభార్య బొత్తిగ పనికిమాలిన మొద్దు; అయినా నేను పెదవి విప్పకుండ సహించి కాలం దొర్లించుకొస్తు న్నాను" అని చెప్పుకున్నాడు ఫర్ఫిష్కా.

"నీ ఓర్పు మెచ్చుకోతగిందే" నంది మతిస్సా.

అదే సమయంలో ఫర్ఫిష్కా పెళ్ళాం దేక్కుంటూ తమగుమ్మంలో కొచ్చి తదేక ధ్యానంతో నింగివంక చూస్తూ కూచుంది.

ఇలియా ఆమెవంక శ్రద్ధగా చూచాడు. వాని కావిడ ఆకాశంలో దేవుని పవిత్ర స్వరూపాన్ని గాంచి మూక భాషలో ప్రార్థించుతున్నట్టు తోచింది.

ప్రాంగణంలోనే మరోతట్టున పిల్లలు పోగయ్యారు. వారిలో పాష్కా వున్నాడు. ఇలియూషా అక్కడికెళ్ళాడు. పాష్కా గొప్ప గీరునిలాగ తన తల్లి హత్యావివరాలు చెపుతున్నాడు. బాలబాలికలు వానిచుట్టూ దడికట్టి నుంచుని వింటున్నారు.

"మొన్ననగా మా యమ్మ యిల్లొదిలిపెట్టెళ్ళింది. అప్పటినుంచి నాన్న కోపంతో మండిపడుతూనే వున్నాడు. అప్పుడప్పుడు ఆకోపాన్ని నామీద చూపేవాడు. ఇందాకనే మాఅమ్మ వచ్చిం దెక్కడినుంచో. ఇంటి తలుపుకు తాళం వేసివుంది. మేమిద్దరము కార్ఖానాలోనే వుండాము. అమ్మవచ్చి తాళంచెవి నిమ్మంది. నాన్నమాట్లాడకుండానే వున్నపాళంగా లేచెళ్ళాడు. నాకప్పుడే తెలిసిపోయింది ఆయనేంచేసేదీ. గాబరా పుట్టింది. నాకళ్ళు వాటంతటవె మూసుకొని పోయినై. బిగ్గరగా కేకేసి అమ్మతో చెప్పేద్దామనుకున్నాను; కాని నా నోట్లోనుంచి మాటే పెగల్లేదు. వెళ్ళీవెళ్ళటంతోనే నాన్న అమ్మపై కురికాడు. ఆమె పారిపోయింది; కాని, నాలుగడుగుల్లోనే ఆమెని లంకించుకున్నాడు. ఒక్క దెబ్బకే అమ్మ క్రింద పడిపోయింది."

పిల్లలందరు గజగజలాడారు. ఒకడూ నోరు తెరవలా. తర్వాతికథ వినాలన్నట్టు నిశ్శబ్దంగా వున్నారు; అయితే పాష్కా మళ్ళీ నోరు విప్పలేదు. క్రిందవున్న గడ్డిపరకలను తీసి వాళ్ళపై కెగజిమ్మి తలొంచుకుని కూచున్నాడు.

"ఆయన మీయమ్మప్రాణం తీశాడా?" అనడిగింది మాషా.

"ఎక్కడో అప్లగాడిదలాగున్నావే!" అని పాష్కా కసిరాడు.

పాపమా పిల్ల చిన్నబుచ్చుకుంది. జాకోబు మాషాని తనవద్దకు లాక్కొని పుసలాయించాడు.

"నీకు విచారంగా లేదూ?" ఇలియా అడిగాడు.

"నీకెందుకోయ్ చవట!" అని పాష్కా గ్రుడ్లురిమి చూశాడు.

అందరిచూపులు పాష్కామీద కెళ్ళాయి.

పగలంతా పాష్కాతల్లి వీధుల్లో తిరుగుతుండేదని మాషా అనాలనుకుంది. కాని జాకో బామె నోరుమూశాడు. "సావెలు స్వభావాన్నిబట్టి జరిగింది అసంభవమేమీ కాదు. ఆయన కళ్ళెప్పుడూ జ్యోతుల్లాగుండేవి. చిరబురలాడుతుండే వాడు. ఆమె యెప్పుడూ నవ్వుతూనే వుండేది. మరి ఆ యిద్దరికి యెల్లా కలుస్తుంది!" అన్నాడు తాను.

పాష్కా శిరమెత్తి చూచి విసుక్కుంటూ ఆరిందావలె "ఎప్పుడో కోపమొచ్చినప్పుడు హఠాత్తుగా నాన్న చంపేస్తాడని నేను లోగడే అమ్మతో చెప్పాను. కాని, నా మాటని లెక్కచేస్తేగా. పైగా జాగ్రత! మళ్ళీ నోరెత్తా వంటె మక్కెలు విరగ్గొడతానని నన్ను కొప్పడింది. నాకు

మంచి మంచి బొమ్మలూ చిఱుతిండీ తెచ్చిపెట్టేది. మేజరు గారుకూడ నాకేదైన యిస్తూండేవాడు. నన్ను ప్రేమతో చూచేవాడు కూడాను" అని చెప్పాడు.

"ఆయనవద్ద కత్తి వుండేదా?" మాషా అడిగింది.

"ఆ, పెద్దకత్తి ఒకసారి ఒరలోనుంచి లాగిచూశాను కూడాను. చాలా బరువుంది."

"పాపం! నువ్వుకూడా ఇలియాలాగా అనాథుడవయ్యావు" అన్నాడు జాకోబు సానుభూతి సూచకంగా.

"అల్లా ఎన్నటికీ కాను. నేను వాడికిమల్లె సందుగొందుల్లో మురికిగుంటలు కెలుకుతా ననుకున్నావా?" అన్నాడు పాష్కా.

"ఎబ్బే! నావుద్దేశమది కాదు పాష్కా!" జాకోబు అన్నాడు.

"ఇప్పుడు నేను సర్వస్వతంత్రుణ్ని. ఇక నేను యథేచ్ఛగా తిరగొచ్చు. ఇదివరకు నాన్న నన్ను చదువుకో నిచ్చాడు కాదు. ఇక నిరభ్యంతరంగా చదువుకుంటాను."

ఇలియాకు నవ్వొచ్చింది. "నీకు దుస్తు లెక్కడివి? పాతగుడ్డలతో బళ్ళోకి రానియ్యరుగా" అన్నాడు.

"ఓస్! నా కార్ఖానా అమ్మితే బోలెడంత డబ్బు. నా కేమిటోయ్!"

అందరూ పాష్కా నభినందించసాగారు. ఇలియా ముఖం తెల్లబడింది. వాని కిప్పుడు డబ్బుమహిమ బాగా

బోధపడింది. పాష్కా విజయదర్పంతో ఇలియావంక చూచి యిలా అన్నాడు— "నేనొక మంచి గుర్రాన్ని కొనుక్కుంటాను. రోజూ బళ్ళోకి గుర్రమెక్కి వెళ్తా" ఈమాట చెప్పాడోకాని, మరుక్షణంలోనే యేమితోచిందో భయమావరించి వాని ఉల్లాసమంతా మాయమయిపోయింది.

నూషా వాని కళ్ళలోకి చూస్తూ "ఇక నిన్నెవరూ కొట్టరు కూడాను" అన్నది.

"అదేనున్నమాట? కొట్టేవాడెవడో ఒకడు వుండనే వుంటా" డన్నాడు ఇలియా.

పాష్కా వానిని మిరిమిరిచూచి "ఎవడికుంది గుండె? నీకా? రా కుస్తీపడదాము" అని దండ చరిచాడు.

జాకోబు కలుగజేసుకుని ఇద్దరినీ శాంతపరిచాడు. విషయం మార్చాలని "ఎంత గమ్మత్తుగా వుందో చూడండి! ఇంతకుముందే కులాసాగా నవ్వుతూ త్రేలుతూ మాట్లాడుతోంది. ఇంతలోనె ఒక్క దెబ్బతో క్రిందపడి గిలగిలకొట్టుకుని ప్రాణంవిడిచింది. అందరూ ఆమె చచ్చిపోయిందన్నారు. ఒక గంటక్రితం సజీవిగావున్న మనిషి ఇంతలోనే విగతజీవెల్లా అయిందో!" అన్నాడు.

ఈ సంగతి పిల్లలందరికి వింతగానే వుంది. వాళ్ళు ఆశ్చర్యంగా జాకోబువేపు చూశారు. వాడు నవ్వుతున్నాడు.

"నేనూ అదే ఆలోచించుచున్నాను. బలే తమాషాగా వుం"దన్నాడు ఇలియా.

"జనం ఆమె చచ్చిపోయిందనీ, జీవితం చాలించిందనీ అన్నారు. అంటే ఏమిటో" నన్నాడు జాకోబు మళ్ళీ.

"ఆమె ఆకాశమార్గాన స్వర్గానికి వెళ్ళింది" అని మాషా జాకోబు చెయ్యిలాగి తాను వినువీథిని చూడసాగింది.

అంతరిక్షాన తారలు బయలుదేరాయి. ఒక చుక్క భూతలానికి దాపులో దివ్యతేజంతో ప్రకాశించుతోంది. పిల్లలందరు తలలు పైకెత్తారు. పాష్కా ఒక్క క్షణం పైకి చూచి గమ్మున అక్కడినుంచి లేచిపోయాడు. ఇలియూ రెప్ప వాల్చకుండా ఒకే చుక్కమీద దృష్టి నిల్పాడు. వాని మోమున భయచిహ్నాలు కనపడుతున్నై. జాకోబు దృష్టి దేనినో అన్వేషించుతూన్నట్లు అంబరతలాన పరుగులెత్తుతోంది.

"జాకోబ్!" ఇలియూ ఆతురతగా పిలిచాడు.

అందరూ అదిరిపడి వానివైపు చూచారు. "ఏమి" టని జాకో బడిగాడు.

"నే ననుకునేది—" అని ఇలియూ ఆగాడు.

"ఏమిటీ?" జాకోబు మళ్ళీ ప్రశ్నించాడు.

"ఎంత పెద్ద ఘటన జరిగిపోయిందో చూచావూ! ఒక వ్యక్తి నిలువునా హత్యచేయబడింది. పెద్ద గొడవ యింది; కాని ఒక్కనికళ్ళనుండయినా రెండు కన్నీటిచుక్కలు రాలినపాపాన పోలేదు చూడు!"

"అదేమిటి, జర్మియూతాత కంట తడిపెట్టలా?"

"ఆయన విషయం వేరు. తాత హృదయంలో ఎవరి విషయంలోనయినా సరే జాలిపుడుతుంది. కాని సాష్కా సంగతే చూడు. వాడికి దిగులున్నట్టే లేదు. గాఢా విషాద ఘట్టాన్ని ఏదో వినోద కథ చెప్పినట్టు చెప్పేశాడు."

"వాడికి దుఃఖం లేకపోలేదు. కాని, మనయెదుట వెల్లడించేందుకు ఇష్టంలేదు అంతే. నిజానికి వానిగుండె పగిలి పోతోంది. చూశావుగా యెలా పారిపోయాడో! లోలోపల కుమిలిపోతున్నాడు."

కొంచెంసేపటివరకు యెవరూ మాట్లాడలా. మాషా జాకోబు తొడమీద తలెట్టుకుని నిద్రపోయింది.

"భయంగా వుందా?" జాకోబు ఇలియా నడిగాడు.

"అవును."

"ఆమె ప్రేతాత్మ యిక్కడే సంచరించుతూంటుంది."

"ఇక వెళ్ళిపోదాం పదండి."

తతిమ్మా పిల్లలందరూ వెళ్ళిపోయారు. ఇలియా కూడ లేచాడు.

"మాషా నిద్రపోతోంది. ఇద్దరం తీసికెళ్దాం" అన్నాడు జాకోబు.

ఇలియా "సరే" నన్నాడు.

ఇద్దరూ బాలిక నెత్తుకుని బయలుదేరారు. ఇలియా వెనకాల వున్నాడు. వాడికి తన్నెవరిదో ఛాయ వెంబడించు

నుంచి వానిని మరీ ఋూసడించుకుంటున్నాడు. ''ముసలిపీనుగ మహా పీనాసి. జీవితమంతా డబ్బు దిబ్బంలో వేసిపుంచాడు. ఇంకెన్నాళ్ళో జీవించడు. వాడికి నాఅన్నవాళ్లు కూడా లేరు. నువ్వంటే యెంతో ప్రేమగావుంటాడు. ఎప్పుడు గుటుక్కు మంటాడో! జాగ్రతగా కనిపెట్టివుండు. బంగారు పిచ్చుకను చెయి జారిపోనిచ్చేవు సుమా!'' అని పెట్రుహా టురెన్ను చెవిలో వూదటం ఇలియా విన్నాడు.

జర్మియా లేవలేనిస్థితిలో కూడా సంజవేళల హోటలు ముందు కూర్చుని టురెన్నుతో ఆధ్యాత్మికవిషయాలు చర్చించుతూండేవాడు. టురెన్ను ఇక్కడికి వచ్చినలగాయతు క్రమంగా ఎండిపోయాడు. వానిముఖం మరింత రోతగా తయారయింది. కళ్ళు లోతుకు దించుకొనిపోయినవి. జర్మియాతో చర్చించేటప్పుడు చిల్లులుపడి మురికిపట్టిన చొక్కా చేతుల్ని మాటిమాటికి పైకెగదోసేవాడు. రెండుచేతుల్తో తన గూని పట్టుకొని నుంచున్నప్పుడు వెనకాల యేదో దాస్తున్నట్టుండేవాడు. జర్మియా మంచమెక్కినప్పటినుంచి టురెన్ను వాని ఆలనా పాలనా కనుక్కుంటూ ''ఏం కావాలి బాబాయ్'' అనడుగుతూండేవాడు.

వృద్ధుడు కంట నీర్పెట్టి ''వద్దు నాయనా, నా కింకేం కావాలి, యేమీ వద్దు'' అనేవాడు.

టురెన్ను తనపనిమీద వెళ్ళేవాడు.

జర్మియాస్థితి నానాటికి తీసికట్టుకొచ్చింది. ఒక రోజున ఇలియాను దగ్గర కూచోబెట్టుకుని "బిడ్డా! నాకు కాల మాసన్నమయింది. భగవంతునిక చేరికి రమ్మని పిలుపొచ్చింది; కాని,......" అస్పైని ఇలియూ చెవిలో చెప్పాడు- "కాని, నా పరితాపమంతా నాకోరిక తీరలేదుగదా అనే. మావూళ్ళో ఒక చర్చి కట్టించా లనుకున్నాను. అందుకోసం పదిహేడు సంవత్సరాలనుంచి ఒక్కొక్క దమ్మిడీ పోగుచేశాను; కాని, నా మనోరథం యీడేరనే లేదు. ఎన్ని తంటాలు పడి ప్రయత్నించినా చాలినంత మొత్తం అవనేలేదు. పోనీ అని యింకో సత్కార్యానికైనా వినియోగించలేక పోయాను. ఇలియూ! నీవద్ద దాపరిక మెందుకు? లోకులు చెప్పుకుంటున్నట్టు నాదగ్గర కొంత డబ్బున్నమాట నిజమే; కాని, యీసంగతి నింకెవరికి చెప్పమాకు."

ఇలియూ శ్రద్ధాళువై జర్మియా చెప్పింది విన్నాడు. అప్పుడు వాని ఆత్మాభిమానానికి అంతులేక పోయింది. ఒక దీనుడు-కాటికి కాళ్ళుచాచుకొనియున్న ముసలి తనజీవిత రహస్యాన్ని విప్పి చెప్పుకుంటానికి, విలువైన తన జీవితసంచితాన్ని వప్పగించేందుకు ఇలియూనే యోగ్యుడుగా యెంచుతున్నాడు. జర్మియా తన యీగుట్టు నెవరికి తెలియనీకుండా దాచాలనుకుంటున్నాడో గ్రహించడానికి ఇలియూ కెంతో సేపు పట్టలా.

మరి కొన్ని దినాలు దొర్లిపోయినాయి. ఒకనాటి మధ్యాహ్నం ఇలియూ బడినుంచి వచ్చేప్పటికి జర్మియా గదిలో మూలుగుతూండటం విన్నాడు. గదిలోపల ఎవరో మసలుతున్నట్టు పసికట్టాడు. పుస్తకాలను తనగదిలోకి విసిరేసి జర్మియాగది వేపుకు చరచర నడిచాడు. తలుపు లోగడియ బిగించివుంది. తలుపుమీద నబాదిబ బాది "తాతా, తాతా!" అని పిలిచాడు.

ప్రత్యుత్తరం లేదు. ఇలియూకు అనుమానం కలిగింది. తలుపుకు చెవినానించి వినడానికి ప్రయత్నించాడు. ఎవరో వృద్ధునిగొంతు నొక్కుతూంటే జర్మియా గింజుకుంటూన్న ధ్వని వినపడింది. తర్వాత "భగవాన్! కరుణించు స్వామీ!" అని వృద్ధుడు కాతరస్వరంతో అనటం వినవచ్చింది. అంతే మరి అలికిడి లేదు.

ఇలియూ తలుపుసందులోగుండా లోపలికి చూచాడు. జర్మియా క్రిందపడి గిజగిజ తన్నుకుంటున్నాడు. ఇలియూ కేడ్పువచ్చింది. "తాతా! తాతా!" అని బిగ్గరగా అరిచాడు.

మళ్లీ జర్మియా యీలెలుగున అన్న యీ మాటలు వినపడినై. "పెట్రూహా! నే నీ డబ్బును దేవునిపేర చర్చి కట్టించడానికి కూడబెట్టాను. ఏంపని యిది?......దేవా! నేను నిరపరాధిని; క్షమించు తండ్రీ!"

ఇలియూకు కంగారు పుట్టింది. తన పాదాలు భూమిలోకి దిగబడిపోతున్నవేమో ననిపించింది. వృద్ధుడు అసహాయ

స్థితిలో చెయ్యూపుతూ యువతినో "అది ఈశ్వర సేవకే. ఈపని...నీ...మే...లు...ను...కాదు" అనటం వినిపించింది.

ఆరిపోయే దీపం గప్పుమన్నట్టు జర్మియా లేని ఓపిక తెచ్చుకొని గబుక్కున లేచి కూచున్నాడు; కాని, కంపించి పోతున్నాడు. రెండు చేతుల్తో యువతినో త్రోసివేయబోతూ న్నట్టు అస్పష్టంగా కనపడింది. ఆక్షణంలోనె దభేలున క్రింద పడిపోయిన చప్పుడయింది.

ఇలియా కెవ్వుమని కేకపెట్టాడు. కింకర్తవ్యతా మూఢుడై కోటల్లోకి లగూతీశాడు. రొప్పుతూరొజుతూ పోయి "బా...బా...య్! జర్మియాతాత చచ్చిపోయాడు; దబ్బున రా" అని పిలిచాడు ఔరెన్సును.

ఔరెన్సు యీ విషాదవార్త విని ఏమాత్రం ఆశ్చర్య పడలా. కేవల మొక నిట్టూర్పు వదిలాడు. అంతలోనె వెనుక తలుపు తెరచుకొని పెట్రుహా వచ్చాడు. ఔరెన్సు భావా త్మకంగా వానివైపుచూచి చొక్కాచేతులు పైకి దోపుకుంటూ బయలుదేరాడు.

ఇలియా పినతండ్రిని అనుసరించబోయాడు. పెట్రుహా "పాపం, పోయాడూ? దేవు డాయన ఆత్మకి శాంతినిచ్చు గాక! ఇలియా! నువ్వూ జాకోబూ యిక్కడే వుండండి. నేనుకూడా పోయి ఆపుణ్యాత్ముని తుది దర్శనం చేసుకొస్తాను. ఎవరైనా బేరానికి వస్తే యిప్పుడే వస్తా నుండమని చెప్పండి" అని ఇలియా నాపి తాను ఔరెన్సు ననుసరించాడు.

“పెరెన్నా! నువ్వు శుద్ధమూర్ఖుడివి. అంతా నిముషాల మీద జరగాలని చెప్పలా. ఇంత సేపా?” అని పెట్రుహా హాలు బయట పెరెన్నునన్నటం వాళ్ళిద్దరూ విన్నారు.

జస్మియొంగదిలో చూచిన దృశ్యము, విన్న మాటలు ఇలియాను భయభ్రాంతుని గావించినయి; అయినా వాని చైతన్యం లుప్తం కాలేదు. వాడు తనచుట్టూ జరుగుతున్న ఘోరాన్ని గమనించుతూ ఆకళింపు చేసుకుంటూనే వున్నాడు.

“ఆయన చనిపోవటం నీకళ్ళారా చూచావా?” జాకోబు అడిగాడు.

ఇలియా వినిపించుకోకుండానే “వీళ్ళెక్కడి కెందు కెళ్ళారు!” అన్నాడు.

“ఎందుకేమిటి? తాతని చూడటానికి. నువ్వేగా చచ్చిపోయాడని చెప్పావు?”

ఇలియా కళ్ళు మూసుకొని “చాలా భయంకర దృశ్యం! తాత వాడి నెంతవిసురుగా తోశాడు!” అన్నాడు.

జాకోబు విస్మయంగా అడిగాడు— “ఎవర్ని?”

ఇలియా కళ్ళు తెరిచాడు. మాట జారానని గ్రహించి “సైతానునులే” అన్నాడు.

“అయితే నువ్వు స్వయంగా సైతానును చూచావన్నమాట?”

ఇలియా తిరిగి కళ్ళు మూసుకున్నాడు. జవాబివ్వనే లేదు.

జాకోబు వానిని దగ్గరకు లాక్కొని "నువ్వు ఏడుసు కున్నావా?" అనడిగాడు.

ఇలియా కళ్ళువిప్పి "ఇప్పుడే వస్తానుగాని, నువ్విక్కడే వుండు. నే నిక్కడినుంచి వెళ్ళానని మీనాన్నతో చెప్ప గూడదు సుమా!" అన్నాడు నిమ్మళంగా.

"చెప్పను గాని దబ్బున రా."

జాకోబు నోటినుం డామాటలు వచ్చి రాకమునుపే ఇలియా ఆదరాబాదరా జర్మియా గదివద్ద కెళ్ళాడు. పిల్లి అడుగులతో ద్వారంవద్దకుపోయి సందుగుండా లోపలికి చూడ్కి నిగిడ్చాడు. వృద్ధుని కళేబరము నేలమీద పడి వుంది. టెరెన్సు జర్మియాతలగడను పట్టుకొని సూదీ దారంతో కుట్టును సరిచేస్తున్నాడు. పెట్రుహా అతని వెన కాల నిలబడి "త్వరగా కానియ్యి. అన్నీ సిద్ధంగా వుంచు కొని యెవరూ రాకపూర్వమే చక్కబెట్టాలని యెన్ని తడ వలు చెప్పాను. సరిగా వెతకటానికైనా అవకాశం లేకపోయె ......సరే, తొందరగా పూర్తిచెయ్యి" అని చెబుతున్నాడు.

ఇలియా వారిచేష్టలు చూస్తూనే వున్నాడు. వానికి తల తిరుగసాగింది. ఇకనక్కడ నిలుచుండ లేకపోయాడు. చడీ చప్పుడూ లేకుండా తిరుగుమొగమయ్యాడు. గుండె బరు వెక్కింది. దుఃఖం పొంగివస్తోంది. కాళ్ళీడ్చుకుంటూపోయి జాకోబును చూడగానే గావురుమన్నాడు. కుమిలి కుమిలి విలపించడం చూచి జాకోబు మిత్రుని వూరడించసాగాడు. అంతలో 'ఎందుకేడుస్తున్నావు?' అంటూ ఫర్ఫిష్కా వచ్చాడు.

జాకోబు జర్మియా మరణించాడని చెప్పగా "నిజంగా చచ్చిపోయాడా!" అంటూనే ఫర్‌ఫిష్కా మెట్లుదిగి వెళ్లిపోయాడు.

పెట్రూహా, టెరెన్సులు వాని వెనుక వచ్చారు. ఫర్‌ఫిష్కా వెనుదిరిగి వారి ననుసరించివచ్చాడు. విలపించుతూన్న ఇలియా వారికి కనపడకుండ కన్నీళ్ళు తుడుచుకో ప్రయత్నించాడు; కాని, ప్రయోజనం లేకపోయింది.

"జాకోబ్! త్వరగాపోయి జర్మియా మరణించాడని పోలీసు స్టేషనులో చెప్పిరా, పో" అన్నాడు పెట్రూహా.

"మీ రిప్పటివరకు ఆయన గదిలోనే వున్నారు కాబోలు" నన్నాడు ఫర్‌ఫిష్కా ప్రశ్నార్థకంగా.

టెరెన్సు గప్‌చిప్‌గా అక్కడినుంచి జారుకున్నాడు. ఇలియాకు ముఖం తప్పించడానికే అతనల్లా వెళ్లాడు. పెట్రూహా ఇలియాతల నిమురుతూ "పాపం జర్మియా నిన్నెంతగానో ప్రేమించేవాడు. అటువంటి మనిషి పోతే దుఃఖంగానే వుంటుంది; కాని, యేడిస్తే పోయినవాడు తిరిగొస్తాడూ? వూరుకో ఇక నీగదికి పో. పోలీసులు వస్తారు; వాళ్ళకెదురుగా వుండటం మంచిదికాదు" అని ఇలియాను అక్కణ్ణుంచి నెట్టాడు.

ఇలియా కళ్ళుతుడుచుకొని చుట్టూ చూచాడు. పెట్రూహా హాల్లోంచి లోపలికి వెడుతున్నాడు. ఫర్‌ఫిష్కా అక్కడే నిలబడి నవ్వుతున్నాడు; అయితే వానికళ్ళలో నిరాశ తొలుకుతోంది. వాని నవ్వులో యేదో మర్మమున్నదని గ్రహించి ఇలియా గోడప్రక్కనె ఆగిపోయాడు.

పెట్రూషా వెనక్కితిరిగి "ఫరొఫిస్కా! ఎందుకు నవ్వుతున్నా"వని అడిగాడు.

"ఆఁ, నువ్వెరగని దేముంది లే. సరేగాని, నా జేబుకూడ నిండదా యేం?"

"అంటే?"

ఫరొఫిస్కా గట్టిగా నేలనుతన్ని "మిత్రమా! నా కడుపు మాత్రం చిన్నదా యేమిటి? కాకపోతే అదృష్టం నా కెదురు తిరిగింది. పోనీలే, దేవుడు నీకైనా మేలుచేశాడు!" అన్నాడు.

పెట్రూషా వెకిలిగా నవ్వి "నువ్వనేదేమిటో నాకు బోధపడలా" అన్నాడు.

"నే నసలు బోళామనిషిని. నా కడుపులో గుట్టు యిముడకుండా వుంది. ఇక నీ యిష్టం."

"ఓహో! తాగుడు కోసమా? ఒక గ్లాసు బ్రాందీ కావాలన్నమాట. దాని కింత డొంకతిరుగు డెందుకు?"

ఫరొఫిస్కా బిగ్గరగా నవ్వాడు.

ఈ సంభాషణ వింటూంటే ఇలియూషకు నెత్తిమీది బరువు దించుతూన్నట్టుంది. కీసీడలా అక్కడినుంచి కదలి పోయాడు.

నాటిరేయి ఇలియూ నెన్నో ఆలోచనలు చుట్టవేశాయి. మామూలుగా నిద్రించేచోటుకు వెళ్ళక హోటలునందె ఒకమూల పడివున్నాడు. జబ్బియా ఆత్మ శిరెన్నును వెంబడించుతూన్నట్టు తోచింది.

ఇలియూకు భయంవేసింది. నేలచెమ్మ వాని ఒంటి కెక్కింది. చలికి వణవణ వణుకుతున్నాడు. ఔరెన్సుకూడ తన గదికి పోక హాల్లోనే వుండిపోయాడు. అతన్ని తన వద్దకొచ్చి పడుకోమని పిలవాలనుకున్నాడు. కాని, ఆవాళ తామిద్దరికీమధ్య అపూర్వమగు తెర ఒకటేర్పడింది. జర్మియా తనచెవిలో యేదో చెపుతూన్నట్టుగా వుంది ఇలియూకు.

ఔరెన్సుకి శాంతిలేదు. పిచ్చివాడివలె అటూ యిటూ పచారుచేస్తున్నాడు. ఇలియూ వాని మానసికాందోళనను గ్రహించాడు. "మీా రివాళ పడుకోరా యేమి"టన్నాడు ఔరెన్సు నుద్దేశించి.

ఔరెన్సు త్రుళ్ళిపడ్డాడు. నడుస్తున్నవాడల్లా టక్కున ఆగి "ఏమి"టన్నాడు.

'మీారు నిద్రపోరూ? పొద్దుపోయిందిగా.'

"ఆఁ, వెళతాను" అన్నాడు; కాని ఔరెన్సు మళ్ళీ అక్కడే చక్కర్లు కొడుతున్నాడు. అతని హృదయము పశ్చాత్తాపంతో వుడికిపోతోందని తలచి "నీ వీ శిక్షకు అర్హుడివేలే" అనుకున్నాడు మతిలో.

వాన తుంపరగా పడుతోంది. గాలి తాకిడికి లాంతరు వెలుగు వూగులాడుతోంది. బల్లమీాది సీసాలు, గ్లాసులు కట కట ధ్వని చేస్తున్నై. మూల పడుకొనియున్న ఇలియూ ముఖం మీాద తుండుగుడ్డను కప్పుకొని నిద్రించటానికి ప్రయత్నిం

చాడు. కాని అంతలో తన పై నేదో నీడపడింది. ఇలియా చప్పున ముసుగుతీసి చూచాడు. టెరెన్సు మోకాళ్ళమీద కూర్చొని దీనంగా దైవానికి మ్రొక్కుతుండడం గమనించాడు.

ఇలియా ఇక కోపం పట్టలేకపోయాడు. "ప్రార్థన కూడా ఎందుకండీ? మీకా యోగ్యత ఎక్కడిది? దేవుణ్ణికూడా దగా చేద్దామనా?" అని అడిగేశాడు తెగించి.

"నువ్వింకా మేలుకొనే వున్నావా! పోయి పడుకో" అన్నాడు టెరెన్సు ఏమీ వినిపించనట్టు.

"సరేగాని, మీరు మాత్రం ప్రార్థన పవిత్రతని చెడగొట్టకండి."

"అయితే నే నిక ప్రార్థన చెయ్యనులే."

క్రింది తేమ, పై చలి ఇలియాను పీడించ సాగాయి. వానికి వూపిరి పీల్చడం కూడ కష్టమనిపించింది. ఒక ప్రక్కన వాడిని భయం సతాయించుతూంటే, మరోవేపున జర్మియా జ్ఞప్తితో వాని కోమలహృదయం విలపించుతోంది. పినతండ్రి అఘాయిత్యం మాటిమాటికి వాని పసిహృదయంలో కలకవేస్తోంది. కొంతసేపటివరకు విచారాతిరేకంచే కూరుకు పట్టక అవస్థపడ్డాడు. తర్వాత లేచికూచున్నాడు.

వాని స్థితి టెరెన్సును కలవరపెట్టింది. దగ్గరకుపోయి ఇలియా చెయ్యి పట్టుకొని "ఏమిటి సంగతి? నీ ఒంట్లో సరిగా లేదా?" అనడిగాడు.

ఇలియా వానిని విదలించి ఒక్క త్రోపు త్రోశాడు. ముఖం ప్రక్కకు త్రిప్పుకొని కన్నీరు కార్చుతూ అత్యంత వేదనా సహితంగా "భగవాన్! నేను వీళ్ళకి దూరంగా దాక్కోటాని కేదయినా తావు చూపించు"మని ప్రార్థించాడు.

వాని కంఠం రుద్ధమయింది. రెండు చేతుల్తోనూ ముఖాన్ని కప్పుకొని వెక్కి వెక్కి యేడ్వసాగాడు.

## 6

జర్మియా మృత్యు ఘటన ఇలియాలో గొప్ప పరివర్తన కలిగించింది. అత డదివరకు తన సహపాఠులను మాత్రమె అసహ్యించుకునేవాడు. అందుకు వాళ్ళప్రవర్తనే కారణం; కాని, ఇలియా యిప్పుడు నీడలను చూచి కూడ భయపడు తున్నాడు. వానికి మనుషులందరు మహాపాతకులుగ కన్పించసాగారు. సదా గంభీరముద్రవహించి వుంటున్నాడు. ఎవరితోను విస్తారంగా మాట్లాడటంలేదు. పూర్వం వానికి వృద్ధులయెడ గల భక్తిభావం కూడ నశించిపోయింది. ఎవరేమి చెప్పుకుంటున్నా చెవియొగ్గి వినేవాడు. జర్మియామరణవిషయం స్మరణకొచ్చి పరితపించేవాడు. పెట్రుహా, కురెన్సులతో

పాటు తానున్న ఆ పాపానికి భాగస్వామినని వాని హృదయం ఘోషించుతూండేది. జబ్బియా తన నిక్షేపం సంగతిని తన కొడుక్కునికే చెప్పాననీ, ఆ విషయం తనద్వారానే పెట్రుహా, మురెన్నులకు తెలిసి వుంటుందనీ వృద్ధుడు అవసానసమయంలో తలచివుంటాడని భావించుకొని ఇలిమా విపరీతంగా వ్యథ చెందేవాడు.

వానిహృదయము సంతతము విషాద భరితమయి వుండేది. కనపడిన ప్రతివ్యక్తిని సందేహాస్పదంగా చూడ సాగాడు. ఎవరయినా యేదేని పాపకార్యం చెయ్యడం కళ్ళ బడితే తన హృదయభారం కొంతవరకు తగ్గుతూన్నట్టు భావించేవాడు. తనచూపు మేరలో వాని కితరుల దురితములు మాత్రమే దృగ్గోచరమయ్యేవి.

ఆ వాడకట్టున వున్నవాళ్ళందరూ పెట్రుహాను దుష్టుడని దూషించేవారు; కాని, వానిముందు మాత్రం స్తుతించేవారు. ఎదుటబడి వాని కెదురు చెప్పడానికెవరూ తెగువ చేసేవారు కారు. మతిస్సాని తిట్టనివాళ్ళే లేరు. నిషా తలకెక్కి తెయితక్కలాడుతూంటే ఆమె ననరాని మాట లనేవారు; కాని, తమ కామెతో పని కలిగినప్పుడు లేని సుగుణాలు కల్పించి యింతదాన వంతదాన వని పొగిడేవాళ్ళు. ఇరుగు పొరుగు వాళ్ళందరూ ఆమెతో యేదో ఒక పని చేయించుకునే వాళ్ళే; అయితే కానిడబ్బిచ్చి సహాయపడినవాళ్ళెవరూ లేరు. మతిస్సా నెప్పుడు చూచినా ఆడుతూ పాడుతూ హుషారుగా

వుండేది. ఎవ రేపని చెప్పినా చేసిపెట్టేది. జబ్బుపడ్డవారికి పరిచర్యచేయటంలోను, పిల్లలను చేరదీసి ముద్దులాడి, ఆడించుటలోను ఆమె అనిర్వచనీయానంద మనుభవించేది.

ఫర్ ఫిష్కా శ్రమజీవి. లోకులు వాని నెగతాళి, యెద్దేవ చేసేవారు. అతడు తప్పతాగొచ్చి సితారువాయించుతూంటే చుట్టూ జనం మూగి హాయి హాయి యని ఆనందించేవారు. అతడే కనుక కాళ్ళు పడిపోయిన భార్య, అమాయిక తనయుల ఆలన - పాలనలో నిమగ్నుడయి వుంటే ఒకడూ పల్కరించినపాపానపోయేవాడు కాడు; మాట మాత్రం సాయమయినా చేసేవారు కారు.

సావెలు నిర్బంధముతో పాష్కా పెద్దదిక్కు లేని వాడయ్యాడు. ఫర్ ఫిష్కా జాలి తలచి వాడిని చేరదీసి తన అజమాయిషీలో వుంచుకున్నాడు. ఫర్ ఫిష్కా చెప్పులు కుట్టి జీవనంచేసేవాడు. పాష్కానికూడ తన పనిలో వుంచుకొని తర్ఫీదు నివ్వసాగాడు. పాష్కా గత్యంతరం లేక ఫర్ ఫిష్కా చెప్పుచేతల్లో వుంటున్నాడు.

ఫర్ ఫిష్కాకొక తెగులుంది. ఆదివారంనాడు తప్ప తాగేవాడు. మర్నాడు పొద్దున కైపు దిగిన తర్వాత పెళ్లాంతో అంటూండేవాడు—"దూనియా! నన్ను మన్నించవూ? నేను అలవాటు కొద్దీ తాగటం లేదని నీకూ తెలుసు. ఏం చెయ్యను చెప్పు! వారం పొడుగునా బొక్కలు ముక్కలయ్యేటట్టు కష్టపడుతున్నానా. ఆ బడలికను బాపుకుంటానికి

వారాని కొక్కసారి మాత్రం తాగుతున్నాను. పని చేసి చేసి ఒళ్ళు హూనం అవుతోంది. మరి సెలవు నాడయినా తాగక పోతే యెల్లా చెప్పు?''

''నేను మాత్రం యేమన్నాను? నీస్థితికి నాకూ జాలిగానే వుంది. నాకు మాత్రం కళ్లు లేవూ? ఏ కష్టం చూచి నాగుండె తరుక్కు పోతోంది. భగవంతుడు నన్ను కూడ నీకు భారం చేశాడు. యమధర్మ రాజయినా దయతలచడమ్యో'' అనేది ఆ యిల్లాలు.

''నువ్విల్లాంటి మాటలు నోటిపైకి రానివ్వకు డూనియా! నువ్వా మాట లంటూంటే నాకు చాలా బాధగా వుంటుంది; హృదయం క్షోభిస్తుంది. నీవల్ల నాకొచ్చిన కష్ట మేముంది? పాపం! నేనే నిన్ను సుఖపెట్టలేకపోతున్నాను. అదయినా దుర్బుద్ధితో కాదుసుమా! నా బలహీనత వల్లనే. ఎక్కడికైనా కొత్త చోటుకు పోయి నూతనపద్ధతిలో వృత్తి సాగించితే బాగుపడేయోగ ముండవచ్చునని ఆలోచించు తున్నాను. అదృష్టదేవత ప్రసన్నమయ్యోనా మన వద్ద నాలుగుడబ్బులు చేరవచ్చుకూడాను'' అని అర్ధాంగితో ప్రస్తావించేవాడు ఫర్‌ఫిషా.

ఫర్‌ఫిష్కా స్థితిగతులు ఇలియాకు సాకల్యంగా తెలుసు. అతనంటే వానికి సానుభూతి వుండేది. చెమటోడ్చి జీవితాన్ని గడుపుకొస్తున్నప్పటికి ఫర్‌ఫిష్కా నిత్య సంతోషి యని ఇలియా మెచ్చుకునేవాడు.

ఇక పెట్రుషా సంగతి: అతను యేపనీ ముట్టడు. దుకాణంలో కూచొని మూడుముక్కలాట మొదలైనవి ఆడుతుంటాడు. పదేపదే తేనీరు తాగేవాడు. తప్పున్నా లేకపోయినా నౌకర్లను సదమాయించేవాడు. జర్మియా మరణించిన పిమ్మట సారా, బ్రాందీలను విక్రయించడానికి టెరెన్సును నియమించాడు. తాను పై పెత్తనం చలాయించు తూండేవాడు.

ఈ విషయాలన్నీ ఇలియాహృదయాన్ని కలవర పెట్టేవి. అందుచే వాడక్కడివారికి నైదొలగి వుండేందుకు ప్రయత్నించేవాడు. తన మనోవ్యథ నెవరిముందయినా వెళ్ళ గ్రక్కాలనుకునేవాడు; కాని, ఆత్మీయుడగు పిన తండ్రితో చెప్పుకోటానికికూడ మనస్కరించడంలేదు. జర్మియా నిర్యాణం చెందిన లగాయతు ఇలియా టెరెన్సుకు ముఖంతప్పించి తిరుగుతున్నాడు. ఇద్దరిమధ్య భేదమేర్పడింది. ఇలియా తనకు తానై టెరెన్సుయెదుటికి వెళ్ళడం మానేశాడు.

జాకోబయినా ఇలియాతో అంతగా మాట్లాడటం లేదు. అసలు కనబడటమే అరుదయింది. తనగొడవలో తానుండేవాడు. జర్మియామరణానికి వాడూ చాలా దుఃఖించాడు. వృద్ధునిఅవసానంతో ఆకొంపలో శోక దేవత తాండ వించుతూన్నట్లుగా భావించారు మిత్రు లిద్దరూను.

జాకోబు ఒకనాడు ఇలియావద్దకొచ్చి అన్నాడు— "మిత్రమా! నీ కొక తమాషా చూపిస్తాను; గాని, యెవరితోను చెప్పకుండ వుంటావా."

"చెప్పనని ఒట్టుపెట్టుకుంటున్నాను."

జాకోబు స్నేహితుడిని ఆవరణలో మూలనున్న వేప చెట్టు మొదట్లో సొరంగంలాగ తొలిచి రంగుపీలికలతోను కాగితాలతోను అలంకరించిన తొర్రను చూపెట్టాడు. అందులో చిన్న యిత్తడిబొమ్మ ఒకటుంది. దానిముందు కొవ్వొత్తికూడ వున్నది.

ఆ సరంజామా అంతా చూచి "ఏమి టిదంతా?" అనడిగాడు ఇలియా.

"నాకోసం చర్చిని తయారు చేసుకున్నానోయ్. రాత్రిపూట యిక్కడికొచ్చి ప్రార్థన చేద్దామనుకున్నాను. మరి నువ్వు కూడ వస్తావా?"

జాకోబు చేసిన ఆ సృష్టికి ఇలియా చాలా సంతోషించాడు; కాని, వాని కొక సందేహంకలిగింది. "ఎవరయినా చూస్తారేమో! మీ నాన్నకు తెలిసిందంటే చావబాదక మానడు" అన్నాడు.

"రాత్రివేళ యెవరు చూస్తారులెద్దూ. అందరూ నిద్రపోయినాక వద్దాం. పగలంతా గలభాగా వుంటుంది కూడాను. మనం చిన్నవాళ్ళం కావటంవల్ల ఆ గందరగోళంలో మనప్రార్థన దేవుడికి వినపడదు. రాత్రిపూట అయితే నిశ్శబ్దంగా వుంటంవల్ల తప్పకుండ వినపడుతుంది.

ఇలియూ వానిముఖంలోకి చూచాడు. జాకోబు కళ్ళు మెరుస్తున్నయి. ''దేవుడు తప్పక మన ప్రార్థన నాలకించు తాడనే మన మూశించుదాము'' అన్నాడు.

''మరి నువ్వు వస్తావా లేదా?''

''వస్తాగాని, ప్రార్థన యేమని చేసేది?'' అని ఇలియూ పక్కున నవ్వాడు. జాకోబుకూడ నవ్వులో నవ్వు కలిపాడు.

''నాకు జ్ఞానం ప్రసాదించమనీ, నా కోరిక లీడేర్చ మనీ నేను దేవుని ప్రార్థిస్తాను'' అని చెప్పాడు ఇలియూ.

''నేనూ అల్లాగే చేస్తాను. (కొంచెమూగి) ఇదివరకు యేదో ప్రాదికినే ప్రార్థన చెయ్యాలనుకున్నాను. ఆయనే యేదోఒకటి యిస్తాడనుకున్నాను; కాని, ఇప్పుడు నువ్వు చెప్పినట్టే చేద్దామనుంది.''

''సరే, మంచిదే'తె''మ్మన్నాడు ఇలియూ.

ప్రతిరాత్రి పార్థన చేయాలని నిశ్చయించుకున్నారు; కాని, వాళ్ళెక్కనాడయినా రాత్రివేళ అక్కడికి పోనే లేదు. క్రమేపి వాళ్ళు బాలచర్చిసంగతే మర్చిపోయారు.

ఆ పిల్లచర్చి పాప్కా పిట్టలను కొట్టుకోటానికి బాగా వుపయోగపడుతోంది. వా డందులో గింజా - గిటాని చల్లి వుచ్చు పన్నేవాడు. వెనకటికిమల్లె వాడి కిప్పు డాడుకోటానికి తీరిక వుండటంలా. ప్రొద్దుగూకులు ఒళ్ళువంచి పని చేయాల్సి వస్తోంది. వాని స్థితి యెత్తుభారంగా వుంది. జీవితము కష్టంగా వుంది. శరీరం శుష్కించిపోయింది. వాడి యెచ్చు మచ్చుకు

లేకుండా పోయింది. ఆదివారంనాడు మాత్రం విశ్రాంతి లభించేది. సెలవురోజున ఇలియా జాకోబుల వద్ద కొచ్చి వాళ్ళ చదువునుగూర్చిన కబుర్లు విని కుళ్ళేవాడు. "గప్పాలు కొట్టకండోయ్! నేనూ చదివేస్తాను యెప్పుడో" ననేవాడు వుక్రోషం పట్టలేక.

"నిన్ను ఫర్ఫిష్కా వదిలితే గద! అని జాకోబు వుడికిలించేవాడు.

"నే నెప్పుడో తుర్రున పారిపోతా చూస్తుండ" మన్నాడు పావ్కా.

ఒక నా డంతపనీ జరిగింది. తర్వాత రెండు రోజులకు ఫర్ఫిష్కా కనపడినవాళ్ళందరితోను "పాష్కా పారిపోయాడు. వాడికి ఒళ్లొంగితేనా! బాగుపడే రాతలేందే" అని చెప్పాడు.

ఆరోజున తెల్లవారగట్టనుంచీ జల్లుపడుతోంది. పాష్కా వానలో తడిసి యెంత అవస్థపడుతున్నాడో నని ఇలియా విచారపడ్డాడు. వరండాలో చేరినవాళ్ళు వర్షం జోరవడం చూచి ఆ పాతకొంప యెప్పుడో కూలిపోతుం దనుకున్నారు. ఇలియా కా యిల్లు భూమిలోకి క్రుంగిపోతున్నట్టు, యీ కాలంలోని పాపభారాన్ని ప్రాచీన యుగంనాటి ఆ భవంతి మరి మోయలేక భూపతనం కాగోరుతూ కిటికీలగుండా భగవంతునివంక దీనంగా చూస్తున్నట్టు తోచింది.

"ఇది ఎల్లాగూ పడిపోక తప్పదు. అది జరిగిన నాడు మన మందరము తలకొక దారి పట్టాల్సివస్తుంది. చాలా

కాలంనుంచి వుంటూవచ్చినందువల్ల ఒకవిధంగా మమత యేర్పడినా, మొత్తంమీద యీ కొంపలోని జీవితంమీద రోతపుట్టింది'' అన్నాడు ఫర్‌షిష్కా.

కాని, అల్లాంటి ప్రమాదమేమీ సంభవించనేలేదు. తర్వాత కొద్దిరోజుల్లోనే పెట్రుషా ఆ ఇల్లు, హోటలుకూడ కొనివేశాడు. అవసరమైన మరమ్మతు చేయించి రంగులు వేయించాడు. ఇం టి ముం దు గిల్టు అక్షరాల బోర్డు తగిలించబడింది.

ఫర్‌షిష్కా యీ మార్పులతోనైనా సంతృప్తి పడలా. "పై మెరుగులతో యేం లాభం? రేపటినుంచీ లోపలి చవుడు రాలుతూనే వుంటుంది'' అన్నాడు ఫర్‌షిష్కా నలుగురిలో. ఇలియా నవ్వి అతన్ని బలపరిచాడు. పైపూత రంగులు కన్నుగప్పి దగాచేయడానికే గదా అనుకున్నాడు.

పాష్కా యెక్కడో ఒకచోట సుఖంగానే జీవించుతూ వుండివుంటాడని ఇలియా భావించాడు. కూపస్థ మండూకము వలె తనజీవితంలో యెల్లాంటిమార్పు జరుగలేదు కదా యని దిగులుపడ్డాడు. అసలిక ఆ కొంపలోనుంచి తనకు మోక్షమే వుండదేమో ననుకున్నాడు. ఇంటికి మరమ్మతు చేయించుటతో పాటు ముందరిఆవరణలోని చెట్లన్నిటిని కొట్టించి క్రొత్తగా పాకలుకూడ వేయబడినై. విశాలావరణ అంతా సంకీర్ణమయి పోయింది. సావెలు కార్ఖానాముందు కొద్దిపాటి ఖాళీస్థల

ఉన్నా, ఇలియా ఆ వేపున పోవానికే జంకేవాడు. పావెలు భార్య రక్తసిక్తమై యింకా అక్కడే పడివున్నట్టు భావించేవాడు.

పెట్రొవిచ్ హోటలుకు సర్వాధికారి అయిన తర్వాత జురెన్కుకు గదిని మార్చి యిచ్చాడు. ఈ క్రొత్త గది సుభ్రముగ నుండేది. వెలుగుకు లోటు లేదు; కాని అది హోటలు ప్రక్కనే వుండటంవల్ల దుర్వాసనతో నిండివుండేది. కిటికీ తెరిచివున్నా నిర్మలవాయు సంచారానికి అవకాశం లేదు.

జురెన్కు పూర్వపు మనిషి కాడు. వాని కట్టు—బొట్టు, ఆచార—వ్యవహారాలు, నడక, మాటల తీరు పూర్తిగా మారిపోయినవి. సుభ్రమైనబట్టలు కట్టుకుంటున్నాడు. 'నీవు'కు మారు 'మీరు' అనిపించుకుంటు న్నాడు; అయితే అస్తమానం హోటలుసామగ్రిని వెయ్యి కళ్లతో కనిపెట్టుకొని వుండాల్సివస్తోంది. ఇలియాకు కూడ కొత్తబట్టలు వగైరా కొన్నాడు; కాని, ఇలియా వాటిని సంతోషపూర్వకంగా పుచ్చుకోలేకపోయాడు. వాడు జర్మియాసంగతిని విస్మరించలేక పోతున్నాడు. వాని జీవిత మొక్క పెట్టుగ నీరసము, దుఃఖభాజనము అయిపోయింది. ఈడుకు మించిన గాంభీర్యత వహించాడు. నిరంతరము హృదయభారంచే దిగనారి పోసాగాడు. మాటి మాటికి వానికి స్వగ్రామం తలపుకొస్తోంది. పల్లెటూరి బ్రతుకే శాంతిదాయకము, సుఖప్రదము ననిపించేది. గ్రామంలోని

ప్రశాంతత, నిరాడంబరము, సుహృద్భావాలు వెతకి చూద్దామన్నా పట్టణంలో కానరాకున్నవి. అంటాయిప్ కర్జనారణ్యవాసము తరచు స్మృతిపథంలోకి వస్తోంది. ప్రాస్టా రూపం కూడ కళ్లముందు మెదులుతూండేది. పాపర్కా యే అడవిలోనో, గుహాయందో . నివాస మేర్పరుచుకొని వుంటాడని అనుకునేవాడు. క్రూరమృగాలభీతి వున్నప్పటికి కాంతారవాసమె వాంఛనీయమనుకున్నాడు.

అల్లా అనుకొనకమాత్రం యేం చేస్తాడు! పట్టణంలో శాంతి యేదీ? అహర్నిశలు ఒకటే గంద్రగోళమయ్యె. ఒకడు గావుకేకలు వేస్తుంటే మరొకడు పాటపాడుతూ యాచన చేస్తుంటాడు. ఒక వేపున బండ్ల బడ బడ, మరో ప్రక్కన మోటార్ల బుర్ బుర్. ఇలాంటి రొదలతో యిల్లదిరిపోతూండేది; మనసు చీకాకయ్యేది. ఇంట్లో శాంతి లేదు సరికదా, బడిలో అసలే హుళ్లక్కి. బడి పిల్లల ఆగడములతో హృదయం కలతచెందేది. ఇంటికివస్తే పిల్లలు— పెద్దవాళ్ళు, ఆడ—మొగ భేదం లేకుండా తప్పతాగి తందనాలుతొక్కడము, పరస్పరం కీచులాడుకోవడము, కొట్లాడుకోడమే కన్పించేవి. ఎంత నికృష్ట దృశ్యాలు! అందరూ నీచులు, పాపులే. ఎవరిని కలుసుకున్నా శాంతి, సంతోషాలు చేకురతాయన్న ఆశే లేదు.

ఒకరోజున ఇలియా పుస్తకాలు చేతబట్టి బడికి పోనుద్యుక్తుడవుతూండగా ఫర్ ఫిష్టా హోటలులో ప్రవేశించాడు. వాని క్రాపు చెదిరివుంది. వస్తూనే ఓరెన్నువంక వింతగా

న్నూరాచారు. వానిప్రద్దేశం కురెన్నుకు బోధపడలా. మాట్లాడ కుండా గ్లాసులో బ్రాంది గ్రుమ్మరించి అందిచ్చాడు. ఫర్ఫిష్కా గటగట తాగేసి మళ్ళీ వెనుకటిరీతిన చూడసాగాడు.

ఫర్ఫిస్కా వాలకం చూచి కురెన్ను విస్తుపోయాడు. "ఏమిటి సమాచారం?" అనడిగాడు.

ఫర్ఫిస్కా కళ్లునలుముకుంటూ—"నా భార్య చచ్చి పోయింది" అని యేమాత్రం చీకూ చింతా లేనట్టు చెప్పేశాడు.

కురెన్ను సానుభూతిపూర్వకంగా చూస్తూ "పాపం! చనిపోయిందా? భగవంతు డామె ఆత్మకు శాంతిని చేకూర్చు గాక!" అన్నాడు.

ఫర్ఫిస్కా మాట్లాడకుండానే వెళ్ళిపోయాడు.

అతనివెనకాల కురెన్ను "తమాషా మనిషి!" అని నసిగాడు. ఇదంతా గమనించుతూన్న ఇలియాకూడ విచిత్ర వ్యక్తే ననుకున్నాడు తనలో.

ఇలియా ఫర్ఫిష్కా వాకిలిముందునుంచే బడికి వెళ్లాలి. అక్కడికి పోగానే టక్కున ఆగిపోయాడు. ఇరుగు పొరుగు అమ్మలక్కలు మానియా శవంచుట్టూ చేరి కళ్లు తడిచేసుకొని దుఃఖం ప్రదర్శించుతున్నారు. మతిస్కా మాషాని చంక నెత్తు కొని వూరడించుతోంది. ఫర్ఫిష్కా నిశ్చలంగా కూచుని కూతురువంక చూస్తున్నాడు. ఆ శోకదృశ్యాన్ని చూచి ఇలియాగుండె తరుక్కుపోయింది. గ్రుడ్ల నీరుక్రమ్మింది. ఇక నక్కడ నిలుచుండలేక దారిపట్టాడు.

ఇలియా బడినుంచి తిరిగివచ్చేసరికి షఖ్‌షిహ్కా హోటలుముందు కూర్చొని సితారు వాయించుతున్నాడు. మధ్యలో ఆపి ఆడవాళ్లు 'తన్ను తాగుబోతనీ, పనికిమాలిన వాడనీ' తిట్టి తరిమేశారని చెప్పాడు. అందుకు తన కేమీ చింత లేదట గాని, తిట్టినా, దుమ్మెత్తిపోసినా శాంతిగా బ్రతకనిస్తే అంతే చాలనీ, ప్రతిప్రాణికి సుఖంగా జీవించాలని కోరిక వుంటుందనీ, అందరిఆత్మలు ఒకటేననీ యేమేమిటో వాగుతున్నాడు.

వానిముఖంలో విషాదచిహ్నాలే లేవు. ఏమీ జరగనట్టే కులాసాగా వున్నట్టు కనపడుతున్నాడు. వాని హుషారు చూచి ఇలియా చీదరించుకున్నాడు. "ఒకప్రక్కన పెళ్లాం చనిపోతే వీడికి కేరింత లేమిటి? భగవంతుడు వీనిదౌష్ట్యానికి తగ్గ శిక్ష విధించకపోడులే" అనుకున్నాడు.

మర్నాడు కర్మ. షఖ్‌షిహ్కా కుత్తుకదాక తాగి వచ్చాడు. నిలువెల్ల నిషా యెక్కివున్నది. తలాతోక లేకుండ బడబడలాడుతున్నాడు; తూలి పడబోతున్నాడు. వాని ప్రవర్తనను అందరు యేవగించుకున్నారు. ఒకరిద్దరు చూచి వూరుకోలేక అనరానిమాటలనిరెండుతగలనిచ్చారుకూడాను.

సాయంత్రం ఇలియా జాకోబుతో అన్నాడు—నీ నెత్తిన కొత్తబరువొచ్చిపడింది.............షఖ్‌షిహ్కా పరమదౌర్భాగ్యుడని నా వుద్దేశం. నీ అభిప్రాయ మేమిటి?"

"నా ముం దాయనవ్వూ సెత్తవద్దు ఇలియా!" అని జాకోబు పెదమొగం పెట్టాడు.

అప్పట్నుంచి జాకోబులో విచిత్రపరివర్తన కన్పించుతోంది. ఎక్కడికీ రాడు; ఎవరితోను మాట్లాడడు. ఇలియాను కూడ ద్వేషించ సాగాడు. ఆ సంగతి ఇలియా సులభంగానే పసిపట్టాడు. చదువులో తన చురుకుతనాన్ని చూచి వాడసూయపడుతున్నాడనీ, తన్ను మించిపోవటానికి రాత్రింబగళ్ళు పుస్తకాలు ముందేసుకొని రుబ్బుతున్నాడు కాబోలనీ మొదట్లో తలపోశాడు; కాని, బళ్లో వాడు నిత్యము వుపాధ్యాయునిచే చీవాట్లు పడుతూండడము, దెబ్బలుతినటము చూచి ఇలియాఅభిప్రాయం మార్చుకున్నాడు. మరి అసలుకారణమేమిటా యని ఆలోచనకలిగింది. జాకోబు ఫర్ పిష్కాలకు స్నేహమేర్పడింది; కాని, వానిధ్యాన మటు లేదు. ఇలియా అసలా యింటిలోనివారిజోక్యం పట్టించుకోడమే మానివేశాడు. అయితే తన మిత్రుని నిజస్థితిని కనుక్కోవాలని మాత్రం తహతహపడ్డాడు. ఒకరోజున "బాగున్నావా? నాకు కన్పించటమే లేదే? నాతో జతగావుండటానికి యిష్టం లేదా?" అనియెదురుపడిన జాకోబు మొహంమీద అడిగేశాడు.

జాకోబు నివ్వెరపోయాడు. "అల్లా అంటున్నావేమిటి? నీ కా సందేహ మెందుకు కలిగింది? ఇంటికి పద; నేను నీ వెనకాలే వస్తాను. గదిలోకూచుని తాపీగా మాట్లాడుకుందాము" అని ఇలియా సమాధానానికైనా వేచియుండ

కుండా గబగబా వెళ్ళాడు. ఇలియా నోటమాట లేక వాని వంక చూస్తూ వుండిపోయాడు. మెల్లగా తన గదిలోకి వెళ్లి కూచున్నాడు. మరుక్షణంలోనే జాకోబు వచ్చాడు. వస్తూనే లోపల గడియవేసి చొక్కాలోపల్నుంచి యెర్రట్ట పుస్తకాన్ని బయటికి లాగాడు.

ఇలియా వానిచర్యలకు చకితుడయ్యాడు. "ఏమిటది?" అనడిగాడు.

"కథల పుస్తకం. బలే మజాఅయిన కథ లున్నాయి. చదువుతాను విను" మని చదువసాగాడు.

"ఆ వీరుని కెదురుగా మిన్నంటుతూన్న పర్వత మొక టున్నది. దానికి మధ్య కవాటం వున్నది. అతని రక్త నాళములందు వీర రక్తము ప్రవహించుచున్నది. అతడు బల్లెమును సంబాళించుకొని గుర్రమును కొరడాతో అద లించాడు. ఒక్కదూకులో తలుపువద్దకు చేరాడు. వీరుడు శక్తికొద్దీ తలుపుకేసి తన్నాడు. అది ఆ ఒక్క తాపుకే విరిగి ముక్కలయిపడింది. లోపలినుంచి గుప్పున పొగ రాసాగింది. దిక్కుల నదరజేసే బుస వినపడుతోంది. పర్వతము అండలండలుగా విరిగిపడుతోంది. "రేమూర్ఖా! వచ్చావూ! రా, ఎన్నాళ్ళనుంచో నేనూ, మృత్యుదేవతా నీకోసం యెదురుచూస్తున్నాము" అన్నమాటలు మేఘ గంభీరధ్వనితో వినవచ్చినయి.

ధూమతీవ్రతచే వీరునికన్నులు మూతపడినవి.

ఇలియూ కథను కుతూహలంగా వింటున్నాడు. "ఆ వీరుడెవ" రని ప్రశ్నించాడు.

"నువ్వెరగవూ? ఇటు చూడు, యీ చిత్రంలో గుర్రానెక్కి చేతిలో బల్లాన్ని కలిగివున్నాడే, అతడే. పేరు 'రాల్.' అతని భార్యని డ్రాగన్ ఎత్తుకుని పోయాడు. తరువాతి ఘట్టం కూడ చదువుతాను, విను."

"చదువు. అయితే ఆ డ్రాగన్ ఎవడు?"

"డ్రాగన్ ఒకరకం సర్పం. దానికి కాళ్ళు, పంజా వుంటయి. దానిని వృశ్చికోరలు. మూడు శిరస్సులుంటై. నిప్పులు కక్కుతూంటుంది."

ఇలియూ జాకోబును తేరిచూచాడు. "సరేగాని, అది ఆ వీరునిప్రేయసిని తిరిగి యిచ్చాడా?" అని మళ్ళీ అడిగాడు.

"నువ్వు మధ్యలో వెర్రి మొర్రిప్రశ్నలు వేయక విను, చదువుతాను."

ఇద్దరూ ఆనుకొని కూర్చొని కథ చదువుకుంటున్నారు. ఈర్ష్య, ద్వేషాలకు తావులేని-కుచ్చితులు, దుర్మార్గులు వాస ముండని అద్భుత దేశాల్లో పరిభ్రమించసాగారు. వారికక్కడ సుందర హర్మ్యాలు, వివిధ సుమ సంశోభిత విశాలోద్యాన వాటికలు కనబడుతున్నవి. అక్కడి ప్రజలు పరస్పర ప్రేమానుబంధంకల సుఖజీవులు. ఆప్రదేశాల్లో తాగుబోతులు లేరు; దైన్యజీవితమే కానరాదు. అంతా ఆనందమయం!

కాని, తిన్నగా వారున్నగది కవతలిప్రక్క గ్లాసు తరువాత గ్లాసును ఖాళీచేస్తున్నారు. ఫర్‌ఫిష్కా సితారు మీాద పాడుతున్నాడు. ఒకేచోట ఎట్టి పరస్పర వైరుధ్యం! ఒకవేపున నిర్మల హృదయ ద్వయము స్వర్గజీవితాన్ని భావనచేస్తుంటే, సూటిగా రెండోప్రక్కన నరక సృష్టి జరుగుతోంది.

"చాల్లే, ఇక నక్కడ ఆపు"మన్నాడు ఇలియా.

"విను, విను. ఆ వీరుడు డ్రెగన్ ను పట్టుకొని విసరి నేలకేసికొట్టాడు. అది బాధచే మూల్గుతోంది" అని ముగించి జాకోబు పుస్తకాన్ని మూసేశాడు.

# 7

ఇలియా జాకోబులు పుస్తకం తర్వాత పుస్తకం చకాపికి చదివేస్తున్నారు. ఒకటి పూర్తయ్యేసరికి మరొకటి సంపాదించుతున్నారు. చేతిలో డబ్బులు లేకపోతే యింట్లో దొంగిలించయినా పుస్తకాలు కొనేవారు. ఈవిధంగా యిద్దరికి పుస్తకపరిజ్ఞానం అభివృద్ధి అవుతోంది. గ్రంథకాలక్షేపంతో వాళ్ళు దుఃఖమయప్రపంచాన్ని మరచి సుఖస్వప్నాలు కంటూండేవారు.

ఒకనాటిప్రయాణాన [illegible]సేర సమను వచ్చింది. అతడు తొట్రుపోయిన దాన్నందుకొని, గజ గజలాడుతూ కోర్టు కెళ్లాడు; అయితే తిరిగి వచ్చినప్పుడుమాత్రం వాని ముఖం కళకళలాడుతోంది. కుడిచేత్తో పాష్కా చేయిపట్టుకొని తీసుకొచ్చాడు. సరాసరి హోటల్లోకి వచ్చి "ఇడుగో, దొర గారు దిగారు! నాకు పిలుపు వచ్చిన దీయనగారి కోసమే. పోలీసు లితగాణ్ని 'పెంసా' నుంచి తీసుకొచ్చారట. ఈకాలపు కుర్రాళ్ళకీ పుట్టినవన్నీ పితపకాలపుబుద్ధులే. ఉట్టి కెగరలేనమ్మ స్వర్గాని కెగరబోయినట్టు వీళ్ళు శ్రమపడకుండ ఒక్కసారిగా అదృష్టశిఖరాన్ని అందుకోబోతారు" అన్నాడు అక్కడున్న వాళ్ళతో.

పాష్కా పక్కనె నిలబడివున్నాడు. వాడి ఒంటి మీదిగుడ్డలు చినిగి, మాసివున్నై. చేతిని విడిపించుకోటానికి గింజుకుంటున్నాడు. కూ డెప్పుడు తిన్నాడో యేమో కళ్లు లోతుకుపోయినై.

"మెత్తగా నాలుగంటించితే సరి, అబ్బాయికి బుద్ధొస్తుంది!" అన్నాడో పెద్దమనిషి.

"ఎబ్బే! అంత పనెందుకు! ఇల్లాగే ఒకటి రెండు డక్కా — మొక్కీలు తింటే తనంతట తానే దారికొస్తాడన్నాడు ఫర్ఫిషాక్.

"పాపం! గొడగొని వున్నాడల్లే వుంది" అని ఒరెన్నా పాష్కా కొక రొట్టెముక్క నందిచ్చాడు.

పాష్కా దానిని పుచ్చుకొని మెల్లగా హోటలు బయటికి వెళ్లాడు.

ఫెర్ఫిష్కా వానివంక చూచి "అప్పుడే వుడాయించుతున్నావ్రా?" అన్నాడు.

ఇలియా తను గదిగుమ్మంలో నిలబడి యిదంతా చూస్తూనేవున్నాడు. రెండంగల్లో పాష్కా నందుకున్నాడు. ఇలియాను చూచి వాడు ప్రశ్నార్థకంగా "ఏమి"టన్నాడు.

"నమస్తే!"

"నమస్తే!"

"కూర్చో."

"ఎందుకు?"

"చాలారోజులకు కల్సుకున్నాం. మంచి — చెడ్డలు మాట్లాడుకుందాము."

ఇలియా స్నేహితుని కష్ట-సుఖాలు తెల్సుకుందామని యెంతో ఆతురతగా వెళ్లాడు; కాని, వాని కర్కశ స్వరము, సౌజన్యహీనప్రవర్తన ఇలియా వుత్సాహాన్ని భంగపర్చాయి. ఇంకేమడగటానికి చొరవ చేయలేకపోయాడు. పాష్కా అరుగుమీద చిప్ప వేసి రొట్టె నములుతూ "నీ చదువు సాంతమయిందా?" అనడిగాడు.

"రెండు నెలల్లో పూర్తవుతుంది."

"నేనంతా చదివేశానోయ్!"

"నిజంగా!"

"మరేమిటనుకున్నావ్? నాకే విద్య అయినా సునాయాసంగా అబ్బుతుంది" అన్నాడు పాష్కా సగర్వంగా

"ఎక్కడ చదువుకున్నావేమిటి?"

"జైలులో"

"జైల్లోనా?" నువ్వు జెయిలు కెందుకెళ్ళావు? పాష్కా! నువ్వక్కడ భయపడలా?"

"భయ మెందుకోయ్! అక్కడ భయానికీ, గాభరాకీ కారణమే లేదు. ఈ రెండేళ్ళలో నే నన్నో జైళ్ళకి చక్కర్ కొట్టాను. అక్కడ యెల్లాంటి పెద్దమనుషులు, యెటువంటి ఆడవాళ్ళు వుంటారనుకున్నావ్! వాళ్ళ లోక జ్ఞానము, అనుభవము చూస్తే దంగైపోతావు. వాళ్ళ మాటలతీరే చిత్రంగావుంటుంది. అందరూ ఖయిదీలే; కాని, పరమభక్తులూ, ఆనందజీవులూను. వాళ్ళమధ్య నాకీ రెండు సంవత్సరాలు ఖులాసాగా గడిచిపోయినై.

"అందరూ దొంగలూ, దగాకోరులేనా?"

"ఓ, పక్కా దొంగలు!"

ఇలియా పాష్కాముఖంలోకి చూచి "అంతా రష్యనులేనా?" అనడిగాడు.

"కొందరు యూదులూ వున్నారు. అందరూ వెలివేయబడినవాళ్లే. దొంగతనంచేయడంలో ఆరితేరిన చేతులే; కాని, దురదృష్టవశాత్తు పట్టు పడ్డారు. కేడీలు కావటంవల్ల సైబీరియాకు పంపబడ్డారు."

"సరేగాని, నీవు చదవడానికి అవకాశము, వ్యవధానము వున్నయ్యా?"

"కావలసినంత అవకాశం. అక్కడివాళ్ళే చదువు చెప్పుతారు."

ఇలియాకు కుతూహలం యెక్కువయింది. 'చదవటం వ్రాయటం కూడ నేర్చుకున్నావా?" అనడిగాడు.

"రాయటం కొద్దేగాని, చదవటంలో తడుపుకో నక్కరలేదు."

చదువును గూర్చిన సంభాషణతో ఇలియా వుత్సాహం రెట్టించింది. "నేనూ, జాకోబు కలిసి రోజూ కొత్త కొత్త పుస్తకాలు చదువుతున్నా"మని చెప్పి పుస్తకాల పేర్లు యేకరువుపెట్టసాగాడు. తాముచదివిన పుస్తకాలలో ఒక్కొక్కదాన్ని గురించి తన అభిప్రాయంకూడ చెప్పకొనిపోతున్నాడు. పాష్కా వానినోటికడ్డుపడి "మీరుచదివిన గ్రంథాలు మంచిరకాలే. నేను ఆధునిక పద్య కావ్యాలు మాత్రమేచూచాను. జైలు గ్రంథాలయంలో వున్నవాటిలో నా కవిమాత్రమే నచ్చినై" అనిచెప్పాడు.

అంతలో జాకోబుకూడ అక్కడికి చేరుకున్నాడు. పాష్కానుచూచి విస్మితుడై నవ్వుతూ నమస్కారం చేశాడు.

ఎదురు దణ్ణంపెడుతూ "ఏంరా కుంక! నవ్వుతావెందు" కన్నాడు పాష్కా.

'ఊరికేనే. ఇన్నాళ్లనుంచీ నువ్వేక్కడున్నావేమిటి?'

"నువ్వు కలలో కూడా చూడని చోట."

పాష్కా పుస్తకాలు చదివేస్తున్నాడని ఇలియూ జాకోబుతో చెప్పాడు. జాకోబు సంతోషం వెలిబుచ్చాడు. మిత్రులు ముగ్గురూ కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు. పాష్కా స్వాభిమానంతో పుద్రేకంగా చెపుతున్నాడు—

"వర్ణింప నలవికాని వెన్నో చూచాను. ఒక తడవ రెండురోజులవరకు ఒక్క కబళమయినా దొరకలేదు. కూడూ, నీళ్లూ లేక యేకాకిగా అర్ధాన్నపు అడివిలో పడి వుండాను."

"నువ్వు జడుసుకోలా?" జాకోబు అడిగాడు.

"మీరు కూడ ఒకటి రెండు రోజు లాస్థితిలో వుంటే సులువుగా అర్థమవుతుంది. మరొకప్పుడు కుక్కలు మీదపడి కరవటంవల్ల నేను బ్రతుకుతానన్న ఆశే లేకపోయింది. అప్పుడు నే నున్నది 'చజాన్'లో. అదొక స్మృతిచిత్రం! చజాన్ ఒక మహాకవిపేర నిర్మింపబడ్డ పట్టణం. అతడు చాలా గొప్ప కవి లెండి............చెప్పటం మరిచాను. నేనూ కవనంచేస్తున్నానర్రోయ్" అని నాలుగు చరణాలు చదివాడు. తరువాత మిత్రులవంక సగర్వంగా చూచాడు.

"ఇ దేనా కవిత్వ మంటేను?" అన్నాడు ఇలియూ.

పాష్కా అప్రతిభుడయి "ఇం కేమి టనుకున్నారు? పాదాంతాల నెంత చక్కగా పొందు పరిచాను! అయినా శుద్ధమొద్దుకు నీ కేం తెలుస్తుంది?" అన్నాడు.

"నిజమే. ఇలియా యెప్పుడూ రంధ్రాన్వేషణ చేస్తుంటాడులే" అని జాకోబు పాష్కాని సమర్థించాడు.

"నేను కొన్ని పద్యాలుకూడ రాశాను."

"నీ కవనం మధురంగా వుం"దని జాకోబు మెచ్చుకున్నాడు.

"వాస్తవికభావాలు కూడ" నన్నాడు ఇలియా.

మిత్రుల మెచ్చుకోళ్ళతో పాష్కా మురిసిపోయాడు. "నా పద్యాలెంత రసవంతంగా వుంటయ్యనుకున్నారు? కవిత్వం రాయటం నేననుకున్నంత కష్టంకాదు. మాటల కూర్పు, పదాలపొందిక—అంతే. కొండ—ముండ, ఈల—గోల. కవిత్వమంటే యిదే."

"సరేగాని, యిక ముందేమి చెయ్యాలని?" అనడిగాడు ఇలియా.

పాష్కా కళ్ళు మూసుకున్నాడు. ఒక చిటికపాటాలోచించి "ఏమో! మళ్ళీ నేను పారిపోతానేమో" నన్నాడు.

*     *     *     *

పాష్కా ఫరిఫిష్టా చెప్పుచేతల్లోనే వుంటున్నాడు. ఫరిఫిష్టా పత్నీవియోగం సంభవించినప్పటినుంచి దుఃఖోపశమనానికి తాగుడు జోరు చేశాడు. ఒకటొకటిగా యింటిలోని సామానులన్నీ కుదువబెట్టి, తెగనమ్మి సురాపానానికి

కైంకర్యం చేశాడు. స్వంతంగా జోళ్లు వగైరా కుట్టి అమ్ముకొనే ఆస్కారం కూడా లేకుండాపోయింది. వేరే దుకాణంలో నౌకరుగా కుదిరాడు. పగలంతా ఇంటి వద్ద వుండేవాడు కాదు; కాబట్టి పిల్లలు వాని గదిలోకి చేరుతూండేవాళ్ళు. పెద్దవాళ్ళ భయం లేకపోవుటచే వాళ్ళక్కడ స్వేచ్ఛగా కాలక్షేపం చేసేవాళ్ళు.

ఫర్‌ఫిస్కా తన కూలిలో సగం మాత్రం కూతురు కిచ్చేవాడు. అంతటితో తన సంసారభాధ్యత తీరిపోయిందను కునేవాడు. మాషా తన సంసారానికి యేకైక సామ్రాజ్ఞి. ఇప్పు డామె అబోధ బాలిక కాదు. ఒడ్డూ పొడుగూ పెరిగింది. శిరోజాలు నలుపెక్కి పిరుదులంటినయి. లోచనాలు చంచలాలయినవి. ఆమె ముగ్ధనాయికరీతి నభినయించ సాగింది. గృహకృత్యాల్లో మనసుంచి పని చేసుకుంటోంది. పుల్లా పుడకా యేరి తెచ్చి వంటచేసేది. ఇల్లూ వాకిలీ వూడ్చి, బట్టలుతికి, కుట్టుపని చూచుకుంటోంది.

అప్పుడప్పుడు మతిస్నా వచ్చి మాషాకి తోడ్పడు తూండేది. కూరా-నారా తెచ్చిచ్చేది. ఒకసారి కొత్త చీర కొని తెచ్చి వద్దు వద్దంటున్నా బలవంతంగా మాషాకి కట్టబెట్టింది.

మాషా మతిస్నాను గౌరవభావంతో చూచేది. ఇద్దరూ తేనీరు కాచుకొని తాగేవారు. మతిస్నా ప్రతిదినము ఫర్‌ఫిస్కాని సాధించుతూండేది. మాషా ఆవిడ అంలో

ఉః కలిపేదేగాని, క్రోధ, విషాదా లేమాత్రం కనపర్చేది కాదు. దుర్ప్రవర్తనలో దిగబడిపోయిన వారియందు గృహ సంరక్షకురాలు చూపేజాలినే మాషా తన జనకునియందు కలిగివుండేది. "తాగుడు కలవాటుపడిన వారి నుంచి మంచి నపేక్షించడం తెలివితక్కువ. ఆయన ఆనందం కోసం, దుఃఖాన్ని మరచేందుకు తాగుతున్నారు. అమ్మ బ్రతికుండగా యెన్నడూ యింతగా తాగి యెరుగరు. కష్టకాలం వచ్చింది. ఏంచేస్తారు ?" అనేది కష్ట — సుఖాలన్నీ వడపోసిన ఆరిందాలాగా.

మతిస్సా అనేది— "వీడి జిమ్మడ! తన పోషణలో ఒక ఆడపిల్ల వున్నదనయినా తోచదేఁ!"

"నేను గడిదేరాననీ, ఇల్లు చక్కబెట్టుకోగలననీ ఆయనకి తెలుసు పిన్నీ!" అనేది మాషా.

"నువ్వూ తగిన దానివేనే" మతిస్సా విసుక్కునేది.

మాషాకి మతిస్సా అంటే మహా యిష్టం. ఇద్దరూ తల్లీ బిడ్డల్లాగా వుండేవారు. ఒక్కొక్కప్పుడు మాషా ఆబిడఒడిలో పడుకొని మతిస్సా మెడకి రెండు చేతులూ లంకెవేసేది.

మతిస్సా నిత్యము వుదయంపూట తప్పకుండావచ్చేది. పిల్లలు సాయంత్రం చేరేవాళ్ళు.

జాకోబు మాషాయందు మక్కువ చూపేవాడు. వాడు తరచుగా టీ, పంచదార, రొట్టె, మాంసం వగైరా

తెచ్చి యిస్తుండేవాడు. మాషా వాటిని నిస్సంకోచంగా పరిగ్రహించేది. అంతేకాదు, ఎప్పుడేది కావలసివచ్చినా జాకోబుతో చెప్పటము, వాడు తక్షణమె వాటిని తెచ్చి యివ్వటంకూడ కద్దు.

జాకోబు ఒకనాడు బజారునుంచి పలక, బలపం తెచ్చి మాషాచే ఓనమాలు దిద్దించాడు. కొద్దిరోజుల్లోనే ఆమె వర్ణక్రమమంతా నేర్చుకొని చదువసాగింది.

మాషా జాకోబుల ప్రేమబాంధవ్యానికి ఇలియా కూడ యథాశక్తిని దోహదంచేస్తుండేవాడు. సమయా సమయాల్లో యేదోఒకటి తెచ్చి మాషాకి సమర్పించేవాడు. వానికి మాషాయందమిత ప్రేమ. తనవలె ఆమె కూడ మాతృవిహీన కావటము, ఒళ్ళొంచి పని చేసుకునేది అవటం వల్ల వానికామె యందభిమానాదరాలు కలిగాయి. మాషాని సంతోషపెట్టేందుకు యెన్ని తిప్పలైనా పడేవాడు.

ఆఁ, అప్పుడప్పుడు వాళ్ళిద్దరికి కీచులాట జరుగుట కూడా మామూలే. మాషా కోపావేశంతో తనమీదికి రాబోతే ఇలియా దూరంగా పారిపోయి నవ్వేవాడు. మాషా కోపం చల్లారి పోయేది.

ఒకరోజున కీచులాట గుద్దులాట దాకా వచ్చింది. ఇలియా, జాకోబు, మాషా పేకాట ఆడుతున్నారు. ఆటలో ఇలియా గెలిచేఛాన్సు వచ్చింది. జాకోబును గెలిపించాలని

మాషా బుద్ధిపూర్వకంగా తప్పాడింది. ఆ విషయం ఇలియా గ్రహించాడు. మాషాపైన కోపంవచ్చి "జాకోబుపెళ్ళాం!" అని వెగతాళి చేశాడు.

అంతటితో నూరుకోలా. కసితీరక యింకా యేమేమిటో అనేశాడు. పరిస్థితి విషమించుతుందేమోనని వాడు వాళ్ళదృష్టిని మరో విషయంమీదికి మార్చాలనుకున్నాడు; కాని, మాషా ముఖం జేవురించి కళ్ళనీళ్ళ పర్యంతం కావటం చూడగానే కోపంతో తోక త్రొక్కిన త్రాచువలె ఇలియా మీద విరుచుకొని పడ్డాడు. ఆవేశంలో గబీగుబీమని ఇలియాను గుద్దాడు. మాషాసరసకుపోయి యేడ్వసాగాడు.

ఇలియా ఒళ్లుదులుపుకొని లేచాడు. హుంకరిస్తూ జాకోబుపైకిపురకబోయాడు; కాని, వా డేడుస్తూండటంచూచి తమాయించాడు. మాషా జాకోబుభుజంమీద చెయ్యేసి వూరడించుతూ "ఊరుకో జాకోబ్! ఇకవాణ్ని మనజతకి రానివ్వొద్దు. వాడు పరమదుర్మార్గుడు. వంశంలో వున్నదెక్కడికి పోతుంది? అబ్బ దొంగ, పిన్నబ్బ మరుగుజ్జు. వీడూ గూనివాడవుతాడు." అని ఇలియా నుద్దేశించి "ఒరే లుచ్ఛా! ఇక్కడికి రా, నీపనిపడతాను!...... సిగ్గూ-శరమూ లేక యింకా చూస్తూనుంచున్నావెందుకు? పో, పో" మంది.

ఇలియా నిలువునా నీరయిపోయాడు. జాకోబు మీద వానికి జాలికలిగింది. సిగ్గుచే క్రుంగి పోయాడు. మాట్లాడకుండ వెళ్ళిపోయాడు. వేదన, అనుతాపాలతో దహింప

బడుతూ పిచ్చెత్తినట్టు అటు నిటు తచ్చాడాడు. మనసు శాంతించిన తర్వాత మెల్లగా ఫర్‌సిస్టాగవి వేపుకు వెళ్ళాడు. కిటికీగుండా లోపలికి తొంగిచూచాడు. మాషా జాకోబులు నవ్వుకుంటూ చీట్లాడుతున్నారు. ఇలియా దిగాలుపడ్డాడు. అడుగులో అడుగేసుకుంటూ లోపలికెళ్ళి "నన్నుకూడా ఆడనివ్వరూ?" అనడిగాడు దీనంగా.

వాడిగుండె కొట్టుకుంటోంది. ముఖంలో కళ లేదు. కళ్లు వాలి వున్నాయి.

వాళ్ళిద్దరూ ఒకరిముఖ మొకరు చూచుకున్నారు.

"నే నిక ఎన్నడు అసభ్యంగా ప్రవర్తించను. క్షమించండి" అని ఇలియా బ్రతిమాలాడు.

"సరే, రా; వచ్చి కూచో" అంది మాషా.

జాకోబు ముఖంచిట్లించి పళ్లునూరుతూ అన్నాడు— "వెధవ! ఇంకా మనం చిన్నపిల్లలమేనా? నోరు సంబాళించుకొని మాట్లాడాలి."

"మనం చిన్నవాళ్ళం కాబట్టే దురలవాట్లు చేసుకోకూడదు" అన్నది మాషా.

ఇలియా స్వాభిమానంతో "మీరు మాత్రం నన్ను చెడామడా తిట్టలా!" అనడిగాడు.

"కానిమాట నే నేమన్నాను? అనవసరంగా కోపం తెచ్చుకోక నువ్వే చెప్పు" అన్నది మాషా.

"కోప మెందుకు? తప్పు నాదేలెండి" అని ఇలియా జాకోబువంక చూచి నవ్వి "నువ్వుకూడ జరిగింది మర్చిపో; మనసులో యేమీ వుంచుకోకు" అన్నాడు.

"అందరము మర్చిపోవడమే మంచిది. ఇక రా, కూచుని చెయ్యి కలుపు"మని మాషా వాని చెయ్యి పట్టుకొని లాగి ఇలియాకి కూడ ముక్కలు పంచింది. జాకోబు ప్రక్కకు జరిగి చోటిచ్చాడు.

ఇలియా పేక ముక్కలు తీసుకున్నాడు. ఈసారి మాషా నోడించాలని పట్టుదలతో ఆడాడు; కాని, ఆమె అస లా ఆటలో గట్టి ప్రవీణ. మాషాకూడ జాగ్రత్తగా ఆడింది. ప్రతి ఆటలోను జాకోబే ఓడిపోతున్నాడు. తన పంతం చెల్లనందున ఇ లి యా విసుగుచెందాడు. "కాకికెంత తెల్లరంగు పూసినా అసలు నలు పెక్కడికి పోతుంది!" అన్నాడు.

వరుసగా ఓడిపోతూండడం వల్ల జాకోబుకూ విసుగెత్తింది. ఇక చాల్లెద్దూరూ. కాస్సేపు చదువుకుందాము" అన్నాడు.

ముగ్గురూ చదవడానికి పూనుకున్నారు.

ఆ విధంగా వాళ్లు చదువుకుంటూంటే ఒక్కొక్కప్పుడు పాప్కా వుట్టిపడి పు స్త కా న్ని లాగేసేవాడు. "ఎప్పుడూ ఒకటే చదువా? మీరీ చదువులోనే చచ్చిపోతారు. జాకోబ్! నువ్వు మాషాని పెళ్లి చేసుకోవోయ్" అనేవాడు.

మాపై కోపం స్నేహంగా పరిణమించేది. ముగ్గురు మిత్రులూ నవ్వుకునేవారు.

చదువుమీది విసుగుదలతో అప్పుడప్పుడు పాష్కా తన యాత్రానుభవాన్ని గూర్చి చెప్పుమనేవాడు. వాడూ యేదో ఒక విషయానికి చిలవలు-పలవలు అల్లి లబ్బుగా చెప్పేవాడు. వాడు చెప్పేది పుస్తకంలోని కథకంటె మనోరంజకంగా వుండేది. ముగ్గురూ తన్మయులై పుస్తకాల మాటే మర్చి పోయేవారు.

ఒక దఫా పాష్కా ఇల్లా చెప్పాడు—

"రాహదారిచీటి లేకుండా ఒక వూరునుంచి మరోచోటుకు వెళ్తే పట్టుకుంటారని తెలిసింది. పోలీసుల్ని మభ్య పెట్టడానికి నేనొక యుక్తిపన్నాను. కానిస్టేబిలు కనపడగానే అత్యావసరమైన కార్యార్థం వెడుతున్నవానివలె బిలబిల నడిచేవాణ్ని; లేదా, దారిలో యెదురువచ్చిన యేరైతువద్దనో నిలబడి అతను నా తండ్రో, అన్నో, చుట్టమో నన్నట్టు బాతాఖాని మొదలుపెట్టేవాడిని. అల్లాంటప్పుడు పోలీసులు నా జోలి పట్టించుకునేవారు కాదు. పల్లెటూళ్ళలో అయితే నిశ్చింతగా వుండేది. అక్కడ పోలీసులే వుండరు. 'ఎందు కొచ్చా'వని యెవరయినా అడిగితే 'దిక్కులేని వాణ్ని; భిక్షాటనతో బ్రతుకుతున్నా' నంటేచాలు. వాళ్ళోట్టి పిచ్చి మా రాజులు! పిల్చికెళ్ళి తిండిపెడతారు. అక్కడ స్వేచ్ఛగా తిరగొచ్చు. బాధించే వాళ్ళుండరు. ఒక్క పొట్టరందే లేక

పోతే స్వేచ్ఛగా యీ భూమినంతను చుట్టిరావచ్చు. దేశాటన యెంత సరదాగా వుంటుంది! కాని, ఒక్కొక్కప్పుడు వేళకి నాలుగు మెతుకులు దొరక్కపోవటం కూడ కద్దు. అల్లాంటప్పుడు ఆకలి దహించివేస్తుంది; పేగులు మాడిపోతై. అప్పుడు యేదో ఒకటి కడుపులో కుక్కా లనిపిస్తుంది. తల తిరిగిపోతుంది. అదృష్టవశాత్తు యేరొట్టిముక్కో చేతికి చిక్కితే నమిలేటప్పుడు యెప్పుడూ అల్లాగే తింటూండా లనిపించుతుంది. ఏమయినప్పటికి నాకుమాత్రం జైల్లోనే బాగుంది. మొదట భయపడుతూండేవాడిని; కాని, అనుభవం మీద అక్కడిదే సుఖ జీవితంగా తోచింది. పోలీసువాళ్ళు పట్టుకున్నప్పుడు లాఠీలతో చావగొట్టి ప్రాణం తీసేస్తా రనుకొనేవాణ్ణి; కాని, ఒకనాడు పోలీసొకడు గప్‌చిప్‌గా వెనక నుండొచ్చి నామీద లంకించుకున్నాడు. 'నువ్వెవరవు? ఏవూ'రని యెంత మర్యాదగా అడిగాడు! అబద్ధమాడటం యెందుకని నేను యథార్థమే చెప్పాను. నేను బొంకినా వాళ్ళు నిజం తెలుసుకోగలరు. వాడు నన్ను పోలీసు స్టేషనుకు తీసి కెళ్ళాడు. అక్కడ అదివరకె పెద్దమనుషులు చాలామంది వున్నారు. వాళ్లు నా చుట్టూ చేరి 'నేరమేమి'టని అడిగారు. 'ఊరకే తిరుగుతూండగా పట్టుకున్నా'రని చెపితే అందరూ పక్కుమన్నారు. తర్వాత కొద్దిరోజులకు నన్ను పెద్దజైలుకు పంపారు. అక్కడా నన్నందరూ గేలిచేశారు. వాళ్లారితేరిన గజ దొంగలయ్యో!"

ఇల్లాగే తన స్వానుభవాన్ని చిత్రవిచిత్రంగా వర్ణించి పాష్కా తన ప్రభావాన్ని మిత్రులపైన ప్రసరింపజేసేవాడు.

పాష్కా మళ్లీ అనతికాలంలోనే పరారయ్యాడు. ఈ పర్యాయం వాడొక అచ్చాఫీసులో నౌకరుగా చేరినట్టు తెలిసింది.

పాష్కా పారిపోయాడని విన్నప్పుడు ఇలియా జాకోబుతో యిల్లా అన్నాడు—"మన బ్రతుకంతా యీ పాడు కొంపలోనే గడిచిపోయేలాగుంది. మనం కూపస్థమండూకాలవలె వుండిపోతాం."

# 8

పాష్కా పలాయనంతో ఇలియా రెండురోజుల వరకు తెరవుమరపుగా వున్నాడు. మూడోనాడుగాని మనసు పుస్తకం మీద నిలవలా. ఆ తర్వాత వాడు పాష్కాను బొత్తిగా మర్చిపోయాడు. ఒక రోజున బడినుంచి రాగానే ఇలియాను పినతండ్రి పిల్చి "నువ్వింక చదువుమాని యేదో ఒక పనిలో ప్రవేశించరా అబ్బాయి! పద్నాలుగేళ్లు నిండి పెద్దవాడివయ్యావు. ఏదో ఒక బ్రతుకుతెరువు చూచుకోకపోతే వెల్లా?" అని చెప్పాడు.

పెత్రుషా ఆ మాటలు విని పెరెన్నుతో అన్నాడు—"నీకు అనేకమందితో పరిచయముంది. నువ్వు కోరితే యెవరో ఒకరు వాడిని నౌకరుగా పెట్టుకోనకపోరు. నా సలహా నచ్చితే ఒక యేడాదిపాటు బాగా పని నేర్పి నీ స్థానంలో వాడినుంచు. నే నింకొక హోటలుకూడ పెట్టాలనుకుంటున్నాను. దానిఅజమాయిషీ నువ్వు చూస్తుందువుగాని."

ఇలియాంవాళ్ళమాటల కంతగా ప్రాముఖ్యత నివ్వలా. మామూలుగా తన చదువును సాగించుతున్నాడు.

అయిదోనాడు తెల్లవారకముందే పెరెన్ను ఇలియానును నిద్రనుంచి లేపి "త్వరగా తానం చేసి ముస్తాబయి సిద్ధంగా వుండు" అని చెప్పాడు.

"ఎందుకూ? ఎక్కడికైనా వెళ్ళాలా?" అని ఇలియా కళ్ళునలుపుకుంటూ అడిగాడు.

"నీకు నౌకరీ కుదిర్చాము. ఇప్పుడే వెళ్ళాలి."

"ఏంపని?"

"చేపలదుకాణంలో నౌకరీ" అని చెప్పి పెరెన్ను వెళ్ళిపోయాడు. ఇలియాకు దిగులుపుట్టింది. ఇన్నాళ్ళ నుంచీ యే దుర్వాసనకు ముక్కు మూసుకుంటున్నాడో, యే పాడుకొంపని విడిచిపెట్టి పోవాలని వుత్కంఠ వెలిబుచ్చుతున్నాడో వాటిని వదలిపెట్టడానికే నేడు వానియాత్మ విలపించసాగింది. మమత పొంగివచ్చింది. పడక మీద నుంచి లేవడానికూడ వానికి త్రాణ లేకపోయింది.

అప్పుడు హడావుడిగా జాకోబు వచ్చాడు. వాడికీ విచారంగానే వుంది. జుట్టు విడబడి వున్నది. తడబడుతూన్న కంఠంతో "త్వరగా లేచిరా నాన్న నిన్ను పిల్చుకొని రమ్మన్నారు. నువ్విక్కడినుంచి వెళ్ళిపోతున్నావని కూడ చెప్పారు. ఒకసారి మాషాని చూచిరా. మమ్మల్ని మర్చిపోవు కదూ?" అని బడబడలాడాడు.

ఇలియా గొంతు బిగుసుకుంది. కళ్ళల్లో గిర్రున నీళ్లు నిండినయి. "నే నిక్కడినుంచి శాశ్వతంగా వెళ్ళిపోవటం లేదులే" అన్నాడు.

ఇలియా వెళ్ళిపోతున్నాడని తెలిసి మాషా అక్కడికే లగెత్తుకొచ్చింది. "నువ్వెళ్ళిపోతున్నావటగా? మేము జ్ఞాపకముంటామా ఇలియా?" అన్నది.

ఇలియా బిక్క మొగంతో మాటరాక తలొంచుకున్నాడు. లోలోపల పినతండ్రిని తిట్టుకుంటూ గుడ్లా గుడుసూ అటూ యిటూ గిరాటేస్తున్నాడు.

మిత్రుడు తమ్మొదిలిపెట్టి పోవాల్సివచ్చినందుకు మాషా జాకోబులకు వంతగానేవుంది. "అప్పు డప్పుడు చూచిపోతూండేం" అన్నాడు జాకోబు.

"తప్పకుండా వస్తాను."

"అబ్బో! అప్పుడే దుకాణదారు దర్జా వచ్చేసిందే! ముక్కువిరిచి ఎల్లా మాట్లాడుతున్నాడో చూడు జాకోబ్!" అని మాషా పరియాచకమాడి నవ్వింది.

"పోవే గాడిద!" ఇలియా కుప్పుగా అన్నాడు.

స్నేహితులవద్ద సెలవుతీసుకొని ఇలియా పెట్రుహా వెంట బజారుకు బయలుదేరాడు. "నిన్ను మంచిచోటుకే తీసికెళుతున్నాను. మన కాబోయే యజమాని పేరు— ప్రతిష్టలు కలవాడు. ఉదారుడూ, వదాన్యుడూను. నగర ప్రముఖుల్లో ఒకడు. నువ్వు బుద్ధిమంతుడివి. ఒళ్లొంచి నమ్మకంగా పనిచేస్తే బాగుపడతావు. నీ అదృష్టం పండుతుంది" అంటూ పెట్రుహా దారిపొడుగునా ఇలియాకి వుపదేశించాడు.

ఇలియా తన భావియజమాని హృదయాన్ని, ఆకారాన్ని వూహించుకున్నాడు. జర్మియా ఒక్కడే దయార్ద్ర హృదయుడనీ, సానుశీలియనీ వాడి కదివరకు తెలుసు. పెట్రుహావర్ణనవల్ల తాను ముఖమెరుగని వర్తకుడుకూడ జర్మియాలాగా బక్కపల్చగా, నవ్వుముఖంతో వుంటాడని భావించుకొన్నాడు; కాని, దుకాణంలో అడుగుపెడుతూనే వాని వూహాసౌధము కూలిపోయింది. దుకాణంమధ్య ఘాతకలాగున్న మనిషి కూచునివున్నాడు. బట్టతల, బవిరి గడ్డం, పిల్లికళ్లూను. అతడి రూపమే భీతి గొల్పుతోంది.

ఇచ్ఛాపూర్వకంగా కాకపోయినా ఇలియా వానికి వంగి నమస్కరించాడు. ఆ తుందిలుడు ఇలియా నెగాదిగా చూచి "వీడి పేరేమి"టని పెట్రుహా నడిగాడు.

"ఇలియా"

"ఇలియూ! మూడు కళ్లతో, నాలుగు చేతుల్తో పని చెయ్యాలి, తెలిసిందా? మీవాళ్ళని మర్చిపోవాలి. నీకు సర్వము నేనే." ఇవీ ఇలియూతో యజమాని ముందుగా అన్నమాటలు.

ఇలియూ దుకాణం నాల్గు వేపులా పరకాయించి చూచాడు. ఒకాయన కూచుని రాసుకుంటున్నాడు. ఒకడు తక్కెడతో తూస్తున్నాడు. చేపలు-చచ్చినవీ, జీవంతో వున్నవీ-పోగులు పోగులుగా వున్నాయి. బుట్టల్లో యెగిరేవి, తొట్లలో ఆడేవి, క్రిందపడివుండి అంత్యాని కెదురు చూస్తున్నవీ-రకరకాలున్నాయి. దుర్వాసనకు ముక్కు పగిలిపోతోంది. తాను రాత్రింబగళ్ళు పని చేయాల్సింది అందులోనే!

పాపం! ఇలియూ కాపని సరికొత్త. చేప నెక్కడ యెల్లా పట్టుకోవాలో కూడా తెలియదు. తలకు బదులు తోక పట్టుకునేవాడు. వెన్నుమీద చెయ్యివేసేవాడు. అందుచే అవి గిలగిలకొట్టుకొని చేతిలోనుంచి జారిపోయేవి. తీసి అందించుటలో జాగ్రై ఇలియూ యజమాని చివాట్లకు గురిఅయేవాడు.

ఒకనాడు దుకాణానికి వెనుకనున్న వసారాగదిలో ఇలియూ మంచుగడ్డను ముక్కలుగా నరుకుతున్నాడు. చిన్ని చిన్ని రవ్వ తెగిరిపడి వానిగుడ్డ తడిసిపోయింది. గొడ్డలి తగిలి గోడ పెకల్కిండింది. తిరిగివచ్చినాక ఇలియూ తన

చేతగానితనంవల్ల కొద్దిగా మంచుగడ్డ పాడయిపోయిందనీ, గోడ పెచ్చూడిందనీ యజమానితో నిజం చెప్పాడు. ఖామందు కళ్ళెర్రజేసి "నిజం చెప్పావు కాబట్టి మొదటి తప్పుగా యీసారికివదిలిపెడుతున్నాను. ఇకనుంచి జాగ్రతగా పనిచెయ్యి. లేకపోతే తన్నులు తగుల్తాయ్" అని కోప్పడ్డాడు.

ఇలియా జీవితం యింజనుచక్రంలా తిరిగిపోతోంది. తెల్లవారుజామున అయిదుగంటలకే లేచేవాడు. యజమాని కుటుంబములోనివారందరివీ శాండిల్సు, బూట్లుపాలిష్ చేసేవాడు. అమ్మగారు, అయ్యగారి కూతుళ్ళు చెప్పిన పన్లు చేసి మరీ దుకాణానికి వెళ్ళాలి. అక్కడ బల్లలు, తక్కెడ, రాళ్ళు తుడిచి శుభ్రపరిచేవాడు. తర్వాత తట్టలు, బుట్టలతో చేపల్ని జేరవెయ్యాలి. చిల్లర మల్లర పనులన్నీ అయినాక మధ్యాన్నం మాత్రం కాస్త విశ్రాంతి చిక్కేది. తీరుబడిగా వున్నప్పుడు దుకాణంముందు నిలబడి బజారున వచ్చేపోయే జనాన్ని చూస్తుండేవాడు. ఏమేమో ఆలోచించేవాడు. ఒకనాడు "చేపలన్నీ అయిపోతే జనం యేం తింటారండీ!" అనడిగాడు యజమానిని.

యజమాని మొహం వాచేటట్టు చీవాట్లుపెట్టాడు. ఇలియా ముక్కీ, నోరూ మూసుకొని అవతలికి జారుకున్నాడు.

మర్నాడు అదేవేళ తీరుబడికాగా ఇలియా వార్తా పత్రిక తీసి చదువసాగాడు. వెంటనే మేనేజరా పత్రికను

లాక్కొని "ఎవర్నడిగి తీశావురా వెధవాయ్?" అని కసిరాడు.

ఇలియా కసిరే ఆ మేనేజరంటే ఒళ్ళుమంట. ఎదుట అనకపోయినా చాటున దూషించేవాడు. [illegible] లేకుండా చూచి యజమానిని తప్పి దుకాణానికి వచ్చి నచ్చిన చేపలను పట్టించుకొని పోతూండేవాళ్ళు. మేనేజరు వారు కోరినవాటిని తన స్వంతముల్లె ఇచ్చినట్లిచ్చి వారితో సరాగాలాడుతూండేవాడు. వాని యీ ప్రవర్తన ఇలియాకు గిట్టేది కాదు.

మేనేజరు మహా దుష్టుడు. వాని దుష్కృత్యాలకు అంతులేదు. బిచ్చగాండ్రను యేడిపించడమంటే వాడికి మహా సరదా. యాచనకొచ్చినవాడెవడైనా దుకాణం ముందు నిలబడితే మే నే జ రు చేపముల్లుతో బిచ్చగాని చేతిలో గుచ్చేవాడు. వాడు లబోలిబోమంటూ పోతూంటే "ఇంకా చాలకపోతే మరో దుకాణానికెళ్ళు"మని మేనేజరు పరిహాసం చేసేవాడు.

ఒకరోజున తిరిపెకత్తె ఒకతె పోతూ పోతూ వీరి దుకాణంముందున్న ఒక రొండుచేపని చేత్తో తీసి పుచ్చుకొన్నది. మేనేజరది చూచి లేచెళ్ళి ఆమెమెడ పట్టుకొని మెలితిప్పాడు. ఆ రొండుచేపని లాక్కున్నాడు. నోటినుంచి రక్తం పడుతున్నా ఆ ద రి ద్ర దే వ త మాట్లాడకుండా వెళ్ళిపోయింది.

మేనేజరు దుకాణంలోపలికి వచ్చి అసిస్టెంటు కార్ప్‌తో యిల్లా అన్నాడు— "నాకీ బిచ్చగాళ్లనుచూస్తే ఒళ్ళు మండుకొస్తుంది. పెళ్ళు లోకులకష్టార్జితం తిని పొట్టలు పెంచుకొని సోమరులుగా తిరుగుతుంటారు. మతిలేని వాళ్ళు కొందరు వీళ్ళని క్రీస్తుదేవుని బంధువులని పేర్కొంటున్నారు. మరి మన మందరం భగవంతునికి శత్రువులము కాబోలు! జీవితమంతా యెండనక, వాననక పనిచేస్తున్నా మన కొక్కనాడూ శాంతిలేదు; కమ్మని తిండే లభించదు."

కార్ప్ మేనేజరును మించిన దగుల్బాజీ. వాడెప్పుడూ ధార్మిక సూక్తులను వుచ్చరించుతూంటాడు. శనివారం నాడు చర్చికి వెళ్ళడాని కేమాత్రం విలంబమయినా ప్రాణంమీాది కొచ్చినంతఆరాటం చూపేవాడు. మంత్రగాళ్ళని, ఇంద్ర జాలికులను పిలిచి పూజించేవాడు. దుకాణంలో పామువలె ప్రాకులాడుతూంటాడు. యజమాని వున్నంతసేపూ యెంతో శ్రమజీవిలాగా, వ్యాపారాభివృద్ధి కోసం శక్తిని ధార పోస్తున్నట్టు నటించుతాడు. వాడు రాటుదేలిన మోసగాడని గ్రహించి ఇలియూ వానిని కంటగించుకొనసాగాడు.

ఆ సిబ్బందిలో యజమానిపట్ల భక్తి - శ్రద్ధలుగలవా డొక్కడు ఇలియూసే. యజమానికూడా వాడిని ప్రేమగానే చూసేవాడు.

ఒకప్పుడు తీరుబాటు సమయంలో దుకాణంముందు కూచొని బజారువంక చూస్తున్న ఇలియూసు కూకలేసి పిల్చి "నిద్రపోతున్నావా?" అనడిగాడు యజమాని.

"లేదండీ"

"నువ్వెప్పుడూ యేదో ఆలోచించుతూన్నట్టు గంభీరంగా వుంటున్నావేం?"

"ఏమోనండి."

"విచారపడటం లేదుగదా?"

"కొంచెం బెంగగానే వుంటోంది."

"అల్లాగే వుంటుంది లే. ముప్ఫై సంవత్సరాలు వచ్చేంతవరకు నాకూ అల్లాగే వుండేది. అంతవరకు నేనూ ఇంకొకరి చేతిక్రింద పనిచేస్తూండేవాణ్ణి. ఇప్పుడో యిరవై సంవత్సరాలనుంచి స్వంత వ్యాపారం నడుపుతూ యితరులమీద జాలి చూపుతున్నాను. ఎందరికో జీవనోపాధి కల్పిస్తున్నాను."

అది ప్రాపంచిక ధర్మమేగా అన్నట్టు ఇలియా తలూపాడు.

క్రమంగా ఇలియా కొక సందేహం కలిగింది. 'ఇంత చక్కనిభవనము, చేతినిండా ధనము కలిగివుండికూడ యజమాని యీ గబ్బు కంపులో కుళ్లడం యెందుకో! ఇంటిపట్టున వుండే ఆ శాంతి-ఆనందాలెక్కడ! యీ కలకలమెక్కడ! ఈయన కసలా ప్రశాంతవాతావరణము, సంసారసుఖాలు మనస్కరించవేమొ!' ననుకునేవాడు. చేపల దుకాణంకంటె సత్రుహోటలు యెన్నోరెట్లుత్తమంగా తోచింది. ఒకనాడు అవకాశం చూచి ఇలియా తన సందేహాన్ని యజమాని ముందె వెల్లడించాడు. "ఈశ్వరుడు

మీకు తగినంత సిరి – సంపద లిచ్చాడుగదా; మరి మీరు స్వసుఖాన్నయినా చూచుకోనక యీ మురికూపంలోనె పడివుంటా రెందుకండీ?''

యజమాని ఇలియా అమాయకత్వానికి నవ్వుకున్నాడు. చెంతకు పిల్చి ''ఇది నీకే తోచిందా, యెవరయినా నేర్పారా?'' అనడిగాడు.

''కొన్నాళ్ళనుండీ నాకీ సందేహం వుంది. ధైర్యం చేసి మిమ్మల్నే అడిగాను తెలుసుకుందామని.''

''నేను నీకు యజమానిని కద, యిల్లాంటి ప్రశ్నలు అడగవచ్చా? ఇది అవిధేయత కాదూ?''

అని యజమాని మృదువుగా మందలించేప్పటికి మేనేజరు, కాగ్పె అక్కడికి వచ్చారు. ఆయన వారిని చూచి ''మానవుడు శక్తికొద్దీ యేదో ఒక పని చేస్తూనే వుండాలి. ఒక్కనాడయినా అలసత్వంతో పోనివ్వకూడదు. ఈసంగతి నెటువంటి మూర్ఖుడైనా గ్రహించగలడు'' అన్నాడు.

''అందుకు సందేహమా?'' అని మేనేజరు యేదో పని చేయబోయేవానివలె దుకాణంలో అటు నిటు తిరుగసాగాడు. ఇలియా వానిని చూచి నవ్వుకున్నాడు.

ఇలియారోజులు యథారీతిని గడిచిపోతున్నాయి. జీవితంలో యెలాంటి మార్పుగాని, పరివర్తనగాని లేదు. ఆశాలేదు; అభివృద్ధీలేదు. ఏకునుంచి దార మేకరీతిని వచ్చు

నప్పే వానికి మాత్రం సాధ్యపడింది. నాడు తన జీవితంలో మరేఆశకు ఆస్వాదం లేకవున్నాడు. జీవల్ని పోగులు పెట్టడం, అదీ ఇక అంతరించడంలో తన జీవితం కాస్తా సమాప్తమయిపోతుందని భావించాడు. వాని కాయాన్య జీవితంలో అదినుంచున్న కొద్దిపాటి అపరిజ్ఞానమే తోడుగా వుంది. తన కళ్ళముందు జరుగుతున్న ప్రతి ఘటనను తన విద్యాజ్ఞానంతో పరిశీలించి ఆ యా ఘటనల వెనకో హేతువులను కనుక్కొని తృప్తిపడేవాడు. హృదయంలో చెలరేగుతూన్న సమస్యలను, సందేహాలను చెప్పుకోడానికెవరూ లేకపోవడం వానికెంతో బాధగా వుంది. అన్నిటిని తనలోనే అణచివుంచుకోవాల్సినచ్చుటచే వాటిభార మధికమై ఇలియా అణగారిపోసాగాడు. ఒక్కొక్కసారి పానప్యావల తాను కూడ ఏ అపరిచితప్రదేశానికో పారిపోతే బాగుండుననుకొనేవాడు. సెలవురోజున చర్చికి వెళ్ళినప్పుడుమాత్రం వాని హృదయభారం కొంత తేలికపడినట్లుండేది.

నౌకరుగా చేరినతరువాత గడిచిన ఆరు మాసాల్లోను ఇలియా రెండుపర్యాయాలుమాత్రం పినతండ్రివద్దకు వెళ్ళి వచ్చాడు. అక్కడా చెప్పుకోదగ్గ మార్పేమీ జరగలేదు. తెరెన్సు దినదినం దిగజారిపోతూంటే పెట్రుహా నానాటికీ బలుస్తున్నాడు. తండ్రి సతాయింపుతో జాకోబు బేజారయ్యాడు. ఇలియా అక్కడికి వెళ్ళినప్పుడు ఒంటరిగా చూచి జాకో ఇల్లా చెప్పుతున్నాడు— "నాన్న నన్ను

నిత్యము నానామాటలు అంటున్నాడు. ఇక నన్ను యేదో ఒక వృత్తిలో ప్రవేశించమంటున్నాడు. నే నిప్పటివలెనే పుస్తకాలపురుగునై వుండటం తా నే మాత్రం సహించనని చెప్పేశాడు. నా కీ హోటలువృత్తి అంటేనే యేవగింపు. ఈ రద్దీ భరింపశక్యంగానిది. ఏ రొదా లేక, యెక్కువ జనంతో పనివుండని ఏ వ్యాపారంలోనైనా సరే పనిచేస్తానని చెప్పాను.''

జాకోబులో హుషారులేదు. ఉసూరుమియాంలాగున్నాడు.

''నువ్వింకా పుస్తకాలు చదువుతున్నావన్నమాట?'' అనడిగాడు ఇలియా.

''నాకున్న తోడు అవేగా. చదివేటప్పుడు నే నీ ప్రపంచాన్నే మర్చిపోతాను. అవి లేకపోతే విచారం నన్నింకా పీడించేది. అసలు ఎవరయినా పుస్తకాలు చదవకుండా యెల్లా వుండగలరో!''

ఇలియా వానివంక తేరిచూచి ''నువ్వెంత అదృష్టవంతుడివి; నాకా గతీలేదు......మాషా యెల్లా వుంది?'' అన్నాడు.

''మాషా యిప్పు డిక్కడ లేదుగా. ఆమెని అనాధ శరణాలయంలో చేర్చాడు. మా నాన్న నామీద కన్ను వేసి వుండడంవల్ల నే నామెని చూచివచ్చేందుకైనా వీలు

చిక్కడం లేదు. ఫక్ షిష్కా సుస్తీగా వుంటున్నాడు. ఆయనకు మతిస్థిమితం సాయపడుతోంది."

"అయితే మీ స్థితి అధ్వాన్నంగానే వున్నదన్నమాట?"

"ఏం, అక్కడ నీపని బాగుండలేదా, యేం?"

"ఇంతకంటె అయోమయంగా వుంది. మిత్రమా! నీ కిక్కడ పుస్తకాల తోడయినా వుంది. అక్కడ నాకు సర్వం శూన్యంగావుంది. మేనేజరుదగ్గర పుస్తకాలున్నా చదువుకోనివ్వడు. నా జీవితం నిస్సారంగా వుందనుకో."

జాకోబు నిట్టూర్పు వదిలాడు.

ఇలిచ్ యిలా అన్నాడు– "భగవంతుడు మన ల్నివిధంగా శిక్షించుతున్నాడు, ఏం పాపంచేశామో!"



# 9

అకాత్తుగా ఇలియా అదృష్టరేఖ బయటపడింది. ఒకరోజున దుకాణంముందు జనం తోక్కిసలాడుతున్నారు; మహా సందడిగాఉంది. అమ్మకము జోరుగా సాగుతోంది. అంతకుముందునుంచి అవతలనున్న యజమాని గల్లాపెట్టి ముందున్న మేనేజరును లెమ్మని కూచుని అమ్మకంసొమ్ము లెక్కపెట్టుకుంటున్నాడు. ఉన్నట్టుండి అతని కళ్ళెరుపెక్కినై. దుమదుమలాడుతూ ఇలియాను పిల్చి "క్రింద పది రూపాయలనోటుగాని పడిందేమో చూడు!" మన్నాడు.

ఇలియా వెదకిచూచి "లే" దని చెప్పాడు.

"బాగా గాలించి వెతుకు!"

"వెతికాను, కనపడలేదండి."

యజమాని అప్పటి కంతటితో సరిపెట్టుకొని ఫూరుకున్నాడు. జనసమ్మర్దం తగ్గినతరువాత ఇలియా రెండు చెవులూ పట్టుకొని గట్టిగామెలేస్తూ "వెతకమంటే యింకోసారి జాగ్రతగా వెతకాలిగాని, యెదురు చెపుతావా?" అని గద్దించాడు.

ఇలియా రెండుచేతులూ యజమానిబొగ్ర మీాద వేసి గట్టిగా త్రోసి చెవులువదిలించుకున్నాడు. దూరంగా పోయి

నుంచోని "వెతకాలంట! ఏమిటి వెతికేది నాబొందిద. ఆనోటు అప్పుడే మేనేజరుగారి జేబెక్కిందేను!" అన్నాడు బిగ్గరగా.

మేనేజరు అదిరిపడ్డాడు. వెనుకపాటున వచ్చి ఇలియా వీపుమీద రెండుగుద్దులు గుద్దాడు. వాడు వెక్కి వెక్కి యేడుస్తుంటే మరోవేపుకు వెళ్ళబోయాడు. అంతలో వుగ్రుడై వున్న యజమాని "ఎక్కడికి? ఆ నోటిచ్చి మరీ పో" అని వురిమాడు.

మేనేజరుమొఖం మాడిపోయింది. "ఈ వెధవాయి బొంకాడండి" అన్నాడు ముఖం పక్కకు తిప్పుకొని.

"ఏదీ యిటు రా"

"నా కేమీ తెలియదండి. ఒట్టుపెట్టుకుంటున్నాను."

"ఇంతకూ నీ జేబులో నోటు వున్నదంటావా, లేదా?"

"బజార్లో వెచ్చాలుకొందామని యింటివద్దనుంచి తెచ్చుకున్నాను. వీడబద్ధంచెప్పినంతమాత్రాన నమ్ముతారా?"

"చాల్లే, నోరుముయ్."

అంతా నిశ్శబ్దంగావుంది. యజమాని లేచి వికటంగా నవ్వి మళ్ళీ కూచున్నాడు. గల్లాపెట్టెమీద వ్రేళ్ళాడించుతున్నాడు. ఇలియా నెత్తిమీద చేతులు పెట్టుకొని గోడనాని కూచున్నాడు. మేనేజరువంక తిరస్కారభావంతో చూస్తున్నాడు.

మేనేజరు మైకేలు దొంగతనం పట్టుబడినందుకు అవమానితుడై క్రుంగిపోయాడు. కోపాతిరేకంచే పళ్ళునూరుతూ

"హుంఁ! ఇంకా చాలలా? చాకీలు చెపుతావా? నీకు బుద్ధి చెపుతానుండు" అని బెదరించుతూ ఇలియామీద కెళ్ళాడు.

ఇలియా లేచి నిలబడ్డాడు. సమీపంలో నేవున్న చేపలను నరికే కత్తిని తీసుకుని "ఏమిటి, మహా యెగిరెగిరిపడుతున్నావు? రా, చూస్తాను నీబడాయి!" అని మోటుచరిచాడు.

మైకేలుకు యిక నడుగు ముందుకుపడలా. ఇలియా బలిష్టశరీరాన్ని, వాని తెగువ చూచి దంగయి ప్రమాన్పడిపోయాడు.

మేనేజరు వెనుకంజవేయడంలో ఇలియా సాహసం యినుమడించింది. యింకొంచెం ముందుకెళ్ళి "రావేఁ" అని దబాయించాడు. వానిశరీరం కంపించుతోంది; అయినా అజ్ఞాతశక్తి యేదో తన్ను ముందుకు నెట్టుతున్నట్టు తోచింది వానికి.

అంతలో "కత్తి నక్కడ పెట్టు" మన్న యజమాని కేక వినపడింది. ఇలియా మెడ త్రిప్పి ఆయనవేపు చూచాడు. ఆయనకళ్లు, ముఖము రక్తిమదాల్చివున్నై. కోపంచే గడ్డం అదురుతోంది. ఇలియా ఆయన్ను చూచికూడ వెనుకాడలా. మేనేజరుమీదికి తొడచరుస్తూనే వున్నాడు.

"నామాట విని కత్తి నవతల పారెయ్యి ఇలియా!" అని యజమాని మరొకసారి హెచ్చరించాడు.

ఇలియా కిక్కురుమనకుండ తక్షణం కత్తిని క్రింద పడేశాడు. చతికిలబడికూచుని యేడుపుసాగించాడు. వాడికి

అంతా అయోమయంగా కనపడింది. ఆత్మరక్షణ చేసు కోటానికూడ స్వేచ్ఛ లేదని తలుచుకున్నంతనె దుఃఖం ముమ్మరమయి కించపడుతున్నాడు.

యజమాని మైకేలు నుద్దేశించి "నీకు రావలసింది లెక్క చూచుకొని పట్టుకొనిపో. నువ్వింక ఒక్క క్షణంకూడ నా దుకాణంలో వుండతగవు" అని చెప్పాడు.

"మీరు నిక్కచ్చిగా వెళ్ళిపొమ్మంటే యిప్పుడే వెళ్లిపోతాను; కాని, మీరీ దుండగీడుమీద కన్నువేసి వుండండని చెపుతున్నాను. వీడి తండ్రి పక్కా బద్మాష్! వీడూ అంతే. ఈ తులువ కత్తి తీసుకొని తిరగబడటం మీ కళ్ళతోనే చూచారుకదూ" అని నెత్తిమీద టోపీ పెట్టుకొని వెనక్కి తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు.

కొంతసేపటివరకూ దుకాణం నీరవంగావుంది. ఇలియూ దుఃఖాక్రాంతుడై వున్నాడు. మైకేలు నిర్గమించిన పిమ్మట బుగ్గలమీదికి కారిన కన్నీటిచుక్కలను తుడుచు కొని యిట్టట్టు చూచి లేచి బయటకుదారిపట్టాడు.

అంతవరకూ వానివంకే దీక్షగాచూస్తున్న యజమాని వెళ్లిపోతున్న ఇలియూను దగ్గరకు పిలిచాడు.

"నిజంగా నీ వాతణ్ని కత్తితో పొడిచేవాడివేనా?" అని ప్రశ్నించాడు.

"నామీదికొస్తే పొడవకేంజేస్తాను?" అన్నాడు ఇలియూ తొణుకూబెణుకూ లేకుండా.

"నీతండ్రికి శిక్ష యెందుకు పడింది?"

"కొంపలకి చిచ్చుపెట్టాడని"

"గొప్పనేరమే!"

అప్పుడక్కడికి కార్ప్ వచ్చాడు. ద్వారబంధము ప్రక్కగానున్న బల్లమీద కూచొని బజార్లోకి చూడసాగాడు.

"కార్ప్! మైకేలును పనిలోనుంచి తొలగించి వేశాను" అని యజమాని చెప్పాడు.

కార్ప్ మొహంత్రిప్పి విస్మయంగా "యెందువల్లనండీ?" అనడిగాడు.

"అతను దొంగతనానికి అలవాటుపడ్డాడు. అందువల్ల సాగనంపాను."

"ఆఁ, అంతపని చేస్తున్నాడా?" అని కళ్లు పెద్దవి చేసి కార్ప్ ఆశ్చర్యమభినయించాడు.

యజమాని గడ్డంసవరించుకొని వికటాట్టహాసంచేస్తూ "నువ్వు శుంఠలాగున్నావే!" అన్నాడు. మరుక్షణంలో గాంభీర్యతవంపించి దీర్ఘంగా నిశ్వసించాడు. "హోదాకు తగినట్టు ప్రవర్తించడమే తెలియదు. ప్రతివాడూ గొప్పవాడు కావాలనుకుంటాడు. ప్రక్కవాడొక చొక్కా తొడుక్కుంటే, తాను రెండు తగిలించుకోవాలనుకుంటాడు. కాని ఎక్కడనుంచి వస్తాయ్! అందరికోరికలు యిల్లాగే వుంటయ్." ఇలియాను నుద్దేశించి "ఏఁరా! మైకేలు జేబులో వేసుకోవడం యింతకుముం దెప్పుడైనా చూచావా?" అనడిగాడు.

"ఇవాళ క్రొత్తేముంది. వానికది నిత్యకృత్యమేనండి." అని ఇలియూ చెప్పాడు.

"మరి నాకెప్పుడూ చెప్పలేదేం?"

"ప్రయోజనం లేదనే."

"అయితే యివాళ యెందుకు చెప్పావు?"

"తప్పు నానెత్తిన పడుతూంటే యేం చెయ్యను?"

"మరి నువ్వెప్పుడూ దొంగిలించలా?"

"నా కా బుద్ధి కలలోకూడా లేదు"

"కావచ్చు, కాని, మరి కార్ప్?"

"ఈయన నీడకూడ మీ యింటివాసాలు లెక్కపెడు తుంది"

కార్ప్ ఇలియూవంక కొఱకొఱచూచి ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

యజమాని సంభ్రమాశ్చర్యాలతో మౌనం దాల్చాడు. కనుబొమలు యెగిరి పడుతున్నై. "హుఁ" అని తలపంకించాడు.

ఏదో రాద్ధాంతం జరిగితీరుతుం దనుకున్నాడు ఇలియూ. దుకాణమం దంతటా యీగలు ముసురుకుని బుఁయ్ మని ధ్వనిచేస్తున్నాయి. తొట్లలోని మత్స్యాలు యెగిరి పడు తున్నయ్.

కార్ప్ నోటమాటలేక నిశ్చేష్టుడై రెప్ప వాల్చకుండ రోడ్డుమీదికి చూస్తున్నాడు. "కార్ప్!" అన్న యజమాని

పిల్పు అదాటుగా వినపడింది. ఏం మునుగుతుందోనని యెదురు చూస్తున్నవానివలె కొప్పు మెల్లగా లేచి యజమాని ముందుకెళ్ళి నుంచున్నాడు. "ఏమి సెలవు?" అని వినయ విధేయతలుట్టిపడేట్లు అడిగాడు.

"విన్నావా?"

"చిత్తం"

"మరి సంజాయిషీ యేం చెప్తావు?"

"చెప్పడాని కేమున్నదండీ?"

"ఏం?"

"వీడు పచ్చి అబద్ధాలకోరు. అపనిందవచ్చిందని కుర్రకుంకమాటల్ని లెక్కచేస్తూకూచుంటే ప్రపంచంలో బతకటమే కష్టం."

"నీ బుకాయింపులు నా ముందు కట్టిపెట్టవోయ్. అసలు వీడు చెప్పింది నిజమో అబద్ధమో సూటిగా జవాబిమ్మని అడుగుతున్నాను, తెలిసిందా?"

"నిజా నిజములంటే యేమిటండీ? మన మనసులోని వూహాలేగా. మీ రీ వెధవ మాటలు నెల్లా భావించదలిస్తే అట్లే చేయండి. నిజమనుకున్నా, అబద్ధమని యెంచినా అది మీ యిచ్ఛాధీనంకదా!"

"అయితే అంతా నాఇష్టంలోనే వున్నదంటావు; ఇలియా చెప్పింది వాతప్పేనంటావా"

"ముమ్మాటికీని. వీడు ఒఠ్ఠి మకురుగాడిద!"

"అల్లాగా? అవున్లే. అక్కుపక్షి గాకపోతే నీ ముఖం మీాదే నీదొంగతనాన్ని బయటపెట్టగలుగుతాడా!"

పై మాటలని యజమాని నవ్వాడు. ఇలియా ద్వారం వద్ద నిలబడి యిద్దరిసంభాషణ వింటున్నాడు. నిజం పల్కటం కూడ తంటాయే కాబోలు ననుకున్నాడు. యిల్లాంటి సమాజంలో తాను యెల్లా మసలుకోవాలోనని చింతించాడు. యజమానినవ్వుతో వాని హృదయారాటం కొంతవరకు చల్లారింది. ఒకసారి కార్ప్వంక జయించిన వానిలాగాచూచి, యజమానివేపుకు కృతజ్ఞతాభరితమగు చూడ్కిని విసిరాడు. కార్ప్ మళ్ళీ మాట్లాడనేలేదు.

సాయంత్రం దుకాణంమూసివేసి వెళ్ళేటప్పుడు కార్ప్ ఇలియాతో "వెర్రిమొగమా! యజమాని అనుగ్రహం సంపాదించడానికి యిదేనా వుపాయము? మైకేలు, నేను వీలు చిక్కినప్పుడల్లా కక్కుర్తిపడుతున్నామని ఆయనకు తెలియదూ? ఆయన మాత్రం యెల్లా సంపాదించాడను కున్నావ్? మైకేలుబండారం బయటపెట్టి మంచిపనే చేశావు; కాని, నామీాదకూడ చెప్పావెందుకు? నువ్వీరీతిని మెక్కులు చెప్పి యేం బావుకుందామని? ఇప్పుడు నా కొచ్చిన నష్ట మేమీా లేదులే. నీ దొబ్బుడాయి తొందరలోనే వదుల్తుంది. కించిత్తైనా గౌరవంచూపకుండా నా యెదుటే నేను దొంగనని చెప్తావా?" అన్నాడు.

ఇలియా తల ఒంచుకొని పెదవివిప్పకుండ విన్నాడు. అయినా వాడికి కార్ప్ఉద్దేశమేమిటో బోధపడలా. గుట్టు బయటపెట్టినందుకు కార్ప్ తనపై కోపించి అవకాశం చూచుకొని చావమోదుతాడని తలిచాడు! కాని, పై మాటలధోరణి మరోమాదిరిగా వుంది; అందుకు ఇలియా ఆశ్చర్య పడ్డాడు. ఇక తనకు వచ్చే ముప్పేముందిలెమ్మను కుంటూ సాగిపోయాడు.

ఇంటికి వెళ్ళగానే యజమాని ఇలియాను మేడపైకి పిలిచాడు.

ఇలియా వూపిరిబిగబట్టి పైకెళ్ళాడు. హాలుమధ్య మేజాబల్ల, కుర్చీలు వున్నై. ఇంటిల్లిపాది బల్లచూట్టూ పరి వేష్టించివున్నారు. ఇలియాను చూచి ఆడపిల్లలు ముగ్గురూ మూతులుముడుచుకున్నారు.

"అంతపనీ చేసింది వీడే!" నని యజమాని భార్యతో చెప్పాడు.

ఆవిడ అంతకుముందెన్నడు చూడనట్టు ఇలియాను వింతగా చూడసాగింది. యజమాని మందహాసంతో బల్ల మీద వ్రేళ్ళాడించుతూ "నువ్వు నావద్ద పనిచేయటానికి పనికిరావు ఇలియా! మాటా - ముల్లె తీసికుపొమ్మనటానికే పిలిచాను" అన్నాడు.

ఇలియా నిశ్శాంతపోయి, మారాటలేకుండానే యజమానికళ్ళలోకి చూచాడు. ఏమడగటానికీ సాహసం లేకపోయింది! నిమ్మళంగా లేచి దారిపట్టాడు.

యజమాని లేచి వెళ్ళి ఇలియా చేయిపుచ్చుకొని వెనక్కి తీసుకొచ్చి యిల్లా చెప్పాడు- "నీకు నేనొకసలహా చెప్పదలిచాను. నువ్వు నాకే మీ ద్రోహంచేయలేదని నే నెరుగుదును. చదువుకున్నవాడివి; ఒళ్ళు దాచుకోకుండా పని చేస్తావు. విశ్వాసపాత్రుడివే; అయినా నీవల్ల నాకు ప్రయోజనం లేదు."

ఒకవంక ఇలియా మెచ్చుకోబడుతున్నాడు. తోట్లో డనే తరిమివేయబడుతున్నాడు కూడాను. ఈ ద్వంద్వార్థ మేమిటో వాని కవగతం కాలేదు. "అయితే నేను కత్తితో యెదుర్కొన్నందువల్ల నేనా నేను తమకు పనికిరానిది?" అని టక్కున అడిగేశాడు.

"ఉద్దండపిండం!" అన్నది యజమానురాలు.

యజమాని ఇలియా వెన్నుచరచి "నువ్వు చాలా దుడుకుమనిషివి. నీ ఆగడం సహింపరానిది. అది సామాన్య విషయం కాదు. నౌకరెప్పుడూ అణకువకలిగి ఆజ్ఞానువర్తియై వుండాలి. యజమానికనుసన్నలలో మెలగుతూండాలి. తన స్వంతవుద్దేశమనేది వుండకూడదు. మరి నీవో! స్వాభిమానివి. యథేచ్ఛగా ప్రవర్తించా లనుకుంటావు. ఎవరిని గాని బాహాటంగా దొంగవని అనవచ్చా? అందువల్ల యెన్ని లకలుకలు వస్తాయి! ఎవరిని గురించయినా చెప్పాల్సివుంటే నాతో చాటుగా చెప్పాలి. యజమానిని కాబట్టి కావలసిన యేర్పాట్లు చేసుకుంటాను. నువ్వు వీడు దొంగ, వాడు

మోసగాడని కుండ పగులగొట్టినట్టు సుళువుగా మొహం మీదనే అనేస్తున్నావు. ఇది ప్రపంచం! లెక్కప్రకారం నడుచుకోవాలి. ఉన్న ముగ్గురిలో యిద్దరు దొంగలు కదాయని నెళ్ళగొట్టితే నాపని సాగ్గా కావద్దూ? పదిమందిలో ముగ్గురు మోసగాళ్ళయితే వాళ్ళను సాగనంపి యేడుగురితో వ్యాపారం నడుపుకోవచ్చు. పదిమంది అన్నదే — అది భ్రాంతియే కావచ్చు - అనుసరణీయం. అది రాణిస్తుంది కూడాను. నిజానిజాలకు గీటురాయి కూడ అదే. భవిష్యత్తులో నువ్వీ విషయాన్ని లెస్సగా ఆలోచించుకొని నోరువిప్పు మనేదే నా సలహా. నోటికివచ్చినట్టు, వున్నదున్నట్టు వాగవద్దు......మరొక సంగతి: నువ్వు చీటికీ మాటికీ కత్తి-కటారులు తీసుకొని తిరుగబడతావు'' అని చెమటను చేరుమాలతో తుడుచుకుంటూ నవ్వాడు.

కత్తిపేరు వినగానే అక్కడున్న ఆడంగులు భీతి చెందారు.

''కత్తిచేబూనినవాడు తన్నే గాయపర్చుకుంటాడని బైబిలులో రాసివుంది; కాబట్టి జాగ్రతగా మసలుకో. నిన్ను విడిసిపెట్టాల్సివచ్చినందుకు నేనూ విచారపడుతున్నాను; అయినా తప్పదు. నామనసులో వున్నదంతా విప్పిచెప్పాను. నువ్వు మరోలా అనుకోవద్దు. నువ్వు నాకు చేసిన నష్టమూ లేదు; నేను నీకు చేస్తున్న హానీ లేదు. (జేబులో నుంచి

నోట్లుతీసి) ఇదిగో! యాభై రూపాయల బహుమానం! (ఇలియా చేతిలోపెట్టి) నీవిక వెళ్ళొచ్చు'' నని కుర్చీవద్దకు పోయి కూచున్నాడు యజమాని.

ఇలియా నోరుతెరచి మాట్లాడలేదు; కాని, కృతజ్ఞతాపూర్వకంగా యజమానికి వంగి నమస్కరించి మెట్లు దిగిపోయాడు.

''నాకరీవ్వాడిందని వాడికళ్లనుంచి రెండు నీటిచుక్కలయినా కారలేదు. వాడికా విచారమే లేనట్టుంది.''అంది యజమానిభార్య.

ఇలియా రోడ్డుమీద నడుస్తున్నాడు. ''యజమానికి కార్పు అవసరమవడంవల్లనే నా కుద్యాసం చెప్పాడు. అదీ నిజమే; మరి అందరికీ స్వస్తి చెపితే దుకాణంసాగించేదెవరు?'' తనలో అనుకున్నాడు. నిజాయితీకి యీ సమాజంలో స్థానం లేకపోబట్టే తన కాగతి పట్టిందని తలచుకొన్నప్పుడు ఇలియా కెనలేని దుఃఖకలిగింది. యజమాని నిరాడంబరత, సరళహృదయము, సాధుస్వభావాలు తలపుకొచ్చి అభినందించాడు.

# 10

ఇలియా ఓరెస్సువద్దకు చేరాడు. ఇంటిపట్టునే వుంటున్నాడు. అక్కడివారిప్పుడతన్ని కుర్రవానిగా యెంచక కాస్త గౌరవించుతున్నారు. ఇరుగు పొరుగు జనరాండ్ర దృష్టినికూడ ఆకర్షించుతున్నాడు. మాటలుకూడ పెద్దవారి వలె మాట్లాడుతున్నాడు.

ఫర్ ఫిష్కా కలిసినపు డొకసారి యిల్లా చెప్పాడు—"నీ విషయమంతా విన్నాను. ప్రపంచం స్వార్థమయం! ఒకరి మేలుతో మరొకరి కగత్యంలేదు. పదభ్రష్టుడై చెడిపోయే వాడిని చూచి నవ్వేవారే కాని, బాగుచేద్దామనే భావన ఒక్కడికీ వుండదు. న్యాయం యెవరిక్కావాలి! నువ్వు త్రాగుతూ వున్నన్నాళ్ళూ చుట్టూ చేరి ఆడించుతారు."

ఇలియా యెవరితో మాట్లాడినా అన్నీ కాచివడ పోసినవానివలె నీతులు చెప్పేవాడు.

ఇలియా పునరాగమనంతో మాషా, జాకోబులు అత్యంతానందంపొందారు. "మళ్ళీ మనం చదువు సాగించుదాము. నావద్ద చాలా మంచిపుస్తకాలున్నై." అన్నాడు జాకోబు.

ఇలియా నౌకరీ వూడిందని పెత్రూహా విన్నాడు. వానిని దగ్గరకుపిల్చి "నువ్వు ఒట్టి వెర్రిబాగులవాడివోయ్. వాళ్ళ

బటారం బాగానే బయటపెట్టావు; కాని, నీ జీవనోపాధిని గంగలోకలుపుకున్నావు. సమర్థులైనవారిని పనిలోనుంచి తొలగించితే ఆయనబండి నడవ నద్దూ? నిన్ను వుంచుకున్నా తిరంగావుండలేవు. వాక్యం తెలిసి నడుచుకోకపోతే ప్రక్క వారితో యెల్లా కలిసి మెలసి వుండగలవు? చేతులారా బోలి బోర్లించుకున్నావు.'' అని మందలించాడు.

మరునాడు పెరెన్ను అన్నకొడుకును ఒంటరిగా చూచి చెప్పాడు- ''ఇలియూ! పెట్రుహాతో అధిక ప్రసంగం చెయ్యబోకు. అతడికి నీయందు సదభిప్రాయం లేదు. అదే పనిగా నిన్ను దూషించుతున్నాడు. నువ్వు గబ్బిలాయివనీ న్యాయంతో ముడెట్టుకొని ముక్కుసూటిగాపోయి నోట్లో మన్నుకొట్టుకున్నావనీ యెగతాళి చేస్తున్నాడు. నువ్వాయన మాటలను లక్ష్యపెట్టొద్దుసుమా!'' అని హెచ్చరించాడు.

ఇలియూ యెవరేమన్నా హంతాశుడు కాలా. వానికి తనప్రవర్తనపట్ల అభిమాన మెప్పటియట్లె అచంచలంగా వుంది. తా నానాడు ప్రదర్శించిన సాహసోద్రేకాలు, సత్య ప్రకటన సబబైనవేనని వాని దృఢవిశ్వాసం.

రెండుమాసాలపర్యతం యెంత ప్రయత్నించినా ఇలియాకు మళ్ళీ నౌకరీ కుదరనేలేదు. ఒకరోజున పెరెన్ను నౌకరీనిగురించి ఇలియూను కదిలించేడు. ''నేను చాలా ప్రయత్నించాను. కాని, నిన్ను నౌకరీలో వుంచుకోటాని కెవరూ యిష్టపడటంలేదు. ఇకముందు కర్తవ్యమేమి''టని ఖిన్నవదనంతో ఇలియూ నడిగాడు.

"నా కొకరివద్ద వూడిగము పొసగదు బాబాయ్. ఒకరి కణగిమణగివుండేస్వభావంకాదు నాది. ప్రపంచం ముఖస్తుతితో నిండివుంది. అది నాకు చేతగాదు." అన్నాడు ఇలియా.

"మరి యీవిధంగా పనీ-పాటూ లేకుండా యెన్నాళ్ళని కూచుంటావు? అయిదు వేళ్ళూ లోపలి కెళ్ళే మార్గమేదయినా చూచుకోకపోతే యెల్లా?"

"ఊరకే కూచోవాలని నాకూ లేదు. మారుబేరం సాగించిచూడాలనుంది."

"ఏమో నబ్బాయి! జీవితమంతా దాస్యంచేసిచేసి నా మెదడు మొద్దుబారింది. నీవుద్దేశం నాబుర్రకెక్కటంలేదు, ఏదెల్లా జరుగుతుందో నాకేమీ తోచకుండా వుంది."

"నిజమే!"

గూనివాడు తనలో యేదో గొణుక్కున్నాడు. విచారోద్వేగాలకు నిరాశతోడై ముప్పిరిగొనగా పెరెన్ను వ్రేళ్ళపైన యేమిటో లెక్కపెడుతున్నాడు.

"అది స్వేచ్ఛావృత్తి. లాభించేదీ లేనిదీ చేసిచూస్తే గాని తెలియదు. కృషిచేస్తే కృతకృత్యుణ్ని కావచ్చుననే నా యాశ" అన్నాడు ఇలియా.

"దేవుడు నీకు మేలుచేయుగాక! నువ్వు పెద్దవాడవయితే నేను నిశ్చింతుడనై పాపపరిహారార్థం ప్రయత్నంచేసు కుంటాను. అందుకు నీవే అడ్డంకిగా వున్నావు. నే నీ యువ

యాతనపడుతున్నది ఎల్లాగైనా నిన్నొక యింటివాడిని చెయ్యాలనే. నీగురించిన తాపత్రయమే లేకపోతే యే ఋష్యాశ్రమానికో పోయి పాప విముక్తికి భగవంతుణ్ని ధ్యానించు కుంటాను.''

ఔరెన్సు కాపైన మాట రాలా. కళ్లు నీరుకమ్మాయి. పినతండ్రి యే పాపాన్నిగురించి అంతగా కటకటపడు తున్నాడో ఇలియా క్షణంలో గ్రహించాడు. జర్మి యా మృత్యుఘటనాదృశ్యం స్మృతిపథంలోకి రాగానే వానిగుండె ఝుల్లుమంది. ఔరెన్సుదీనస్థితికి ఖేదపడ్డాడు; కాని, సాను భూతి తెలిపేవిధం తోచలా. మీ రింతగా కాతరులు కావద్దు. వ్యాపారంలో కుదురేర్పడగానే మీకు నాభారం తగ్గిపోతుంది. తరువాత మీరు నిర్విచారంగా ఆశ్రమవాసా నికి వెళ్లిపోవచ్చును.'' అన్నమాటలు వాని నోటినుంచి వెలువడినై.

కొంతసేపటివరకు దీర్ఘాలోచనా తత్పరుడై వుండి ''మీరు సంక్షోభించకండి. భగవంతుడు మిమ్మల్ని తప్పక మన్నించుతాడు'' అన్నాడు.

ఔరెన్సు శిరమెత్తి ఆశాదృష్టితో ఇలియావంకచూచి ''నన్ను నిజంగా క్షమించుతారంటావా?'' అనడిగాడు.

''దేవుడు దీనదయాళువు. మిమ్ము తప్పకుండ క్షమించుతారు. ఘోరాతి ఘోర పాపాత్ములను కూడ క్షమించినట్టు నేను పుస్తకాల్లో చదివాను.''

ఇలియూ మాటు వేర మారంభించాడు. పొద్దుపొడిచిన లగాయతు సాయంత్రమయ్యేవరకు వీధుల్లో, సందు — గొందుల్లో 'సబ్బులు, సూదులు, అద్దాలు, దువ్వెనలు, సెంట్లు, తలనూనె'లని కేకలువేస్తూ తిరిగేవాడు. ఎదురుగా వచ్చే పెద్దమనుషుల చెంతకుపోయి వస్తువులను ఓపికతో చూపెట్టి కొనుడని ప్రార్థించేవాడు.

ఇలియూ జీవిత మిప్పుడు శరత్కాల నదీప్రవాహం వలె శాంతమై, గంభీరగతిని గడచిపోతోంది. పగలంతా తిరిగి తిరిగి అమ్ముకుంటూ, ఆకలయినప్పుడు యే హోటలుకో పోయి రొట్టెముక్కో, పరోటాయో తిని, ఒక కప్పు తేనీరు తాగి క్షుద్బాధను తీర్చుకునేవాడు. ఇదే మోస్తరుగా అతను రోజులు వెళ్ళబుచ్చుతూ, భావి సుఖ జీవితాన్నూహించుకుంటూ తృప్తి చెందేవాడు. అంగళ్ళ వీధిలో తాను స్వంతంగా దుకాణంపెట్టి, మడత విప్పిన శుభ్ర వస్త్రాలను దాల్చి గల్లాపెట్టెముందు కూర్చొనివుంటే క్రయదారులు వచ్చి మర్యాదగా బేరమాడి ఖరీదు చేసేరోజు నూహించుకొనేవాడు. సీటుగావుండాలని ఇలియూకు మహా అభిలాషగా వుండేది.

తానుకూడ గౌరవనీయవ్యక్తి నవుతాననీ, తన్నెవరూ అవజ్ఞ చేసి అవమానించరనీ, మర్యాదగా జీవితంగడిపే రోజులు వస్తాయని తలచుకొన్నప్పుడు ఇలియూ మొహం చాటంతఅయ్యేది.

కాని, అమ్మకము తమాము లేనినాడు ఇలియా మ్లానముఖంతో యే హోటల్లోనో కూచుని తన దరిద్ర జీవితాన్ని గురించి వితర్కించుకొనేవాడు. నిరాశ భయంకరరూపంతో వాని నావరించేది. పోలీసుల అత్యాచారాలు, కొనుగోలుదారుల పేచీలు, తోడి బేరగాండ్ర పోటీలు మొదలయినవన్నీ వాని బుర్రలో గిరగిర తిరిగేవి. మానవులందరొకే విధమగు కాంక్షలతో, ఒకే లక్ష్యంతో ముందుకు పరుగెడుతున్నట్టు తోచేది. ఆ పరుగులాటలో యెవని గొడవ వానిదే. అవకాశం చిక్కితే ప్రక్కవానిని పడద్రొబ్బి ముందుకు దాటిపోవడానికెవడూ సందేహించడు; తటపటాయించడు. జీవితమంతా పరస్పర సంఘర్షణామయము. ప్రతిహింసాభరితము. అందుచేతనే పొరుగువాని కెగ్గు చేయటము. దురాగతం చేసినవానికి కించిత్తయినా పశ్చాత్తాపము కలుగకుండడము మరీ శోచనీయము!

ఈ భావపరంపరలతో ఇలియా వూహానిర్మిత సౌధ మొక్కసారిగా నేలకూలేవి. వాని యాశలన్నీ అడుగంటేవి. తానీవిధంగానే కాళ్లీడ్చుకుంటూ పెట్టె మోస్తుండగానే తన జీవితం కాస్తా సమాప్తమయిపోతుందనీ, నాలుగు డబ్బులు కూడబెట్టడ మసలే వుత్తదనీ నిరాశ చెందేవాడు; అయితే మళ్ళీ అమ్మకం జోరుగా జరిగినప్పుడు వాడి, మోడిపోయిన ఆశాలత తిరిగి చిగిర్చేది.

ఇలియాసుకొకనాడు ఆకస్మికంగా బజారులో పాష్కా కనిపించాడు.

వాడిబట్టలు మాసిపాతల్లాగా వున్నై. దేహం శుష్కించి పోయింది. పాష్కా ఇలియాసును చూచి నవ్వాడే కాని, ముందుకు రాలేదు. చూచీ చూడనట్టు వున్నచోటే తచ్చాడుతున్నాడు.

ఇలియాసు మిత్రుని కలసికొని క్షేమసమాచారం కనుక్కొనేందుకు తహతహలాడాడు. పాష్కా విముఖత్వాన్ని గ్రహించికూడా తన వ్యగ్రతను నిగ్రహించుకోలేకపోయాడు. చరచర పోయి కరస్పర్శచేసి "ఏమోయి మిత్రమా! ఖులాసాగా వున్నావా? ఎక్కడ వుంటున్నావు? ఏం చేస్తున్నావు?" అని సత్కరించాడు.

"క్షేమంగా వున్నాను. దొరికిననాడు సుష్టుగా మెక్కడము. లేనిపూట కడుపులో కాళ్ళెట్టుకుని హాయిగా పడుకోవడమూను. ఇంతకంటే క్షేమసమాచారం యింకేం కావాలిరా!" అన్నాడు పాష్కా వెటకారంగా.

"నువ్వు మమ్మల్ని చూడటానికి రావడం బొత్తిగా మానివేశావేం?"

"నీమకాము నాకేం తెలుసు!"

"ఎప్పటింట్లోనేగా"

"నువ్వెక్కడో చేపలదుకాణంలో నౌక చేస్తున్నావని విన్నానే!"

ఇలియూా తన కథను సవిస్తరంగా చెప్పాడు.

"బలేపని చేశావు! సరిగా నాకూ అల్లాగే జరిగింది. మొదట నేనొక అచ్చాఫీసులో జేరాను. అక్కడ సవ్యంగా జరగలా. తరువాత ఒక పెయింటరువద్ద కుదిరాను. అక్కడ యేదో చిన్న పొరపాటుకు స్పృహతప్పి పడేదాకా కొట్టారు. ఈమధ్యనే పంపులు దింపేవాని చేతిక్రింద నౌకరీ సంపాదించాను. నెలకి అయిదు రూపాయ లిస్తున్నాడు. ఇప్పుడు భోంచేసి ఆ పని మీాదే వెళుతున్నాను. ఇంతలో నీ దర్శనమయింది."

"తొందరగా వెళ్ళాలా?"

"పగలనక, రాత్రనక, బద్ధకించకుండా చాకిరీ చేసినా మెప్పులేదు. కొంచె మాలస్యమయితే చీవాట్లూ, చెప్పు దెబ్బలూను. ఈ సొద నీకెందుకులే. నేనొకసారి మీాదగ్గరకు వస్తాలే."

"తప్పకుండా రావాలిసుమా."

"మీారింకా పుస్తకాలు తిరగేస్తున్నారా?"

"ఆ, మరి నువ్వో?"

"నేనా! నాకంత మెసులుబాటేదీ?"

"అయితే పద్యాలు రాయటంలేదా?"

"రాయకేం, కవనం మానేస్తానూ?" అని పాష్కా నవ్వాడు.

"వచ్చేటప్పుడు నీపద్యాల పుస్తకం తీసికొనిరా."

"పుస్తకం సంగతి యెల్లావున్నా బుద్ధి తెస్తాలేరా"

"ఓరి బడ్డు! తాగుడుకి అలవాటుపడ్డావూ?" అన్నాడు ఇలియా విస్మయంగా.

"ఎబ్బే! కొద్ది కొద్దిగా సుమ్మరించుతున్నానంతే. సరే పోయివస్తా"నని పాష్కా వెళ్ళిపోయాడు.

ఇలియా దారిపొడుగునా పాష్కానుగురించే ఆలోచించుతున్నాడు. తన స్వంత వ్యాపారం స్వేచ్ఛా వృత్తులను గూర్చి విన్నప్పుడైనా పాష్కా ఈర్ష్యపడకుండడం ఇలియా నాశ్చర్యపరచింది. తన్ను చూచి వాడసూయ పడకపోవటము వాని కసాధారణ విషయంగా కనపడింది. ప్రజలందరిలాగా పాష్కా పరస్పర సంఘర్షణతో కూడుకున్న త్రోపులాటలలో పాల్గొనటమే లేదాయని సందేహం కలిగింది.

ఇలియా క్రమముతప్పకుండా చర్చికి వెడుతున్నాడు. ఒకమూల నిలబడి అక్కడ చేరిన జనాన్ని నిశ్చల దృష్టితో పరికించేవాడు. ప్రార్థనలో అత్యంత శ్రద్ధాభక్తులతో పాల్గొనేవాడు. చర్చికి వచ్చేవారందరూ స్థిరదృష్టితో యేదో ఒకే అవ్యక్తఆకారాన్ని ధ్యానించుతూన్నట్టు భావించేవాడు. ప్రార్థనా సమయంలో గానఝురి తరంగాలవలె లేచి సాగిపోతూండేది. చర్చిలో మూలమూలల కూడ ప్రార్థనారవము ప్రతిధ్వనించేది. ఒక్కొక్కప్పుడు తానా గానవాహినిలోపడి కొట్టుకొనిపోతున్నట్టు, తన అస్తిత్వాన్నే కోల్పోతున్నట్టూ తోచేది ఇలియాకి. చర్చిలో సంప్రాప్తించిన శాంతి వానికి

జీవితరంగంలో మరెక్కడా పొడకట్టేదికాదు. ఆదిలో అదేదో బాహ్యాభావనగా తలిచేవాడు; దానితో జీవితసంఘర్షణ కెట్టి సంబంధము లేదనుకున్నాడు; కాని, ఆభావ మనవరతము తన అంతరంగంలోనే అణగివున్నట్లు ఇలియా అనతికాలంలోనే గ్రహించగలిగాడు. జీవితపోరాటంలో మాత్రం దాని చిహ్నమయినా కన్పించేదికాదు. చర్చిలో అడుగుపెట్టగానే వెనకటిభావం తుపానువలె చెలరేగేది. అప్పుడు వానికి బాహ్యప్రపంచంమీద జుగుప్సకలిగేది. భావి జీవితాన్నిగురించిన కల్పనాజగత్తు నిస్సారంగా తోచి అదృశ్యమయ్యేది. అంటాయిప్, జర్మియా మొదలగు పుణ్యపురుషుల పవిత్రసూక్తులు జ్ఞప్తికొచ్చేవి. 'భగవంతుడు సర్వవ్యాపితుడు. సమస్తాన్ని ఆయన గమనించుతూనే వుంటాడు. ఆయనకు అగోచరమన్నది లే' దనుకొని సంతృప్తి పొందేవాడు.

చర్చిలోనుంచి బయటకు వచ్చి రావటంతోనే అదో విచిత్ర మనస్థితి యేర్పడేది. ఊహలు పుంఖానుపుంఖాలుగా రేకెత్తేవి. అంతకుముందు కలిగిన విరక్తి - వైరాగ్యాలు ఎటుపోయేవో, మళ్ళీ మామూలు వ్యవహారాల్లో నిమగ్నుడవుతూండేవాడు.

ఇలియా తన జీవితవివరాలన్నీ జాకోబుతో చెప్పేవాడు. కాని తన అంతరంగంలో నిత్యము జరుగుతున్న యీ ద్వంద్వయుద్ధాన్నిగూర్చి మొన్నడూ బయటపెట్టే

వాడుకాదు. అస లావిషయంలో తానైనా సావధానంగా ఆలోచించి యదార్థాన్ని తెలుసుకొనటానికి ప్రయత్నించనేలేదు.

సాయంసమయాన్ని ఇలియా కులాసాగా గడిపేవాడు. అమ్మకంచాలించి తిన్నగా మాషాగదికి వెళ్ళటం అలవాటయింది. వెళ్ళగానే ఒక కప్పు తేనీటి నపేక్షించేవాడు. ఆమెకూడా టీని సిద్ధంచేసివుంచేది. ఇలియా ప్రతి రోజూ బజారునుంచి వస్తూ యేదోఒక చిరుతిండి తెచ్చేవాడు. మిత్రులు ముగ్గురూ కూర్చొని కబుర్లుచెప్పుకుంటూ అల్పాహారం ఆరగించేవారు.

ఇప్పుడు మా షా కూ డా ఆర్జించుతోంది. మతిస్సా ఆమెకి కాగితపుపువ్వులు కత్తిరించికట్టడం నేర్పింది. మాషా రంగుకాయితాలతో గులాబీ, చామంతి వగైరా పూలు తయారుచేసి అమ్ముతోంది. రోజు కేడెనిమిది అణాలకు లోటులేకుండా తెచ్చుకుంటోంది. ఈ పని చెయ్యడంలో ఆ మించుబోడిమనసుకూడ లగ్నమయ్యేది.

సంధ్యాసమావేశా లెప్పుడూ మాషా గదియందే జరుగుతూండేవి. ఇలియా జాకోబులు బల్లమీద తనాయించి కూర్చొనేవారు. పొద్దుపోయేదాకా టీకప్పులు చేత్తో పట్టుకొని పిచ్చా-పాడీ మాట్లాడుకొంటూ కాలక్షేపంచేసేవారు. ఇలియా తన అమ్మకాన్నిగురించీ, తాను చూచిన విశేషాలూ వర్ణించి చెప్పేవాడు. జాకోబు గ్రంథవిమర్శ

చేస్తూండేవాడు. హోటలుసంగతులుకూడ చెప్పేవాడు. నిత్యము వాడు తన తండ్రి నేదోఒకకారణంతో నిందించకుండా వుండేవాడు కాదు. అప్పుడప్పుడు మాషా ఇలియాలకర్థంగాని జటిలసమస్యల్ని చర్చకుతెచ్చేవాడు. మాషా పంగలంతా గృహకృత్యాల్లోను, పువ్వులు కట్టి అమ్ముకొనటంలోను నిమగ్న అయి వుండుటచే గుమ్మం దాటి యెక్కడికీ వెళ్లేదికాదు. మరి తానేం చెపుతుందాగోల! వారిద్దరిమాటలు వింటూ మధ్య మధ్య నవ్వేది. తనవంతుపనిని—తేనీరు కాచియివ్వడంమాత్రం అతి శ్రద్ధగా నిర్వహించేది.

ఆ చిన్నగది - ఎన్ని లోపాలున్నా - ఆనందానికి నిలయం. వారి కందులో చేకూరిన శాంతి-సుఖాలు మరెక్కడా దృగ్గోచరమయ్యేవికావు. అక్కడ కూర్చొని పారపొచ్చాలెరుగని యీ మిత్రత్రయం యెన్నెన్నో పవిత్ర సుఖచిత్రాలు చిత్రించుతూండేవారు.

ఫర్ఫిష్కా యెప్పుడయినా వస్తే వారికి యెడంగా కూచునేవాడు. మాషా రొట్టె, టీ వాడిముందు పెట్టేది. కూతురు చూపే దయకు మూకభావలో కృతజ్ఞతను ప్రకటించేవాడు.

ఫర్ఫిష్కా పిల్లల్తో ఆట్టే మాట్లాడేవాడు కాదు. కాని, ఆరంభించితేమాత్రం కోడికూయువలసిందే. ఒకనాడు సాపాటు అయినతర్వాత పిల్లలతో చెప్పనారంభించాడు—

"మానవజీవితము నానాటికి సుఖప్రద మవుతోంది. మీవయసులోవుండగా నాకు సుఖం స్వప్నంలోకూడా గోచరించేది కాదు. నిత్యము తగిలే చెప్పుదెబ్బలతో వీపు అట్టకట్టింది. మొదట్లో పెడబొబ్బలుపెట్టేవాణ్ని; కాని, క్రమంగా అలవాటయి ఒళ్ళు బండబారిపోయింది. ఆచెప్పు కెప్పుడూ విశ్రాంతివుండేదికాదు. అప్పటి నా జీవితానంద మంతా ఆ పాదరక్షతోనే. ఇదీ నా బాల్యస్మృతి. మీరు పెద్దవాళ్ళయితే మీచిన్ననాటిస్మృతి చాలా ఆనంద దాయకంగావుంటుంది. నాకిప్పుడు ముప్పైఆరేళ్ళు వచ్చినయి. నా యీ గతజీవితంపైకి దృష్టిని సారించితే యెక్కడా కాంతిరేఖ కన్పించదు. ఆదినుండి అంతంవరకు గాఢాంధ కారమే. కళ్ళు, చెవులు వుండిన్నీ నేను గుడ్డివాడినే. చలి, క్షుద్బాధలచే నా దంతాలు కటకటలాడటము, దెబ్బలబాధ నోర్వలేక యేడ్చినందున ముఖం కంది వాడిపోవటము మాత్రం నా కిప్పటికీ జ్ఞాపకమున్నై. నాఒంటిమీద కొరడా మాత్రిం మెప్పుడూ పడలా. ఇక తతిమ్మా దండన లేవీ తప్ప లేదన్నమాటే. మావాళ్లు దయాదాక్షిణ్యాలు లేకుండా బాదేవారు. వాతలుకూడా పెట్టారు. అయినా మొండినై బ్రతికాను. నిజంగా మానవుడు బలే విచిత్రజీవి! పిండి-పిల్చి పిప్పిచేసినా ప్రాణాన్ని వుంచితే చాలు; లేచి నిలబడతాడు. నన్నే చూడండి! చిత్రహింసలకు, కఠినదండనలకు గురి అయ్యానా! మళ్ళీ యెప్పటిలాగే దుక్కలా తయా

రయ్యాను.......... నే నెందుకూ విచారించను; కాని, కేవలం పొట్టకోసం పరుగులుతీస్తాను. భగవత్కృప నాపై నుంది. నన్నుచూచి నవ్వి వదిలేశాడు.''

ఫర్ ఫిష్కా మాటలు వింటూ పిల్లలు కడుపుబ్బ నవ్వారు. ఇలియాహృదయంలో మళ్లీ ఆలోచన మొలకెత్తింది. ''నీ కోరిక యేమి?'' టని ఫర్ ఫిష్కా నడిగాడు.

''బ్రాంది కావాలనుంది. దానికోసం తహతహలాడుతున్నాను.''

''నవ్వులాటక్కాదు. నిజంగా నీ మనసులోవున్న కాంక్ష యేమిటో చెప్పు''మని మళ్ళీ అడిగాడు.

''నిజం చెప్పమంటావా? అయితే విను—నాకొక మంచి సితారను సంపాయించుకోవాలని వుంది. పది రూపాయలు యెల్లాగైనా చేతికివస్తే కొనుక్కొని ఆనందంగా గడిపేస్తాను.''

ఈ మాటలని ఫర్ ఫిష్కా కిలకిల నవ్వాడు. నవ్వాపుకొని మళ్లీ యిల్లా చెప్పాడు:

''కాదు ఇలియా! నాకు సితారు అక్కర్లా. అసలే తాగుబోతును. ఎప్పుడో కక్కుర్తిపడి దాన్ని అమ్మివేయననే నమ్మక మేమిటి? అదీగాక కొత్తది యిప్పుడున్న సితారుకంటె బాగా మోగుతుందనిమాత్రం పూచీయేముంది? ఈ సితారుమీద నా వ్రేళ్ళాడితే చాలు; దాన్నుంచి వెలువడే మధురధ్వని మనసు కూరటకలిగించి ఉర్రూతలూపుతుంది.

ఇల్లాంటి దీ ప్రపంచంలో యింకొకటుండదని ఘంటాపథంగా చెప్పగలను. ఈ సితారు కూడ నా ప్రియసతిలాంటిదే. అదృష్టవశాత్తు పతిభక్తిపరాయణ యైనభార్యే నాకు లభించింది. ఆమె అందరు స్త్రీలలాంటిది కాదు; దేవీ సమానురాలు; కాని, 'బ్రతుకనిబిడ్డ బారె' డన్నట్లు నడి కారులోనే చచ్చిపోయింది. కావాలనుకుంటే నాకిప్పుడైనా మరో పిల్ల దొరక్కపోదు; అయితే నా దూనియా గుణాలు కలది ప్రాప్తించటము కలలోమాటే. ఎవతెకో పుస్తెకట్టి తెచ్చుకోవడం నా మెడకి డోలుతగిలించుకోవడమేగా."

ఫర్‌ఫిష్కాసితారు అల్లాంటిదే; కాని, యీవిషయా లేవీ ఇలియూమనసుకుపట్టలా. వా డేదో జిజ్ఞాసతో సతమత మవుతున్నాడు. ఫర్‌ఫిష్కాహృదయంలో యే ఆకాంక్షా లేదంటే నమ్మలేకపోతున్నాడు. కాంక్షారహితుడై కేవలం తాగుడుతో యెల్లా జీవించగల్గుతున్నాడా అని వానికి సందేహంకలిగింది. కోరిక లేకపోవటమే వాస్తవమయితే వానిని పిచ్చివాడుగా భావించవచ్చునుకున్నాడు. అయినా ఫర్‌ఫిష్కా యెందువల్లనో వాని నాకర్షించుతున్నాడు. తాగుబోతయినా చాలమందికంటె ఫర్‌ఫిష్కాయే విశాల హృదయుడనీ, సాధు స్వభావంకలవాడనీ ఇలియూ భావించు తూండటమే ఆ ఆకర్షణకు హేతువేమో!"

ఇలియూ, జాకోబు, మాషా లొక్కొక్కప్పుడు అసా ధారణవిషయాలను చర్చించేవారు. అవన్నీ జాకోబు మస్తిష్కం

లోనుంచే దిగుమతిఅయ్యేవి. "మన మందరము నిద్రలో వున్నప్పుడు మనసు ఎక్కడికి పోతాయో!" నని జాకోబు కొత్తసమస్య నొకదానిని లేవదీశా డొకనాటి రాత్రి.

ఇలియా కిల్లాంటి చర్చలంటే తలనొప్పి. వాటి మూలంగా తన హృదయం యెక్కడ కల్లోలమవుతుందో నని వానిబెదురు. అందుచే "నాకు తెలియ"దని తప్పించుకో జూచాడు.

"నిద్రించేటప్పుడు మనసు సంచారంచేస్తుందని చాలామంది చెపుతూంటారు." అన్నాడు జాకోబు.

"నిజమే"నంది మాషా.

"అందుకు నిదర్శనమేమిటి?" ఇలియా అడిగాడు.

"మనస్సు కోతిలాంటిది. ఎప్పుడూ దాడుతీస్తుంది. అందువల్లనే మనకి రకరకాలకలలు వస్తుంటాయి." అని జాకోబు చెప్పాడు.

ఇలియా జాకోబుఅన్నదానిని కాదనాలనుకున్నాడు; కాని, ఏం చెప్పాలో తోచక తూష్ణీంభావము వహించాడు. ఒకక్షణం నిశ్శబ్దంగా వుంది. అక్కడున్న దీపం బయట నుంచి లోపలికి చొరబడిరాబోతున్న గాఢతిమిరాన్ని వెనక్కి తరిమివేస్తోంది. ఆని స్తబ్ధతను చీల్చుకొంటూ జాకోబుకంఠస్వరం మళ్లీ వినవచ్చింది.

"మన కళ్లముందు జీవి చలించుతున్నా, పనిచేస్తున్నా ప్రాణమున్నదంటాము. ఆ జీవే మరుక్షణంలో అచేతనమై పడివుంటే ప్రాణంపోయినదంటాం. దీని భావమేమిటో!"

"ఏముంది, వృద్ధాప్యంలో ప్రతిజీవి మృతిచెందడం సహజమేగా" అన్నాడు ఇలియా.

"మరి పిల్లలూ, పడుచువాళ్ళూకూడా చచ్చిపోతుంటారే! దానికేం చెపుతా"వన్నాడు జాకోబు.

"వాళ్ళకి జీవించటానికితగ్గ శక్తి-సామర్థ్యాలు లేక మృత్యుముఖంలోపడుతున్నారు."

"అయితే అంతవరకు ఎందుకు బ్రతుకుతారు?"

ఇలియాకు కోపం వచ్చింది. అయినా "వాళ్ళకు జీవితంమీద మోజుంది. అందుచే జీవితపోరాటంలో ముందుకు వురకటానికి కృషిచేస్తూనేవుంటారు." అన్నాడు విసుగ్గా.

"పేదలవిషయంలో అంతే కావచ్చు; కాని, ధనికులు భాగ్యవంతులుకూడా నిరంతరము తాపత్రయపడుతారెందుకు? భగవంతుడు వారికి సిరి-సంపదలు సమృద్ధిగా యిచ్చాడుగా!"

"ఏం చిత్రమైన ప్రశ్న! నువ్వన్నట్టు శ్రీమంతులు విరాగులే అయితే పేదవాళ్ళకు బ్రతుకు తెరువేదీ? వాళ్ళెవరి పన్లు చేస్తారు?"

జాకోబు కేమీ స్ఫురించలా. ఆలోచనలోపడ్డాడు. కొంచెమాగి "అయితే మానవులు పనిచెయ్యడానికే బ్రతుకుతున్నారంటావా?" అనడిగాడు.

"ఆ, అంతే; కాని, అందరూ అందుకే కాదు. కొందరు పనిపూర్తి చేసుకొని కష్టార్జితాన్ని అనుభవించు తుంటారు. అందుకోసమే వారు జీవించుతారు."

"అల్లా యెందుకు జీవించాలి?"

"ఓరి తిక్కశంకరా! అందరూ జీవించాలనే కోరుతారు; జీవిస్తున్నారు. ఎందుకు జీవించాలనే ప్రశ్నేమిటి? నువ్వెందుకు జీవించుతున్నావో చెప్పు?"

జాకోబు ప్రశ్నలతో ఇలియాకు ఒళ్ళుమండుతోంది. వానికోపానికి కారణం అనూహ్యం. ఏమయినప్పటికీ వాని హృదయంమాత్రం ఆ చర్చతో వికలమయింది.

"నే నెందుకు జీవించుతున్నానో కారణం చెప్పలేను. చావంటే నాకు భయమే; కాని, దూరంగా పారిపోను. మొత్తంమీద యీ విషయాలన్నీ బలే మజాగా వుంటై." అని ఒక చిటికపా టాగి జాకోబు నిమ్మళంగా మళ్లీ సాగించాడు—"నీకు కోపం వచ్చినట్టుంది; కాని, అందుకు నాకేమీ హేతువు కన్పించటంలేదే. సావధానంగా ఆలోచించు. మానవులు పనిచేసేందుకే జీవించుతున్నారు; పని మానవులకొఱకే యేర్పడుతోంది. ఈ చక్రం నిరంతరము గిరగిర తిరుగుతూనేవుంది; సరే, మరి దానికి అంత మెప్పుడు? దాని ప్రయోజనం యేమిటి? అసలన్నిటికి మూలాధారము పరమేశ్వరుడు గద! ఆయన యెక్కడున్నాడు? దేవుడు 'మీరు పెరిగి పెద్దవాళ్ళయి ఫలించి వృద్ధిచెందండి' అని

ఆదం, పాపాలకు సెలవిచ్చాడు; కాని, ఆ వృద్ధికావట మెందుకో స్పష్టంకాలేదు. భగవంతుడదికూడ చెప్పాడు. కాని, ఆ వాక్యం మధ్యలోనే హరించబడింది. దాన్ని మ్రింగివేసిన చోరుడు సైతానే. అందువల్ల ఆ పై వివర మెవరికీ తెలియకుండాపోయింది.''

జాకోబువాదనకి పూర్వాపరసందర్భం లేదు. అయినా ఇలియా మనసు నది కల్లోలపర్చింది. అంతా విన్నాడేగాని మాట్లాడలేదు. జాకోబువాగ్ధోరణి ఇంకా సాగుతూనేవుంది.

''భగవంతుడు మననుంచి కాంక్షించేదేమిటి?'' అని ఆవేశంతో జాకోబు లేచి నిలబడ్డాడు. అంతలో శాంతించి మెల్లగా చెపుతున్నాడు. మాషా వానివంక వింతగా చూస్తోంది. ఇలియా అక్కసుతో వికార చేష్టలుచేస్తున్నాడు. జాకోబుచెప్పేది అర్థంకానప్పుడు విసుక్కుంటున్నాడు. వాడు జాకోబు నెప్పుడూ తనకంటె మందబుద్ధిగా యెంచేవాడు. తానెంత కుశాగ్రబుద్ధి ననుకున్నా జాకోబు వాక్పటిమ చూచి డంగయిపోతున్నాడు. కడుపుబ్బుపట్టలేక ''రాత్రింబగళ్ళు యెన్ని పుస్తకాలు రుబ్బితేమాత్రం మట్టిబుర్రకేం తెలుస్తుంది? అడివి దున్నపోతు!'' అని కారాడ్డి మాడాడు.

''నేనుమేధావంతుడి నన్నానా? నాకేమీ తెలియకనేగా యింతగా నీతో చర్చించటం!'' అన్నాడు జాకోబు.

ఎమీ తెలియదని స్పష్టంగా చెప్పేసి వూరుకోరాదూ? చర్చించితేమాత్రం శుద్ధ మొద్దుకి నీకేం తెలుస్తుంది?

కూజాలోనీళ్ళొలికినట్టు బడబడ యీ వాగుడెందుకు? వినే వాళ్ళకు విసుగుకలుగుతుందేమో నన్న జ్ఞానమే లేదు.''

అదీ ఒక సమస్యే. ఏవిషయంగాని తెలుసుకోవటం అనుకున్నంత సులభంకాదు. ఉదాహరణకు ఈదీపాన్నే తీసుకోండి. దానిజ్యోతి రెప్పపాటులో ప్రకటితమవుతుంది. మళ్లీ క్షణంలో అదృశ్యమైపోతుంది. అగ్గిపుల్ల గీసి ముట్టించితే కన్పిస్తుంది; నోటితో ఉఫ్ అంటే మాయమవుతుంది. కాబట్టి జ్యోతి యెప్పుడూ వుండివుంటుందనే సంగతి స్పష్టమే. కాని, అది యెక్కడుంటుందో యెవరయినా చెప్పగలరూ?''

ఇలియా ఆలోచనలోపడ్డాడు. వానివిసుగు, కోపం యెగిరిపోయినై. తదేక దృష్టితో దీపంవంక చూస్తూ యోచించసాగాడు.

''జ్యోతి అగ్గిపుల్లలో వుంటుం''దని మాషా చులాగ్గా చెప్పేసింది.

ఆమెమాటు నిద్దరూ పెడచెవిని పెట్టారు. జీవిత రహస్య విషయాలు, వైజ్ఞానిక విషయాలను చర్చించే సందర్భాల్లో వాళ్ళామెమాటల నెప్పుడూ లక్ష్యపెట్టరు. అందుకు మాషా కూడ నామోషీగా భావించదు.

''జ్యోతి యెందులో అంతర్భూతమైవుంటుందో నేను చెప్పలేను. తెలుసుకోవాలన్నకుతూహలం కూడ నాకు లేదు. జ్యోతివల్ల ప్రయోజనమున్నదనీ, దాన్ని ముట్టుకుంటే కాలుతుందనీ తెలిసినమట్టుకు సంతృప్తి పడుతాను.'' అన్నాడు ఇలియా.

"నీసమాధానం అతి పేలవంగా వుంది. ఇల్లాంటి జవాబు నెవరయినా యివ్వగలరు; అయితే ఇది అసలు సమస్యకు సమాధానమేనా? మంట యెక్కడనుంచి వస్తుం దన్న సమస్య అల్లాగే వుంది. రొట్టెసంగతి తీసుకో! దాని విషయంలో అలాంటి శంకలకు అవకాశమే లేదు. దాని మూల పదార్థాలన్నీ స్పష్టంగా కనపడుతాయి. విత్తులో అంకురము, దాన్నుంచి మొక్క, మొక్కవల్ల గోధుమలు, వాటిమూలంగా పిండి, పిండితో రొట్టెలు తయారవుతాయి. మరి మనిషి యెల్లా తయారవుతున్నాడో!" అని జాకోబు యింకొక సమస్య నెత్తాడు.

ఇలియా తెల్లపోయి చూచాడు. ఇల్లాంటి అపూర్వాలోచనలు జాకోబు బుర్రలో యెల్లా పుడతాయా అని ఆశ్చర్య పడ్డాడు. తన కేమీ సమాధానం తోచక "నువ్వు నా బుర్రనుకూడ పాడుచేస్తున్నావు. పనీ-పాటూ లేక వెర్రి మొర్రి విషయా లాలోచించుతావు. ఒళ్లొంచకుండా కూడూ, గుడ్డా దొరుకుతున్నాయిగా! నీకు చింతేముంది? నా మాదిరిగా నువ్వూ నెత్తిమీద బరువెత్తుకొని వీధివీధిని తిరిగితే మెదడు పాటునబడి తాలాతోకాలేని యీఆలోచనలు తట్టవు. గొప్పవాడి నెప్పు డయిపోదామా అని ఆరాట పడుతు న్నావులే. నీ అస లేదు పదీ!" అని చెడామడా అనేశాడు.

వాళ్ళిద్దరూ అర్థంకాని నిగూఢవిషయాలను మాట్లాడు కొంటూంటే మాషాకి నిద్రజోకింది. మెల్లగా లేచిపోయి పక్కమీద వాలింది.

"చాలా ప్రొద్దుపోయింది. ఇక పోయి పడుకుందా" మన్నాడు ఇలియా.

"కొంచెం ఆగు; మా షా కు దు ప్ప టి క ప్పి, దీప మార్పేసి వెళ్దాం" అని జాకోబు లేచాడు.

ఇ లి యా తలుపుదగ్గరకు వెళ్ళటం చూ చి "నేనూ వస్తున్నా నుండు; కటిక-చీకటిగా వుందల్లేవుంది; నాకు భయ మేస్తుంది" అన్నాడు జాకోబు

ఇలియా హేళనగా నవ్వుతూ "పదహారేళ్ల పడుచు కుర్రాడివి; ఇంకా భయమేనా? ఎక్కడికైనా సరే నేనొక్క డినే వెళ్తా" నన్నాడు ఇలియా.

జాకోబు మాట్లాడలా. మౌనంగా మాషాకి పచ్చ డము కప్పి, దీపమార్పాడు. తలుపును చేరికగా లాగి ఇలియా చెయ్యి గట్టిగాపట్టుకొని బయల్దేరాడు.

---

# 11

ఒకనాటి మునిమాపువేళ ఇలియా క్షుభితహృదయం తోను, విషణ్ణవదనంతోను యింటి కొచ్చాడు. వానికి తల తిరుగుతోంది. మేను కంపించుతోంది. ఏదో చేటు మూడి వుంటుందని వానిముఖమే చెపుతోంది.

ఆరోజున ఇలియా సర్కసుమైదానములో వస్తువు లమ్ముకుంటున్నాడు. బీటుజవాను తన మామూలు చేతిలో వేసికొని ఇలియాను విడిచిపెట్టాడు. కొంతసేపటికి పోలీసు ఇనస్పెక్టరు అనూహ్యంగా తనిఖీకి వచ్చాడు. అతడు ఇలియాకు నాలుగు లెంపకాయలిచ్చి, బండబూతులుతిడుతూ సామానులను అటూయిటూ గిరాశేశాడు. చాలావస్తువులు దుమ్ముకొట్టుకొనీ, విరిగీ, పగిలీ పాడయిపోయినయి. ఇలియా బిక్కమొగంవేసి అతికష్టంతో అన్నిటిని యేరుకొని అధి కారితో "మీరిలా చెయ్యటం ధర్మంకాదు. తప్పంటే లాప్రకారం నన్ను శిక్షించాలి; గాని, యిల్లా చేయిచేసు కోటానికీ, నావస్తువులను విరజిమ్మి నష్టపరచటానకీ న్యాయ శాస్త్రం మీకు అధికారమిచ్చిందా?" అనడిగాడు ధైర్యం చిక్కబట్టి.

ఒక చిల్లరబేరగాడా విధంగా జంకుగొంకులేకుండా పొగరుబోతుతనంతో యెదిరించి మాట్లాడుతూంటే పోలీసు

ఇనస్పెక్టరులాంటి హోదాగల అధికారి యెల్లాసహించగలడు! అతనికి అరికాలిమంట నెత్తికెక్కింది. ఇలియాజుట్టుపట్టుకొని బూటుకాలితో మళ్ళీ రెండు తాపులు తన్ని కానిస్టేబులుకు వప్పగించాడు. అంతకుముందు లంచంపుచ్చుకున్న బీటుజవానే ఇలియాను తీసుకొనిపోయి 'లాకప్పు'లో నిర్బంధించాడు. పగలంతా కూడూ నీళ్ళూ లేకుండా కొట్టులోవుంచి సాయంత్రం వదిలేశారు. ఇలియా తలవ్రేలాడవేసుకొని, కాళ్ళీడ్చుకొంటూ యింటికి చేరాడు.

ఇంతకుపూర్వంకూడ అనేకతడవలు ఇలియాకు పోలీసులతో ఘర్షణజరిగింది; అయితే యిప్పటిలాగా లోగడ యెన్నడు నిర్బంధింపబడియెరుగడు. యింతగా అవమానింబడినదీలేదు. నేడు వాని హృదయము పరాభవాగ్ని జ్వాలలచే భగభగమండుతోంది. పక్కమీద పడుకొని నాటి సంఘటనను గురించి పరిపరివిధాల తలపోస్తున్నాడు.

ఇటు ఒక సామాన్యసంఘటనకారణంగా ఇలియా కిసమిస చెందుతున్నాడు. సరిగా అదే గోడకవతలి ప్రక్కన హోటలులో అంతకంటె క్షోభింపజేసేదీ, భీభత్సమునైన అభినయము జరుగుతోంది.

హోటలుగంద్రగోళంతో చెవులు చిల్లులుపడుతున్నై. 'రొట్టె తే, మాంసం తీసుకురా, బ్రాందియియ్యి' అనే కేకలు ప్రతిధ్వనించుతున్నాయి. సర్వర్లు చకచకా అందిస్తూనే వున్నారు. టేబిలుమీద డబ్బులు ధ్వనిచేస్తూనేవున్నై.

ఒకడు రాగాలాపనసాగించాడు. పక్కవాడుకూడా స్వరంమేళవించాడు. ఇద్దరూ స్వరంలోస్వరం కలిపి

"జీవితమందలి అనుపమఘడియలు
చింతతో చీకుతు గడిపేశాం" అని పాడారు.

"అంతా అబద్ధం! పచ్చి అబద్ధం!! 'నా ఆజ్ఞలను ధైర్యంతో అమలు జరిపితే మిమ్మల్ని కష్టాలనుంచి కాపాడుతా' ననలా యేసుక్రీస్తు" అని యెవడో మూడో వ్యక్తి కర్కశకంఠంతో అరుస్తూ పాట కడ్డొచ్చాడు.

నాలుగోమనిషి అందుకున్నాడు— "నీ వసలె శుద్ధ అబద్ధాల కోరువు. 'మీ రొకసారి అటు, ఒకపరి యిటు తిరుగుతున్నారు; అందుచేతనే మిమ్ము దూరంగా తన్నేస్తున్నా'నని నువ్వు చెప్పినమాటలకు దిగువనే రాసిలేదూ?"

రెండోవ్యక్తి వికటంగానవ్వి "నాకిష్టమయిన చోటునల్లా ముద్దెట్టుకున్నాను; లెక్కలేనన్ని ముద్దులు!" అన్నాడు.

నాలుగోమనిషి కిలకిలా నవ్వాడు.

"ఆముదుగుమ్మ క్రిందపడినా నేను వదల్లా. ముద్దులాడుతూనే వున్నాను."

"వహ్వా! ఏం మొనగాడివోయ్!" అన్నాడు మరో తాగుబోతు.

మూడోవ్యక్తి అన్నాడు—" అందులో తప్పేముంది? ఎవడయినా అల్లా చేయవలసిందే. ప్రేయసి మీద సర్వ హక్కులూ వుంటయ్.

"దానిపర్యవసానం యేమిటో తెలుసా? కఠినశిక్ష తప్పదు. డేవిడ్ రాజుశాసనాన్ని మర్చిపోయావా?" అని నాలుగోమనిషి అడిగాడు.

ఇలియా తనగదిలోనుండి యీ సంభాషణ నాలకించుతూనేవున్నాడు; కాని, వాని ధ్యాస అటులేదు. ఇలియా కళ్ళముందు పోలీసుఇన్స్పెక్టరుభయంకరాకృతి వికటాట్టహాసం చేస్తోంది.

ఉన్నకొద్దీ హోటలులో గల్లంతు, పాటలు రెచ్చిపోతున్నై. "ఇప్పుడు కమ్మనిపాటలే పాడుతున్నారు. ఆధ్యాత్మికవిషయాలు చర్చించుతున్నారు. కాని, కైపు తలకెక్కినతరువాత ఒకరినొకరు తిట్టుకుంటారు; వాదులాడి గుద్దుకుంటారు. ఏమిటీ దౌర్భాగ్యపుస్థితి!" అనుకున్నాడు ఇలియా తనలో.

మళ్ళీ పాటవినపడింది.

"చరచర మేఘాల్ తరుముకు రాగా
చాటుకు పోయెను మా భాగ్యం"

ఇలియాకా పాటలో "నాజీవితమంతా వెతికినా యెక్కడా కాంతిరేఖ కనపడలే"దన్న జర్మియామాటలు జ్ఞప్తికొచ్చాయి.

'ముసలిజర్మియా దైవభక్తి కలిగివుండిన్నీ డబ్బును కూడబెట్టుటలో యెవరికీ తీసిపోలేదు. బాబాయికి పాపభీతి వున్నా జర్మియాసొమ్ము నపహరించాడు. దీనినిబట్టి ప్రతి

మనిషికి రెండురూపా లున్నట్టు విదితమవుతోంది. మనిషి మనస్సు ఒకసారి ఒకవేపుకు, మరోసారి వేరొక ప్రక్కకు మొగ్గుతుందన్నమాట. అదే పాప-పుణ్యాల బరువును తెల్పే ముల్లు.

ఈవిధంగా ఇలియా వితర్కించుకుంటూండగా హోటల్లో యేదో గచ్చుమీద పడి ఖంగుమని మోగింది. ఆధ్వని హాలులో ప్రతిధ్వనించింది. అందరూ నివ్వెరపడి అటువేపు చూచారు.

హోటలులో మళ్లీ కిలకిలలు-కేరింతలు, గంతులు-తందనాలు అతిశయించాయి.

ఇలియాకు నవ్వొచ్చింది. తా ననుకున్నట్టే జరుగుతోందనుకున్నాడు. ప్రక్కకొత్తిగిలి ఆలోచనలోమునిగాడు.

"అంటాయిప్ తాత చేసినపాపం చాలా ఘోరమైనదయివుంటుంది. మహాపాతకుడయినందువల్లనే యేకదీక్షతో యెనిమిదేండ్లు తపస్సుచేయాల్సివచ్చింది. మొత్తంమీద తుదకు ప్రజ లాయన్ను క్షమించారు; ఆయన దురాగతాలన్నీ మర్చిపోయి వారినామధేయాన్ని భక్తితో స్మరించసాగారు; కాని, ఆయనసంతానాన్ని సర్వనాశనం చెయ్యకుండా వదల్లేదు; పెద్దకొడుకును దేశబహిష్కారం చేయించి, రెండో కుమారుని వూళ్ళోనించి తరిమేశారు. విధివిలాస మెంత చిత్రంగావుంది!"

ఇలియా ఈవిధంగా భావనావీధిలో విహరించు తూండగా చేపలదుకాణపుయజమాని 'లెక్క ప్రకారం నడుచుకోవాలి. తొమ్మండుగురు దుష్టులై ఒక్కడే మంచి వాడయితే వాడు రసాతలానికిపోవలసిందే. అట్టివానికి లోకంలో స్థానం లేదు. బహుజనాభిప్రాయమే అనుసరణీయము, విధాయకమూ'నని వుగ్గడించినపల్కులు స్మృతిపథంలోకి వచ్చినయి.

న్యాయానికి కూడు, ధర్మానికి తావు, నిజానికి ఆదరణా లేని యీ తుచ్ఛసమాజంపైని ఇలియాకు రోత కలిగింది. క్రోంద్రించి వుమ్మివేశాడు. వానిహృదయము పగబట్టినత్రాచువలె బుసకొడుతోంది. కళ్ళముందుజరిగిన ఘుటన లొకటొకటిగా వానిమనోవీధిలో సంచరించ సాగాయి.

ఇంటిమొగదల అరుగుమీదకూచొని మతిస్సా కుమిలికుమిలి యేడుస్తోంది.

ఫర్ఫిషాక్ ఆమెకెదురుగా నిలబడి వెకిలిగా నవ్వుతూ ఈ రంకులాడి తనకీ గతిని చేజేతులా తెచ్చుకొన్నదే'' నంటున్నాడు.

పెట్రుహా దూరాన్నుంచే వారిద్దరిని గాంచి పకపకా నవ్వుతున్నాడు.

ఇలియాదృక్పథంలో యిల్లాంటిచిత్రాలొకదాని వెనుక మరొకటిగా దొర్లిపోతున్నై. వానిగుండె కరుడుగట్టి శిలాసదృశమయింది.

కొంత సేపటికి హోటలులో సద్దణిగింది. ఒకరిద్దరు మాత్రం గునుస్తున్నారు. ఒకడు హార్మోనీ వాయించుతున్నాడు. దానినుంచిగార్దభస్వరం వినవస్తోంది. అదయినా ఎంతోసేపు లేదు. ఇలియావున్న గదిగోడ నానుకొని యిద్దరు వ్యక్తు లేదో మాట్లాడుతున్నారు. వారిసంభాషణ ఇలియాకు వినపడుతోంది.

"మన జీవితా లిల్లా గడిచిపోవలసిందేనా? రెక్కలిర గ్గొట్టుకుని చాకిరీచేసినా ఫలితమేమీ దక్కదయ్యే. కొందరు కోట్లు మూలుగుతుంటే హాయిగా అనుభవిస్తూ కులుకుతున్నారు. మరి మన కర్మమేమిటో, మనస్థితి రోజురోజుకూ దిగనారిపోతోందిగదా!" అన్నాడు ఒకడు.

"అవును, నిజమేరా" అని రెండో వ్యక్తి పై వానితో యేకీభవించాడు.

"ఈ అనంతప్రపంచంలో జీవితసంఘర్షణవల్ల యేదీ స్పష్టంగా తెలియకుండావుంది. నీతిగా బ్రతకాలనుకొనే వాడు బాగుపడటం సున్నా అనిమాత్రం స్పష్టమవుతోంది. నమ్మకంగా పనిచేసేమనిషి నిరంతరము సావధానుడై జాగ్రత వహించాల్సివస్తోంది.

"అయినా మనకు గత్యంతరమేమున్నది?"

దారి లేకేం గాని, స్వామిద్రోహం చెయ్యటానికి సర్వసామాన్యుల్లో అరుదుగావుండే ధైర్య—సాహసాలు కావాలి. యుక్తికూడా అవసరమవుతుంది.

"ఓయి దేవుడా!" అని రెండోవ్యక్తి నిట్టూర్చాడు.

ఇలియాకూడా దీర్ఘంగా నిశ్వసించాడు.

అప్పుడే హోటలులో ఫర్ఫిష్కా కేక వినపడింది. "ఒరేయి, నికిటా! జాడీలోదంతా గుమ్మరించి యివ్వరోయ్! రేపటిసంగతి ఆలోచించేవ్! ప్రాణం గుటుక్కుమనేదాకా కులాసాగానేవుండాలి. మద్యము, ఆనందము యివేగా జీవిత సారాలు! జేబు గలగలలాడుతున్నంతసేపు మస్తుగా తాగి మజాచెయ్యాలి."

ఈమాటలు కక్కుడి వారందరు పకాలున నవ్వారు. "భేష్, భేష్! శెబాష్! బలే, బలే!" అన్నారు.

గోడనానుకొనికూచున్నమనిషి మళ్ళీ ప్రారంభించాడు.

"నేను గోచీపెట్టినప్పటినుంచి కష్టపడుతున్నాను. చూస్తూచూస్తుండగానే నలభైయేళ్ళు దాటిపోయాయి; ఇన్నాళ్ళలో ఒకనాడూ సుష్టుగా కమ్మనిపదార్థం తినెరుగను. ఆపదలకు అంతూపొంతూ లేదు. సుఖమనేది యెల్లావుంటుందో! కొంప నరకకూపమే. పిల్లలు బీరకాయపీచు. వాళ్ళ యేడుపులు-బొబ్బలు, భార్యవిసుగూ-సాదింపులతో నిలువునా నీరయిపోతున్నాను. ఎవడయితేమాత్రం యెన్నాళ్ళని యివన్నీ అనుభవించగలడు? దారిద్ర్యాంధకారంలో దారీ-తెన్నూ గానక మానవుడు దుఃఖోపశమనానికి, మనశ్శాంతికి తప్పుదారితొక్కి దురలవాట్లకు లోనవుతున్నాడు. ఆవిధంగా పతనమై సర్వనాశనం చేసుకొంటున్నాడు."

"నువ్వు చెప్పింది అక్షరాలా నిజం."

"మనము పగలూ, రాత్రీ దేవుణ్ని స్మరించుతున్నాము; మనయిక్కట్లను మొరపెట్టుకుంటున్నాము; కాని, ఆయన మనగోడు నాలకించుతున్నట్టే లేదు."

"అవును, అలాగే కన్పిస్తోంది."

నిరాశతో నిండియున్న యీ సంభాషణ ఇలియాకు మనస్తాపం కలిగించింది. పక్క మీద దొర్లుతున్నాడు. ఆ నిస్పృహలో వానికాలు గోడకు తగిలింది. అంతే, ఆపైన మళ్ళీ వారిసంభాషణ వినపడలేదు.

ఇలియా యిక పక్కమీద పడివుండలేకపోయాడు. లేచి బయటికి వెళ్ళాడు. ఎక్కడికయినా పోవాలనిపించింది; కాని, యెటువెళ్ళడానికీ తోచలేదు. అప్పటికి చాలా ప్రొద్దుపోయింది. మాషా నిద్రపోతూ వుంటుంది. జాకోబు తలనొప్పితో పడివున్నాడు. అసలు వానివద్దకి పోవాలనే లేదు ఇలియాకి; వెళ్తే పెట్రుహా ముక్కుపట్టుకుంటాడని భయం! శీతరాత్రి. కొరుక్కుని తినే చలి. ఓరుగాలి వీస్తోంది. గగనమండలం మేఘావృతమయివుంది. కన్నుపొడుచుకున్నా కనపడని కారుచీకటి.

ఇలియా చలికి వలిగొనిపోతున్నాడు; అయినా గదిలోకి వెళ్ళి పడుండటానికీ యిష్టంలేదు. "ఊరకంగా జీవించడము అసంభవము, దుస్సహము. ఇంతకంటె నరసంచారంలేనిచోట యేకాంతవాసమే మే" లనుకున్నాడు.

ఉన్నట్టుండి "ఎవ రా నిలబడింది?" అని కేక విన్పించింది.

ఇలియా అదిరిపడి "నేను, నువ్వెవరు?"అని ఎదురడిగాడు.

"నేనే మతిస్సాను" అని ప్రత్యుత్తరంవచ్చింది.

"ఇంత రాత్రివేళ బయట యేం చేస్తున్నా" వని ఇలియా అడిగాడు.

"కాలిమీద పుండు లేచి బాధగావుంది. చుట్టూ వాచింది. బాధ భరించ లేక బయటికొచ్చాను."

"అంత బాధగావుంటే ఆస్పత్రికి వెళ్ళకపోయావూ?"

"దగ్గిరా దాపా? నడవ లేక మానుకున్నాను."

"బండిమీద వెళ్ళొచ్చుగా?"

"చేతిలో చిల్లిగవ్వ లేంది ఎట్లా వెళ్ళేది."

అంతలో హోటలుతలుపు తెరువబడింది. ఎవరో ఒక వ్యక్తి తూలుతూ వెళ్ళిపోయాడు. లోపలినుంచి కొద్దిగా సవ్వడి వినిపించింది. కాని వాయు వీచిక లా ధ్వనిని తరుముకొనిపోయినై. హోటలుతలుపులు మూసిన చప్పుడయింది. ఆతర్వాత మళ్ళీ నీరవంగావుంది.

"నువ్విక్కడ నిలబడి వున్నావేం?" మతిస్సా తిరిగి పల్కరించింది.

"నిద్రపట్టక వచ్చాను."

"సరే, నీ స్థితీ నాలాగానే వుందే! ఈదురుగాలి వేస్తోంది; నాగదిలోకి వెళ్ళి కూర్చుందాం రా."

ఆమెనిట్టూర్చడం విని ఒకక్షణమాగి "సరే, పద" అన్నాడు ఇలియా.

ఇద్దరూ బయలుదేరారు. కాలు నొప్పిగావుండటంవల్ల మతిస్సా అడుగులు నిమ్మళంగా వేస్తోంది. ఇలియా అనాలోచితంగానే ఆమెననుసరించాడు. వెళ్ళి గదిలో కిటికీ చెంతనున్న కుర్చీలో కూచున్నాడు. గోడకు వ్రేలాడుతున్న పటంమీద వానిదృష్టిపడింది. "ఎవరి దది?" అనడిగాడు.

"అనీ సాధుది" అని మతిస్సా శ్రద్ధా — భక్తు ల్పుట్టి పడేట్టు చెప్పింది.

"నీ పేరేమిటి?"

"నువ్వెరుగవ్వూ? నా పేరు ఆనీయే" నంది మతిస్సా.

"మతిస్సా అనిమాత్రమే నాకు తెలుసు."

"నీకే కాదు, నా అసలుపేరెవరికీ తెలియదులే!"

ఇలియా ఆమెముఖంలోకి చూశాడు; కాని, యేమి మాట్లాడాలో తెలియలా. మతిస్సాకూడ మౌనంగానేవుంది. కొంచెంసేపయినతర్వాత "ఏం చేద్దాము?" అని తానే ప్రారంభించింది.

"ఏమో నాకేం తెలుసు?" అన్నాడు ఇలియా.

మతిస్సా పేలవంగానవ్వి "నిజమేలే, నీ కేం తెలుసు!" అన్నది.

"మరి?"

"ముందు నాకొక బుడ్డి బ్రాంది తెచ్చిపెట్టు. తింటానికి కూడ యేదయినా తెస్తే మరీ మంచిది. ఆకలి నన్ను దహించి వేస్తోంది. కాలిమీద పుండు లేచినప్పటినుంచి దమ్మిడీ సంపాదన లేదు. ఉన్నది కాస్తా అయిపోయింది. రెండురోజులనుంచి పచ్చిమంచినీళ్ళు మినహా తిన్నదేమీ లేదు" అని మతిస్సా దీనంగా ఇలియూవంక చూచింది.

మతిస్సా పడుపువృత్తితో పొట్టపోసుకుంటోందని ఇలియూకప్పుడు స్ఫురణకువచ్చింది. ఆమెవంక తేరి చూచాడు. మతిస్సానేత్రాలు నిలకడలేనట్టున్నై. ఏదో చప్పరించుతున్నట్టు ఆమెపెదిమలు చలిస్తున్నయి. మతిస్సా దీనస్థితికి ఇలియూహృదయం ద్రవించింది. "ఇప్పుడే తెస్తానుండు"మని లేచాడు.

గబగబా హోటలుముందు కెళ్ళాడు; కాని, లోపలికి వెళ్ళటానికి తటపటాయించాడు. వాకిట్లోనిలబడి ఒకక్షణం ఆలోచించాడు. హృదయంలో ద్వంద్వయుద్ధం సాగింది. తరువాత తెంపుచేసుకొని తలుపు తన్ని లోపలికి వెళ్ళాడు. భోజనపదార్థాలన్నీ పుచ్చుకున్నాడు. బ్రాంది నిమ్మనటానికి సందేహించాడు. ఎన్నడూ తాగియెరుగని తాను బ్రాంది నడిగితే సర్వరు యేమనుకుంటాడోనని వెరిచాడు. తుదకు "నేనొక స్నేహితునికి విందు చేస్తున్నాను; ఒకబుడ్డి బ్రాంది కూడ యియ్యి" అని అడిగేశాడు.

సర్వరు మాట్లాడకుండ బ్రాందిసీసా నందిచ్చాడు.

ఈమాత్రానికే అబద్ధమాడకపోతే వచ్చే ప్రమాద మేమీ లేదని ఇలియాకు తెలుసు. అనవసరంగా అనృత మాడినందుకు ఇలియా ఖేదపడ్డాడు. బిల్లుచెల్లించి బయటి కొచ్చాడు. సవ్వడి కాకుండా అడుగు లేస్తున్నాడు. ధ్వనిఅయితే యెవరయినా చూచి పల్కరించుతారేమోనని జంకు; కాని అప్పుడా సమీపంలో నరసంచారమే లేదు. నిర్విఘ్నంగా మతిస్నాగదిలోకి చేరుకున్నాడు. అయినా యెందుకో తెలియని అజ్ఞాతశంకచే వానిమన స్సాందోళన చెందుతోంది.

మతిస్నా క్షామపీడితలాగా ఇలియా తెచ్చిన పదార్థాలపై విరుచుకొనిపడి లొట్టలేస్తూ బొక్కసాగింది.

ఇలియా తృషితనేత్రాలతో ఆమెమోము నవలోకించుతున్నాడు. ఆ మత్తకాసినిని బాహుబంధంలో బంధించే దెప్పుడాయని ఆరాటపడుతున్నాడు. "ముద్దుపెట్టుకుంటూంటే యెల్లా వుంటుందో! నాకీ విషయంలో బొత్తుగా తెలియదే! నాకే మాత్రం అనుభవములేదనీ, రసికత్వం తెలియదనీ చుల్కనచేస్తుందేమో!"నని మదనపడుతున్నాడు. మనసు వూగిసలాడుతోంది. మెదడు వేడెక్కింది.

గాలి యథారీతిని హోరుమంటోంది. దానితాకుడుకు కిటికీరెక్కలు కొట్టుకుంటున్నై. ధ్వనిఅయినప్పుడెల్ల ఇలియా వుల్కిపడి ద్వారంవేపు చూస్తున్నాడు. ఎవరయినా వస్తారేమొ, తనగుట్టు బయటపడుతుందేమొనని భయంగావుంది. "తలుపుకు గడియవేసెయ్యనా?" అని మతిస్నా నడిగాడు.

ఆ జారిణికూడ తలాడించింది.

మతిస్సా భోజనంముగించి చెయ్యికడుక్కున్నది. మెల్లగా అనీయోగిపటంముందుకెళ్ళి నమస్కరించి "దేవుని దయవల్ల నా ఆత్మ తృప్తిపడింది. ప్రొద్దుటినుంచి యెంత తల్లడిల్లిపోయాను!" అని ఇలియూవంక చూచింది.

ఇలియూగుండె టకటకకొట్టుకొంటోంది. చూపులో వేగిరపాటు కన్పిస్తోంది. మతిస్సా వాని మనోగతాన్ని గ్రహించి పెద్ద నిట్టూర్పువిడిచింది. ఆ తరువాత అన్నది—"ఎంత కోరేవా రంతా యివ్వాల్సి వస్తుంది."

"ఎవరికి?" ఇలియూ ప్రశ్నించాడు.

"ఇదికూడా తెలియదూ? ఇంకెవరికి? దేవునికి!"

ఇలియూ మరి మాట్లాడలా. ఈశ్వరస్మరణతో కంపించాడు. ఆ నిముషంలో వా డూహించుతున్న భావనలన్నీ దూదిపింజల్లాగా యెగిరిపోయినై. మతిస్సాని కౌగలించుకొని ముద్దుపెట్టుకోవాలనుకున్నకోరిక అయిపు లేకుండా పోయింది.

మతిస్సా గోడకానుకుని నుంచొనివుంది. పరధ్యానంగా అంటోంది—"పాపం! ఫర్ ఫిష్కాకూతురుగతి యేమవుతుందో! నాకెప్పుడూ ఆపిల్లనుగురించినయావే. అది తరుచుగా నీతోను జాకోబుతోను కలసిమెలసి వుంటోంది. మీరిద్దరు ఆ పిచ్చి పిల్లని సర్వనాశనంచేయకుండ వదలరనే నా అనుమానం. దానిక్కూడ నాగతేపడుతుందేమోనని నేను భయపడు

తున్నాను. ఈ రొంపిలో అడుగు పెట్టినఆడుదాని కిక ముక్తే లేదు. పడుపువృత్తికంటె పతితము హేయమునైన మార్గము మరేదీ లేదు.

మతిస్సా ఒకక్షణమాగి తనచేతుల్ని చూచుకొని మళ్ళీ చెపుతోంది—“మాషాకి ఈడొచ్చింది కూడాను. ఆ పిల్ల కెక్కడయినా నౌకరీ కుదురుద్దామని యెందరివద్దకో పోయొచ్చాను. కాని, యెక్కడా ఒనగూడనేలేదు. పిల్లని అమ్మేయటానికి ఒప్పుకుంటే కొంటామనీ, మాషాకి మంచి తిండి, బట్టలకు లోపముండదనీ, నాకు డబ్బు బాగానే ముట్ట జెపుతామనీ చాలమంది చెప్పుకొచ్చారు. పిల్లలను అమ్మటం ప్రాయికమే లే. శ్రీమంతులు చాలమంది యీ పడుపు వృత్తినే పోషించుతున్నారు. వాళ్ళకి వృద్ధాప్యంలో జవ సత్వా లుడిగి యింద్రియపటుత్వం లేకపోయినా కామతృష్ణ చల్లారదు. వాజీకరణంలాంటి ఔషధాలకోసం దేవులాడు తూంటారు. సాధారణంగా స్త్రీలు పసందుచేసేఆకర్షణ వారిలో వుండదు. ఆ వృద్ధజంబుకాలు మందభాగ్యులగు యువతుల్ని డబ్బిచ్చి కొని సర్వనాశనంచేస్తుంటారు. వారి వల్ల దోసిళ్ళాదిగా ధనం లభిస్తుందన్నమాటేగాని, ఈపాపపు వృత్తి ఆద్యంతాలు మహాభయంకరాలు. అంతకంటె పస్తులతో మ్రగ్గిచావటమే మేలు! చూడరాదూ! నా బ్రతు కెంత నికృష్టము- పాపభూయిష్టమూనో!”

ఇలియా మానసికస్థితి విచిత్రంగా వుంది. వాన్నిపై నెక్కిన కామభూతం దిగనని మొదురుతిరుగుతోంది; కాని, ఇలియా తనవాంఛను వెలిబుచ్చలేకపోతున్నాడు. పైగా ఆ టక్కులాడి చెపుతున్న ప్రతిమాటా నిరాశతోనిండి కర్ణకఠోరంగా వుంది. ఆమెపొందుకు వా డెంత వేగిరపడుతున్నాడో ఆమె ధోరణి అంత తిరస్కృతిని తెల్పుతోంది. అందుచే వానికి కోపంకూడ వస్తోంది.

"దయామయా! కరుణానిధీ! పవిత్రజననీ!" అంటూ మతిస్నా కళ్లుమూసుకొని చేతులుజోడించి ప్రార్థించుతోంది.

ఇలియా విసుక్కున్నాడు. కోపంపట్టలేక "ఒకప్రక్క పతితనయ్యానని వాపోతూ, నిరంతరము యీశ్వరోపాసనలో లీనమయివుండే పరమభక్తురాలివలె మళ్ళీ యీ భగవన్నామ సంస్మరణ దేనికి? ఏమి టీ బూటకము?" అని అడిగేశాడు.

మతిస్నా ఖేదసూచకంగా నిట్టూర్చి అధోముఖియై "నాకు నీమాటలు అర్థంకాలే" దంది.

ఇలియా లేచి నుంచున్నాడు. "తెలియకపోవడాని కేముంది? నువ్వు రాత్రింబగళ్ళు వ్యభిచరించుతూనే దేవుణ్ని కూడా తలుస్తున్నావు. ఇవి రెండూ పరస్పరవిరుద్ధాలు. ఈ రెండింటికి పొత్తెల్లా కుదురుతుంది? ఏదో ఒకదాన్ని వదులుకోవాలి. అంతేగాని, నీతిలేని నీకు భగవద్ధ్యాన మేమిటి?" అని ఆక్షేపించాడు.

"నాబోటిపతితలకు ఆ పరమాత్ముడే దిక్కు. మా కాయనకు మించి యింకెవరుంటారు స్మరించటానికి?" అంది మతిస్సా.

ఇలియాకు అరికాలిమంట నెత్తికెక్కింది. అంతవరకు వాని నావేశించియున్నభూతం దిగిపోయింది. వాడికా మదవతి నవమానించాలన్న కోరికకలిగింది. "అదంతా నాకు తెలియదుగాని, నీలాంటి కులటల కా పవిత్రమూర్తిని స్మరించటానికి అర్హత లేదనిమాత్రం చెప్పగలను. నువ్వు చేసిన పాపాలన్నిటిని దేవునిచాటున మరుగుపరచాలనిచూస్తున్నావు. ఎవడినిచూచినా తనసాదవెళ్లగ్రక్కే వాడే; కాని, తన పొరుగువాడిగొంతు నులిమేటప్పుడుమాత్రం వానికి దేవుడు జ్ఞప్తికి రాడు. జీవితమంతా వంచనతోను, వ్యభిచరించీ గడిపి, చరమదశలో కంటనీరు పెట్టి చేతులుజోడించి సాష్టాంగపడి 'దేవా! కరుణానిధీ! ఈ పాపాత్ముని కరుణించు'మని ప్రార్థించుతారు. నోటి మాటలేగా! సామాన్యమానవుల కనుబ్రామినట్టే భగవంతుడినికూడా వంచించాలనేగా మీ వుద్దేశం?" అన్నాడు.

ఈ మాటలతో ఆమెను బాగా పరాభవించాననుకున్నాడు. ఇక నొక్కక్షణంకూడ ఆగక దభాలున తలుపు తెరచుకొని బయటపడ్డాడు. మతిస్సా విస్మయ విస్ఫారిత నేత్రాలతో వానివంకే చూస్తోంది.

ఇలియూ పైమాటలన్నీ ఒక్క మతిస్సా నుద్దేశించి మాత్రమే అన్నవికావు; పెట్రుహా, టెరెన్సు ప్రభృతులను దృష్టిలో పెట్టుకొనే అన్నాడు. గడపదిగుతూ మళ్ళీ యిల్లా అన్నాడు:

''ఛండాలులారా! మీరు పరమపాతకులు. మీ సంపర్కంలో వుండటంకూడ పాపమే. మహాపాతకం!''

# 12

ఇలియూపతన మారంభమయింది. కామినీగోష్టిలో దిగి వేశ్యాసంపర్కంలోపడ్డాడు. బేరములో వచ్చే ఆదా వెలయాండ్ర కివ్వడానికే చాలటంలేదు. ధనాభావంవల్ల వేశ్యా తిరస్కారానికి గురిఅయినప్పుడు ఈ బోగంపొత్తు బాగా లేదు. ఇల్లూ-ఒళ్ళూకూడ గుల్లవుతున్నై. గౌరవానికా కళంకం. ఈదారిత్రొక్కి సుఖపడినవా డెవడు; అని కుక్క దాలిగుంటలో బ్రహ్మజ్ఞాని అయినట్టు ఆలోచించేవాడు.

డబ్బుసంపాదనకు కొత్తమార్గ మేమిటాయని ఆలోచించసాగాడు. తోటి బేరగాండ్రవలె తానుకూడా అనుమతి పొంది లాటరీవేసి, చర్ బొప్పాయిగుండులాంటి కొత్త కొత్త ఆటలు పెట్టి ధనమార్జించవచ్చు ననుకున్నాడు; కాని,

ఆమోసప్రవృత్తి వానికి మనస్కరించలా. ఏమయినాసరే, అల్లాంటివృత్తిల్లో దిగకూడదనుకున్నాడు. పైగా పోలీసువాళ్ళ బాధ పడాలి. అస లొకరిముందు చేతులు నలపటం వాని స్వభావానికే విరుద్ధం. ఇలియాకి పరిశుభ్రత, నిజాయతీ ప్రవర్తనలందు అతిశ్రద్ధ. యెవరితోనయినాసరే మోర పైకెత్తి, ఱొమ్ము ముందుకుచాపి మాట్లాడుతాడు. వాని మాటలలో అహంభావం తొలుకుతూంటుంది. అయినా డబ్బుగడించాలన్న కాంక్ష వా ని ని వదలకుండావుంది. ఎలాగయినా ఒక వెయ్యిరూపాయలు చేజిక్కితే దర్జాగా వ్యాపారంచేసుకోవచ్చు ననుకునేవాడు.

బందిపోటువార్తలంటే ఇలియా చెవికోసుకునేవాడు. దొంగలు పట్టుబడిందీ లేనిదీ తెలుసుకోటానికి ఆరాట పడేవాడు. ఎప్పుడయినా దొంగలుపట్టుబడినట్టు వింటే తన కొంపమునిగినట్టు విచారపడుతూ జాకోబుతో "తప్పించుకునే నేర్పులేనివెధవలు అసలు చోరీ కెందుకెళ్ళాలో" అనేవాడు.

మరొకప్పుడు దుర్మార్గుడై, మోసకారిగా జీవించు టెంత సులువో, ధర్మపథానువర్తియై నిజాయతీగా బ్రతకటం అంతే కష్టం!" అన్నాడు జాకోబుతో ఇలియా.

జాకోబు తన సహజ సరళస్వభావంతో "నిన్న మీ బాబాయివద్ద కొక ముదిమనిషి వచ్చాడు. బాగా చదివినట్టున్నాడు. అచ్చంగా ఆయనకూడ నీ లా గే అన్నాడు" అని చెప్పాడు.

"ఏమన్నాడు?"

"దొంగలకత్తికి పదునెక్కువట. దేవునికి ఆగ్రహం కలిగించేవాళ్ళే సుఖపడతారనీ, భగవంతుడల్లాంటివారికే సర్వసంపదలను సమకూర్చుతాడనీ బైబిలులో వుందని చెప్పాడు.

"నువ్వే యీమాటలు కల్పించిచెప్తున్నావేమో?"

"ఇవి నామాటలు కావు. అసలీ మాటలు బైబిలులో వుంటాయన్నవిశ్వాసంకూడ నాకు లేదు. ఆవృద్ధుని కల్పనే కావచ్చు. నేను రెట్టించి అడిగినా తిరిగి ఆ ముక్కలే చెప్పాడు. బైబిలులో చూస్తేగాని నిజం తెలియదు. అయినా ప్రపంచపరిస్థితినిచూస్తేమాత్రం ఆయనచెప్పినదంతా వాస్తవంగానే కనపడుతోంది." ఇలియా చెవివద్ద నోరుపెట్టి "మానాన్ననే చూడు! ఆయన భగవంతునికయిష్టమగు పనుల్లో దేన్ని చెయ్యటంలేదు? అయినా ఆయన వైభవము వృద్ధిచెందుతూనేవుంది. ఆయన సుఖభోగాలకు లోపంలేదు." అన్నాడు జాకోబు.

"అందులో సందేహంలేదు. పేరు - ప్రతిష్టలకు కూడా కొరతలేదు. పురపాలకసంఘంలో సభ్యుడుకూడాను."

జాకోబు తలొంచుకొని చెప్పాడు—"మానవ హృదయానికి మచ్చలేకుండావుండాలంటే స్వచ్ఛము - నిర్మలమునైన నడత కలిగివుండాలి. కాని, మానవుడి నేటి ప్రవర్తనను గమనించితే మనస్సుచివుక్కుమంటుంది. ఇల్లాంటి

సమాజంలో బ్రతుకే భారమనిపించుతోంది. పూటకూళ్ళ వృత్తి పాతకమని నా వుద్దేశం. కాని నాన్న నన్ను నిత్యము సతాయించుతున్నాడు. నేను బడుద్ధాయిలాగా తిరుగుతున్నానని, యికనైనా తెలివిగలిగి వ్యవహారంచూచుకోమనీ గోజాడుతున్నాడు. ఔరెన్సు లేనప్పుడు బ్రాందిషాపులో నేనే కూచుంటున్నాను. ఆపని నాఆత్మకు విరుద్ధమైనా ఎల్లాగో సహించుతున్నాను. నేను స్వతంత్రుడనయితే యీ తగులాటంలో చిక్కుకొనేవాణ్ని కాదు.''

''నీకంతకంటె గత్యంతరంలేదు; ఏం జేస్తావు?'' ఇలియా సానుభూతిచూపుతూ అన్నాడు.

''జీవితసమస్య మహాజటిలమయినది!''

''నీయేడుపు అనవుసరము. నాజీవితమల్లా కాదు. నీకేమోయ్! ఎప్పుడో మీబాబు తారుమని చస్తాడు. అంతటితో ఆయనయావదాస్తి నీకు సంక్రమిస్తుంది. తర్వాత నువ్వు కాలిమీదకాలేసుకుని కూచుని సుఖంగా అనుభవించుతావు. నేనో! కష్టాలన్నీ నాపాలే. బజారునపోతూ దుకాణాల్లోని విలాసవస్తువుల్ని చూచినప్పుడల్లా నామనసు వాటికోసం వువ్విళ్ళూరుతుంది. ఆ వ్యామోహాన్ని అణచుకోటానికి యెంతో ప్రయాసపడుతాను. ఇంకీజీవితములో నాకోరికలుతీరవని నిరాశచెందుతాను. అప్పుడప్పుడు మంచి మంచిబట్టలను చూచి కొనాలనిపిస్తుంది; కాని, చాలినంత డబ్బు లేక వ్యథననుభవిస్తాను. నా కా మేలురకం దుస్తులను

ధరించేయోగ్యత లేదేమోనని నిర్విణ్ణుడనవుతూంటాను. సుఖాలన్నీ పాపాత్ములకు, కుచ్ఛితులకే. గౌరవ-మర్యాదలు కూడా వాళ్ళకే. వాళ్ళు దురహంకారంతోనే మనపైన పెత్తనం చెలాయించుతూ మిడిసి పడుతున్నారు. అదృష్టదేవత ఆదుర్మార్గులకు ప్రత్యక్షమై మనకు దూరంగాపారిపోతుంది. ఈవిపరీత మెందువల్లనో!''

''దేవుడు నిన్నా కోరికలకు దూరంగా వుంచుగాక!'' అన్నాడు జాకోబు.

''ఎందువల్ల?'' అనడిగాడు ఇలియా.

''నీ కోరికలకు అంతుండదు. నీ పిపాస వుపశమించేది కాదు.''

ఇలియా వికటంగానవ్వి ''జర్మియావద్ద అపహరించిన సొమ్ములో సగం నాకియ్యమని మీయబ్బతో చెప్పు. అల్లా యిప్పించినాక అంతటితో నేను తృప్తిపడేదీ, లేనిదీ చూడు! నాసంగతి నీకేం తెలుసు. నేను కాదు లోభిని, దురాశాపరుడిని; మీ నాన్నే'' నన్నాడు ఇలియా నిరసన భావంతో.

జాకోబు లేచి నిదానంగా ద్వారంవేపు నడిచాడు. వానితల దించుకొనిపోయింది. ఇలియామాట వాని హృదయానికి కుఠారాఘాతమై తగిలింది. అవమానంచే క్రుంగిపోతున్నాడు. ఇలియా వెంటనే లేచిపోయి మిత్రుని చేయిపట్టుకొని ఆపి ''ఆగు, వెళ్ళిపోతున్నావేం?'' అనడిగాడు.

"ఏమీ లేదు, నన్ను పోనివ్వు" మన్నాడు. జాకోబు ఆగి, ఇలియా కళ్ళలోకి చూడసాగాడు. ఇలియా ముఖం తెల్ల బడింది.

"విచారించకు జాకోబ్! రా, కూర్చో. నేను మీ నాన్నమీద లేని అభాండం కల్పించలా. నీకు కోపం రావలసిన కారణంకూడ లేదు" అని ఇలియా జాకోబును లాక్కొనిపోయి కుర్చీలో కూర్చుండబెట్టాడు.

"చాటుమాటుగా యితరులు చెప్పుకోవటం నేనూ విన్నా"నన్నాడు జాకోబు.

ఇలియా "ఆ చెప్పుకున్నవాళ్ళా అల్లాంటి వాళ్ళే" నన్నాడు.

జాకోబు దీనంగాచూస్తూ అన్నాడు—"ఈర్ష్యతో అల్లా చెప్పుకుంటున్నారేమో ననుకున్నాను మొదట్లో; కాని వినగా వినగా నిజమేనేమోనని సందేహించాను. ఇప్పుడామాటే నీ నోటినుంచికూడా విని నిజమే......"

ఇక వానినోటినుంచి పలుకు బయటికి రాలా. ఇలియా మౌనంగా కూచునివున్నాడు. వానికి తా నేమనాలో తోచలా. ప్రక్కగోడ కవతలివైపునుంచి యేదో గల్లంతు వినపడింది.

"అబ్బ! ఈ రొదలో నిద్ర యెల్లా పడుతుంది?" అని ఇలియా విషయాన్ని మార్చాడు.

"అయితేమాత్రం తప్పుతుందీ! నేను జీవించక తప్ప నట్టె నీకు నిద్రపట్టక మానదు."

"నీ కీ వాతావరణంలో సుఖ-శాంతుల్లేవు; కాని, చేసేదీలేదు. మనందరికతీ ఒకలాగేవుంది. అదే సంతోష కరమగు విషయము"

"ఇంతకూ అసలా సంగతి నిజమేనంటావా? అని జాకోబు వెనుకటివిషయాన్ని లేవనెత్తాడు.

"నిజమేనా అని నీకింకా సందేహ మెందుకు? నేను స్వయంగా చూస్తేను! అప్పుడు నీ దగర్నుంచి నేను పరు గెత్తు కెళ్ళటం నీకు జ్ఞాపకంలేదూ? నేను వెళ్ళేసరి కే జర్మియా గదితలుపుకు లోపల గడియ బిగించాడు. నే నూరుకోలేక తలుపుసందుగుండా లోపలికి చూచాను. తాత క్రిందపడి వున్నాడు. మీ నాన్న తొందర పెడుతూంటే మా బాబాయి వూడదీసిన తలగడదిండుకుట్టు సరిచేస్తున్నాడు. వాళ్ళ గుసగుసలుకూడ విన్నాను."

జాకోబు పోతవిగ్రహంలాగా కూచుని శ్రద్ధగా వింటున్నాడు. నోరు తెరవటానికి ధైర్యంలేకపోయింది.

ఇలియా అంతవరకు చెప్పి వూరుకున్నాడు. జాకోబు మెల్లగా లేచి దారిపట్టాడు. ఇలియా వాడిని పోనిచ్చి దడాలున తలుపు వేసి పక్కమీద పడి చింతించసాగాడు. జాకోబుపట్ల వాని కెంత సానుభూతి వుందో, పెట్రుహా, టెరెన్సులయం దంత కోపముంది. శాంత స్వభావి, సరళ

హృదయుడునైన జాకోబువంటి దుర్బలమనస్కుడు కటిలాత్ముడైన పెత్రుహపోషణలో యెంతోకాలం నిలువజాల డనుకున్నాడు. ఈ విషయాన్నిగురించి ఆలోచించినకొద్దీ వానికి మానవసమాజంపైన రోతకలుగుతోంది. వానికందరు దుర్మార్గులు, నీచులు, పాపాత్ములుగా కన్పించారు. ఎల్లరు యేవగించుకోదగ్గవారేనని తోచింది. ఉన్నకొద్దీ వాని యాందోళన అతిశయించుతోంది. ఒంటిమీద చీమలు, జెర్రులు ప్రాకినట్లుంది. మరి పక్కమీద పడుకొనివుండలేక బయటి కెళ్ళాడు. ఆ అర్ధరాత్రివేళ నిశాచరునివలె బజారుల్లో గ్రుమ్మరుతూ ద్వంద్వభావాలతో పోరాడుతున్నాడు.

శత్రువులు రహస్యంగా వెన్నాడుతూ తన్నగాధసాగరగర్భంలో పడద్రోయజూస్తున్నట్టు తోచింది ఇలియాకి. క్రోధావేశంతో మండిపడ్డాడు. "ఈ లోకమంతా చెడ్డతోనే నిండివుందా? మంచి లేనే లేదా? ఉంటే దానిచిన్నె లేకనపడవేమి? నాకెప్పుడూ చెడుగే యెదురవటానికి హేతువేమిటి? నన్నాపదలవేపుకి నెట్టుతున్నదెవరు?" యిలాంటి ప్రశ్నలెన్నో ఇలియా అంతరంగంలో చెలరేగినయి.

హృదయంలో రేగిన తుపానుతీవ్రతచే బాహ్యజ్ఞానశూన్యుడై పట్టణబహిఃప్రదేశమందున్న చర్చిదాపులో కెళ్ళాడు. అప్పుడంబరవీధిని కారుమేఘాలు పరుగులుతీస్తున్నై. ఆ జలధారలమధ్య మధ్య నీలాకాశం కనపడుతోంది.

అందు మిణుగురుపురుగులవలె చుక్కలు తళుక్కుమని మెరసి అంతలో అదృశ్యమవుతున్నై. చర్చిలోని ఘంటారవము నిశీథమందలి నిస్తబ్ధతను చీల్చుకుంటూ వస్తోంది. మంచు దట్టంగా కురుస్తోంది. ఆ పెంజీకటిలో మిట్ట-పల్లాలను గానక ఇలియూ తూలిపడ్డాడు. అప్పుడుగాని వానికి బాహ్యస్మృతి కలుగలేదు. తానెక్కడున్నదీ తెలిసికొని భయంచే గజగజ లాడాడు. మరివెనుకముందులు చూడక గృహోన్ముఖుడై దౌడుతీశాడు.

# 13

దీపాలువెలిగించేవేళ. మంచు పడుతోంది. పాష్కా కమీజు తొడుక్కొని అన్యమనస్కుడై రోడ్డుమీద నింపాదిగా నడిచిపోతున్నాడు. ఇలియూచూపు వానిపై పడింది. వెంటనే గబగబా వెళ్ళి చటుక్కున మిత్రుని చేయి లంకించుకున్నాడు.

పాష్కా వెనక్కితిరిగిచూచి "ఓహో, నువ్వా!" అన్నాడు.

"బాగున్నావా?" అని ఇలియూ అడిగాడు

"ఆఁ యేంబాగులే! వీూరు?"

"బాగానే వున్నా మనుకో."

"నీ మొహం అల్లా చెప్పటంలేదే?"

"దానికేంగాని, యెన్నిసార్లు చెప్పినా నువ్వు రాకనే పోయావు."

"తీరుబడి లేదోయ్."

"నువ్వు రావాలనుకుంటే వ్యవధానమే దొరక్క పోతుందీ?"

"ఒరేయ్! నేను రాలేదు రాలేదని నెపమేస్తున్నావు, సరే గాని, మరి నే నెక్కడుంటున్నానో, ఏంచేస్తున్నానో, యెల్లా వున్నానో, మాట మాత్రమైనా అడిగావూ?" అన్నాడు పాప్కా నిర్మొగమాటంగా.

"పొరపాటే, యీ తప్పు నావల్ల జరిగిందని ఒప్పుకుంటున్నాను."

"తమాషాకి అన్నాన్లేవోయ్. నేనీమధ్య కాయిలా పడి మూణ్ణెల్లు ఆసుపత్రిలో వున్నాను. నాజబ్బు యెల్లా వుందని అడిగినవాడే లేకపోయాడు."

"అరె! జబ్బా! నాకు తెలియనేలేదే. ఏం జబ్బు?" అని ఇలియా వ్యగ్రత చూపాడు.

"చలీ, జ్వరమూ. కొంచెం తగ్గి కోలుకునేటప్పుడు ఒంటరిగా మంచంమీద పడివుండటము మరీ కష్టమయింది. కుంటి - గుడ్డివాళ్ళలాగా పగలూ, రాత్రీ మంచంమీద పడివుండాను. పలికేవాడు, ఉలికేవాడు లేకపోయాడు.

డాక్టరు చాలామంచివాడులే. ఆయనే పుస్తకాలు తెచ్చిచ్చి చదువుకోమనేవాడు; లేకపోతే యీపాటికి పిచ్చివాడి నయ్యేవాణ్నే.'' అని చెప్పేటప్పటికి పాష్కా గొంతు అవరుద్ధమయింది.

"ఏం పుస్తకాలు? వైద్యశాస్త్రాలా?''

"కాదు, చాలా మంచి గ్రంథాలు. పేరు మోగిన కవుల కావ్యాలు. ప్రతిపాదము కలకండముక్కలాగా మధురంగా వుంటుంది. ఆపద్యాలు చదువుతూంటే కలిగే ఆనందం ప్రేయసీపరిష్వంగంలో కూడ లభించదు.''

ఇలియా "నాకిప్పుడు పుస్తకాలపొత్తే లేదు'' అని చెప్పాడు.

"ఏమిటీ! నిజంగానా!'' పాష్కా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు.

"పుస్తకాలు చదివినందువల్ల నాకేమీ ప్రయోజనం కన్పించలా. వాటిలో వుండేది ఒకటీ, లోకంలో జరుగుతున్నది మరొకటీను.''

"అదే వాటి ప్రత్యేకత. నడివీధిలో నిలబడి యీ చర్చ మెందుగ్గాని, హోటల్లోకి పోదాం పద; సరదాగా కబుర్లు చెప్పుకొంటూ భోంచేద్దాము.''

"అయితే పద'' అని ఇలియా దారితీశాడు.

పాష్కా ఇలియా వెనక నడుస్తూ "మన యిద్దరికీ యెన్నడూ అంతర్యం లేకపోయినా నిన్ను కలుసుకొన్నందుకు చాలా సంతోషంగా వుంది'' అన్నాడు నవ్వుతూ.

"నన్ను కలుసుకొన్నంతమాత్రాన నీకు సంతోషం కలుగుతుందని నే ననుకోను. నా ఆలోచన యెప్పుడూ అందుకు ప్రతికూలమే; కాని,......"

పాష్కా మధ్యలో ఇలియా కల్పించుకొచ్చి "అల్లాకాదు మిత్రమా! నిన్ను నేను తలచుకొన్నప్పుడె సరిగా నువ్వు సాక్షాత్కరించుతున్నావు" అన్నాడు.

మిత్రులిద్దరూ హోటల్లో ప్రవేశించి భోజనానికి కూచున్నారు. దీపంవెలుతురులో పాష్కాముఖం పాలిపోయివుండటము, కళ్ళు దించుకొనిపోయి వికృతంగా వుండటము, చూచాడు ఇలియా. అతడే సంభాషణ ప్రారంభించాడు:

"ప్రస్తుతం పని చేసే దెక్కడ?"

"మళ్ళీ అచ్చాఫీసులోనే చేరాను."

"శక్తికిమించి పనిచేయాల్సి వస్తోందా?"

"ఆ శ్రమ తతిమ్మా విచారాలముందు లెక్కలోది కాదులే."

ఒకానొకప్పుడు కన్నుమిన్నుగానక త్రుళ్ళిపడిన పాష్కా యిప్పుడు తలబిరుసు తగ్గి నిరాశతో దీనుడై వున్నందుకు ఇలియాకి సంతోషంగానే వుంది; అయితే వానికి పాష్కావిచారహేతువును తెలుసుకోవాలన్న ఆతురత హెచ్చింది. "కవిత్వం రాస్తున్నావా?" అనడిగాడు.

“ఇప్పుడన్నీ వదిలేశాను. లోగడ రాసినవాటిని డాక్టరు చదివి చాలా మెచ్చుకున్నాడు. ఒక శీర్షికను పత్రికకు పంపించాడు. సంపాదకుడు దాన్ని ప్రకటించి నాకు పారితోషికంకూడ పంపాడు.”

“అల్లాగా! ఏదీ, ఆపద్యాలు చదువు.”

“ఇప్పుడు జ్ఞాపకం లేవు. నెమరేసి తెచ్చుకోవాలి. కవిత్వంరాస్తుంటే ఒక్కొక్కసారి హృదయం నీరయి కంట నీరుకమ్ముతుంది.”

“కారణం?”

“హృదయంలో యేదో జ్వాలలేచిన ట్టుంటుంది. దాన్ని కాయితంమీాద పెట్టాలనుకుంటాను; కాని, తగిన మాటలు దొరకవు. మనసులో రేగిన భావాలన్నిటిని పద రూపంలో వెల్లడించడం అసంభవం. పద్యరూపంలోకి వచ్చే సరికి వాటిసారమే పోతుంది.”

పాష్టాని చూచినకొద్దీ ఇలియాహృదయం తరుక్కు పోతోంది. వానికి పాష్కాయం దిదివరకు లేని ఆదరాభి మానాలు కలుగసాగాయి. “ఒకటి రెండయినా విని పించుదూ” అన్నాడు.

“స్వవిషయాన్ని గురించి తమాషాకి యేవో రాశాను, అవి చదవనా?”

“పోనీ, అవే చదువు.”

పాష్కా ఒకపద్యంచదివాడు. అంతలో యేదో స్మృతికొచ్చినట్టు వేదనపడుతూ కుర్చీలో వూగులాడ సాగాడు.

ఇలియా సంభ్రమాశ్చర్యాలతో పాష్కావంక చూచాడు. ఆ పద్యం పాష్కారచించినదేనని నమ్మలేక పోయాడు. "ఇది తమాషాకు రాసిందిగా లేదే! ఎంత గంభీర భావ మిమిడివుంది! మానవుని వాస్తవికస్థితి కళ్ళకు కట్టినట్టు చిత్రించబడింది, నిజానికీ పద్యం నా హృదయాన్నూపివేసింది. మళ్ళీ చదువు, వినాలి."

"ఇలియా! నిజంగా నీకంత బాగుందా?" పాష్కా వుత్సాహంగా అడిగాడు.

"లేకపోతే నిన్ను కోడిగమాడుతానా పాష్కా!"

"నీ విషయంలో అల్లా అనుకోటానికి వీలులేదు. నీ వెప్పుడూ యదార్థవాదివే. అందువల్లే నీవంటే నాకు ఇష్టం. మరి విను, ఇంకోటి చదువుతాను."

పాష్కా చదివిన రెండోపద్యం విన్నాక ఇలియా సందేహం మరింత బలపడింది.

పాష్కా పద్యం పూర్తిచేసి "నాకు ఆలస్యమయి పోతోంది. కవితాప్రవంతికి అంతేముంది? రాతపుస్తకం తెచ్చి అన్నీ చదివి విన్పించుతాలే. ఇప్పుడు ఒకదాని మొదలు జ్ఞాపకంవుంటే మరొకదాని తుది అందుతుంది. ఇంకో పద్యభావం చెబుతా విను—నేను ఒక అరణ్యంలోకి వెళ్ళాను. అక్కడ దారితప్పాను. ఆ కీకారణ్యంలో

అంధకారబంధురంగా వుంది. దరి–దాపుల్లో నరసంచారం లేదు. తెన్ను దెలియక నా దురదృష్టాన్ని నిందించుకో సాగాను! దీనికి తరువాయి కూడ వుందిలే'' అన్నాడు.

''ఏం చక్కని భావం! అద్భుతంగావుంది. జీవిత రహస్యమంతా యిమిడివుంది. మానవుని బ్రతుకూ అల్లాగే వుందిగా. దారి కనపడదు. యెటుచూచినా అగమ్యగోచరంగా వుంటుంది. వెలుగుచిన్నెలైనా కనపడవు. మార్గాన్ని కనుక్కోవడమే దుస్తరం'' అన్నాడు ఇలియా.

పాష్కా లేచాడు. ఇలియాచేయిపట్టుకొని "నేనిక పోవాలి. నువ్వుకూడా లేచి రా, కొంతదూరం కలిసి వెళ్ళొచ్చుగా'' అన్నాడు.

"వెళ్దాం గాని, నువ్వు చదివినపద్యాలు చాలా బాగున్నై; అవి నీ రచనలేనని నాకు విశ్వాసంకలగటం లేదు; కాని, నిన్ను నమ్మకుండానువుండలేను.''

"ఓశ్, అదా సంగతి; రాతప్రతి తెచ్చి చూపిస్తాగా; అప్పుడే నమ్ముదువుగానిలే.''

"నిజంగా వాటిరచయితవు నువ్వే అయితే నిన్నెంతగా కొనియాడినా తనివితీరదు పాష్కా! ఆదర్శ జీవితాన్నిగురించి రాసిన దేదయినా ఒకటి చదువు, వెళ్ళిపోదాము.''

"ముందు నన్ను ఆదర్శంగా జీవించడం అలవాటు చేసుకోనీ. ఆతర్వాత యెన్నయినా రాసేస్తాను. అప్పుడైనా సుషుప్తిలోవున్నవాళ్ళని లేపకూడదు.''

"అల్లాకాదు, తప్పకుండా వాళ్ళని లేపవలసిందే. వాళ్ళ కాళ్లులంకించుకుని యీడువు."

"కొందరు మితిమీరిన డాబు – దర్పాలతో విర్రవీగుతూంటే, మరికొందరు......"

"అది ఆలోచించాల్సినవిషయమే. అందరూ పరబ్రహ్మస్వరూపాలే మళ్ళీను!" అన్నాడు ఇలియావుత్సాహంగా.

"ఇవతలిపుల్ల నవతల వెయ్యనివాళ్ళకు సర్వభోగాలు, రెక్కలు ముక్కలుచేసుకొని శ్రమపడేవారికి పొట్టకూటికయినా గతిలేకపోవటం యెంత అన్యాయం! దాన్నే సమాజధర్మమంటూరు మన పెద్దలు!"

"అందరూ దేవుని బిడ్డలే; మరి సమాజంలో యేమిటీ హెచ్చు – తగ్గులు! అంతా మోసం!"

"నేను బాగా చదువుకోలేదే అని యిప్పు డపూరించుతున్నాను."

ఇద్దరూ యిల్లాగే మాట్లాడుకొంటూ నడుస్తున్నారు. పరస్పరభావాలు కలుస్తున్నందున యిద్దరు హుషారుగా వున్నారు.

"ప్రజ లిప్పుడిప్పుడే యీ వాస్తవిక విషయాలను గ్రహించుతున్నారు." అన్నాడు పాష్టా.

"ఈ హెచ్చుతగ్గులసమాజ మింకెన్నాళ్ళో నిలవదు." అన్నాడు ఇలియా.

"ఎంత హాస్యాస్పదమో చూడు! కుల వంశా లెంత హీనమైనవయినా సరే చేతినిండా డబ్బుండి సభ్యసమాజంలో తిరిగితే చాలు. గొప్పవాడయిపోతాడు!"

"ఎన్నివున్నా డబ్బు లేనివాడు దుబ్బుకు కొరగాడు"

ఎదురు దెబ్బ తగిలి ఇలియా ఒరగబోయాడు.

దారిని నడవమన్నాడు పాష్కా.

"అరె! మాటలగొడవలో నేనుకూడ నీ వెంటబడి చాలాదూరం వచ్చేశానే!" ఇలియా ఆగిపోయి అన్నాడు.

"అయితేయేంలే. ప్రొద్దున్నే వెళ్ళొచ్చు; నాతో రా"

"మన జీవితవాహినులు భిన్నముఖాలుగా ప్రవహించుతుంటే యిద్దరికి ఒకే మార్గం యెల్లాసరిపడుతుంది?" అన్నాడు ఇలియా పాష్కాని వదలిపెట్టిపోవాల్సివచ్చిందే అని.

"నే నక్కడికి పోయితీరాలి. పోనీ నువ్వుకూడా వద్దూ" అని పాష్కా మరోసారి ఆహ్వానించాడు మిత్రుణ్ని.

"సరే, పద" అని ఇలియా పాష్కాననుసరించి నడుస్తూ "అయితే నువ్వుండేది యెక్కడ? వెళ్ళక తప్ప దన్నావు; యెవ తెక యినా అంటుపడ లేదుగద? అనడిగాడు.

"మర దేనోయ్ వ్యవహారం! 'సిదోరిహా'లో ఒక యువతి వుంది. చాలా మంచిదిలే. రూపసి కూడాను. నువ్వు చూచావంటే డంగయిపోతావు. డాక్టరువద్ద మంత్రసానిగా వుండేది, పుస్తకాలకోసం నే నాయన ఇంటికెళ్ళినప్పుడు చూచి కన్నుగీటాను. చూపులో చూపు కలిపింది. ఇంకే

ముంది, యిద్దరి హృదయాలు కలిశాయి. నేను చేతులు చాచాను. ఆమె వచ్చి నా బాహువుల్లో వాలింది. ఇప్పుడామెలేనిజీవితమే నిరర్థక మనిపిస్తోంది. ఆమె నాహృదయ జ్యోతి. నాప్రాణంలోప్రాణం!"

పాష్కా తన ఆత్మకథను చెపుతూంటే ఇలియూ కుతూహలంగా వింటున్నాడు. పాష్కా యింకా చెపుతూనే వున్నాడు.

"ఒక పర్యాయం మేమిద్దరం ముద్దులాడుతూండగా డాక్టరుగారిభార్య చూచింది. ఆమె స్వభావసిద్ధంగా మంచిదేగాని, సంసారుల యింట్లో సరాగా లేమిటని మా మీద కోపించింది. మేరీ వేరా – ఇది ఆచిగురుబోడి–అంటే నా ప్రేయసిపేరు–ను వెళ్ళగొట్టింది. నన్నుగూడ తమ గడపతొక్కవద్దని చెప్పేసింది. నౌకరీవూడిపోవటంవల్ల వేరా నామెడకు తగుల్కుంది. అప్పట్లో నేనూ నిరుద్యోగినే. దగ్గర వున్నమట్టుకు వుస్తువులన్నీ తెగనమ్మి తిన్నాము. ఆతర్వాత ఆకలితో అటమటించిపోయాము. ఆస్థితిలో ఒకనాడు వేరా నాతోచెప్పకుండా పారిపోయింది. రెండు వారాల వరకూ అయిపూ–అజా లేదు. తదుపరి ఒక రోజున వేరా సిల్కు–చీర–జాకెట్టూ సింగారించుకొని, కొంత డబ్బుతోసహా కులుకుతూవచ్చింది. వేరా వాలకము, ప్రవర్తనా చూచి, నారక్తం వుడికిపోయింది. ఆ నాడామె వొళ్ళు హూనంచేసి మరీ వదలిపెట్టాను.

"ఆమె మళ్లీ పుడాయించి వుంటుంది." అన్నాడు ఇలియా.

"ఆమెనన్ను విడిచిపెట్టిపోతే యెప్పుడో ఆత్మహత్య చేసుకొనివుండేవాణ్ని." అన్నాడు పాష్కా అతిధీమాగా.

"అయితే అన్ని దెబ్బలూతిని యింకా నీతోనే వుంటోందా?" అనడిగాడు ఇలియా.

"తన్నొక్కసారిగా చంపేసినా యిష్టమేనటగాని, చెయ్యిచేసుకోవద్దని బ్రతిమాలింది. నాకు తానుకూడ భారమయినందువల్లనే గత్యంతరంలేక డబ్బుగడించటానికి పెడతోక్కానంది. తనహృదయాన్నిమాత్రం యింకెవరికీ అమ్ముకోనని చెప్పి కన్నీరు మున్నీరుగా యేడ్చింది."

"మరి నువ్వేమన్నావు?"

"బుద్ధికితోచినట్లు చేశాను. తిట్టాను; కొట్టాను. ఇంకేంచేస్తాను? ఆమెకి తిండిపెట్టేందుకైనా నావద్ద రాగి దమ్మిడీ లేదాయె!"

"మళ్లీ మంత్రసానిగా పనిచెయ్యడం ఆమె కిష్టం లేదా?" ఇలియా అడిగాడు.

"ఏమో! నేనాసంగతి అడుగనూలేదు. ఆమె చెప్పనూలేదు. నా ఒక్కనితోనే వుంటే తన బరువేకాక, పుట్టే సంతానంకూడా నాకు భారమవుతుందట. తనకు స్వేచ్ఛనిస్తే తన భారంగాని, సంతానబాధగాని నాకుండదనీ, కేవలం డబ్బుకోసం వ్యభిచరించినా తాను ననుదప్ప అన్యుని ప్రేమించననీ నొక్కి నొక్కి చెప్పింది."

"ఊఁ హుఁ, అయితే జాణయే నన్నమాట!"

పాష్కా వెనక్కి తిరిగి ఇలియా కభిముఖుడై కాని,
—ఇలియా!— నా ప్రియవేరా యితరులను ముద్దుపెట్టు కొంటోందని తలచుకొన్నప్పుడు హృదయం దహించుకొని పోతోంది; కాని, యేంచెయ్యను?" అన్నాడు.

"అయితే నువ్వామెను వదిలెయ్యరాదూ?" అన్నాడు ఇలియా.

పాష్కా మౌనందాల్చాడు.

అంతలో వారొక యింటిముందాగారు. ఇంటి చుట్టూ ప్రహారీగోడవుంది. పాష్కా మెల్లగా తలుపు తట్టాడు.

పాష్కా తలుపుకొట్టి యివతలికొచ్చి "ఈ యిల్లొక సత్రంలాగుంటుంది. ఇందులో వేరాలాంటి జవరాండ్రింకా వున్నారు. గృహాయజమాని పేరు సిదోరిహా. అతడే అందరికి తిండి, బట్ట లిస్తాడు. ప్రతి ఒకతెవద్ద నెలకు నూరురూపా యలు పుచ్చుకుంటాడు. ఎవరిపైనా యెల్లాంటి నిర్బంధమూ లేదు. ఏ పడుచుగాని యథేచ్ఛగా సంచరించవచ్చు, ప్రస్తుతం యిక్కడ నలుగురు మాత్రమే వున్నారు. అందరికి తగినంత రాబడి వున్నది. పదినుంచి పాతిక రూపాయల వరకు రోజు వారీ రేట్లు వుంటయి." అని ఇలియా చెవిలో చెప్పాడు.

"నీ తాలూకూ ఆమె రేటెంత?" అనడిగాడు ఇలియా.

"నాకా సంగతి తెలియదుగాని, వేరాది గిరాకి బేరమే అయివుంటుంది."

లోపట్నించి "ఎవరారు?" అని యెవరో అడిగారు.

"నేను, పాష్కాని"

తలుపు తెరువబడింది. ఒక ముసలామె ముందుకొచ్చి "రా, నాయనా!" అని పాష్కా నాహ్వానించింది. పక్కనే ఇలియాను చూచి "ఇంకెవ్వరో వున్నారే?" అంది.

"నాస్నేహితుడేలే" అని పాష్కా గమిడి యెక్కుతూండగా "ఎవరా వచ్చింది?" అని లోపలినుంచి ఒక కోకిల కంఠం వినబడింది.

"వేరా విటుడు" వృద్ధాంగన ప్రతి పల్కింది. ఈ మాటలు విని వేరా తనగదితలుపు తెరచుకొని వచ్చింది. ఆ జవ్వని పాష్కాభుజంమీద చెయ్యేసి "ఇవాళ యింత ఆలస్యంచేశావేఁ? ఎక్కడికెళ్లావు?" అనడిగింది ప్రేమ పూర్వకంగా.

పాష్కా నడుస్తూనే ఇలియాను చూపుతూ చెప్పాడు— "ఈయన నా బాల్యస్నేహితుడు. పేరు ఇలియా లూనవ్. దారిలో యీయన కనపడ్డాడు. అందు వల్లనే ఆలస్యమయింది." గౌరవపురస్సరంగా ఇలియాను వేరా నమస్కరించింది. తగులబడినతోటలో మిగిలివున్న పచ్చని చెట్టును చూచినట్టు వేరా ఇలియావంక చూడసాగింది.

వేరా వారిద్దరిని తోడ్కొని గదిద్వారంవద్దకు వెళ్ళగానే ప్రక్కకు తప్పుకొన్నది. పాష్కా గదిలోకి

వెళ్ళాడు. వేరా నవ్వుతూ "మంచి మర్యాదస్తుడివే. ముందు అతిథుల్ని ఆహ్వానించాలా, మీ మట్టుకు లోపలికి చొరబడాలా?" అంది.

పాష్కా కూడా నవ్వి "ముందుకు రావటానికి ఆయన కిష్టముంటేగా! మధువు వెంటబడ్డ భ్రమరంలాగా నీవెంటే వున్నాడుగా?" అన్నాడు.

"మీ స్నేహితుడు అంటున్నది నిజమేనాండి?" అని వేరా ఇలియూవంక చూస్తూ కిలకిలా నవ్వింది.

"నీ చక్కదనం నాకు మతిలేకుండా చేస్తున్నమాట నిజమే" నన్నాడు ఇలియూ.

"ఏయ్, వేరా! నువ్వీయన్ను ప్రేమించావా నీ పీక నొక్కేస్తా సుమా!" అని పాష్కా పకపకానవ్వాడు.

తన ప్రియురాలిసౌందర్యం ఇలియూను ఆకర్షించి నందుకు పాష్కా పొంగిపోయాడు. వేరాకి కూడా తనఅందం పైన అభిమానంకలిగింది. ఆమెపెదాలమీద చిర్నగవు చిందులుతొక్కుతూంది. పల్చని జాకెట్టును పగలదీసు కొస్తోన్నట్టునై ఆమెవక్షోజాలు. పసిబిడ్డ అద్దంలో పాపని చూచి కేరింతలుకొట్టినట్టు వేరా తనరూపానికి తానే మురుసుకొంటోంది.

ఇలియూ ఈర్ష్యతో నలువేపులా చూస్తున్నాడు. అప్పుడు పాష్కా ఒకపద్యం చదివాడు.

"ఎంత మధురంగా వుంది!" అంది వేరా ఆనందంతో.

"ఈ మాధుర్యాని కేంగాని, వేరా! ఆయన్ను చూడు! ఇప్పుడే కొలిమిలోంచి బయటపడ్డట్టు యెల్లా వుడికిపోతు న్నాడో!" అని పాష్కా ఇలియావంక చూస్తూ "మిత్రమా! గుటక లేస్తూ యీ మెవంక చూస్తే యేంలాభం? నువ్వుకూడా ఒకదాన్ని చూచుకో!" అన్నాడు.

వేరా ఇలియాకళ్ళలోకి చూచి "నాకంటె సొగసు కత్తెనా?" అని పరియాచకమాడింది.

ఇలియా నవ్వి "నీకంటె అందగత్తె యింకెవరు?" అన్నాడు.

"మీారు చూడకుండానే అల్లాఅనడం న్యాయమేనా?"

పాష్కా ఇలియావంక భావయుక్తంగాచూచి "మా వాడికి కథంతా తెలుసులే. నా అదృష్టంకొద్దీ నువ్వు దొరి కావు; కాని, నీ ప్రవర్తన తలుచుకుంటే మాత్రం నాకు భరిం చరాని వేదనకలుగుతోంది. వెయ్యితేళ్లొక్కసారిగా పొడిచినట్టుంటుంది" అన్నాడు.

"పోనిద్దురూ! ఆసంగతి యిప్పుడెందుకు, మర్చి పొమ్మంటేను?" అంది వేరా తలొంచుకొని.

వేరాముఖంలో పొడకట్టిన దైన్యాన్ని ఇలియా గమనించాడు. ఆమెయింకా చెపుతూనేవుంది–"ఒక్కరోజే కావచ్చు; నేను మాత్రం నీ దాన్నే. నాకూ ఆ విషయం దుస్సహంగానేవుంది. అయితే యేం చేయగల్ను? సుఖ దుఖాఃలు రెంటినీ నే నొకేసారిగా అనుభవించాలనుకోవటం

లేదు. దుఖాఃన్నీ, వేదననీ నేను ఒంటరిగానే అనుభవిస్తాను. సుఖానందాలను మాత్రం నీతోకలసి పొందాలని నా కోరిక.

పాష్కా మౌనంగా ఆమెమాటలు వింటున్నాడు.

ఇలియా వాళ్లిద్దరికి పూరటకల్గించే మా టేదయినా అందామనుకున్నాడు. "మీరిద్దరు యిల్లా అనుకొంటే యేం లాభం? నావద్ద డబ్బే వుంటే మీచేతుల్లోపోసి సుఖంగా బ్రతకండి. ప్రేమజీవులగు మిమ్మల్ని చూచి నేను ఆనంద మనుభవించుతా నని చెప్పేవాణ్ని. మీరు పరస్పరం ప్రేమించుకొన్నారు. వాస్తవిక ప్రేమ అంటే మీదే. నాకు సర్వత్ర కృత్రిమము, పాపమే కన్పించాయి."

ఇలియా ఆవేశభరితుడయాడు. ఏదో అవ్యక్త ఆందోళిత హృదయుడై కుర్చీలోంచిలేచి పచారు చేయసాగాడు.

వేరా కృతజ్ఞతాదృష్టితో వానివంక చూస్తోంది. పాష్కా నవ్వుతూ తరువాత యేమి టన్నట్లు చూశాడు.

ఇలియా చెప్తున్నాడు—"నే నింతవరకు యిల్లాంటి అపురూపసౌందర్యాన్ని చూడనేలేదు. మీలాగా పరస్పరం నిష్కల్మషంగా ప్రేమించు కోవటం కూడా చూచెరుగను. పాష్కా! ఇప్పుడు నా హృదయంలో యేముందో చెప్పనా? నీ అదృష్టాన్ని చూచి నా కీర్ష్యకలుగుతోంది. మిమ్మల్ని చూచి సంతోష–విషాదాలు రెండూ నా కొకేసారి కల్గుతున్నాయి. సర్వేశ్వరుడు తన కరుణాదృష్టిని మీపైన ప్రసాదించుగాక! ఈ సందర్భంలో నేనొక విషయం చెపు

తాను, వినండి—కేవలం కురూపి అయినంతమాత్రాన యే వ్యక్తినీ అసహ్యించుకోకూడదు. సర్వమానవులు ఆ దేవ దేవునిసంతానమేననీ, భగవంతుడు తనసృష్టిలో లోటు చేయడు కాబట్టి, అందరినీ సౌందర్యవంతులుగానే సృజించుతాడనీ మరువరాదు."

"నువ్వు చెప్పింది వాస్తవమే" నన్నాడు పాషా.

"మీరూ ఆ ప్రేమజీవుల్లో ఒకరేగా" అంది వేరా.

"నాకా అదృష్టం లేదు......" అని నిట్టూర్చి "ఒక కప్పు టీ యిద్దూ" అంటూ ఇలియా కుర్చీలో కూలబడ్డాడు.

ఇలియామాటలతో పాష్కాహృదయం ఆనంద సందోహమయింది. అప్పుడు వానిముఖం వుజ్వలంగా వుంది. కళ్ళు మెరుస్తున్నయి. మంచంమీదినుంచి దిగి అటూ యిటూ నడయాడుతున్నాడు. భావావేశంతో యిల్లా అన్నాడు–

"ఈ సమాజాన్ని పూర్తిగా అవగాహనచేసుకొనేటంతవరకె యెవరికైనా యీ లోకంమీద మోజుంటుంది. .........నిన్నుకూడ యిక్కడికి తీసుకొని రావడం మేలే అయింది. నాకు చక్కనితోడు దొరికావు."

వేరా ఇలియానుద్దేశించి చెప్పింది—"పాష్కా స్థితి యెప్పుడూ యింతే. ఇంద్ర ధనస్సులాగా మెరుస్తాడు. మళ్ళీ అంతలోనే ఆలోచనలోపడి దిగులుపడుతాడు."

"విచారపడితే యేం ప్రయోజనం?"

తరువాత వేరా తేనీరు తెచ్చింది. ముగ్గురూ తాగారు. అందరికి వుషారెక్కింది. ముఖాలు ఆనందంతో కళకళలాడుతున్నై.

"వేరా! నేనుకూడ రావచ్చా?" అని బయటనుండి యెవరో అడిగారు.

"రా" అంటూనే లేచెళ్ళి వేరా తలుపుతీసింది. ఒక చక్కనిచుక్క లోపలికొచ్చింది. "ఈమె నా స్నేహితురాలు లీపా" అని వేరా ఆ వచ్చినయువతిని ఇలియాకి పరిచయంచేసింది.

గుమగుమలాడుతూ వచ్చిన ఆయువతిని ఇలియా తలెత్తిచూశాడు. బక్కపల్చగావుంది. కురులు మోకాళ్ళు దాటుతున్నై. వచ్చీరావటంతోనే "ఒంటరిగా వుంటే యేమీ తోచలేదక్కా! మీరు మాట్లాడుతూంటే కాస్సేపయినా కాలక్షేపమవుతుందని చక్కావచ్చాను. ఇక్కడ ఈయన ఒక్కడే కూచున్నాడేం? (ఇలియాతో) ఏమండీ! నేను కూచ్చోనా మీ సరసని?" అంది కొత్తన్నా లేకుండా.

లీపా కుర్చీని ఇలియాదగ్గరకి లాక్కొని కూచుంది. అతనేమీ మాట్లాడకపోయినా మళ్ళీ తానే యిల్లాఅన్నది. "వాళ్ళిద్దరూ సరససల్లాపాలాడుకుంటూంటే మీరు వాళ్ళ మొహాలు చూస్తూ కూచున్నారా? పాపం! మీకెవరూ జతలేకపోయారు కామోసు!"

ముక్కూ - మొహం మెరుగని ఒకపడుచు యెబ్బెరికమైనా లేకుండా తనతో ఆవిధంగా మాట్లాడుతూంటే ఇలియా విస్తుపోయాడు. ఇక మాట్లాడకపోతే మర్యాదగా వుండదని "వీరిద్దరితో మాట్లాడుతూంటే నాకు బాగానే కాలక్షేపమవుతోంది" అన్నాడు.

"చిత్రంగా వుందే! అయితే మీరు బలే తమాషా మనిషన్నమాట. (వేరా వేపుకు తిరిగి) నిన్న నేను 'వర్జిన్ చర్చి' కెళ్లా నక్కా! అక్కడ బోధకురాలుగావున్నామె యెంత చక్కని దనుకున్నావు! ఆవిడ అందులో చేరినందుకు నేను చాలా విచారపడ్డాను." అన్నది లీపా.

"నే నయితే విచారించను లీపా!"

"అల్లా అంటే యెవరు నమ్ముతారు?"

లీపా పైటచెంగునుంచి గుమాయించుతున్న పరిమళంతో ఇలియా మైమరచి వారి సంభాషణలు వింటున్నాడు. లీపా నెమ్మదిగా మాట్లాడుతోంది. వినేవారి నిట్టే ఆకర్షించగల మాధుర్య మున్నదామె స్వరంలో.

"పోలటోవ్‌ను రానిద్దామా, వద్దా అన్న సమస్యనా కింకా తెగలే దక్కా!"

"అందులో ఒకరు చెప్పేదేముంది? నీయిష్టం" అంది వేరా.

"ఆయన నిప్పుడే తగిలేయ్యకూడదనిపిస్తోంది. ఆయన ముసిలాడే; గాని, బాగా డబ్బున్నవాడు. అయితే పరమ

లోభిలే. చెయిజారిరావటం మహాకష్టం. ఇప్పుడు నా పేర నాలుగువేలు బాంకిలో వేసి నెలకి నూటయాభై రూపాయ లిమ్మంటున్నా. ఆయన వందకుమించి యివ్వనంటున్నాడే.''

''ఈ సొదంతా నాతో చెప్పటమెందుకే? నువ్వే ఆలోచించుకో.'' అన్నది వేరా విసుగ్గా.

''పోనీలేవే అక్కా!'' అని మొహం ఇలియా వేపుకు తిప్పుకొని ''మీ కళ్ళెంత పెద్దవండి! తోణక్కుండా బెణక్కుండా ముంగిలా కూచున్నారేం? పలుకే బంగారమా'' అంది లీసా.

ఈ లయ తన్ను వల్లోవేసుకోటానికే ననుకున్నాడు ఇలియా. ''ఏముంది మాట్లాడ్డానికి?'' అన్నాడు వెక్కసంగా.

లీసా నిరుత్సాహపడలా. ''ఏమీ లేకపోతే మీ రాలోచించేదేమిటి? పోనీ మీ రేంచేస్తుంటారో చెప్పండి.''

''వీధుల్లో చిల్లరవస్తువు లమ్ముతూంటాను.''

''అల్లాగా! ఏ బ్యాంకులోనో, దుకాణంలోనో గుమాస్తా అయివుంటారేమో ననుకున్నాన్లెండి! మీ సీటు చూచి అల్లా అనిపించింది.''

''సీటో—గోటో పరిశుభ్రత నాకిష్టం.''

''అది మంచి పద్ధతేలెండి. సరేగాని, మీకు కించి త్తైనా వివేకం ఉన్నట్టులేదే.''

''నీ ఉద్దేశం?''

"ఒక ఆడుదానివద్ద యిద్దరు మగాళ్ళా. ఇది సమంజసంగా వుందీ?'' అని లీపా పరిహాసంచేసింది.

"అల్లాగా! అయితే నే నిప్పుడే వెడుతున్నా లే.''అని ఇలియా లేచాడు.

"ఆగండి, ఇందాకటినుంచి లేంది యిప్పు డంత తొందరేం'' అని లీపా ఇలియాచెయ్యిట్టుకొని వేరా నడిగింది— "ఈయన్ను నాగదిలోకి తీసికెళ్ళనా అక్కా?''

వేరా నవ్వి ''ఆయన వస్తానంటే నేను వద్దన్నానా? తీసుకెళ్లు పిల్లా!'' అంది.

ఇలియా ''ఎందుకూ?'' అనడిగాడు.

''ఆమెకొంగుపట్టుకొని వెళ్ళవోయ్, నీకే తెలుస్తుంది!'' అన్నాడు పాష్కా నవ్వుతూ.

ఇలియా కళవళపడ్డాడు. అతను తటపటాయించుతూంటే లీపా లాక్కొనిపోతోంది. దారిలో ''మీకిదే మొదలల్లేవుంది. సిగ్గుగా వుందా? పర్వాలేదులే. నా వెంట రండి; అన్నీ నేర్పుతాను. నాకు వెనకా ముందూ యెవరూ లేరు. (పైనచంద్రబింబాన్ని చూపి) ఆ చందమామని పట్టుకోవాలన్నా యెగిరిపోతాను. నన్ను వద్దనే వాళ్ళెవరూ లేరు. ప్రాణంపోయినా నాకు లెక్కలేదు.'' అని చెపుతూ లీపా ఇలియాను వొరుసుకొని నడుస్తోంది.

ఇలియా మాటపలక్కుండా ఆ జవ్వనిప్రక్కను నడుస్తున్నాడు. ఆమెమాటలతనికి వినిపించటమే లేదు.

ఆ సుందరితనూలతస్పర్శతో పరవశుడయ్యాడు. ఆమె తీయని తేనెపలుకులతో ముగ్ధుడయ్యాడు. ఆ తలిరుబోణి చూపులు వాడితూపులయి సమ్మోహితునిగావించినై. ఆ విలాసిని పూసుకొన్న సెంటు-అత్తర్ల సువాసనలతో ఇలియా గుమ్మైపోయాడు.

# 14

ఆ ఆకస్మికసమాగమము ఇలియా కెంతో సుఖదాయక మనిపించింది. వానికళ్ళముందు జరిగిన ఘటనల కారణంగా ఇలియా హృదయంలో పడిన వేదనాపూరిత గాయాని కది పట్టీలాగా పని చేసింది. సర్వాంగసుందరియగు పడుచొకతె సర్వస్వము తన కర్పించుట గాంచి ఇలియా హృదయ మభిమానభరితమయింది. లీపాఅనురక్తితో అత డానందసాగరమందు మున్కలు వేయసాగాడు.

ఇలియాతలపై చేతితో నిమురుతూ, పెదవులాని లీపా అన్నది— "ప్రియా! నిన్ను చూచేకొద్దీ నా అనురాగ మతిశయించుతోంది. నీ హృదయము నిర్మలము, నిశ్చలమూను. నీవు సేచ్ఛాస్వభావివి. నా కా గుణమంటే

అత్యంతాభిమానము. మన యీ సన్ని వేశ మింతకుపూర్వమే తటస్థమయివుంటే, నేను నిన్ను పెళ్లాడి దేశ దేశాలు పరిభ్రమించుతూ జీవితానందాన్ని అనుభవించేదాన్ని.

ఇలియా ఆమెను మనసార ప్రేమించాడు. ఆమె సరళ స్వభావము వానికి పూర్తిగా సంతృప్తిని కలిగించింది. లీపా ఆ పతితజీవితంలోకూడ తన ఆత్మగౌరవాన్ని కాపాడు కుంటోంది. వయసుకు చిన్నదే అయినా అనుభవంలో జాణ. అన్యవార కాంతలవలె అసభ్యంగా ప్రవర్తించేది కాదు. కండ అట్టే లేకపోయినా గట్టి శరీరం. స్వరం మధురమై శ్రావ్యంగా వుండేది. స్వభావ ముదాత్తము. నీటుగా వుండటం ఆ యెలనాగ అభిమాన గుణాల్లో ఒకటి. పనిముట్లు వగైరా వస్తువు లెక్కడెక్కడ వుండాలో చక్కగా సర్ది గదిని గలీజుగా లేకుండా ఆకర్షణీయంగా వుంచేది. ఆమెకి నిగ్రహశక్తి కూడ మెండే; కాని, ఒక్కొక్కప్పుడు జుట్టు చెదరి, ముఖం యెలా తెలాపోయి, కన్నులు కాంతిదప్పి వుండేవి. అల్లాంటప్పు డామెమూర్తిని గాంచి ఇలియా హృదయం కరుణాప్రపూరిత మయ్యేది. ఆమె నవ్వుహు పల్కరించటానికే వెరిచేవాడు.

ఆమె ఇలియామనోభావాన్ని కనిపెట్టి తన మొహాన్ని చేతుల్తో కప్పుకొని వేరాగదిలోనుంచి మంచినీళ్లో, యేదో తెచ్చి పెట్టుమని వంక పెట్టి అక్కడినుంచి పంపించేసేది.

వేరా ఇలియూష్కానముఖం చూచి అతని కెల్లాగైనా సంతోషం కల్గించాలన్న తలంపుతో నవ్వుతూ, పేలుతూ మాట్లాడేది. వేరా ఒకసారి "అప్పుడప్పుడు నీ హృదయాని కేదో దెబ్బ తగులు తున్నట్టుందే?" అనడిగింది.

"మీ మనసు మంచుగడ్డలాంటిది. చిర్నగవుచిందు లతో కరిగిపోయే దేగా!" అన్నాడు ఇలియూ.

"అమ్మ దొంగా! మీరిద్దరూ బలే మోసగాళ్ళే నే!"

ఈవిధంగా యిద్దరూ చాలా చనవుగా వుండేవాళ్లు. ఇలియూకు వేరాయందు వల్లమాలిన అభిమానం. ఆమె స్థితి కతను జాలిపడేవాడు. పాష్కా చీటికీ-మాటికీ కీచు లాడుతున్నందుకు బాధపడేవాడు. ఇద్దరిమధ్య తానుచేరి వాళ్ళని సమాధానపరిచేవాడు. వేరా తలంటుపోసుకొని జుట్టారబెట్టుకొంటున్నా, పాడుతున్నా, కుట్టుకొంటున్నా ఇలియూ యెదురుగా కూచుని రెప్పలువాల్చకుండా ఆమె ముఖాన్నవలోకించుతూండేవాడు. అప్పట్టున వానికి కలిగే ఆనందం వర్ణనాతీతం. ఆమెముఖాన విషాదచిన్నెలగపడినా, నవ్వులో వుదాసీనత తొలికినా ఇలియూ హృదయం తపించేది. ఆమెని అనునయించేందు కెన్నెన్నో తంటాలుపడేవాడు.

"సోదరా! ఈ నికృష్టజీవిత మెన్నాళ్ళని గడుప గలను? చుక్కానిలేని నా జీవితనౌకని అగాధసాగర తరంగాల్లో వదలేశాను. అది తెలిసిన్నీ పాష్కా నాతో పాటు మునిగిపోవటానికే సిద్ధమవుతున్నాడు యెందుకో?" అన్నది వేరా ఒకప్పుడు ఇలియూతో

"మునిగినా, తేలినా నిన్నొదలకూడదనే వాని వాంఛ" అన్నాడు ఇలియా.

"పాష్కా నిజంగా నాయందంత అనురాగంతో వున్నా డంటావా?"

అని వేరా అడుగుతూండగానే లీపా వచ్చింది. ఇద్దరూ మౌనముద్ర వహించారు. లీపా ఇలియాచెయ్యి పట్టుకొని తీసికెళ్ళింది. ఇలియా లీపావెంట వెళ్తూ 'ఒక గంటక్రితం నేనుచూచిన ఆ దీనమూర్తేనా ఈబిడ! యింతలో యెంత మార్పు!' అనుకున్నాడు.

మరొకప్పుడు లీపా ఇలియాతో "నువ్వు సామాన్య రైతుబిడ్డ వైపోయావు! విద్యావంతుడివి కాదే అని నేను కించపడుతున్నాను. మన యీ జీవితము యేం జీవితము! నువ్వా పెట్టిబేరం మానేసి యింకేదైనా వృత్తిలో ప్రవేశించు; లేకపోతే యేదయినా వుద్యోగం సంపాదించు. నీ కిష్టమైతే ఖోలటోవ్ను నడిగిచూస్తాను" అన్నది.

"వాడు నీ కిస్తానన్న ఐదు వేలు యిచ్చాడూ?" అన డిగాడు ఇలియా.

"ఇంకా చేతికిరాలేదు గాని, యిస్తాడని నమ్మకం వుంది."

"నా కెప్పుడయినా తారసిల్లితే వాడి నేం చేస్తానో చూడు!"

"నీ కాయన యేం చెరుపుచేసాడు?"

"ఏం చేశాడా? ఇంకేం చెయ్యాలి? వాడు నా లీపా..."

లీపా మధ్యలో ఆపి "ఎంత పిచ్చివాడివి! ఆయన శరీరం కృశించి, జవ-సత్వాలుడిగిన ముసలితొక్క! నీ కెందు కంత కచ్చి?" అంది.

"ఏమైనప్పటికీ వాడు నీవద్దకు రావడం నేను సహించలేను. వాడి ప్రాణం తీయకుండ వదల్ను. ఆ వృద్ధజంబుకాన్ని చంపినా పాపంవుండదు" అన్నాడు ఇలియా కోపంతో పళ్ళు పటపటనూరుతూ.

"నన్ను డబ్బయినా గుంజుకోనియ్యి" అని లీపా నవ్వింది.

ఈసంభాషణజరిగిన దర్మిలా కొద్దిరోజుల్లోనే పోలటోవ్ చాలామట్టుకు లీపాకి ముట్టజెప్పాడు. ఆమె కోసమని ప్రత్యేకంగా వక యిల్లేర్పాటుచేశాడు. అందులో ఆధునిక పద్ధతిని ఫర్నీచరు వగయిరా లమర్చజేసి సర్వాలంకార సుశోభితం గావించాడు. అయితే అందువల్ల లీపా కే మాత్రం వుల్లాసం కల్గలా. యెప్పటిలాగే వుదాసీనంగా వుంటోంది.

కొత్తయింట్లో కెళ్ళినతర్వాత ఒకరోజున లీపా ఇలియాతో యిల్లా చెప్పింది—— "నా కిప్పుడు యిర్వై యేడేళ్ళు. మరి మూడేండ్లలో యింకో పదివేల రూపాయలు చేజిక్కించుకొని ఆ ముసలాయనకు స్వస్తి చెప్పేస్తా. అప్పుడు నేను సర్వస్వతంత్ర నవుతాను. ఆతర్వాత మన

మిద్దరము స్వచ్ఛందజీవితం గడుపుతూ హాయిగా సుఖ పడొచ్చు. ఈ ప్రపంచంలో జీవితాన్నెల్లా నెట్టుకొని పోవాలో నా వద్ద నేర్చుకో.''

నిజానికి లీపా ఇలియా కెన్నివిధాలుగానో హితాన్ని బోధించేది. అత డామెకు చూపుల్లో కృతజ్ఞతని వెల్లడించే వాడు; కాని, తనలీపాని మరొకడు కౌగలించుకొని, ముద్దాడే దృశ్యాన్ని తలచుకొన్నప్పుడు వానిహృదయం వదా - వద లయ్యేది. అయితే, అంతలోనే లీపాసంపర్కంవల్ల భావిలో తాను స్వంతంగా ఒక షాపుపెట్టుకొని జీవితాన్ని హాయిగా వెళ్ళబుచ్చవచ్చనేభావం కలిగి అది మర్చిపోయేవాడు. ఈ ఆశాభావంతో వాని విషాద మదృశ్యమయ్యేది. ఇదేవిధంగా ఇలియా మరో మూడు మాసాలు దొర్లించాడు.

ఒకనాడు ఇలియా బేరంచాలించుకొని యింటికి చేరాడు. పెట్టెను గదిలోదించి మామాగదికి దారితీశాడు. గది మధ్యలో బల్ల కిరుప్రక్కలా కూర్చొనివున్న ఫర్ఫిష్కా, జాకోబులతోపాటు బల్లమీద కార్కుతీసివున్న బ్రాంది సీసాకూడ ఇలియాకంటపడింది. జాకోబు చెపుతున్నాడు—

''ఈశ్వరుడు సర్వాంతర్యామే అయితే నన్ను చూచి తీరతాడు. మిత్రులందరు నన్ను వదిలేశారు. ఈ లోకంలో నాకు నా అన్నవాళ్ళెవరూ లేరు. నాతండ్రికి నేనంటే అసలే గిట్టదు. ఆయన కుత్సితుడు, మోసకారి, అన్నిటికీ మించి కర్కోటకుడు!''

"నిజమే, నీకు పట్టినగతి యెవరికైనా విచారం కల్గిస్తుంది; కాని, చేయగల దేముంది?" అన్నాడు ఫర్‌ఫిష్కా.

"ఎవర్ని నమ్మేది? అంతా అయోమయంగా వుంది. ఈ ప్రపంచంలో బ్రతికే దెల్లాగో తోచకున్నది. మా నాన్న సంగతి చెప్పనేఅక్కర్లేదు గద! ఇలియా నన్ను విడిచిపెట్టేశాడు. మాషా అమాయకపు పిల్ల. ఇక నా కెవరున్నారు?"

ఇలియా ద్వారంవద్ద నిలబడి పై మాట లన్నీ విన్నాడు. వానికి దుఃఖం పొంగివచ్చింది. మిత్రుని పెదిమలు తడారి, మోము వాడిపోయివుండడం చూచాడు. జాకోబు కంఠస్వరంలోనైనా పటుత్వం లేదు. ఆ మందభాగ్యుని మాటలకు ఫర్‌ఫిష్కా మెడతోసహా తలూపుతున్నాడు. భావరహితంగా నవ్వుతున్నాడు. వాని ధ్యాస అసలు జాకోబు మాటలయందే వున్నదో, లేక బల్లమీది బ్రాందిబుడ్డిమీదనే వుందో చెప్పలేము. ఇలియా మెల్లగా గదిలో ప్రవేశించుతూ "ఏమి టీ పని?" అని జాకోబును గద్దించాడు.

జాకోబు త్రుళ్ళిపడ్డాడు. మిత్రునివంక దీనంగా చూచాడు. "మా నాన్నేమోనని కంగారుపడ్డానోయ్" అన్నాడు.

ఇలియా వెనుకటిప్రశ్ననే రెట్టించాడు.

ఫర్‌ఫిష్కా లేచి నుంచున్నాడు. వానికికాళ్ళు తేలి పోతున్నై. "ఇలియా! వీనివిషయం వదిలేద్దూ. వీడి కింద

లోనే శాంతి వుంది. వీడికి తాగుడు అలవాటవడం భగ వంతునికృపాఫలితమే సుమా!'' అన్నాడు.

జాకోబు బిక్కమొగంతో ''నాన్న నన్ను చావ గొట్టాడు ఇలియా!'' అన్నాడు.

ఫర్‌ఫిష్కా యెదురొమ్ముమీద గుద్దుకొని బిగ్గరగా అరిచాడు— ''నా కళ్ళముందేనోయ్! వీడిపళ్ళు కదిలి పోయినై. ముక్కునుంచి రక్తం వరదలై పారింది.''

జాకోబుముఖమంతా వాచిపోయింది. ''నాకు పందొమ్మి దేళ్ళుకూడా వచ్చినై. ఇంకా దెబ్బలుపడాల్సిందేనా? నేను తప్పేమీ చేయకుండానేరా'' అని చెబుతూంటే జాకోబు కళ్ళలో గిరున నీళ్ళు నిండినై.

స్నేహితుడిని యేమని ఓదార్చాలో ఇలియాకు స్ఫురించలా. జాకోబు కుర్చీకోడు పట్టుకొని యేడుస్తున్నాడు. ఫర్‌ఫిష్కా వాణ్ని కుర్చీలోకూచోబెట్టి, తాను సీసాను గ్లాసులోకివంచుకొని ఇలియాతో అన్నాడు— ''జాకోబును బాగా యేడ్వనీ. ఏడిస్తే గుండె తేలికవుతుంది. మా పా యిల్లాగే యేడుస్తూంటే మతిస్నాదగ్గరకు పంపేశా.''

''అసలేం జరిగిందేమిటి?'' ఇలియా అడిగాడు.

''మీ బాబాయి యెక్కడికైనా పోయి యేకాంతంగా తపస్సుచేసుకుంటానసీ, తనకు సెలవిచ్చి పంపాల్సిందనీ పెత్రుహా నడిగాడోయ్. అసలదివరకునుంచే ఓరెన్సు కధ్యాపనం చెప్పాలనుకుంటున్నాడు. సెలవిమ్మని అడిగిందే

తడవుగా "సరే" నన్నాడు. తనకోసంకూడా భగవంతుని ప్రార్థించమని పెరెన్నుతో చెప్పాడు. ఆమాట విని జాకోబు తానుకూడ పెరెన్నువెంటపోయి తండ్రి పాపపరిహారార్థం తపస్సుచేస్తానికి అనుజ్ఞనిమ్మన్నాడు. ఇందుకేనయ్యా పెట్రుహా కొడుకునిపట్టుకొని చితుకబాదింది" అని ఫర్ షిప్కా జరిగిన వైనం టూకీగా చెప్పాడు.

"ఇక నే నీ కొంపలో బతకలేను; ఎక్కడికైనా పారిపోతా; లేకపోతే యేందులోనైనా పడి చస్తాను. నేను నిజంచెప్పినందుకేగా ఆయన నన్ను కొట్టింది. ఇక బ్రతికి యేంలాభం చెప్పు?" అని జాకోబు వాపోయాడు.

ఇలియా దుస్సహమైనవ్యధ చెందాడు; వాని కేమీ పాలుపోలా. మెదలకుండా అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు. పెరెన్ను యీ స్వార్థమయసమాజాన్ని, లౌకిక ప్రపంచాన్ని వదలి అరణ్యవాసానికి పోదలిచాడన్నసంగతి వానికి సంతోషాన్నే కల్గించింది. తానుకూడా యెక్కడైనా పోతేనే బాగుండు ననుకున్నాడు.

గదిద్వారంవద్దే పెరెన్ను యెదురయ్యాడు. అతని కళ్లు మెరుస్తున్నై. ముఖం కళకళలాడుతోంది. నేనీ కామాటంవదిలించుకొని తీర్థయాత్రలకు వెళ్లా లనుకుంటున్నారా అబ్బాయ్! ఇవాళ నౌకిరీ వదిలేసినతర్వాత నాకు బందిఖానాలోనుంచి బయటపడ్డట్టుగా వుంది. ఇన్నాళ్ళకు దేవుడు నాపైన దయతలిచాడు. ఆయన నా ప్రార్థనకూడ తప్పక వింటాడు" అని చెప్పాడు.

ఇలియా గంభీరంగా అడిగాడు— "జాకోబుసంగతి మీకు తెలిసిందా? వాడు తాగుడు మెదలెట్టాడు."

"చిన్నతనంలో తాగటం తప్పే."

"పెత్రుహా వాడిని కొట్టినప్పుడు మీరున్నారా?"

"నా ముందే బాదాడు. ఏం?.

"అదే వాడిదుర్వ్యసనానికి కారణమయింది."

"అదేనా?" అని పెరెన్ను నవ్వాడు.

జాకోబు దుర్వ్యసనలోలుడైనట్టు విని పెరెన్ను యేమాత్రం విచారపడటంలేదని ఇలియా గ్రహించాడు. వానిహృదయం ద్వేషభావంతో నిండిపోయింది. పెరెన్ను అప్పుడున్నంత ఆనందంగా వుండటం వాడిదివరకెన్నడు చూచివుండలేదు. తోటి మానవుడొకడు అధఃపతన మవుతూంటే పెరెన్ను సంతోషంతో వుప్పొంగిపోతున్నందుకు ఇలియా చింతించాడు. కిటికీలో కూర్చొని "హోటలుకు వెళ్ళరేం" అన్నాడు.

"నీతో మాట్లాడాలి."

"ఏమిటి?"

పెరెన్ను ఇలియాదగ్గర కెళ్లి "నేను త్వరలోనే వెళ్ళిపోతాను. నువ్వికయేకాకివయిపోతావు. అందువల్ల..."

"మీరు చెప్పదలచినదేదో స్పష్టంగా చెప్పరాదూ?" అన్నాడు కర్కశంగా.

ఒరెన్సు మొహం ప్రక్కకుతిప్పుకొని "చెప్పాలనేగా! కాని, అదే చెప్పలేకపోతున్నాను." అన్నాడు.

"నా విషయంలో యేమైనా చెప్పదలిచారా?"

"నీ విషయంలోకూడాను. ముందు నేను చెప్పేది విను: నేను కొంతడబ్బును వేరే తీసిపుంచాను."

ఈ మాటలు వినగానే ఇలియా నవ్వాడు.

"నవ్వుతా వెందుకు?" ఒరెన్సు అడిగాడు.

"నాకు తెలుసులెండి. సరే, ఆ మొత్తమెంత?"

"మఠం కట్టించేందుకు రెండొందలు, నీకు వంద"

"ఒంద రూపాయలా!"

ఇలియా తన కంతకంటె పెద్ద మొత్తా న్నిస్తాడని ఆశించాడు. అసలాయన ధనాని కెందు కాశించానా అని తనపైనా, తక్కువగా యిస్తున్నందుకు పిన్నబ్బమీదా కోపం వచ్చింది. కిటికీలోనించి దిగి ముఖంచిట్లిస్తూ "నా కా పాపపుసొమ్ము అక్కర్లా" అన్నాడు.

ఒరెన్సు తెల్లపోయాడు. కొడు కావిధంగా మొహమ్మీద అనేసేటప్పటికి నిలువునానీరయ్యాడు. నుంచోలేక పక్కమీద కెళ్ళి చతికిల పడ్డాడు. ఒరెన్సు ఆలోచనలో పడ్డాడు. విషాద మతణ్ని ఆవరించింది. జంకుతూనే ఇలియావంక చూచాడు.

"ఎందు కల్లా చూస్తారు? నేను మీా దొంగసొమ్మును ముట్టుకోను." అన్నాడు ఇలియా నిర్మొగమాటంగా.

"ఇలియా! కోప్పడకు. నా మాట వినవూ?"

"ఏమిటి? చెప్పండి."

"నిన్ను కన్నకొడుకులా పెంచాను. నేనా పాపాని కొడిగట్టిందికూడా నీకోసమే. నాపైన జాలిలేదూ? నువ్వా డబ్బు పుచ్చుకోనకపోతే దేవుడు నన్ను క్షమించడు. నాకిక నిష్కృతి వుండదు." అని తెరెన్సు అతిదీనంగా బ్రతిమాలాడు.

"పాపాన్ని మూటకట్టుకొని భగవంతునిశరణ్యాం లోకి వెళ్తున్నారా? నాకోసం ధనాన్నపహరించమని నే నెప్పుడు చెప్పాను? మీా రెవరిసొమ్ము నపహరించు తున్నారో అప్పు డాలోచించారూ?"

"నువ్వు పుట్టాలనిమాత్రం కోరుకున్నావా? ఇదీ అంతే. నా మాట విని డబ్బుపుచ్చుకోరా అబ్బాయి! నా మనశ్శాంతికోసం, నా మోక్షంనిమిత్తం దేవుని పేర యీసొమ్ము తీసికో. ఇప్పు డింతమట్టుకే గాని, తిరిగి వచ్చిన దర్మిలా తతిమ్మా దంతా నీకే యిచ్చేస్తాను."

తెరెన్సు బ్రతిమాలుతూంటే ఇలియా అతని దీన వదనాన్ని చూచాడు. పినతండ్రిపట్ల తనహృదయంలో లేశమాత్రమైనా జాలి వున్నదీ లేనిదీ నిశ్చయించుకోలేక పోయాడు. కాస్సేపాలోచించి "సరే, తీసుకుంటాలెండి." అన్నాడు.

ఆమాట చెప్పి యిక నక్కడ ఒక్కక్షణమైనా వుండలా. చివాలున లేచి పోయాడు.

ఆ పైకం తీసుకోటానికి అంగీకరించాడే గాని, ఇలియా హృదయంలో దేవుతూనే వుంది. తానుకూడా పతనమయినట్లే భావించాడు. 'అదయినా స్వల్పమొత్తం. ఒకటి రెండు వేలయినా బాగుండేది. షాపు పెట్టుకొని ఈదుర్భరదారిద్ర్యాన్నుంచయినా విముక్తిపొందేవాణ్ని. విధం చెడినా ఫలం దక్కాలి గదా! జర్నియాసామ్ముల్లో అసలు బాబాయివంతు కెంత వచ్చిందో అడగాలి' అని తలపోశాడు తనలోతాను.

లీపాతోడి సంపర్కం యేర్పడిన లగాయతు వాని కా హోటలుగది మానవనివాసయోగ్యంగా కనపడటంలేదు. నేడది మరీ అసహ్యంగా తోచింది. ఎక్కడ కూర్చోటానికీ మనసొప్పలేదు. హృదయం అల్లకల్లోలంగావుంది. అనాలోచితంగా నడుస్తూ మతిస్సాగదివేపు కెళ్ళాడు. గడ పెక్కేటప్పుడు తన్నూ, ఆ మెనీకూడా ఆకొంప అధఃపాతాళానికి తొక్కేస్తుందనుకున్నాడు.

మతిస్సా కుర్చీలో కూర్చొనివుంది. "నిద్రపోతోంది" అని మెల్లగా చెప్పింది.

మాషా మతిస్సా పక్కమీద నిశ్చింతగా నిద్రిస్తోంది.

"ఈకాలంలో కన్నతండ్రులే తమసంతానాన్ని చీల్చుకొని తినేస్తున్నారు; గొంతులు నులుముతున్నారు. వీళ్ళ జిమ్మడ! వీళ్ళనెత్తిమీద యేదయినా విరుచుకొని పడదే!" అంది మతిస్సా.

ఇలియా మాషాభవిష్యత్తునుగూర్చి ఆలోచించు తున్నాడు. భగవంతు డామెనొష్టన యేమి రాసిపెట్టాడో ననుకుంటూ మాషా మొహంమ్మీాదనే దృష్టి నిల్పి చూస్తున్నాడు.

"ఆ కర్కోటకుడు దీనిజుట్టుపట్టుకొని యీడ్చాడు. తనకొడుకును కొట్టుకోవడమే గాక, పరాయిపిల్లనికూడ తన్ని, యిద్దర్నీ బయటికి గెంటుతానని బెదరించాడు. పాపం! తల్లి లేని పిల్ల!" అని మతిస్సా ఇలియావంక చూచింది.

లీపా తనచేతిక్రింద పనిచెయ్యటాని కొక ఆడపిల్ల కావాలన్న సంగతి ఇలియా కిప్పుడు జ్ఞప్తి కొచ్చింది.

"నే నీమెకు నౌకరీ కుదుర్చుతాన్లే" అన్నాడు ఇలియా.

మతిస్సా కళ్ళెర్ర జేసి వెక్కసంగా అంది— "నీవా! బలే పెద్దమనిషివి! నువ్వేనా మేలుచేసేది? అంత దయకల వాడివి యిన్నాళ్ళనుంచి యెందు కూరుకున్నావు? ఈపిల్లను చూచి నీకు జాలైనా కల్గటంలేదూ?"

"పిచ్చి పిచ్చిగా వాగకు. మాషా కు వయస్సెంత వుంటుంది?"

"పదిహేనేగా! ఎం తనుకుంటున్నా వేమిటి?"

"నీ తలకాయ! పన్నెండుకు మించి వుండవు. నిన్న మొన్నటి పిల్లేగా! జోకొడితే నిద్రపోతుంది, లేపితే లేస్తుంది. అభమూ శుభమూ తెలియని కసుగాయ కదూ!"

ఇలియూ ఆట్టేసేపు అక్కడా వుండలేక పోయాడు. సరాసరి లీపా యింటి కెళ్లాడు. వెళ్లి తలుపుతట్టాడు; కాని ప్రత్యుత్తరం లేదు. కొంతసేపటికి "ఎవరా మనిషి?" అన్న కీచుగొంతుక విన్పించింది.

ఇలియూ నిర్ఘాంతపోయాడు. "నే నే" నన్నమాట మాత్రం వాని పెదవులను దాటిపోయింది.

ఆ కంఠధ్వని వానికి బొత్తిగా అపరిచితము.

ఒక అనాకారి వృద్ధ తలుపు తెరిచింది. "ఎవరి కోసం?" అనడిగింది.

"లీపాతో పనుంది."

అని ఇలియా చెప్తూండగానే లోపల్నుంచి ఒక వృద్ధుడు వచ్చాడు. పొట్టిగా లావుగా రుబ్బుపొత్రంలా గున్నాడు. ముక్కంటుకొని వుంది. బట్టతల, గడ్డం పాతిక పాలు నెరిసింది. అతడు ఇలియూను తేరిచూచి "ఎవర్నువ్వు? ఎందు కొచ్చా" వని తీవ్రంగా అడిగాడు.

ఇలియా తడబడి ఒకడుగు వెనక్కి వేశాడు. తన కళ్ళని తానే నమ్మలేకపోయాడు. ఆ ముసలాత డెవరో క్షణంలో గ్రహించాడు. లజ్జావమానాలతో వుడికిపోతున్నాడు. క్రోధావేశంచే కళ్ళు మెరుస్తున్నై. అతడే తన ప్రతిద్వంద్వియని తెలిసిపోయింది. "చిల్లర బేరగాణ్ణి" అని జవాబిచ్చాడు.

వృద్ధునిముఖం విప్పారింది. లాంత రెత్తిపట్టుకొని ఇలియూముఖాన్ని పరికించి "ఏమేమి అమ్ముతా" వని అడిగాడు.

"సెంట్లు, అత్తర్లు, అద్దాలు, దువ్వెన్లు, లేసులు, రిబ్బన్లు వగైరా."

అని చెప్పాడు; కాని, ఇలియా వుడికిపోతున్నాడు. అవమానంచే కృంగిపోతున్నాడు.

"ఆఁహాఁ! విటులకు విలాసవస్తువులు, పడుచులకు షోకేళా సరుకులూనా? అయితే యిక్కడికేం పనిమీద వచ్చావ్?"

"బాకీకోసం."

వృద్ధుని చూస్తున్నకొద్దీ ఇలియా హృదయంలోని మంట మరింత రగుల్కొంటోంది. అతనిబోసినోటినవ్వు చూచి కుళ్ళిపోతున్నాడు.

"బాకీయా? ఎంత? బిల్లేది?"

"బిల్లేమిటి?"

"లీపా పుచ్చుకొన్నవాటికి బిల్లు లేదూ? ఎంతో చెప్పు. యిచ్చేస్తాను. ఊఁ, డబ్బున తేల్చుకొని పో."

అని ముసలాయన యింకా ముందుకొచ్చాడు. ఇలియా మరో అడుగు వెనక్కి తగ్గాడు. వానికి కొంచెం జంకుకూడా కలిగింది. అయినా కడుపుమంటాగక "నా దగ్గర బిల్లూ-గిల్లూ వుండదు. నోటి లెక్క" నన్నాడు తీవ్రంగా.

అప్పుడే వృద్ధుని వెనక్కి వచ్చిన లీపా కన్నుగిలపటం చూచాడు.

"ఏమి టీ గడబిడ?" లీపా కంగారుతో వృద్ధుని అడిగింది.

"నువ్వీ బేరగాడివద్ద యేమిటో అరువు పుచ్చు కొన్నావటగా? డబ్బుకోసం వచ్చాడు" అని చెప్పి వృద్ధు డొకసారి లీపాముఖంలోకీ, ఒకసారి ఇలియాకళ్ళల్లోకీ చూచాడు. లీపా అతనిభుజంపట్టుకొని వెనక్కి లాగి ముందు కొచ్చింది. "ఏం, యిదేనా సమయం? మరొకప్పుడు రాకూడదూ?" అని దబాయించిన ట్టభినయించింది.

"మూర్ఖుడికి వేళాపాళా తెలిస్తేగా. బుర్రలో పుట్టింది; ఎగడి తగూ కొచ్చాడు!" అన్నాడు వృద్ధుడు.

లీపా "మీ రెందు కూరుకుందురూ" అని వృద్ధుణ్ని ఆపి "ఎంత? మూడున్నర కాదూ?" అని ఇలియా నడిగింది.

"ఈ ముష్టిభాగ్యాని కేనా యిప్పు డొచ్చాడు! ఆ డబ్బువతలపారేసి తలుపేసెయ్యి" అన్నాడు ముసలాతడు.

తలుపు మూతపడింది.

ఇలియా నిర్విణ్ణుడయి యింకా ఆ తలుపువేపే చూస్తున్నాడు. ఇదంతా నిజమా, కలా అని నివ్వెరపడు తున్నాడు. చేతిలో వెండిబిళ్ళలు మెరుస్తున్నై. మరి నిజం కాదనుకొనే దెల్లా?

చల్లగాలి తెరతో వానికి స్పృహవచ్చింది. నిలువెల్ల దహించివేస్తున్న అవమానాగ్ని తీవ్రమై దుస్సహంగావుంది.

# 15

ఇలియూ హృదయం విషాదాగ్నిచే వుడికిపోతోంది. ముఖాన కత్తివాటుకు నెత్తురుచుక్కలేదు. క్రితంనాటిరాత్రి జరిగిన ఘటనాదృశ్యము వానికళ్ళముందే నిల్చివుంది. వృద్ధుడు గుడ్లుతిప్పుతూ దబాయించటం మరువలేకపోయాడు. పెట్టె నెత్తికెత్తుకొని బజారునపడ్డాడేగాని, అమ్మకం మీద దృష్టిలేదు. వెర్రివానిలాగా—కాలుకాలిన పిల్లివలె అటూ యిటూ తిరుగుతున్నాడు.

ఒక దుకాణంముందున్న బోర్డుపైన దృష్టిపడేప్పటికి ఇలియూ టక్కునఆగిపోయాడు: 'పోలటోవ్ అండ్ సన్స్, వడ్డీ వ్యాపారం' అన్న పెద్ద తాటికాయంత అక్షరాలకింద 'ఇక్కడ పాతనాణాలు మార్చబడును' అని చిన్నసైపులో చెక్కబడివుందా బోర్డుమీద. ఏమనుకొన్నాడో యేమో ఇలియూ గప్‌చిప్‌గా లోపలికి చొరబడ్డాడు. పోలటోవ్ మొఖమల్ మెత్తమీద పద్మాసనంలో కూర్చొండి ఖాతా పుస్తకంపుటలు తిరగేస్తున్నాడు. అప్పుడక్కడ గుమాస్తాలుగాని, ఖాతాదార్లుగాని లేరు. సాహుకారు ఇలియూవంక చురచురచూచి "ఏం కావాలి?" అనడిగాడు.

"మీరు నన్నానవాలుపట్టలా?" ఇలియూ అన్నాడు.

"చిల్లర బేరగాడివని కనపడుతూనేవుందిగా. అప్పు కోసమా?" అన్నాడు.

"కాదు, పాతనాణాలు మార్చుకోటానికి వచ్చా."

"ఏవీ? చూపించు."

ఇలియా పెట్టెదించి డబ్బుకోసం అందులో వెతక సాగాడు. లోపల వానిగుండె దడదడకొట్టుకుంటోంది. బయట చేతులు వణకుతున్నై. సంచి దొరక నేలేదు.

"ఏవీ? త్వరగా నీపని చూచుకొని వెళ్ళు."

"ఇదిగో! తీస్తున్నా" నంటూ ఇలియా సంచి నెల్లాగో వెతికి బయటికితీశాడు. అందులోవున్న నాణాలన్నీ షాహుకారుముందు దిమ్మరించాడు. పోలటోవ్ వాటి నన్నిటిని పరిశీలించిచూచి రెండుతీసి ఇలియాకు చూపుతూ "ఇవి బాగా అరిగిపోయాయి" అని వేరుగా వుంచాడు.

"చాలా పాతనాణాలు. బాగా వురుంగా వున్నై కూడాను" అన్నాడు ఇలియా.

"వీటికి సగానికిమించి యివ్వటానికి వల్లపడదు. తతిమ్మావాటికి మామూలు పాతిక విరగ్గోతే. ఇష్టమైతే చూడు" అని పోలటోవ్ ఖాతాపుస్తకంతీసి చూచుకో సాగాడు.

ఇలియా కోపం ఆపుకోలేక పోతున్నాడు. ప్రతీకార భావము వాని నున్మత్తుని గావించింది. రెప్పపాటులో వృద్ధునిపై నురికి మెడ లంకించుకున్నాడు. రెండు చేతుల్తో

గట్టిగా పీక నొక్కాడు. తర్వాత వెనక్కి పడద్రోసి గబగబా ఇనప్పెట్టిసొరుగు లాగాడు. చేతికిచిక్కిన నోట్లకట్టొకటి తీసి లోపలిజేబులో కుక్కుకున్నాడు. తన పెట్టెనెత్తుకుని రోడ్డుమీది కెళ్ళాడు. అట్టిట్టు చూచి ముందుకు సాగాడు; కాని, వానికి తలతిరుగుతోంది. కళ్లు మంటగావున్నై. ముసలాడు కళ్ళలో చేరి కెలుకుతున్నట్టనిపించింది. రెప్పలు మూతపడటంలేదు. ప్రయత్నించినా ప్రయోజనం లేక పోయింది. 'ఇల్లాఅయితే సుళువుగా పట్టుబడతా' నను కున్నాడు. రోడ్డుకిపక్కగా పోయి నిలబడి రెప్పలువాల్చేం దుకు తిప్పలుపడుతున్నాడు. అప్పుడే వెనకనుంచెవడో తోసుకొచ్చాడు. ఇలియా వెనక్కితిరిగిచూచేసరికి వాడు ముందుకు దూసుకెళ్ళాడు. ఈలోగా రెప్పలు వాలినయి. తోసుకెళ్ళినవాణ్ని తిట్టుకుంటూ ముందుకు నడిచాడు. చౌకులో బీటుకానిస్టేబులు కనపడ్డాడు. ఇలియా వణుకుతూ వాడిముందుకెళ్ళి "అబ్బ! ఏంమంచుకురుస్తోంది" అన్నాడు.

"దేవునిదయవల్ల యిక త్వరలోనే చలి తగ్గిపోతుంది" అన్నాడు పోలీసు.

"ఇప్పుడెన్నిగంటలవుతుంది?" అని ఇలియా టయి మడిగాడు.

"చూచి చెపుతా" నని కానిస్టేబులు చేతిమీదనున్న మంచును దులుపుకుంటున్నాడు. ఇలియాకప్పుడు భయము, సంతోషం కూడ కల్గుతున్నై. వెర్రివాడివలె పెద్దపెట్టున నవ్వాడు.

కానిస్టేబిలు విస్మయంగా "ఎందుకు నవ్వుతావు?" అనడిగాడు.

" పొడుమంచు మిమ్మెల్లా ముంచేసిందో చూడండి!"

పోలీసు గడియారంలో చూచి "ఒంటిగంట అయిం" దని చెప్పి "నువ్వే హోటల్లోనో కూర్చొని తర్వాత గూటికి చేరుకుంటావు. వెచ్చగా హాయిగా పడుకుంటావు. నే నిక్కడ యిదేవిధంగా ఆరుగంటలయ్యేదాకా యీ మంచులో నిలువుగాళ్ళమీద నిలబడుండాలి" అని తనసొద చెప్పాడు.

"వెళ్ళి వస్తా" నని ఇలియా అక్కణ్నుంచి సాగాడు.

సమీపంలోనే వున్న ఒకహోటల్లో దూరి గవాక్షాని కెదురుగా కూచున్నాడు. అక్కడికి పోలటోవ్ కొట్టు చక్కగా కనబడుతుంది; కాని, అప్పుడు మంచు జోరుగాపడుతున్నం దున యేమీ కన్పించటం లేదు. వానిగుండె దడదడలాడు తూనే వుంది. ఏం జరుగుతుందో అక్కడేవుండి చూడాలను కున్నాడు. సర్వరు టీ తెచ్చియిచ్చాడు.

ఇలియా కప్పునందుకొని "మంచు తగ్గేటట్టు లేదే" అన్నాడు సర్వరుతో.

"ఇప్పు డిప్పుడే కొంచెం తగ్గి మొండపోడ వస్తోంది" అని వాడు చక్కాపోయాడు. ఇలియాకు కునుకువస్తున్న

ట్టుగా వుంది. టీని సాసరులోకి ఒంపుకున్నాడు; కాని, తాగలా. అప్పటికప్పుడె వానికి వుక్కగావున్నట్టు తోచింది. కోటుగుండీలు విప్పివేస్తున్నాడు. మెడక్రింద బొత్తామును విప్పబోయేసరికి ఒళ్ళుఝల్లుమంది. చేతులు కంపించినై. అవి యింకెవరిచేతులోననీ, తనగొంతు పిసుక బోతున్నట్టూ కలవరపడ్డాడు.

చేతివ్రేళ్ళను కళ్ళతో పరీక్షగా చూచుకున్నాడు. అన్నీ శుభ్రంగానేవున్నై. అయినా ఒకసారి సబ్బునీళ్ళతో కడగాలనుకున్నాడు.

అదేసమయంలో "పోలటోవ్ హత్య! ఎవరో చంపేశారు" అన్న కేకలు విన్పించాయి.

ఇలియా అదిరిపడ్డాడు. హోటలులోకూడ గందర గోళం వ్యాపించింది. అందరూ హత్యాస్థలానికి పోవాలన్న హడావుడిలోవున్నారు. ఇలియాకూడ లేచి సిద్ధమయ్యాడు.

పోలటోవ్ దుకాణంముందు జనం పోగయారు. పోలీసులు జనాన్ని వొత్తిగించి ముందుకెళ్తున్నారు. తర్వాత పహరాకూడ యేర్పాటుచేయబడింది. ఇలియా పంచపంచలబడి తిరుగుతూ యెవ రెవ రేమేమి చెప్పు కొంటున్నదీ వింటున్నాడు.

"గుమాస్తాలు, నౌకరూకూడ సమయానికి లేకపో యారు. ముందుగా నౌకరు వచ్చిచూచేప్పటికి యజమాని

కింద పడిపోయివున్నాట్ట. మూర్ఛ కాబోలని వాడు కంగారుతో పరుగెత్తుకెళ్ళి బ్యాంకి నుంచి తిరిగివస్తున్న పీటరు స్టెఫినోవిచ్ (హెడ్ గుమాస్తా) తో చెప్పాడు. పీటరు వచ్చి తీరా చూస్తే ప్రాణమేలేదు. "ఎంత సాహసం! మిట్ట మధ్యాన్నం రాజవీధిలోని దుకాణంలో యిల్లాంటి ఘోరం జరగటం యెన్నడూయెరగము" అన్నా డొకాయన.

"అంతా భగవదేచ్ఛ. ఆయన కల్లా రాసి పెట్టి వుంది కాబోలు!" యింకొకాయన అన్నాడు.

ఇలియా రెండడుగులు ముందుకెళ్ళాడు. ఒక వర్తకునిరాచుకోవటం జరిగింది. అతడు ఇలియాని వెనక్కినెట్టి "ఎక్కడికీ, తోసుకొస్తున్నావ్?" అని దబాయించాడు.

ఆ పక్క నెవరో "ఈశ్వరాజ్ఞలేనిదే యీగైనా కుట్ట" దన్నాడు.

"నిజ మంతేగాని, భగవంతుడా అపరాధాన్ని యెవరో వొకరినెత్తిని రుద్దుతాడు" అన్నాడు మరో అనుభవశాలి.

ఇలియా కీ మాటలు కొంత శాంతిని చేకూర్చినయి. వానిగుండె కుదుటబడినట్టుంది. అప్పు డెవరైనా తన్నడగటమే సంభవించితే ఆ హత్య చేసింద తనే నని నిర్భయంగా చెప్పేద్దామనుకున్నాడు.

ఆ తృప్తితో నిశ్చింతుడై తొంబను చీల్చుకుంటూ ముందుకెళ్లాడు. తనకు పరిచయమున్న కానిస్టేబిలును

చూచి వానిదగ్గరలో కెళ్ళి నుంచున్నాడు. "ఎక్కడికి? వెనక్కి పో" మ్మని వాడు కసిరాడు.

ఇలియా తొట్రుపడ్డాడు. సరిగా అప్పుడే యిం కెవడో ఘట్టిగా తోసి "తగలనియ్యి రెండు తాపులు" అన్నాడు.

ఇలియా గుంపులోనుంచి బయటపడి యెడంగా పోయి నిలబడ్డాడు. "దుర్మార్గుడు, నా డ్యూటీసమయం లోనే యీ పని చేశాడు" అని బీటుకానిస్టేబులు అంటున్న మాటలు ఇలియా చెవినిపడ్డయి.

"వడ్డీ గుంజటంలో కాబూలువాడి తాతరా" అన్నాడు ఆ సమూహంలో ఒకడు.

"మంచు బాగా పడుతూండడం కూడ హంతకుడికి బాగా అనుకూలపడింది."

"బాకీలు వసూలుచెయ్యడంలో దయా-దాక్షిణ్యాలు లేకుండా రక్తంపిండేవాడు."

"అయినా మనిషేగా!"

"అందువల్లే ఆయనకుపట్టినగతికి విచారం కలుగు తోంది."

"అందరూ ఎదటి వాడిని మ్రింగివేయాలనేగా!"

"ఇదేవిధంగా తలకొకమాట అంటూండగా "పాపం! ఆయనభార్యకూడ వస్తోంది" అన్నాడొకవ్యక్తి.

ఇలియా తలెత్తి చూచాడు. ఒక అంధ స్త్రీ యిద్దరునొకర్లసాయంతో వస్తోంది. ఆమె గోలుగోలున యేడుస్తోంది. ఆవిడనుచూచినప్పుడు ఇలియాకు లీపా జ్ఞప్తికొచ్చింది.

"పిల్లా-జెల్లా వున్నారా?" ఎవరో అన్నారు.

"ఒక్కడే కొడుకు. అతడైనా మాస్కోలో వుంటున్నాడు" అని మరెవరో అన్నారు.

"అతనుకూడ తండ్రిచావు కెదురుచూస్తూవుండి వుంటా"డన్నాడు యింకో మనిషి.

"అయితేకావచ్చు. ఎంతవుండి యేం లాభం?"

ఈ తుదిమాట విని ఇలియాకూడ విచారపడ్డాడు. పొలటోవ్ పట్టపగలు హత్యచేయబడినందు కెవరికీ విచారము, సానుభూతి లేనందుకు సంతోషించినా, పై సంభావణ వానికి బాధగానేవుంది. ఆగుంపులో ఒక్క నావికుడు మినహా అందరూ తమతమ కడుపుమంటను వెళ్ళగ్రక్కినవాళ్ళే. నోటికివచ్చినట్టు తలకొకవిధంగా ఆడిపోస్తున్నారు.

---

# 16

అందరూ వెళ్ళేవరకూ ఇలియా అక్కడే వున్నాడు. గదికిచేరుకొనేప్పటికి గాసిచెందాడు. గదితలుపులు బిడాయించుకొని నోట్లకట్ట విప్పి లెక్కపెట్టాడు. వాటి నెక్కడ దాచాలా అని ఆలోచించాడు. కొంతసేపాగి నోట్లకట్టతో బయలుదేరాడు. వాకిటిముందే జాకోబు తారసిల్లాడు. "ఇవ్వాళ యింత పెందలాడే వచ్చావేఁ? ముఖం వాడిపోయి వుందేమిటి?" అని వాడడిగాడు.

"ఒంట్లో సరిగాలేదోయి" అని ఇలియా మెల్లగా చెప్పాడు.

"చేతిలో దేమిటి?"

ఇలియా త్రుళ్ళిపడ్డాడు. చేతిలోకట్టవున్నట్టు అప్పుడుగాని వానికి స్ఫురించలేదు. గుట్టు బయటపడిపోతుందేమోనని భీతిచెందాడు. నోట్లకట్టని చప్పున జేబులో దాస్తూ "ఏమీ లేదురా. గోటు అట్టలే" అన్నాడు.

"టీ తాగివద్దాం రా."

"నువ్వు పద, నేను వెనకాల వస్తాలే" అని ఇలియా ముందున్న ఖాళీస్థలంలోకి దారిపట్టాడు. జాకోబు తన దారిని పోయాడు. చుట్టూ పారజూచి యెవరూ లేక పోవటంవల్ల ఇలియా చాకుతో చిన్నగొయ్యి త్రవ్వుతున్నాడు. ఎవరో

చాటునుంచి తన్ను చూస్తున్నట్టు కల్లింతపడ్డాడు. మనిషి వున్నాడనుకున్న వేపుకు రాయి విసరాలనుకున్నాడు; కాని, మరుక్షణంలో తన భ్రమేగాని, అక్కడ తానుగాక యింకెవరూ లేరని నిశ్చయించుకున్నాడు.

నోట్లకట్టను గోతిలో పూడ్చిపెట్టి తిన్నగా మాషా గదికి వెళ్లాడు. ఇలియా అప్పటికి కొంత తేరుకున్నాడు; అయినా వాని మొహంలో వుద్విగ్నత, గాభరా ప్రస్ఫుటమవుతూనే వున్నై.

"నే డింత ముందుగా వచ్చావేఁ?" అన్నది మాషా వానిని చూచీచూట్టంతోటే.

"మంచు యెక్కువగా కురుస్తోంటే వచ్చా. అయినా మీరు అప్పుడే వచ్చానని సతాయించుతున్నారేఁవిటి? నే మామూలు వేళకే వచ్చానే!"

"మంచువల్ల మసగ్గావుందిగాని, యింకా పొద్దులేకపోలేదులే. సరే గాని, కంగారుగా మాట్లాడుతున్నావేమిటి?"

"అబ్బ! ఏమి టీ కుంటి ప్రశ్నలు? 'ముందొచ్చావేఁ; ఎక్కడికెళ్తున్నావ్, చేతిలో దేమిటి' అని నన్ను వేధిస్తారెందుకు?"

మాషా వాడి వింతధోరణికి విస్తుపోయింది. "మాటి మాటికి యివాళ యిల్లా శృతిమించిపోతున్నావేమి" టని మళ్లీ అడిగింది.

"భేష్! అయితే యిక నేను మాట్లాడనులే" అని ఇలియూ కుర్చీలో కూచున్నాడు. మాషా వింతగా ఒకసారి వానివంక చూచి టీకాచేందుకు అవతలికి పోయింది. ఇలియూ రెప్పలువాల్చకుండా ఆమెపైనె దృష్టినిల్పి 'ఈ అమాయిక పిల్ల వొక్కతే తోడులేకుండ యెల్లా వుండగల్గుతోం దబ్బా! పాపం! రోజంతా కష్టపడి పొట్టపోసుకోవాల్సివస్తోంది' అని ఆలోచించుతున్నాడు. "ఈమెకు జీవితంలో సుఖం లేశ మాత్రంలేదే! నేనో! కావాలనుకుంటే సుఖంగా గడుప గలను" అనుకున్నాడు.

ఈ విధంగా వూహాపథంలో విహరించుతూంటే ఇలియూకి వుల్లాసంగానే వుంది; కాని, మాషాని ఆమెగతికి వొదిలిపెట్టడం తా నన్యాయంచేయటమే ననుకున్నాడు. ఆయోచనలోనుంచి "మాషా!" అని మెల్లగా పిల్చాడు.

"ఏమిటి?"

"నీకు తెలుసా నే నెంత ఘోర......"అని టక్కున ఆగాడు. తన రహస్యా న్నామెతో చెప్పుదామా, వద్దా అని సంధిగ్ధావస్థలోపడ్డాడు ఇలియూ.

"ని న్నదమాయించే వాళ్లెవరూ లేరనా?" అంది మాషా.

"అంత తురుతుగా అనెయ్యకు."

మాషా లేచి ఇలియూదరికొచ్చింది. 'నన్ను తన వెంట తీసికెళ్ళమని మీ బాబాయితో చెప్పవూ?' అంది.

ఇలియా పరధ్యానంగా "ఎక్కడికి" కనడిగాడు.

"ఆయన తీర్థయాత్రలకు వెడుతున్నారటగా?"

మాషా భక్తురాలివలె చేతులుజోడించి ఇలియా ముందు నుంచొనివుంది. ఆమెనేత్రాలనుండి కన్నీటి చుక్కలు టపటప కిందపడుతున్నై. "దేశాటన బలే సుఖదాయకంగా వుంటుంది. పల్లెటూళ్ళ ప్రకృతిశోభ, అరణ్య దృశ్యాలు వసంతఋతువులో మనోహరంగా వుంటాయి. నా కవన్నీ చూడాలనుంది. నా కోర్కె తీర్చవూ? నువ్వు చెపితే ఆయన కాదనరు. నే నాయనకు భారమవన్లే. బిచ్చమెత్తుకొని పొట్టపోసుకుంటాను" అని అతిదీనంగా చెప్పుతున్నది. ఆమె ఇలియా చెయ్యి పట్టుకొని ముద్దుపెట్టుకోబోయింది.

ఇలియా త్రాచుపామునితొక్కినట్టు యెగిరి గంతేసి యెడంగాపోయి నుంచున్నాడు. ఆ వుద్వేగంలో "మాషా! నువ్వేమి చేయబోతున్నావో తెలుసా? ఈ చేతుల్తోనే నే నింతకు ముందే ఒక హత్య చేసి వచ్చాను. అల్లాంటి అపవిత్రహస్తాన్ని నిన్నెలా ముద్దెట్టుకో నిస్తాను?" అన్నాడు.

మాషా మళ్ళీ అతన్ని సమీపించింది. ఓస్! పర్వాలేదులే. నేను నిత్యము యెన్నెన్ని అపవిత్ర హస్తాల్ని ముద్దుపెట్టుకోవటం లేదు. కానీ దానంచేసిన ప్రతివాడు చెయ్యినందిస్తాడు. ఇష్టమున్నా, లేకపోయినా చాచిన చేతినందుకొని పెదాలానించక తప్పదు" అంది.

తన పాపకృత్యాన్ని గురించి కొంతవరకు చెప్పేశాను గదా అనీ, తన మాటల్లోని యదార్థాన్ని గ్రహించి మాషా రహస్యాన్ని తెలుసుకోజాలనందుకు ఇలియా చాలా సంతోషించాడు. మందహాసం చేస్తూ "నే నంతా యేర్పాటు చేస్తాన్లే మాషా! నువ్వు విచారపడనక్కర్లా. నీ దారి ఖర్చులకుకూడా నేనే యేర్పాటుచేస్తాను, సరా" అన్నాడు.

మాషా సంతోషంతో చంకలుకొట్టుకుంది. ఇలియాను గట్టిగా కావలించుకుంది.

ఇలియా ఆ అబోధ బాలిక బాహువల్లరినుంచి తప్పించుకొని "ఇప్పుడు నన్నేమీ విసిగించమాకు మాషా! నీ ప్రయాణసన్నాహమంతా చేస్తానన్నానుగా. అయితే ఒక సంగతి; నా కోసం కూడ ప్రార్థించే?" అన్నాడు.

"ఓ, తప్పకుండాను."

అప్పుడు "ఎందు కలా అరుస్తావు? నీ మాటలు బజార్లోకి విన్పిస్తున్నై తెలుసా?" అంటూ జాకోబు గదిలో కొచ్చాడు.

మాషాకి సంతోషం పొంగివస్తోంది. ఆ హుషారుతోనే "నేను కూడ వెళ్ళిపోతున్నాను జాకోబ్! ఇలియా టెరెన్సుతో చెప్పి నా యాత్రకి యేర్పాటుచేస్తానని మాటిచ్చాడు" అని చెప్పింది.

"టెరెన్సు వొప్పుకుంటాడనేనా నీ వుద్దేశం?" జాకోబు ఇలియా నడిగాడు.

"ఆయన కొచ్చే యిబ్బంది యేముంది? మాషా ఆయన కేమైనా బరువై తేగద!......మాషాముఖం చూడు! మానవి కాదు, దేవీస్వరూపం!" అన్నాడు ఇలియా.

జాకోబు వుదాసీనుడయ్యాడు.

"అంత విచారంగా వున్నావేం?" ఇలియా అడిగాడు.

"నన్నందరూ వొదిలిపెట్టిపోతున్నారుగా." జాకోబు బిక్కమొగంతో అన్నాడు.

"దాసీ నుంచుకోవోయ్!" ఇలియా అపహాసించాడు.

"బ్రాంది, గ్లాసు, దాసీ — మూడూ కావాలి" అన్నాడు జాకోబు.

మాషా జాకోబువంక చూచి తలొంచుకుంది. "ఇంత దుర్బలహృదయుడవేం?" అంది.

"అవున్లే! నన్నొదిలేసి పోతూన్నందుకు నేను విచార పడుతూంటే పైగా మనోదండిలేనివాడినంటున్నావుకదూ? స్నేహితుణ్ని యీ విధంగా ఒక్కడినీ వొదిలిపెట్టి పోవటం నీకు న్యాయమేనా?"

ఈ మాటలని జాకోబు ఇలియాపార్శ్వంలో చతికిల బడ్డాడు. "నేనుకూడ మీ రెన్ను వెంట వెళ్తే యెంత బాగుంటుంది!" అన్నాడు మళ్లీను.

"రా, నువ్వుకూడ వస్తే మరీమంచిది! నేను మాత్రం వెళ్లితీరాలి" అన్నది మాషా.

"ఒకవేళ నేను బయల్దేరివచ్చినా మానాన్న నా వెనకాలే పోలీసుల్ని తరుముతాడోయ్!"

అందరూ మౌనంవహించారు. కాస్సేపాగి జాకోబు లేనినవ్వు తెచ్చుకొని "తాగుడువల్ల మేలు చాలావుంది. దానివల్ల చైతన్యం లుప్తమైపోతుంది. మంచి – చెడ్డల విచక్షణాజ్ఞానమే వుండదు. చీకూ–చింతా లేక నిర్విచారంగా పడుండొచ్చు" అన్నాడు.

"సిగ్గులేని శిఖండి!" అంది మాషా.

జాకోబు కోపంతో "నోరుముయ్! పైన సతాయించే వాళ్లెవరూ లేకపోతే శ్రీరంగనీతు లెన్నయినా చెప్పొచ్చు. మీనాన్న నిన్నెన్నడైనా వొక్క మాట అన్నాడూ? బ్రతికే వున్నాడుగా!" అన్నాడు.

"నా కల్లాంటి బాధేమీ లేదు. నా జీవితం చాలా సుఖంగావుంది. లేకపోతే యెప్పుడో పారిపోయివుండేదాన్ని. మళ్లీ వెనక్కి తిరిగ్గూడ చూచేదాన్ని కాదు."

"ఏం సుఖం, నీ బొంద సుఖం! అసలు మన్లో యెవరికీ సుఖం లేదు" అన్నాడు ఇలియా.

"ఈ తగులాటమేమీ లేకుండా యే అరణ్యానికో, నదీతీరానికో పోయి యేకాంతంగా జీవించటమే సుఖం" అని జాకోబు తన వుద్దేశాన్ని వెలిబుచ్చాడు.

"ఓరి పిచికోలురాయుడు! అందులో యేముంటుందిరా ఆనందం!" అన్నాడు జాకోబు.

జాకోబు కొంచెమాగి "నాకు బలేపుస్తకం దొరికిందిరోయ్!" అన్నాడు.

"ఏం పుస్తకం?"

"మొరాకో బైండు చేసివుంది. యేదో ధార్మిక గ్రంథ మయివుంటుంది. చవగ్గా యిస్తుంటే కొన్నా."

ఇలియాకు మాట్టాడాలని లేదు; కాని, మౌనంగా వుంటే భావపరంపర చెలరేగి పీడించవచ్చుననే భయంతో "పుస్తకం పేరేమిటి?" అనడిగాడు.

"అట్ట చిరిగిపోయింది. అందులో భూమ్యాకాశాలు, నీరు, మనిషి మొదలైన విషయాలు చాలాచాలా వున్నై. గ్రంథకర్త నాస్తికు డయివుంటాడు."

ఇలియా లేచి నిలబడి "ఏదీ, ఆపుస్తకం? చించి ముక్కలు చేస్తా. నీ చెవులుపట్టుకొని మొలేస్తానుండు" అని మిరిమిరి చూచాడు.

"ఎందుకోయ్?"

"నువ్వు యింకెప్పుడూ ఆపుస్తకం చదవకుండా వుండటానికి. దాని రచయిత శుద్ధ మూర్ఖుడై వుంటాడు. ఈశ్వరుడు సృష్టికర్త—సంహర్త కూడాను; ఆయన సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు. ఆయనకుమించినది లేదు. పరీక్షార్థమై మనకీ జన్మ నిచ్చాడు. మనం పాపానికి దూరంగా పారిపోతామో, లేదో చూస్తుంటాడు. పాపంవేపుకే పోతే శిక్షిస్తాడు. ఇదంతా మానవమాత్రునికి సాధ్యమేనా?"

"కాని, నా అభిప్రాయం అది కాదు" జాకోబన్నాడు.

"నీ వుద్దేశం యెవడిక్కావాలి? అసలు ఆలోచిం చేందుకు నువ్వెవరివి? ఆ పరమేశ్వరునిఆజ్ఞ లేనిదే వొకడు యింకొకని వెంట్రుకైనా కదిలించ లేడు. నేను పాపం చేశానూ అంటే–ఆయన ప్రేరేపణతోనే."

ఇలియా స్పృహతప్పి యేమేమిటో అసందర్భంగా వాగేశాడు. వాని దేహం వొణుకుతోంది.

"నీకు పిచ్చిగానియెత్తిందా యేం? నువ్వు చేసిన పాపమేమిటి?"

అని జాకోబడిగినప్రశ్నతో ఇలియా మేల్కొన్నాడు. నెత్తిమీద అదాటుగా కొత్తకడవలోని చన్నీళ్లు గుమ్మరించి నట్టు వాని మెదడు చల్లబడింది. మాషా, జాకోబులవంక అనుమానంగా చూశాడు. ఇద్దరూభయభ్రాంతులై విస్మయ పడుతున్నారు.

"వుదాహరణకి అన్నానులే" అన్నాడు ఇలియా.

"నీ ఒంటో బాగా లేదల్లే వుందే" అంది మాషా.

"అలా వెర్రిచూపు చూస్తున్నావేం ఇలియా?" అ నడిగాడు జాకోబు.

చప్పున చేతుల్తో కళ్లుతడువుకొని "నిజంగా ఒంట్లో బాగాలేదోయ్" అని ఇలియా మొహం పక్కకుతిప్పు కున్నాడు.

ఇక నక్కడ వుండటం ఇలియాకి భారమనిపించింది. మాషా కాచి యిచ్చిన టీ అయినా ముట్టలా. మొదలకుండా లేచి పోయాడు.

వెళ్ళి పక్కమీదవాలాడో లేదో పెరెన్కు వచ్చి పక్కనే కూచున్నాడు. పాపవిమోచనమవుతుందనే వుజ్వలానందంతో ప్రఫుల్లహృదయుడయివున్నాడు పెరెన్కు.

"నీతో మాట్లాడాలని వచ్చారా అబ్బాయ్!" అని పెరెన్కు సంభాషణ ప్రారంభించాడు.

"మీ రిక్కడినుంచి వెళ్ళే దెప్పుడు?"

"ఎండలుముదిరినాక వెళదామనుకుంటున్నాను."

"మాషానికూడ మీవెంట తీసికెళ్ళండి."

"ఏం, మీ దగ్గరే వుంచుకోరాదూ?"

"ఇక్కడ వుంటే ఆమె పతనమైపోతుంది. మాకా- ఆమెపైన యే ఆశా లేదు. మా అందరిస్థితీ ఒకలాగే వుంది. మీతో తీసికెళ్ళండి."

"నే నెల్లా తీసికెళ్ళగలను? అయినా నాకీ తగులాట మెందుకు చెప్పు?"

ఆమెబరువు మీరేమీ యెత్తుకోవద్దులెండి. మీరు నాకిస్తానన్న నూరురూపాయలు ఆమెకోసం ఖర్చుపెట్టండి. అనాధకు సాయంచేస్తే మీకు పుణ్యం దక్కుతుంది.

"నువ్వుచెప్పింది నిజమే. కాని, నీ కిచ్చిన సొమ్ము మళ్ళీ నేను తీసుకోలేను. మాషాసంగతి ఆలోచించి చెపు

తాలే......నిన్న పీటరు వాసిలోవిచ్ లీనఫ్ వచ్చారు. ఆయన చాలా ప్రసిద్ధికెక్కిన పరివ్రాజకులు. వారి వుపదేశంతో నాకు చాలవరకు శాంతి చేకూరింది. వారి దర్శనం అయాచితంగా లభించటం నా అదృష్టమే!''

ఇలియా పెదవివిప్పనేలేదు. కాస్సేపు ఒంటరిగావుంటే బాగుండుననుకున్నాడు. టెరెన్సు చెపుతున్న మాటలు వాని బుర్ర కెక్కటంలేదు. పినతండ్రి అవతలికెళ్లిపోతే బాగుండు ననుకున్నాడు; కాని, టెరెన్సు చెపుతూనే వున్నాడు—

''పాప - పుణ్యాలు, జీవుడు - ఆత్మ మొదలయిన విషయాలనుగురించి చర్చించాము. కత్తికి పదునుపెట్టేందుకు రాయి అవసరమైనట్టే ఆత్మని మేల్కొల్పటానికి పాపంకూడ అవసరమేనని ఆయన సెలవిచ్చారు.''

''మీ వుపదేశకుని మొహం సైతానుముఖంలాగే వుందా?'' ఇలియా అడిగాడు.

టెరెన్సు విస్తుపోయాడు.

''తప్పు, అల్లా అనకూడదు నాయనా! ఆయన గొప్ప పుణ్యాత్ముడు. నీ తాతగారికీర్తికంటె ఆ మహానుభావుని యశం గొప్పది.''

''ఉఁహూఁ, అలాగా! మంచిదే. ఇంకేం సెలవిచ్చారు?''

ఇలియాధోరణి యివాళ యెందువల్లనో వింతగా వుందని టెరెన్సు కంగారుపడుతూ ''నీ మనస్సు బాగాలేదా?'' అనడిగాడు.

"బాగాలేకేం. మీ గురువుగారి భావాలు నా వుద్దేశాలతో కలుస్తున్నై. ఇంతకుముందు నేనూ అలాగే ఆలోచించుతున్నాను."

ఇలియా మరి మాట్లాడలేదు. మొహం గోడవేపుకి తిప్పుకొన్నాడు.

"మానవునికి ధైర్యంకల్గించగలది పాపమేననీ, దాని సహాయంవల్లనే దైవసన్నిధికి తేలిగ్గా చేరుకోవచ్చనీ కూడ వారు చెప్పారు."

"మీరు సైతాను లాగున్నారే!" అని ఇలియా పక్కున నవ్వాడు.

టెరెన్సు బిత్తరపోయాడు. ఇలియా లేచి కూచుని మళ్లీ యిలా చెప్పాడు:

"నేను ప్రాయశ్చితంచేసుకుంటేనో! నాకసలు పాపం చేయాలన్న వుద్దేశమేలేదు. అదంతా భగవదేచ్ఛతో దానంతటదే జరిగిపోయింది. ఈమాత్రానికి నే నెందుకు చింతించాలి? దేవునికి అంతా తెలుసు. ఏదిజరిగినా ఆయన ప్రేరణవల్లనేగా. ఆయనకా పని యిష్టంలేకపోతే నన్నాపివుండాల్సింది; కాని, ఆపలేదుగా మరి. కాబట్టి నేనుచేసింది సబబే........అసలా లెక్కకొస్తే పాపంచేయని దెవరు? ప్రాయశ్చిత్తంచేసుకోవాలని యేడ్చేదెవరు?"

"ఏమిటో, నీ మాటలధోరణి నాకు అర్థంకాలా."

“ తెలియకపోతే మరి యీ వాగుడంతా దేనికి?” అని ఇలియా పక్కమీద ఒరిగాడు. “నా ఒంట్లో బాగా లేదు బాబాయ్!” అన్నాడు నిమ్మళంగా.

“ నేనూ అలాగే అనుకుంటున్నాన్లే.”

“ నేను నిద్రపోవాలి. ఇక నన్నొదిలిపెట్టి పొండి.”

టెరెన్సు లేచి వెళ్లిపోయాడు. ఇలియా ఒక్కడే పడుకొని వున్నాడు. మధ్యాన్నపు ఘటన వాని కళ్ళముందాడుతోంది. పోలటోవ్ తనముందు నిలబడి దీనవదనంతో యేదో చెప్పబోతున్నట్టు తోచింది.

ఇలియా వ్యాకులచిత్తుడై కళ్ళు బలవంతంగా మూసుకున్నాడు.

# 17

నిద్రపట్టక ఇలియా పక్కమీద యిట్టటు దొర్లు తున్నాడు. అప్పు డెవరో కుర్రాడు ఒకచీటీ తెచ్చి యిచ్చాడు. అది లీపా రాసింది.

"రాత్రి సరిగా పదిగంటలకు క నెస్కీరోడ్డుమీద చౌకులో నీకోసం యెదురుచూస్తుంటాను."

అని రాసివున్న ఆ చీటీని చదవగానే ఇలియాకు గతరాత్రి తనకు జరిగిన అవమానం జ్ఞప్తికివచ్చింది. క్రోధ - ద్వేషాలచే వాని మో మెరుపెక్కింది. "నువ్వు మరొకప్పుడు రాకూడదూ?" అన్న లీపా తిరస్కారవచనం వానిచెవుల్లో గింగురుమంటోంది.

"లీపా నాకోసం యిప్పు డేల కబురంపిందో! నాతో ఆమె కేంపని?" అని ఆలోచించసాగాడు.

ఆ దేశానుసారం పదిగంటలకె నియమితస్థలానికి చేరుకున్నాడు. లీపా అప్పటికే వచ్చి కాచుకొనివుంది. ఆమెనిచూచి ఇలియా కంపించాడు. కళ్లు మినహా యింకేమీ కనపడకుండేలాగున లీపా ముసుగువేసుకొచ్చింది. ఇలియా మాట్లాడకుండా పోయి ఆమెముందు నిలబడ్డాడు.

"మొహం కన్పడకుండా కప్పుకో" అని లీపా వానిని

సందు—గొందులు తిప్పి తిప్పి దొడ్డిగుమ్మాన తన యిం ట్లోకి తీసికెళ్ళింది. ఒక గదిలో కూర్చోబెట్టి "మనిద్దరిని కోర్టు కీడుస్తారు" అంది.

"ఎందుకు?" ఇలియూ ఆతురతగా అడిగాడు.

"సాయంత్రింనుంచి గూఢచారి ఒకడు యిక్కడే తచ్చాడుతున్నాడు."

"అయితే నాకేం? ఇంతకూ నన్నెందుకు పిల్చినట్టు"

"నామీద కోపంగావుందా? తొందరపడక నా మాటలు శ్రద్ధగా విను. కోర్టులో మనయిద్దరిసంబంధాన్ని గురించి అడిగితే యదార్థం చెప్పే శెయ్యి; కాని, వృద్ధుని విషయంలో యేమడిగినా సరే, జాగ్రత్తగా సమాధానా లివ్వు. ఆయన్ను నువ్వెన్నడు చూడలేదనీ, అతణ్ని గురించి నేకేమీ తెలియదనీ చెప్పాలి."

లీసాతన్నుచూచి భీతహరిణిలా బెదురుతోందని ఇలియా కనిపెట్టాడు. తన కామె భయపడుతూన్నట్టు గ్రహించాడు. ఆమెస్థితి వానికి సంతోషాన్నే కలిగించింది. లీసాని ఇంకా కలవరపెట్టాలని వికటంగా నవ్వసాగాడు.

లీసా కంపించిపోయింది. ముఖంలో కళ—కాంతు లేవు. ఒకడుగు వెనక్కి తగ్గి "ఎందుకల్లా వెర్రిగా నవ్వుతూ చూస్తున్నావు?" అన్నది.

"నేను అబద్ధ మెందుకు చెప్పాలి? నేను పోలటోవ్‌ను నీ యింటిదగ్గర చూళ్లేదూ?"

ఇలియాహృదయంలో ద్వేషాగ్ని గప్పుమంటోంది. గోడనానుకొని మళ్లీ యిల్లా అన్నాడు—"నా ప్రతిద్వంద్వి వాడేనని నే నప్పుడే అనుకున్నాను. నేను వాడిగొంతు పిసక్కపోతే........"

లీపా బల్లమీద చేత్తోకొట్టి చెప్పింది—"నువ్వు అబద్ధమాడుతున్నావు. అతడు నీ దారిలో కంటకంగా యెన్నడూ లేడు. మనఅవసరంకోసమే........."

"ఆఁ, అల్లాగా!" అని ఇలియా మధ్యలో దీర్ఘం తీశాడు.

"నువ్వు స్వస్తి చెప్పమని యెప్పుడు చెప్పితే అప్పుడే తొలేస్తానని నీతో యెన్నిసార్లో చెప్పాను. ఎప్పటి కప్పుడు నువ్వు నవ్వుతూ వూరుకున్నావే గాని, ఆయన్ను రానివ్వొద్దని ఒకసారీ స్పష్టంగా చెప్పవైతివి. అతని రాక-పోకలను నువ్వూ యిష్టపడ్డావు. నీకు నాయందు నిజమైన ప్రేమ యెప్పుడూ లేదు."

ఇలియా అసలే వుత్తేజితుడై వున్నాడు. లీపా యెత్తిపొడుపు అగ్ని కాజ్యంతోడైనట్లు ఇలియా హృదయానికి కశాఘాతమై చురుక్కుమంది. కళ్లెర్ర జేస్తూ లేచి కూచుని "చాల్లే,వూరుకో. ఒళ్లు దగ్గర వుంచుకొని మాట్లాడు" అన్నాడు.

"నే నెల్లా వూరుకోగల్ను? నిన్ను మనసార ప్రేమించాను; కాని, అందుకు ప్రత్యామ్నాయంగా నువ్వు నా

కిచ్చిన దేమిటి? 'లీపా, నువ్వు నాతోనయినా వుండు, లేదా, వానితోనే వుండు. ఒక వరలో రెండుకత్తు లిముడ' వని ఒక్కసారైనా నాతో చెప్పావూ? నీ ప్రవర్తన మామూలు బజారుమనిషి వ్యవహారంలా లేదూ?"

ఇలియా వుడికిపోతున్నాడు. పిడికిలి బిగించి" నువ్వెంత కూరుకోవో చూస్తానుండు" మని పొడవబోయాడు.

లీపా తప్పించుకొని యెడంగాపోయి "నువ్వాతణ్ణి చంపుతానన్నావుకదూ యిదివరకు? సరే, యిప్పుడు నా వొంటిమీద దెబ్బే పడనియ్యి; పోలటోవ్‌ను నువ్వే హత్య చేశావని కేక లేస్తాలే'' అని బెదరించింది.

ఇలియా నిజంగానే బెదరిపోయాడు. తనకే మూడు తుందని జంకాడు. ఊపిరి సలపలా. తన పీక నెవరో నొక్కుతున్నట్టనిపించింది. చతికిలపడి వెర్రిగా నవ్వాడు. లీపా పెదిమకొరుక్కుంది. నోరుజారినందుకు పశ్చాత్తాప పడుతోంది. ఆకారుచీకటిలో దేనికో తడువుల్లాడుతూ "నవ్వు, బాగా నవ్వు!" అంది.

"నవ్వాకేం, దొబ్బొచ్చిందా?" అన్నాడు ఇలియా.

"తొలిసారి చూచినప్పుడు నన్నుద్ధరించేవాడివి నువ్వే ననుకున్నాను; కాని......"

"లీపా!" ఇలియా మెల్లగా పిల్చాడు.

లీపా పలకలా.

ఇలియా మళ్ళీ పిలిచాడు. వానిహృదయంలో తుపానుచెలరేగింది. "పోలటోవ్‌నుచంపింది నేనే లీపా!" అన్నాడు.

లీపా గజగజలాడింది. తలెత్తి ఇలియావంక చూచింది. అతికష్టంతో "నువ్వు భయపడుతున్నావా?" అన్నది.

కాని, అసలు తానే భయంతో కంపిస్తోంది.

ఇలియా ఆమెదరికిపోయి కూర్చున్నాడు. లీపా అతని చెయ్యిపట్టుకొని "ప్రియా! నువ్వు నన్ను వుడికించుతావెందుకు? అతడు చచ్చిపోయాడని నాకేమీ దిగుల్లేదు. మంచిపనే జరిగింది" అన్నది.

"ఆపనిచేసింది నేనే లీపా!"

"హుష్! ఊరుకో. మళ్ళీ ఆమాట నోటిపైకి తేవొద్దు ప్రియా!" అంది లీపా వానినోరుమూస్తూ.

ఇలియా ఆమెని రెండుచేతుల్తో లాక్కొని యెద కదుముకున్నాడు. ఈ ప్రపంచంలో తన కష్టసుఖాల్లో పాల్గొంటున్న సహచరి ఆమె ఒక్కతే. ఇప్పు డామె అవసరం మరింతగా కనపడుతోంది.

లీపా వేడి కన్నీటిబొట్టులు ఇలియామీద పడుతున్నై. ఇక ఇలియాకుకూడ కట్టతెగడింది.

లీపా ఇలియాను తనఒళ్ళో పడుకోబెట్టుకొని తల నిమురుతూ "నీకు నా రూప-సౌందర్యాలంటే యేవగింపు

లేదని నాకు తెలుసు; కాని, నువ్వు నన్ను హృదయపూర్వకంగా ప్రేమించటం లేదు. ఆ ముసలాయనతో సంపర్కం కలిగివున్నానని నన్ను ద్వేషించుతున్నావు కూడాను. నువ్విప్పటికీ నన్ను క్షమించనే లేదు'' అన్నది.

''వాడి వూసెత్తకు లీపా!'' కళ్లుతుడుచుకొని ''కాకున్నది కాకమానదు. భగవంతుడు శిక్షించదలచినవాడికిక ముక్తిలేదు. నా ప్రియ లీపా! నువ్వన్నదంతా నిజం. నా హృదయంలో ద్వేషం అంకురించినమాట వాస్తవమే; కాని, నీ వెప్పటి లీపావే. నేనే అపరాధిని'' అన్నాడు ఇలియా రెండు చేతులూ ఆమెమెడకి లంకెవేసి.

ఇలియాస్వరం చలించుతోంది. పెదాలదురుతున్నై. కళ్ళెర్రబడ్డాయి. ''దోషమంతా నాదే, నీ తప్పేమీ లేదు! నేనే దోషిని'' అన్నాడు మళ్ళీ.

లీపా కూడ వొరిగింది. ఇద్దరూ వొరుసుకొని పడుకున్నారు. ''వాడిని చంపింది నేనే, నేనే'' నని ఇలియా ప్రలాపించాడు.

''ఈ విధంగా ప్రలాపించటం క్షేమంకాదు. ఇక ఆ సంగతి మర్చిపో. ఇక నేం చెయ్యాలనీ నీ వుద్దేశం?'' అనడిగింది లీపా.

''నే నుద్దేశపూర్వకంగా చేసింది కాదు లీపా. పోతూ పోతూ దుకాణంలో కూచునివున్న పోలటోవ్‌ని చూచాను. అత డొంటరిగావుంటంవల్ల కాస్సేపా వెధవని

యేడిపించాలని లోపలి కెళ్ళాను. వెళ్లేటప్పుడు వానికి హాని చెయ్యాలన్నతలంపే లేదు నాకు. కాని, తీరా యెదుటికి పోగానే సైతాను నా నెత్తినెక్కికూచున్నాడు. అది భగవ దేచ్ఛ కాబోలు!......కాని, వాడిసొమ్ము నపహరించటమే మహాపాపం! నే నా నోట్లకట్ట తేవాల్సింది కాదు.''

అని కడుపులోవున్నదంతా వెళ్ళగ్రక్కేసరికి ఇలియా హృదయం వొక్కసారిగా తేలికపడినట్టయింది. పెద్ద నిట్టూ ర్పొకటి విడిచాడు. లీపా భయంతో కంపించింది. గట్టిగా వానిని పెనవేసుకొని ''డబ్బు తెచ్చి మంచిపనే చేశావు. అందువల్ల ధనాశచే యే దొంగలో హత్యచేసి వుంటారని యెంచుతారు. నువ్వు డబ్బు తెచ్చివుండకపోతే పగవల్లనో, ద్వేషంవల్లనో హత్యజరిగివుంటుందని నిశ్చయించేవారు'' అన్నది.

"కాని, నే నీ పాపానికి ప్రాయశ్చిత్తంచేసుకోవా లనుకోటం లేదు. దేవుడు నాకు తగిన శిక్ష విధించుగాక! మానవు డింకొకని పాప-పుణ్యాలను విచారించలేడు. అస లందరూ పాపులే. నా కింతవరకు నిర్దోషి అయిన వాడెవడూ అగపడనే లేదు.''

"నా కంతా అయోమయంగా వుంది. ఈశ్వరుడేమి చేయనున్నాడో!...మనం యిక్కడినుంచి పారిపోతేనో!'' అంది లీపా.

ఆమె లేచి నిలబడింది. కాళ్లు తడబడుతున్నై. మళ్లీ ఇలియా ప్రక్కనే పడుకొని శరీరమందంతటా శాలువా కప్పుకుంది. "ఏమవుతుంది? మనప్రాణాలకేమీ ముప్పు రాదుగద?" అనడిగింది.

"పర్వాలేదులే" అని ఇలియా ధైర్యం చెప్పాడు.

"ఒకవేళ కోర్టుకీడ్చి అడిగితే నేను చెప్పినట్లే చెప్తావు గదూ?"

"ఓసిపిచ్చిదాన! నా కామాత్రం కూడా తెలియదనుకుంటున్నావా? ఈమాత్రానికే నామెడకి వురితగిలించుకొంటానూ? అదెన్నటికి జరుగదు. నే నీ విషయంలో జాగ్రత్తగానే వున్నాన్లే."

"అయితే సరే; గాని, ఎన్ని రూపాయలు?"

"రెండు వేలకుపైనే."

"ఒశ్, ఇంతేనా? విధంచెడ్డా ఫలందక్కలేదన్నమాట!" లీపా నిరుత్సాహంగా అంది.

"నేను డబ్బుకోసమే ఆపని చేస్తేగా!" అని ఇలియా వెళ్ళటానికి లేచాడు.

"మామూలుగా వస్తూవుండు. మనం దాక్కోవాల్సినపని లేదు. వస్తావుకదూ?" అని లీపా ఇలియాగడ్డం పట్టుకొని అడిగింది.

లీపాతో మాట్లాడినందువల్ల పెద్దబరువు తగ్గిపోయినట్లుంది ఇలియాకి. వాని కామెయ్యం దదివరకున్న ద్వేష

మంతరించి అనురాగ మతిశయించింది. హంతకుడని త న్నామె యేమాత్రం బెరుకుగా చూడలా. తిరస్కరించనూ లేదు. పైగా సానుభూతిచూపి తన కష్టంలో సమభాగిని అవడానికి లీపా ముందుకొచ్చింది కూడాను. కాని, అంతకు ముందె ఒకసారి తన్ను పట్టిస్తానని కూడ బెదిరించింది. ఇవన్నీ తలచుకొని ఇలియూ నవ్వుకొన్నాడు. అప్పుడు ఇలియూ మానసిక స్థితి మధుమురళీస్వనము నాలకించిన గంగిగోవులా వుంది.

# 18

ఇలియూ హత్యజరిగినమూడోనాడుదయాన మామూలుగా హోటల్లోకి వెళ్లాడు. పెట్రుహో వానివంక తీక్షణంగా చూచాడు. టెరెన్సుకూడ అదోమాదిరి చూపు విసిరాడు. ఒక్కరూ పల్కరించలా. ఇలియూ కేమీ బోధపడలేదు. జాకోబుచేసైగతో మాషాగదికి దారిపట్టాడు.

“నిన్నసాయంత్రం పోలీసువాడొచ్చి నిన్నుగురించి దర్యాప్తుచేసుకెళ్లాడు. వాడు మానాన్నను చాలా చాలా ప్రశ్నలడిగాడు. ఇదంతా యెందుకొచ్చింది ఇలియూ” అన్నాడు జాకోబు జంకుతూ.

"ఏమేమి టడిగాడు?"

"నువ్వేమిచేస్తుండేది, త్రాగుబోతు వవునా కాదా అనీ, నీ కే యే ఆడవాళ్లతో సంబంధమున్నదీ, యింకా యేమేమిటో అడిగాడు. అసలు సంగతేమిటి చెప్పవూ?"

"నాకేం తెలుసు?" అని ఇలియా అక్కడనుంచి వెళ్లిపోయాడు.

సాయంకాలం లీపావద్దనుంచి ఇలియాకు మళ్లీ జాబు వచ్చింది. "పోలీసులు నిన్ను గురించి చాలా వివరాలడిగి రాసుకున్నారు. నే నన్నిటికి జాగ్రత్తగానే జవాబులిచ్చాను. భయపడాల్సినఅవసరమేమీ కనపడదు" అని రాసింది లీపా.

పట్టణంలో యేమూల విన్నా పోలటోవ్ హత్యా చర్చలే. పరిపరివిధాలుగా చెప్పుకుంటున్నారు. ఆ మాటలు విని ఇలియా నవ్వుకొనేవాడు. ఒకొక్కప్పుడు తానుకూడ ఆ చర్చలలో పాల్గొనేవాడు. వివిధ వూహాగానాలు విని నవ్వాపుకోలేకపోతున్నాడు. హంతకుడు బలే చతురుడు, చురుకైనవాడనే ప్రశంసలుకూడ ముట్టుతూండేవి.

"సొమ్ములేకపోయింది; గాని, లేకుంటే పెద్ద మొత్తాన్నే కొట్టేశేవాడు అని ఒకరంటే, 'పాపం! పట్టుబడకుండ ఒడుపుగా తప్పించుకున్నాడు; అదీ మేలే' నని యింకొకడనేవాడు. అంతేగాని మృతునిపట్ల సానుభూతిని ప్రకటించినవాడొక్కడూ లేడు. లోకుల యీ నిష్ఠుర స్వభావాన్ని ఇలియా యేవగించుకోకుండా వుండలేకపోయాడు.

ఇలియాకు పాపంచేశానన్న మనస్తాపం యేమాత్రం లేదు. ఇతరభారాలవలె యిదికూడ వాడిహృదయకోశంలో ఒకమూల యిమిడిపోయింది. ఒత్తిడితగలనిదే నొప్పికలుగని వాపులాగ అదికూడ ఇలియామెదలో వుండిపోయింది. భగవంతుడు విచారణనాడు తనపాపాలకు తగినశిక్ష నెల్లాగూ విధించకపోడని ఇలియాదృఢవిశ్వాసం. ఆ శిక్ష యెప్పుడు విధించబడినా అనుభవించేందుకు సంసిద్ధంగానే వున్నాడు. మరి యిప్పటినుంచీ ఆరాటపడినందువల్ల కలిగే ప్రయోజన మేమి టనుకున్నాడు. ఈ విధంగా వానియాత్మకు శాంతి చిక్కింది. ఇక వా డితరుల పాపకృత్యాలను గమనించుతూ నవ్వుకొనేవాడు.

హత్య జరిగిననాటినుంచి ఇలియా అతి గంభీరంగా వుంటున్నాడు. మామూలుగా వస్తువు లమ్ముకుంటూ, హోటల్లో తింటూ, లోకం చెప్పుకొనేమాటల నాలకించుతూ రోజులు వెళ్ళబుచ్చుతున్నాడు. ఒకనాడు వానికి పూడ్చి పెట్టిన ధనం సంగతి జ్ఞాపకం వచ్చింది. వెళ్ళగించి తెచ్చు కుందామనుకున్నాడు; కాని, మళ్లీ ఆలోచించి ఒకవేళ పోలీసులు వచ్చి సోదాచూస్తేపట్టుపడవచ్చునని ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

పోలీసులు రానూలేదు, సోదా జరగనూ లేదు; కాని, కోర్టుకు హాజరుకావలసిందని సమనుమాత్రం వచ్చింది. వేళకు కచేరీకి వెళ్లాడు. ప్రభుత్వన్యాయవాది "నీ పేరేనా ఇలియా?" అనడిగాడు ప్రమాణంచేయించినాక.

"అవును" ఇలియూ సమాధానమిచ్చాడు.

"నిన్ను రప్పించడానికి గల కారణమేమిటో నీకు తెలుసు గదూ?"

"నాకు తెలియదు."

ఇలియూ కోర్టుహాలు పరిశుభ్రత, అలంకరణ చూచి "ఇక్కడి జీవితమే జీవితం! ఎంత ఆనందంగా వుంటుంది! దొంగల్ని, హంతకులను పట్టుకోటంలోనే వుంది సరదా. వీళ్ళకి జీతా లెంతెంత యిస్తారో!" అని యోచించు తున్నాడు.

"ఏం? లీపా నీతో యేమీ చెప్పలా?" అని ప్రభుత్వ న్యాయవాది మళ్లీ ప్రశ్నించాడు.

"కొన్ని రోజులనుంచి నేనామెని కలుసుకోనేలేదు."

"ఎన్నాళ్ళనుంచి?"

"ఖచ్చితంగా చెప్పలేను, ఏడెనిమిది రోజులు కావచ్చు."

"లీపా యింటివద్ద పోలటోవ్‌ను యెన్నిదఫాలు చూచావు?"

"ఎవరు? హత్యచేయబడిన మనిషా?"

"అవును, ఆయన్ను చాలాసార్లు చూచావు కదూ?"

"నే నాయన్ను యెన్నడు కలుసుకొనివుండలేదు."

"ఎప్పుడూ కలియనేలేదా?"

ప్రాసిక్యూటింగ్ యిన్స్పెక్టరు నిర్లక్ష్యాన్నభినయిం చుతూ ఇలియూను వెంటవెంటనే ప్రశ్నించుతున్నాడు.

ఇలియా తాపీగా జవాబులిస్తున్నాడు. అది ప్రా॥ యిన్స్పెక్టరుకు కంటకంగావుంది. మధ్య మధ్య బల్లతో ముష్టియుద్ధం చేస్తున్నాడు. ముక్కద్దాల్లోంచి ఇలియావంక చూచి మళ్ళీ అడిగాడు.

"పోలటోవ్ లీసాతో సంపర్కంకలిగివున్న సంగతి నీకు తెలుసుగా?"

"నాకు తెలియదు."

ఇలియా ప్రతిదీ నిరాకరించడం వానికి వుడుకెత్తిస్తోంది. "ఆయనకు లీసాతో సంబంధమున్న మాట వాస్తవమేలే. ఆ పొత్తు హర్షించతగ్గది కాదు."

"కావచ్చు."

"నేను చెప్పింద నిజమేకదూ?"

ఇలియా మాట్లాడడు.

"నీకు లీసాతో యెన్నాళ్ళనుంచి పరిచయముంది?"

"సుమారు రొక యేడాదినుంచీను."

"కాబట్టి పోలటోవ్‌కుపూర్వంనుంచీ నీకు లీసాతో సంబంధమున్నట్టేగా?"

ఇలియా "నాకేం తెలుసు?" అన్నాడు.

పా॥ ఇన్స్పెక్టరు ఔడుకరచుకున్నాడు. ఈలవేస్తూ ఫయిలొకటి తీసి చూచుకోసాగాడు. ఇలియా ఎదురుగా గోడనువేలాడుతున్న పటాన్ని తదేకధ్యానంతో చూస్తున్నాడు.

"ఆ చిత్రం అంత బాగుందా?" అనడిగాడు ప్రభుత్వ న్యాయవాది.

"ఎందుకు బాగుండదు? క్రీస్తుదేవుడా పోవుచున్న దెక్కడికో?" అన్నాడు ఇలియా భక్తిపూర్వకంగా.

ప్రి॥ న్యాయవాది హతాశుడై "మానవులు తమ కర్తవ్యాన్నెంతవరకు పాలించుతున్నారో చూచేందుకు భూలోకానికి వేంచేస్తున్నారు" అని చెప్పాడు.

"ఆయన స్వర్గాన్నుంచే యిదంతా చూడలేరూ?"

"దీనినే వుత్ప్రేక్ష అంటారు. మానవహృదయాల పైన ప్రభావం కల్గించటానికే యిది చిత్రింపబడింది. మానవుడేవిధంగా ఈశ్వరాదేశాలను తిరస్కరించి పాపాచరణ చేస్తున్నదీ భోధించటానికే యీ పట ముద్దేశింపబడింది. సరె, నిన్నింకా రెండు - మూడు ప్రశ్న లడగాల్సివుంది" అని చెప్పి ప్ర॥ న్యాయవాది ఆగాడు.

ఇలియా అతనివేపొకసారి చూచాడు. ప్రి॥ న్యాయవాది ప్రశ్నమీద ప్రశ్న వేస్తున్నాడు. జవాబిచ్చి యిచ్చి ఇలియా గాసిచెందాడు. అతడు బుద్ధిపూర్వకంగానే తనకు విసుగుకలిగించి, మనస్సు కలవరపరిచి అనుకూలసమాధానాలు లాగజూస్తున్నాడని ఇలియా గ్రహించాడు.

"గత బృహస్పతివారంనాడు పగలు వొకటి-రెండు గంటల మధ్య నువ్వెక్కడున్నావో చెప్పగలవా?"

"హోటలులో టీ తాగుతూ కూచున్నాను."

"ఏ వీధిలో?"

"స్ప్రైనా స్ట్రీటులో."

"నీకు వేళవిషయంలో ఇంత ఖచ్చితంగా జ్ఞాపకం వుండడానికి కారణం?"

ప్ర॥ న్యాయవాది బల్లమీదకి వొంగి సులోచనాల గుండా ఇలియాను చురచుర చూస్తున్నాడు. ఇలియా యే మాత్రం చలించక మెల్లగా యిలా చెప్పాడు:

"హోటలులోకి వెళ్తూ చౌకులో వున్న కానిస్టేబులును టైమడిగాను. అతను వొంటిగంట అయిందని చెప్పాడు. అందువల్లనే యింత రూఢిగా చెప్పగలిగాను."

ప్ర॥ న్యాయవాది కుర్చీలో వెనక్కి చేరగిలబడి పెన్సిలుతో గోళ్ళమీద గిలుకుతూ "ఆ జవాను నిన్నెరుగునా?" అనడిగాడు.

"అవును."

"నీవద్ద గడియారం లేదూ?"

"లేదు."

"నీ వా కానిస్టేబిలు నంతకుపూర్వంకూడ టైమడుగుతూవుండేవాడవా?"

"అప్పుడప్పుడూ."

"అక్కడికి సమీపంలోనే టౌనుహాలు టవర్ క్లాక్ వుందిగా?"

"దాన్ని చూచి క్లైము తెలుసుకోవాలన్న విషయం చాలామందికి గుర్తుండదు."

"నీ వా హోటలులో యెంత సేపటివరకున్నావు?"

"కేకలు విని బయట కెళ్లాను."

"ఎక్కడికి కెళ్ళావు?"

"హత్యాప్రదేశానికి."

"అక్కడ నిన్నెవరైనా యెరిగినవాళ్లు చూచారా?"

"నాకు క్లైము చెప్పిన కానిస్టేబిలు చూశాడు. నన్ను ముందుకు పోనీకుండ వెనక్కి గెంటివేశాడు కూడాను."

ప్రాసిక్యూటింగ్ ఇన్స్పెక్టరు పరధ్యానంగా వున్నట్టు ప్రక్కకు చూస్తూ "సరేగాని, నువ్వు కానిస్టేబిలును క్లైమడిగింది హత్యకు ముందా, తర్వాతనా?" అనడిగాడు.

ఈ ప్రశ్న నడగటంలో గల వుద్దేశాన్ని ఇలియా సులభంగానే వూహించాడు. వాని మొహం జేవురించింది. 'చూడటానికి పెద్దమనిషిలాకన్పడినా నల్లత్రాచులా వ్యవహరించుతున్నాడే' అనుకున్నాడు ఇన్స్పెక్టరునుగురించి.

"నే నెల్లా చెప్పగలను?" అని జవాబిచ్చాడు.

ఇన్స్పెక్టరు ముఖం నల్లబడింది. మళ్లీ ప్రశ్నించాడు.

"ఆ కానిస్టేబిలు పేరేమిటి?"

"మతేయి ఇవానోవిచ్."

అధికారికి ఆశాభంగమయింది.

"ఆరోజున నువ్వెవరయినా పొడుగాటివ్యక్తిని కలుసుకున్నావా?"

"లేదు."

"సరే, నీ వాఙ్మూలం చదువుకొని దస్కత్తు చెయ్యి."

ఇలియా కోర్టునుంచి సరాసరి లీపాయింటికి వెళ్ళాడు. జరిగిన వైనమంతా లీపాకు విన్పించాడు. లీపా వానివీపు తట్టుతూ "పక్కా కిలాడీవి!" అని అభినందించింది.

"టక్కరిముండాకొడుకు పుచ్చుబాగాపన్నాడు. బోల్తా కొట్టించడానికి మహాతిప్పలుపడ్డాడు" అన్నాడు ఇలియా.

"వాళ్ళవృత్తే అదాయె" అంది లీపా.

"ఫలానా ఘటన జరిగింది. అందులో నీ చెయ్యుందని అనుమానంగా వుందని స్పష్టంగా అడగ్గూడదూ?"

లీపా నవ్వుతూ అన్నది— "నువ్వుమాత్రం నిజం చెప్పావూ?"

"నువ్వన్నది సత్యదూరంకాదులే; కాని, అక్కడ వాళ్ళయెదుట వున్నంతసేపూ నేనుచెప్పింది ప్రతి అక్షరము నిజమేననిపించింది."

"దేవునిదయవల్ల అంతా సజావుగానే జరిగిందిలే."

"నేనొక్కమాటకూడ అబద్ధంచెప్పాల్సిన అగత్యం లేకపోవడం అన్నిటికంటె ముఖ్యవిషయం."

"సి. ఐ. డి. వెధవలు మనిద్దరిపైన బాగా నిఘా వేశారు."

"నాకు తెలుసు. నన్ను చుట్టముట్టేందుకు వేటకుక్కల్లాగా ప్రతిఅంగుళంనేల పసిపడుతున్నారు. కాని, వాళ్ళ కేనా అంత చిక్కేది?......నే నెవరికీ అపకారం తలపెట్టలేదు; అయినా కాని దురదృష్టదేవత నా గొంతు పిసకటానికే పూనుకుంది. అస లందరిస్థితీ యింతేలే."

"ఇక మనం భయపడాల్సిన అవసరం లేదనుకుంటాను. ఇక మనం నిశ్చింతగా కాలంవెళ్ళబుచ్చవచ్చు" అంది లీపా.

ఇలియా లేచి కిటికీవద్ద కెళ్ళాడు. బయటికి చూస్తూ "నేను యెల్లప్పుడు పాపాచరణకె నడుంగట్టవలసివస్తోంది. నా కిచ్ఛ లేకపోయినా అల్లాంటివిషయాల్లో చెయిచేసుకోక తప్పటంలేదు. నాకు శాంతినిచేకూర్చి, ఆనందింపజేయగల వ్యక్తే కన్పించటంలేదు. నేనా వృద్ధునిగొంతుపిసికి చంపానే గాని, అందువల్ల నేను బావుకున్న దేమిటి? నాచేతుల్ని పాప పంకిలంగావించుకొని, హృదయాన్ని కళంకితంచేసుకున్నాను. నే నా పాపపుసొమ్మునైనా తీసుకోకుండావుండవలసింది" అని దురపిల్లాడు.

లీపా సమవేదన ప్రకటించుతూ యిల్లా అంది—

"ఆ పిసనిగొట్టుకోసం విచార మెందుకు?"

"వాడినిగూర్చి నా కేమీ విచారంలేదు; కాని, నేను చేసినపని వుచితమో, అనుచితమో నిశ్చయించుకోలేక పోతున్నాను. ఎవనిప్రవర్తన వాడికి పవిత్రంగానే తోస్తుంది.

ఆ ప్రభుత్వన్యాయవాది యెవడినీ యేమీ చేయలేడు. అతడు కంబళిబొచ్చులో దాగివుండే నల్లిలాంటివాడు. వాని జీవితము పవిత్రము, సాత్వికము కావచ్చు"

"మనం త్వరలో యిక్కడ్నుంచి వెళ్ళిపోదాము."

"నే నిక్కడినుంచి కదలను. యిక్కడే వుండి యీ నాటకమంతా చూడాలి."

లీపా దిగులుపడింది.

ఇలియా పచారుచేస్తూ చెప్పాడు— "నే నీ జీవిత పోరాటాన్ని యిక ముందుకూడ సాగించదలిచాను."

లీపా దెబ్బతిన్నట్టయింది. "నువ్వు నా విషయంలో సందేహించుతున్నావు. అందువల్ల నే నాతో రానంటున్నావు. నీ రహస్యం తెలిసినందువలన నేను నిన్నలుసుగా చూస్తానని జంకుతున్నావు; కాని, అది పూర్తిగా పొరపాటు; నీ కిష్టం లేనిదే నిన్నొకక్షణమైనా బలవంతంగా వుంచను" అన్నది లీపా.

ఆమె శాంతంగానే చెపుతోంది; కాని పెదాలదరుతున్నై.

"అనవసరంగావాగ" కని ఇలియా గదురుకున్నాడు.

"నేను నిన్ను నిర్బంధించివుంచను. నీ యిష్టం వచ్చిన చోటుకు పో" అన్నాడు.

ఇలియా లీపాచెంతకు పోయి కూచున్నాడు. ఆమె చేయిపట్టుకొని "నీ బుర్రలో కిల్లాంటి ఆలోచనలు ఎందుకు కలుగుతున్నాయో నాకు బోధపడటంలే" దన్నాడు.

లీసా తనచేతిని విడలించుకొని "నువ్వెంత ఆత్మాభిమానివో అంత కఠినాత్ముడవని నాకు తెలుసు. ఆ ముసలాతడితో సంపర్కం కలిగివున్నానని యింకా నన్ను ద్వేషించుతూనేవున్నావు. నీ యీ యిడుములన్నిటికి కారణం నేనేననికూడ అనుకుంటున్నావు" అంది రోషంతో.

"ఎందు కీ పోచికోలు కబుర్లు? నేను నీ కేవిధంగాను దోషమారోపించటం లేదు. నావంటి దౌర్భాగ్యుడికి పవిత్ర-నిష్కళంక స్త్రీ సాహచర్యం లభించే అదృష్టం వుండదని నే నెరుగుదును. అది అందరాని పండు; చాల గిరాకీ బేరం! అల్లాంటివారిదర్శనం సంసారులయిళ్ళలో మాత్రమే లభిస్తుంది. ఇల్లు—వాకిలి యేర్పరచుకొని సలక్షణంగా కాపురము చేయగలవారికే అలాంటి గృహిణులు ప్రాప్తమవుతారు. అసలు పవిత్రమైనదేదైనా సరే, ధనికులకు మాత్రమే అందుబాటులో వుంటుంది. నాబోంట్లకు యెంగిలి కూడే గతి."

"నీకు నేను యెంగిలిమంగలంగా కనపడుతూంటే యిప్పుడే వదిలేసెయ్యి" అని లీసా తీవ్రంగా అంది. ఆమె కళ్ళనుండి కన్నీరు ప్రవాహంకట్టింది. ఆ కోమలి హృదయం ఇలియా నిష్ఠురంగా మాట్లాడటంతో కాఠిన్యత వహించింది. ఇక నామె ఇలియాపైకి వాక్బాణాలు వదలసాగింది.

'నేను యిచ్ఛాపూర్వకంగానే యీ మురికికూపంలోకి దూకాను. నా హృదయస్వరూపాన్ని చరితార్థం

చేసుకొనేటందు కుపకరించే వస్తువు నిందులో పొందగలనన్న ఆశతోనే ఆపనిచేశాను. నీవు నా కిందులో తొడ్పడ్డావు. నీ సుగుణాలను చూచి నేను మోజుపడలా. పాలపొంగులాగున్న నీ నవయౌవనమూ, కండలు తేరిన శరీరము, ముచ్చటైన క్రాపు, మిలమిలమెరిసే కళ్లు, నీ స్వాభిమానము, అన్నిటికి మించి శూలంలా హృదయాన్ని దూసుకొనిపోయే నీ చీవాట్లంటే వ్యామోహపడ్డాను. నే నాజన్మాంతం నీకు కృతజ్ఞనై వుండదలిచాను. నీ అడుగుజాడల్లో మెలగుతూ నీ పాదధూళిని కళ్ళ కద్దుకుంటాను.''

ఇట్లని లీపా ఇలియాపాదాలమీాద పడి వాటిని ముద్దు పెట్టుకుంది. ఆమె యింకా చెపుతోంది–

" నేను విముక్తికొరకె యీా పాపకూపంలో దిగబడిపోయానని భగవంతునికికూడ తెలుసు. దేవుడు నన్నిందులోనే శాశ్వతంగా వదిలేయడు. తప్పకుండ నే నుద్ధరింపబడుతాను. ఎప్పుడో నే నిందులోనించి బయటపడి తప్తకాంచనంలాగా ప్రకాశించుతాను. నే నామరణాంతం యిందులోనే కుళ్ళిపోను. ఒకనాటికి నేనూ ప్రాయశ్చిత్తం చేసుకొని క్షమాప్రార్థన చేసేఘడియ వస్తుంది ........... ఇప్పుడు నన్నంటియున్న పాపపంకిలము జీవితమంతా కన్నీళ్ళతో కడిగినా వదలదు.''

ఇలియా ఒకసారి లీపాను దూరంగా త్రోసివేయాలనుకున్నాడు. కాని, ఆమె గట్టిగా వానిపాదాలను పట్టు

కొనివుంటంవల్ల ఆ కాఠిన్యత కరగిపోయింది. ఆమె వెన్ను మీద చేయివేసి నిమురుతూ ఆలింగనం చేసుకున్నాడు. వాని పరిష్వంగంలో కూడ లీపా అనర్గళ వాగ్ధార ప్రవహించుతూనే వుంది.

"ఒకసారి కాలుజారిపడితే యిక శాశ్వతంగా పతన మవక తప్పదన్న స్థితిలో నా దోష మేముంది? నేను మిస మిసలాడే యౌవనంలో వున్నప్పటి సంగతి: నా సవతితండ్రి నా వెంటపడ్డాడు. పశుప్రాయుడై నన్ను చెరచటానికి ప్రయత్నించాడు. నే నెన్నిసార్లో మొహంవాచేట్టు చివాట్లు పెట్టినా ఆయన తనమంకుపట్టు వొదల్నే లేదు. పవిత్రము, నిర్మలమునైన నా అవయవాలను నలిపి మలినం చేసివేశాడు. నేను కడవలాది కన్నీరు కార్చాను. గాని, ప్రయోజనం యేముంది? జరిగినదానికి ప్రతీకారం లేకపోయింది. అప్పటి నుంచి పురుషులపైన అంతులేని ద్వేషం కలిగింది. నే నిక మగజాతి నెత్తినెక్కి ఆనందంగా అట్టహాసం చెయ్యాలని నిశ్చయించుకున్నాను. కళ్లుమూసుకుని డబ్బును దూబరాగా ఖర్చుపెట్టసాగాను. రాత్రింబగళ్ళు త్రాగి మైకం కమ్మి, వివేకహీననై వుండేదాన్ని. నేటివరకు నిన్నొకడిని తప్ప యిం కెవరిని హృదయంతో ప్రేమించి యెరుగను. కేవలం మగవారిని మోసగించుతూ నా ఆత్మనే విధ్వంసం చేసుకుంటూ వచ్చాను."

లీపా యింతవరకు చెప్పి ఇలియా బాహుబంధంలో నుంచి విడిపించుకోటానికి గింజుకుంది. కాని, వా డామెను గట్టిగా గుండె కదుముకొని వున్మత్తునిపగిది ముద్దులాడు తున్నాడు.

"నువ్వు న న్నవమానించావు. వొదులు, యీ యెంగిలికూడును పోనివ్వు" మని లీపా స్వాభిమానంతో తీవ్రింగా అన్నది.

ఇలియా యేమాత్రం చలించలా. లీపా యెత్తిపొడుపును లక్ష్యపెట్టకుండా ఆమెకళ్ళలోకి చూస్తూ యిలా అన్నాడు—

"నువ్వు న న్నేన్ని అన్నా సమాధాన, మివ్వనులే. మన యీ దుస్థితికి కనీసం రెండు కన్నీటి చుక్కలయినా కార్చేవాడెవడూ లేడని మాత్రం చెపుతున్నాను. మన మైనా యింకొకరినిగురించి ఖేదపడాల్సిన అవసరం లేదు. నువ్వింతవరకు మంచిపనే చేశావు......వుండు, నిన్ను ముద్దుపెట్టుకోనివ్వు. నీకు నే నిచ్చే జవా బిదే. లీపా! నన్ను నమ్ము. అంతకంటె నీపట్ల నా హృదయంలో యెల్లాంటి ప్రేమ వున్నదో వ్యక్తంచేయలేను.

లీపావాక్ప్రివాహంతో ఇలియాహృదయం ప్రేమ భరితమైంది. వారికీచులాట ముద్దులాటగా మారి, భేద భావాలు ముద్దులవర్షంలోతడిసి ముడుచుకొనిపోయినై. ఆ తరవాత వారిద్దరు ప్రేమసూత్రింలో చిక్కుకున్నారు.

"మనజీవితములో సుఖపడేఅదృష్టం లేనట్టుంది" అన్నది లీసా.

ఇలియా లీసాని దగ్గరకులాక్కుంటూ అన్నాడు- "ప్రియసీ! రా, యీ విచారసాగరంలోనే తరచి ప్రేమామృతాన్ని తీసి తాగుదాము. మనజాతకంలో నిర్వాస-ప్రవాసమే రాసిపెట్టి వున్నా యిద్దరమూ కలిసే అనుభవిద్దాము. ప్రేమమినహా యీ జగత్తునే మర్చిపోదాము, రా. భవిష్యత్తునుగూర్చినచింత నాకు లవలేశమైనా లేదు. నేడు నా హృదయంలో అనంతప్రేమవాహిని పొంగిపొర్లుతోంది. నీ కిష్టమయితే అందులో తానమాడు. నేను గతమంతా విస్మరించాను. నే నిక అనవసరవ్యధకు లోనై కుమిలిపో దలచ లేదు.

---

# 19

ఇలియా న్యాయాలయానికి వెళ్ళివచ్చిన కొద్దిరోజుల కొకనాడు పోలటోవ్ హత్యాసందర్భంలో 'ఆడూ' అనే ఒక పొడుగాటివ్యక్తికోసం పోలీసు లన్వేషించుతూన్నట్టు వానికి తెలియవచ్చింది. ఆడూ అప్పునిమిత్తం పోలటోవ్ వద్దకు తరుచుగా వస్తూపోతూవుండేవాడట. ఆ వ్యక్తి హత్యజరిగిన నాడు, ఆ క్రితంరోజున వేశ్యాగృహంలో వున్నట్టు గూఢచారులు కూపీతీశారు.

హంతకుడిని కనిపెట్టుటలో పోలీసులదృష్టి పెడదారి బట్టినదని తెలిసినప్పటినుంచి ఇలియా నిర్విచారంగా వుంటున్నాడు. ఇక పోలీసు లెంత హంగామాచేసినా అసలు రహస్యంకనుక్కోవటం వాళ్ళతరం కాదని నిశ్చింతుడయాడు.

ఇలియాకు తన ప్రస్తుత జీవితముమీద రోతకలిగింది. వానిస్థితి యుద్ధరంగానికి వెళ్ళిన కొత్తసైనికునిలాగుంది. ఎక్కడైనా ప్రశాంతప్రదేశంలో యేకాంతంగా తన జీవిత సమస్యనిగూర్చి దీర్ఘంగా ఆలోచించుకోవాలనుకున్నాడు; కాని, వాని చుట్టూర అశాంతి కొలిమిలాగా భుగభుగమండుతోంది. ప్రతి నిత్యము యేదో వొక సంఘటన వాని దృష్టి నాకర్షించుతూనేవుండేది. క్రమంగా వాడు బక్క

చిక్కి పాలిపోయాడు. జాకోబుకూడ వానిని కలవరపెడు తూండేవాడు. కన్పించినపుడెల్లా "మిత్రమా! కాస్సేపు తీరికగాకూచుని కబుర్లు చెప్పుకుందాము వస్తావా" అనేవాడు. "ఇప్పుడు తీరిక లే" దంటూ ఇలియా తప్పించుకునేవాడు.

ఒకసారి "చాలా జరూరైన విషయం మాట్లాడాలి" అంటూ జాకోబు ఇలియా వెంటపడ్డాడు.

"ఏమిటా జరూరు?" అని ఇలియా తరచిఅడిగాడు.

"నాకు చాలా మంచిగ్రంథమొకటి లభించింది. అందులో బలే బలే విషయాలున్నాయి."

"నీ మంచి పుస్తకాన్ని పట్టుకెళ్లి పొయిలోపెట్టు. ......సరేగాని, మీ నాన్న నా వేపు అంత గురగురగా చూస్తాడెందుకు?" అనడిగాడు ఇలియా.

"నాకేం తెలుసు? కాని, ఒక సంగతి. నువ్వేవో దొంగనాణాలు మారుస్తున్నావని ఆయన మీ బాబాయితో చెపుతూండగా విన్నాను."

"ఊఁ హుఁ, నా పైన యీ ప్రచారంగూడ సాగించాడూ?"

"పోనిద్దూ, ఆయన మాటలకు విలువేముంది! ఇంతకూ కాస్సేపు కూచునేది వుందా లేదా?"

"పుస్తకంచదవటానికేగా?"

"మరేనోయ్! నే నీ పుస్తకంలో ఒక కొత్తసంగతిని కనిపెట్టాను."

జాకోబుదీనవదనాన్ని చూస్తున్నకొద్దీ ఇలియా వాని దుస్థితికి వగచాడు. నిజానికి జాకోబుజీవితం భూమికి బరువు చేటుగా తయారవుతోంది. వాడిబాబు పెత్రుహా యింకో హోటలుకు యజమానిని అయిన ఒక ముసలావిడను పెళ్లి చేసుకోటానికి ప్రయత్నంచేస్తున్నాడు. ఆ సంగతి ఇలియా చెవినికూడ పడింది.

"పెళ్ళెప్పుడు?" ఇలియా జాకోబు నడిగాడు.

"ఎవరిది?"

"మీ నాన్న పెళ్ళోయ్."

"నాకేం తెలుసు. ఈయ నెంతనాలిముచ్చో, ఆవిడా అంత కుత్సితురాలే. గంతకుతగినబొంత!"

"నీ కొక తమ్ముడుకూడా వస్తాడోయ్; వాడు చదువుకుంటున్నాడటగా?" అని ఇలియా నవ్వాడు.

"కాబోలు" అన్నాడు జాకోబు యథాలాపంగా.

"వాడేనటగా మీ నాన్నకు వారసు?"

జాకోబు ఊఁకొట్టి వూరుకున్నాడు. మళ్లీ యేం తోచిందో గాని మరుక్షణంలోనే "ఆమె కొక కొడుకున్నా డన్నావుగదూ?" అనడిగాడు.

"అవును."

"అయితే నే నదృష్టవంతుణ్ణే! నాన్న వాడికే బ్రాందీషాపును ఒప్పగించుతాడు. నాకీ పితలాటకం తప్పు తుంది" అని సంతోషాన్ని వెలిబుచ్చాడు.

తనభావిని తలచుకోవటంతో జాకోబుముఖంమీద మెఱుపు మెరిసినట్టయింది. వానిఅమాయకత్వానికి ఇలియా జాలిపడ్డాడు. "మరి నీ జీవితం యెల్లా గడుస్తుంది?" అనడిగాడు.

జాకోబు చెవులు నిక్కపొడుచుకున్నై. ఇలియావంక తేరిచూచాడు.

"నే నా విషయంకూడ ఆలోచించుకున్నాను. ప్రతి మానవుడు ముందు మెదడును స్వాధీనంలో వుంచుకోవాలి. తర్వాత భగవంతుడు తన్నెందుకు సృష్టించాడో గ్రహించాలి. ఇప్పుడు సమాజంలో భీషణసంఘర్షణ జరుగుతోంది. ప్రతివాడూ త్రాడు పట్టుకొని తన వేపుకు లాగుతున్నాడేగాని, తా నెటుపోవాలో యెవడికీ తెలియదు. మానవు డీ ప్రపంచంలో జన్మిస్తున్నాడు; జీవించుతున్నాడు; కాని, ఆ రెండింటిలో యేది యెందుకో యెరుగడు. అస లిదంతా తెలుసుకోటానికి ప్రయత్నించక పూర్వమే మృత్యు వాసన్నమౌతోంది. కాన నేను ముందుగా యిప్పట్నుంచే ఆ విషయం తెలిసికోటానికి ప్రయత్నిస్తాను."

"నీ నెత్తిమీద మళ్ళీ యిదో కొత్తభూతం సవారి చేస్తోందీ? ఇంతకూ అందువల్ల ప్రయోజనం ఏమిటి?" అని ఇలియా అడిగాడు. జాకోబువాగ్ధోరణి వాని హృద్గతభావాలను మరొకసారి రేపింది. అవి అంతుకురాక విద్రోహాని కాయత్తమౌతున్నట్టుగా తోచింది. జాకోబుసమస్యలు తన కయిష్టంగా వున్నా వాటిపీడవదిలించుకోలేక పోతున్నాడు.

"ఇదే జీవితసారం. ఆ విషయం తెలిసికొనకపోతే జీవన్మృతునివలె పడివున్నట్టే. మానవజీవితలక్ష్యం నిర్దిష్టంగా వుండాలి. అనిర్దిష్టపథంవేపు కెన్నడు ఒక్కఅడుగైనా పడనివ్వకూడదు" అని జాకోబు వచించాడు.

"నీ మాటలు జీవితసారమంతా వట్టిపోయి, కాటికి కాళ్ళుచాచిన వృద్ధులకు రాణిస్తాయి. సరే, యిక నేను పోయివస్తా" నని ఇలియూ తనదారినిపోయాడు.

ఇలియా యిలాంటి సంభాషణతో వ్యాకులచిత్తుడయ్యేవాడు. వాని నేదో ఆర్పరానిపిపాస పీడించేది. భగవంతుడు తన్ను శిక్షించటాని కప్పుడే యేర్పాటుచేస్తున్నాడనేభావం కూడ కలిగేది. వానియాత్మ భగభగమండుతూన్నట్టుండేది. శాంతికోసం పరితపించేవాడు; కాని, ఇలియాకు ఏకాంతం లభించేదే కాదు. అటువంటప్పుడు విసిగి వేసారి లీసావద్దకు పోయి మనోవినోదం కల్గించుకొనేవాడు.

ఇలియా అపుడపుడు వేరాను చూచి వచ్చేవాడు. ఆ పతితజీవితంలో ఆమె మరింత అధోగతికి సమీపించుతోంది. వేరా తన ఆత్మకథాఘట్టాలను సాభిమానంగా చెపుతూండేది. విటులు తెచ్చిచ్చిన బహుమతు లన్నిటిని విడిచిపెట్టకుండా ఇలియాకు చూపెట్టేని. తనప్రేమను సంపాదించటానికి, తన్ను అనుకూలవతిని గావించుకొనుటకు విటులు పరస్పర మెట్లు కయ్యానికికాలుదువ్వేదీ, దుయ్యబట్టుకొనేదీ, స్పర్థ నెట్లు పెంచుకొనేవారో నవ్వుతూ వర్ణించేది.

వేరా ఆరీతిని వర్ణించుతూంటే ఇలియా ఉల్లాసంగా వుండేవాడు కాదు. విషణ్ణహృదయంతో "వేరా! ఒకనాటికి నీవు పస్తాయించవలసివస్తుందిసుమా!" అన్నాడు ఒకనాడు.

"పర్వాలేదు. నా నొష్టన యిదే రాసిపెట్టుంది. సాగినంతకాలం సుఖమనుభవించితే, తర్వాత చూచుకో వచ్చు"నంది వేరా.

"మరి పాష్కా నేమి చేయదల్చావు?"

ఆమెముఖం కళావిహీనమైంది. నవ్వు అదృశ్యమయింది. "నన్ను విడచిపెట్టటంలోనే ఆయనకు మేలుంది. నా సంపర్కంవల్ల వ్యధ చెందటమేగాని, సుఖముండదు. లభించినదానితో తృప్తి చెందక అంతా తనకే దక్కాలని తాపత్రయపడి నిరాశతో దిగులుపడుతాడు. కాని, నే నెలాగూ చెడిపోయాను. చెడ్డచేనుకు మంచెందుకు? నేనిక మధ్యలో ఆగదలచ లేదు."

"అయితే నువ్వు పాష్కాను ప్రేమించటం లేదా?"

"అట్టి వ్యక్తిని ప్రేమించకుండా వుండగల్గటం నా వశంలో లేదు."

"అయితే మీ రిద్దరూ ఒకఇంటివాళ్ళై కాపురం చేసుకోరాదూ?" అని అడిగాడు ఇలియా.

"నే నాయనకు భారంకావటం నా కిష్టంలేదు. పాష్కా తన స్వంతఖర్చులకే సంపాదించుకోలేడు. మరి నన్నెలా పోషించగలడు చెప్పు?" అంది వేరా తలొంచుకొని.

"అతని స్వభావాన్నిబట్టి ఎప్పుడైనా యేదో భయం కరసంఘటన జరుగుతుందేమోనని నేను భయపడుతూ వుంటాను" అన్నాడు ఇలియా.

వేరాకు నవ్వొచ్చింది. "అతని హృదయం అతి మెత్తనిది. నేను మీామిత్రుణ్ణి కీలుబొమ్మలా ఆడించగలను."

"వాడిని వదిలెయ్యవు గద?"

వేరా హృదయానికి సూదిగుచ్చుకున్నట్టు బాధపడి అంది– "మరి నేనేం చెయ్యగలను? నే నొకరిదాననై జీవించటానికే జన్మించా ననుకుంటున్నారా? ప్రతిప్రాణికీ సుఖపడాలనేవాంఛ వుంటుంది. ప్రతివ్యక్తీ సుఖంకోసంమార్గాన్ని వెతుక్కోవటం సహజం. అందరూ యింతే."

"నీవు చెప్పింది అంతా సత్యంకాదు. మానవుడు ఎల్లప్పుడు తన సుఖానికే దేవులాడడు."

"మరి ఎవరికోసం?"

"ఇతరుల సుఖానికి. నీ సుఖానికి మల్లేనే"

వేరా కిలకిల నవ్వింది. "ఓహో! నా సుఖం!"

ఇ లి యా విషాదహృదయంతోనే అక్కడినుంచి వెళ్లిపోయాడు.

ఇలియా కీ మధ్య పావ్కా ఒకటి రెండు పర్యాయాలు మాత్రమే అగపడ్డాడు. వాడు వేరావద్ద ఇలియాను చూడటం తటస్థించితే మండిపడేవాడు. ఇలియా మౌనంగా వున్నా వానికళ్లెర్ర బడేవి. పావ్కా అనుమానపడి ఈర్ష్యా

నలంతో కుములుతూంటే ఇలియా కానందంగా వుండేది. పాష్కా నిక యీ పతితజీవితాన్నుండి వుద్ధరించటం అసంభవ మనుకున్నాడు. ఏదో గట్టిదెబ్బతగలనిదే వాడు కళ్లు తెరచి చూడడని ఇలియాకు విశ్వాసం కలిగింది. వాళ్లిద్దరిని గూర్చి ఇలియా యెంతో బాధపడేవాడు. తుదకు పాష్కాకు శాంతి కలిగించాలని వేరావద్దకు పోవుటే మానుకున్నాడు.

లీపాసంపర్కంతో ఇలియాజీవిత మానందంగానే గడిచిపోతోంది; కాని, కారుమబ్బులు కమ్ముకొచ్చి అపు డప్పుడు వారిసన్నివేశాల్లో తుపాను చెలరేగుతుండేది. వానిహృదయం క్షోభించేది. లీపా వానిగాంభీర్యతను గాంచి "వృథాగా గతించినదానికి వగచి ప్రయోజనమేమిటి? అందరూ మనలాంటివాళ్లే. ఎవరిహస్తాలు కళంకితం కాకుండా వున్నాయి?" అని ఊరటకల్గించేందుకు యత్నించేది.

"ఆ విషయం నా ముందు ప్రస్తావించకు. నే నిప్పుడు ఆలోచించేది చేతుల కళంకాన్ని గురించి కాదు. నీవు నా మనోభావాన్ని గ్రహించలేవు. నే నెవ్వరికీ చెరుపు చెయ్యకుండా సుఖ-శాంతులు కలిగి జీవించే వుపాయమేమిటా అని అఘోరిస్తున్నాను." అని ఇలియా చెప్పేవాడు.

వా డెంత విముఖత చూపినా మృతుడైన పోలటోవ్ విషయం ప్రస్తావించకుండా వుండేది కాదు లీపా. ఇలియా సహించలేక అక్కడినుంచి వెళ్ళిపోయేవాడు. మరునాడు మళ్ళీ వచ్చినపుడు లీపా వానిని పరుషవాక్యాలతో నొప్పించేది.

"నీవు జాలి, భయాలవల్లనే నా వద్దకు వస్తున్నావు; కాని, నీ హృదయంలో నా యందు రవంతయినా ప్రేమ లేదు. నేనిక యిలాంటి వ్యక్తితో వుండలేను. యెక్కడి కైనా లేచిపోతాను.

లీపా నిత్యము ఇలాంటి వాగ్బాణాలను ఇలియాపైకి విసిరేది; కాని, మరుక్షణంలోనే ఆ వగలాడి ఇలియాపాదాలమీద పడి తనరూపంమీద ఒట్టుపెట్టుకొని వానిని ప్రసన్నునిగావించుకొన ప్రయత్నించేది.

అట్టితరి నామె కన్నులరమూతలడి, పెదవులదిరేవి. వానికౌగిలిలో ఇమిడిపోవటానికి ఆసక్తికలిగియున్నట్లు ఆ మిటారివక్షు ముబికేది. అంతట ఇలియా ఆమెను బాహుపాశంలో బంధించి వుద్రిక్తమానసుడై ముద్దులాడేవాడు. ప్రేమరసాన్ని వెల్లువగా ప్రవహించే హృదయంగల లీపా బోసినోటి పోలటోవ్ చుంబనాన్నెట్లు సహించగల్గిందా యని అక్కజపడేవాడు. ఆ విషయం స్మృతికివచ్చినప్పుడు లీపా కూడా అసహ్యంతో వుమ్మివేసేది.

ఒకనాడు ఇలియా లీపా నడిగాడు – "ముసలిపీనుగను హతమార్చినప్పటినుంచి నీకు నా పైన అనురాగం అధికమౌతోందికదూ?"

"ఏం?"

"ఏముంది? కొందరు తాజాసరుకును వదలి, కుళ్ళి కంపుకొట్టే వస్తువునే పసందుచెయ్యటం చూచి నాకు నవ్వు వస్తోంది."

"ఒక్కొక్కరిఅభిరుచి ఒక్కొక్కవిధంగా వుంటుంది. రుచులనుబట్టి ఆచరణకూడా భేదించుతుంది" అంది లీసా.

ఒకనాడు ఇలియా బజారునుంచి తిరిగివచ్చి బట్టలు మార్చుకొంటూండగా పెరెన్సు వచ్చి "నిన్నుగురించి అనేకు లనేకవిధాలుగా చెప్పుకొంటున్నారు. ఏమి టీ గొడవ?" అన్నాడు.

"ఏమని?"

"ఆ హత్యలో నీ చెయ్యికూడా వుందనీ, దొంగ నాణాలు మార్చుతున్నావనీ, ఇంకా యిలాగే చెప్పు కొంటున్నారు."

"అయితే నన్నందరూ అసహ్యించుకొంటున్నారా?"

"సి. ఐ. డీ.లు వచ్చి నిన్నుగూర్చి ఎన్నెన్నో ప్రశ్న లడుగుతున్నారు."

"అడగనివ్వండి, ఏం పోయింది?"

"అసలు కారణంలేకుండా వాళ్ళెందుకు వేధిస్తారు?"

ఇలియా అట్టహాసంచేసి వూరుకొన్నాడు.

"ఇప్పుడు పోలీసువాళ్లు రావడంలేదులే. పెట్రిహా మాత్రం నిన్నుగూర్చి వున్నవీ, లేనివీ చెప్తుంటాడు. నీ విక్కడినుంచి వెళ్ళిపోతేనే మంచిది. తాను మ్యునిసిపాలిటీ మెంబరు ననీ, నీవంటి అనుమానింపదగినవాళ్ళను తన గృహంలో వుండనివ్వననీ ఖండితంగా చెప్పేశాడు."

ఇలియా ముఖం కందగడ్డలాగైంది. కళ్ళెర్రజేసి "వాడికి ప్రాణంమీద తీపివుంటే నోరు సంబాళించుకొమ్మని చెప్పు. నే నెల్లాంటివాడనైతే తనకెందుకు? ఇకముందు అవమానకరంగా మాట్లాడినట్టు తెలిస్తే వాడితల తుంచేస్తా. నాకిష్టమైనప్పుడే ఇక్కడినుంచి వెళ్తాను. ఇంకా నే నీ పుణ్యాత్ములతో కొంతకాలం వుండ దలచాను" అన్నాడు.

ఇలియా రౌద్రరూపం చూచి పెరెస్సు భయకంపితుడైనాడు. రెప్పవాల్చకుండా ఇలియావంక చూస్తూ మెల్లగా అన్నాడు— "నీకు పెళ్ళీడు వచ్చింది. నీ అంద చందాలు చూస్తే పల్లెటూరికన్యలంతా వెంటపడతారు. నీవు మన వూరికి వెళ్తేనే బాగుంటుంది.

ఇలియా ప్రత్యుత్తర మివ్వలా.

"నేను మరికొంత డబ్బిస్తాను. నువ్వు అక్కడొక దుకాణం పెట్టుకొంటే జీవితం సుఖంగా వెళ్ళిపోతుంది." అన్నాడు పెరెస్సు.

"నేను అంతకంటె వుచ్ఛదశకు వెళ్ళాలనుకొంటున్నాను."

"మంచిదేగాని పల్లెటూళ్ళోఅయితే రెండూ సమకూడుతాయి. ఉన్నతీ పొందొచ్చు; సుఖమూ ప్రాప్తిస్తుంది."

"ఆ తర్వాతనో?"

"ఈ ప్రశ్నతో పెరెస్సుకు నవ్వు వచ్చింది. యేదో చెప్పబోయాడు; కాని, ఇలియా చెవిని పెట్టలా. వాడు గత

విషయా లన్నిటిని స్మరించుకొని ప్రపంచ మెట్లు వలవలె చిక్కులతో కూడుకొనివుందో ఆలోచించుకొంటున్నాడు. రక్షక భటులు నేరస్తుణ్ని పట్టుకొని యిచ్చివచ్చినట్టు త్రిప్పినట్లే, ప్రాపంచికఘటనాక్రమము మానవుని అనిర్దిష్ట మార్గంలో తీసుకొనిపోతోందని భావించుకున్నాడు. తా నదివరకె ఆ కొంపను వదలిపెట్టగోరుతున్నాడు. పరిస్థితులుకూడ అట్లె సంఘటిల్లుతున్నై.

ఇట్లాలోచనానిమగ్నుడై వుండగానే తలుపుతట్టిన చప్పుడయింది. "త్వరగా తెరవండి" అని ఇలియా టెరెన్సును హెచ్చరించాడు.

జాకోబు లోనప్రవేశించాడు. వానిచేతిలో పచ్చట్ట పుస్తక మొకటుంది. "మాషాయింటికి పోదాం రా" అన్నాడు వస్తూనే.

"ఎందుకోయ్?" ఇలియా అడిగాడు.

"మాషాకన్పించలా; ఎక్కడికి పోయిందోఏమిటో!"

"ఎక్కడి కెళ్తుంది?" టెరెన్సు అడిగాడు.

"మతిస్సా గది కెళ్తుంది తరుచుగా."

"మతిస్సాసావాసం మాషాకి శ్రేయస్కరం కాదు."

"పోదాం, పద"మని ఇలియాచెయ్యిపట్టుకొని గుంజ సాగాడు జాకోబు.

"నువ్వు ఇంటివద్దనుంచి పలుపుతప్పించుకొచ్చినట్టు న్నావే?" అని ఇలియా వాడిముఖంలోకి చూచాడు.

జాకోబు "ఇందులో యింద్రజాలమహేంద్రజాలముంది తెలుసా?" అన్నాడు.

"ఎందులో?"

"ఈ పుస్తకంలోనే. రా, నీకిస్తాను. బలే చిత్రమైన పుస్తకం! చదువుతూంటే నాకు భయంకలుగుతోంది."

ఇద్దరూ మాసాగదికి వెళ్ళారు.

జాకోబుచేయి చలించుతోంది. కళ్ళు లోతుకుపోయి వున్నై.

"తాగివచ్చావా?" ఇలియా అడిగాడు.

"లేదు. నేనివేళ వాసనే చూళ్ళేదు. ఇప్పుడసలు రోజూ తాగటంలేదుగా. మానాన్న యింటివద్ద వున్నప్పుడు మాత్రం నాకు ధైర్యసాహసాలవసరమై ఒకటి రెండు గ్లాసులు తాగేస్తున్నాను" అని చెప్పి జాకోబు కుర్చీలో కూర్చొని పుస్తకం తెరచి చదువసాగాడు.

"మూడవ అధ్యాయం. మానవుని ప్రారంభదశ, మానవుని ఆదిమదశ రెండువిధములుగా వున్నదని కొందరి వూహ. ఈ జగత్తుకు వినాశమే లేదని మరికొందరి భావన. వారి వుద్దేశంలో మానవజాతికి ఆద్యంతాలే లేవు."

అని చదివి జాకోబు పుస్తకంలోనుంచి దృష్టి మరల్చి సాభిప్రాయంగా ఇలియా నడిగాడు—"శ్రద్ధగా వింటున్నావా? మానవుడికి తుది మొదలు లేవు."

ఇలియా సంశయాత్మకంగా పుస్తకం వంక చూచి "తర్వాత చదువు" అన్నాడు.

"సిసేరో, పైథాగరస్ మొదలైనవాళ్లీ విశ్వంలో ప్రస్తుత మున్నదానికి, కానున్నదానికి ఆది లేదని నమ్మి అదే వుద్దేశాన్ని వెల్లడించారు. కాని, మనకళ్ళముందే అనేకజీవు లుద్భవించి అంతరిస్తున్నై. వాటి జనన–మరణాలు రెండూ మనకళ్లతో చూస్తూనేవున్నాము."

ఇలియా గబాలున వుస్తకంలాక్కొని మూసివేశాడు. "ఈ బూతులబుంగని దూరంగాపారెయ్యి. వీళ్ళంతా యేదేదో రాసిపారేస్తారు అర్థంకాని తుక్కు" అన్నాడు.

జాకోబు విస్తుపోయి అడిగాడు, "నీ ఆది నీకు తెలుసా?"

ఇలియా తీవ్రంగా "ఏమిటి?" అన్నాడు.

"కోప్పడకు. ప్రతిమనిషిలోను ఆత్మ వుంటుంది."

"అయితే ఏమంటావ్?"

"ప్రతివాడూ తనపుట్టుకనుగూర్చి తెలుసుకోవాలి. ఆత్మకు చావులేదనీ, అది అవినాశకరమైనదనీ తత్వవేత్తలంటారు. అది సర్వదా జీవించేవుంటుంది ............ కాని, మానవునికి తన జననాన్నిగూర్చి తెలియవలసిన ఆవశ్యకత లేదు. వాడు తెలుసుకోవలసింది తనలో ప్రాణం ఎప్పుడు ప్రవేశించిందా అని మాత్రమే. కారణం ప్రతివాడు జీవంతోనే పుడతాడుగా. మరి ఆ శరీరంలోకి ప్రాణం ఎప్పుడు

ప్రవేశించిందో కనుక్కోవలసిందే. తల్లి గర్భంలోనా? అయితే పూర్వజన్మవిషయం ఏల జ్ఞప్తికిరాదో! ఆత్మ ప్రత్యేకపదార్థమైతే అది శరీరంలోకి ఎప్పుడు చేరుతోంది?''

జాకోబుకళ్లు మెరుస్తున్నై. ఏదో ఇలియాకు తెలియని నిగూఢరహస్యాన్ని తాను బయటపెట్టినట్టు విజయగర్వంతో వుబ్బిపోయాడు. హర్షాతిరేకంతో "ఇంతే, ఆత్మ సమస్య నిప్పుడు విడగొట్టు చూద్దాం'' అని అరిచాడు.

ఇలియా వానివంక చూచాడు. "ఎందుకోయ్, ఆ మిట్టి పడటం?'' అన్నాడు.

"ఏమీ లేదు. వుల్లాసం!''

"నా సలహా విని ఈ పుస్తకాన్ని ఎప్పుడూ చదవకు. యిందులో భగవద్విరుద్ధవిషయాలున్నై. నాలో ప్రాణం ఎప్పుడు ప్రవేశించిందో తెల్సుకోవాల్సిన అవసరం లేదు. ఎవరికీ యే యిబ్బందీ లేకుండా నా జీవితం శాంతియుతము, సుఖప్రదము యెల్లా అవుతుందో, అందునిమిత్తం నే నెల్లా ప్రవర్తించుకోవాలో తెలుసుకోవటంమాత్రం జరూరు. ఇలాంటిసంగతులున్న పుస్తక మేదైనావుంటే వెతికి పట్టుకురా.''

జాకోబు ఆలోచనలోపడ్డాడు. నెత్తిమీద చేతులు పెట్టుకొని యోచించుతున్నాడు. ఇలియాప్రత్యుత్తరంతో వానిఉత్సాహమంతా అణగారిపోయింది. కొంచెమాగి అన్నాడు——

"నీలో నాకు నచ్చని గుణ మేదో వున్నట్టుంది. నీవు చెప్పినది నాకేమీ బోధపడకుండావుంది. నీకు దేన్నిగురించో అహంభావముంది. ఎప్పుడూ మహాపుణ్యాత్మునివలె మాట్లాడుతుంటావు."

ఇలియా నవ్వుకున్నాడు.

"ఎందుకూ నవ్వుతావు? నేను యదార్థమే అన్నాను. నువ్వు అందరినీ నిందించుతావు. ఎవరితోను చెలిమికలిగి వుండవు."

"నీవు చెప్పేది నిజమే; కాని, నే నెవరితో మాత్రం స్నేహంగా ఎందుకుండాలి? నే నొకరిసొమ్ము తింటున్నానా? ప్రతివాడు స్వలాభంకోసం ప్రక్కవాడికి గోయ్యితవ్వటానికే తయారవుతున్నాడు. అయినా, వాడి కితరులప్రేమ కావాలే? నేను తెలివితక్కువదద్దమ్మను కాను. నీవు గౌరవాన్నాశించితే, ముందు యితరులను గౌరవించటంనేర్చుకో. అందరూ సుఖంకోరేవాళ్లే, ఎవరివంతును వారనుభవించాలి. అప్పుడే అంతా ప్రేమమయమవుతుంది."

"అందరూ సాంసారికసుఖంకొరకే తాపత్రయపడుతున్నా రంటావా?"

"ఖచ్చితంగా అవు నంటున్నాను. ఎటుచూచినా మోసము, వంచనలే. మానవుని ప్రతిచర్యలోను స్వార్థమిమిడి వుంది. భృత్యుడు యజమానికి జమాఖర్చులను ఒప్పజెప్పినట్లె మా పినతండ్రి భగవంతునికి పాప పుణ్యాల

జమాఖర్చులను చెప్పబోతున్నాడు. మీనాన్న చర్చిలో గంట కట్టించాడు. దానిఅంతరార్థంగా ఆయన యెవరినో వంచించివుంటాడనీ, లేదా మోసగించనున్నాడనీ నేను భావించుతున్నాను. సర్వత్ర యిదే తంతు. ఒక రూపాయి యిచ్చినవాడు అయిదురూపాయ లపేక్షించుతున్నాడు. అంతేకాదు; తన ప్రవర్తన సబబైనదనీ, న్యాయయుక్తమనీ ఒప్పించటానికి ప్రయత్నించుతున్నాడు. ఇంతకూ నేను చెప్పేదేమంటే తప్పుచేసినవాడు దానిఫలితాన్ని అనుభవించటానికి బుద్ధిపూర్వకంగా సిద్ధపడాలని.''

''నిజమే. విధాత మనల్ని బలే విషమదశలో సృష్టించాడు. నీవు యితరులను నిందించి, వారి దుష్కార్యాలను విమర్శించి నీ హృదయానికి శాంతినిచేకూర్చుకొంటున్నావు; కాని, ఆపని నావల్లకాదు. నే నెక్కడికైనా పారిపోతే మేలేమొ!''

''ఎక్కడికి వెళ్తావు?''

''ఏమో! ఎక్కడికని చెప్పను?''

ఇద్దరూ మౌనంవహించారు. పరస్పరం ముఖాలు చూచుకొంటున్నారు. ఎదుట పచ్చట్టబొక్కు పడివుంది.

ద్వారంవద్ద పదధ్వని విన్పడింది. ఫర్ ఫిష్కా సితారుతో వచ్చాడు. వాని వెనకనె మతిస్నా వుంది. ఫర్ ఫిష్కా తూలిపడబోతుంటే మతిస్నా చేతులుచాచి పట్టుకోబోతోంది. వాడామెచేతుల్ని త్రోసివేసి ''దూరంగా పో, నాకేం పర్వాలేదులే'' అని కసరుతున్నాడు.

జాకోబు వానివంక చూచి నవ్వాడు.

"ఎక్కడినుంచొస్తున్నారు?" అని ఇలియా అడిగాడు.

"స్వర్గాన్నుంచి" అని పకపకా నవ్వి ఫర్‌ఫిష్కా రాగంతీయసాగాడు.

ఇలియా మళ్లీ అడిగాడు—"మాషా ఏదీ?"

ఈ ప్రశ్నతో జాకోబుకు మాషాసంగతి స్ఫురణ కొచ్చింది. వాడూ ఆ ప్రశ్ననే రెట్టించాడు.

కాని, యెవరూ ప్రత్యుత్తరమివ్వలేదు. ఫర్‌ఫిష్కా వ్రేళ్ళు సితారుమీద ఆడుతున్నై. మతిస్సా ఆలాపిస్తోంది.

ఇలియా కూర్చున్నచోటునుంచి లేచాడు. ఫర్‌ఫిష్కా మెడను గట్టిగా లంకించుకొని వూపుతూ "నీ కూతురెక్కడుంది?" అని గద్దించి అడిగాడు.

మెడవదలించుకుంటూ "ఎక్కడో తిరుగుతూ వుంటుందిలే" అన్నాడు ఫర్‌ఫిష్కా.

జాకోబు మతిస్సా నడిగాడు. ఆమె "చెప్ప"నంది.

ఇలియా పళ్లు పటపటానూరుతూ "ఈ దుర్మార్గులామెను అమ్మివేసివుంటా"రన్నాడు.

జాకోబు అలజడిచెంది "మాషా ఏమైనట్లు?" అని ఫర్‌ఫిష్కా నడిగాడు.

"ఊఁహూఁ, యిప్పుడు జ్ఞాపకంవచ్చిందేఁ?" అంది మతిస్సా.

"ఏమిటి కర్తవ్యం?" జాకోబు ఇలియా నడిగాడు.

"పోలీసుస్టేషన్లో రిపోర్టు చేద్దాం."

"ఓసి నీ దుంపతెగ! వింటున్నావా? వీళ్ళు రిపోర్టు చేస్తారంట!"

మతిస్సా ఒకసారి జాకోబువైపు, ఒక పర్యాయం ఇలియావంక చూచి గుడ్లుతిప్పుతూ, చేతులుఝాడించి ఫర్ఫిష్కాతో అన్నది— "నీవే పోయి స్టేషన్లో చెప్పి రారాదూ. వెళ్ళు. వీళ్ళసలిక్కడి కెందుకురావాలి? యిది నా యిల్లు. నేను నిన్ను పెళ్లి చేసుకోబోతున్నాగా."

ఫర్ఫిష్కా నవ్వుకుంటున్నాడు.

"ఈ దుష్టులు మనకేమీ చెప్పేటట్టులేరు. పోదాం, పద"మన్నాడు ఇలియా.

"ఆగు, వెడదాం. మాషా యీడొచ్చిన పిల్ల. ఏం చేశారో!" మతిస్సా వేపుతిరిగి "ఏమిటి సంగతి? చెప్పవా?" అనడిగాడు జాకోబు.

"ప్రియా! వీళ్లిద్దరిని పట్టుకో, రక్కు, కొరుకు" అని ఫర్ఫిష్కా అరిచాడు. నాలిక వెళ్ళబెట్టి యీలవేయ బోయాడు; కాని, ధ్వనిరాలా. జాకోబుకు నాలుక చూపి నవ్వసాగాడు.

మతిస్సా ఇలియావద్దకు పోయి బిగ్గరగా "ఎవడవురా నువ్వు?" అని కేక పెట్టింది.

ఇలియా మతిస్సాను ఒకతోపుతోసి గదిలోంచి బయటికెళ్ళాడు. జాకోబు వాడి ననుసరించాడు. దారిలో

"మాషా ఏమైపోయుంటుందంటూ? వీళ్ళామెను అమ్మేసి వుంటారనేనా నీ నమ్మకం?" అని ఇలియా నడిగాడు బిక్క మొగంతో.

ఇలియా కసరుకొని "ఊరుకోరా ఎంబన్నా! ఇప్పుడు గగ్గోలుపడి ప్రయోజనమేముంది? నువ్వు మొదటినుంచి జాగ్రత్తగా వుండవలసింది. ఇన్నాళ్ళనుంచీ కంటికిరెప్పవలె కాపాడుతూవచ్చింది నీవు, తగులుకొనిపోయింది మరొకడు" అన్నాడు.

"ఇందులో నా తప్పేముంది చెప్పూ? పగటివేళ ఎక్కడికైనా పనికి వెళ్ళిందేమో ననుకున్నాను."

"నీ దోష ముందా లేదా అని నేను విమర్శించాల్సిన పని లేదు. నేనిక ఈకొంపలో ఒక్క క్షణం కూడా వుండను. దీనికి నిప్పెట్టాల్సిందే" నని ఇలియా గబగబా నడక సాగించాడు.

జాకోబు వ్యాకులచిత్తుడై అటూ యిటూ చూస్తూ నిలబడిపోయాడు.

ఇలియా వెనక్కి తిరిగిచూచి "ఏడువు; నీ కర్మ!" అని అంధకారంలో కలిసిపోయాడు.

మాషాకు నిజంగానే వివాహమైనట్టు మర్నాడు ఫర్ఫిష్కా చెప్పాడు. వరుడు పెళ్లాంచచ్చిన విధురుడు. వయస్సు యాభై కిపైనే. వాడికి యిద్దరుకొడుకులుకూడా వున్నారు. పిల్లలపోషణకు ఆడుది కావలసొచ్చింది. అదివరకున్నపని

మనిషి చెయ్యాడించేది కావటంవల్ల పెళ్ళిచేసుకోటానికిసిద్ధమై, పిల్ల ఎక్కడా కుదరక మతిస్సావెంటపడ్డాడు. ఆ మాయలాడి తనవాక్చాతుర్యంతో మాషాని, ఫర్‌ఫిష్కాను బుట్టలో వేసింది. అంతా మూడురోజుల్లో ముగిసింది. ఆవృద్ధజంబుకం మతిస్సా, ఫర్‌ఫిష్కా లిద్దరికి చెరి అయిదురూపాయలు చేతిలోపెట్టాడు. క్రితంరాత్రి వాళ్లిద్దరు ఆ పైకంతోనే తప్ప తాగారు. తాగటంలో మతిస్సా ఆరితేరిన చెయ్యి!

ఇలియా యీ వృత్తాంతం అంతా విన్నాడు. మాషాకు యేదో ఒక ఆశ్రియం లభించింది గదా యని సంతృప్తిపడ్డాడు; కాని, ఆమెలేని యాకొంప వానికి ప్రేతాలయంగా కనుపించసాగింది.

మాషాభర్త ఫర్‌ఫిష్కా నెప్పుడూ తనయింటికి రావద్దనీ, బ్రాందిషాపుకు వస్తే తృప్తిగా బ్రాందీ నిప్పించుతాననీ చెప్పాడట. అందుకు తాను సరే నని సమ్మతించానని కూడ ఫర్‌ఫిష్కా ఇలియాతో చెప్పాడు. "ఇప్పుడు తాగటానికి లేక అల్లాడిపోతున్నాను. తలతిరిగిపోతోంది; నాలుగణాలు యి"మ్మని ఫర్‌ఫిష్కా చేయిచాచాడు.

"ఇకముందేం చెయ్యాలని?" ఇలియా అడిగాడు.

"ఇక నేను హాయిగా తాగుతాను. ఇదివరకు మాషాను పోషించేబాధ్యత వుంటంవల్ల తృప్తిగా తాగనేలేదు. ఆమెనుగూర్చినచింత వేధించుతూండేది. ఇప్పుడిక యే బాదరబందీ లేదుగా."

"నీవు తాగుడు మాన్లేవూ?"

"అమ్మో! అసంభవం. అయినా ఎందుకుమానాలి?" అని ఫర్ఫిష్లా అడిగాడు.

"ఇంతకంటె నీ కేకే కాంతూ లేదూ"

"ఈ గొడవంతా యెందుకు? ఒక పావలా యిద్దూ పోతాను."

"ప్రపంచంలో ఏ ఆశయమూ లేకుండా ఎల్లా జీవించ గలరో నాకు అవగాహన కావటంలేదు."

"ఏం? నే నున్నానుగా అలాంటివాణ్ని. మానవుడు ఏమేమో చెయ్యాలనుకుంటాడు, కాని, అదృష్టదేవత వాని మార్గంలో అడ్డుతగులుతుంది. నా విషయమే చూడు! నేను జర్మియాడబ్బుమీద కన్ను వేశాను. నేను కాకపోయినా ఎవడో ఒకడా ధనాన్ని అపహరించుతాడని నాకు తెలుసు. అయినా భాగ్యదేవత నన్ను చూచి ముఖం ముడుచుకున్నది. నేను దేబెమ్మలా చూస్తుండగానే వాళ్ళిద్దరూ ఆ మొత్తాన్ని కొట్టేశారు. అనుకున్నంతమాత్రాన ఏపనీ జరుగదు...... సరే గాని, నన్ను పంపవూ? ప్రాణం కొట్టుకొంటోంది."

ఇలియా జేబులోనుంచి డబ్బుతీసి యిచ్చి "నువ్వు పనికిమాలినవాడివై పోయావులే" అన్నాడు.

"నిజమే"

"కాని, నేను అపుడపుడు నీ యంత మంచివాడు లే డనుకొంటాను."

"నన్నెగతాళి చేస్తున్నావా?"

"నేను నిన్ను ముఖస్తుతిచెయ్యటం లేదు. నాహృదయంలోవున్నదే అన్నాను. నువ్వు నమ్ము, నమ్మకపో."

"నీవుద్దేశం యేమిటో తెలియటంలేదు."

"సరే గాని, నువ్వు భగవంతునికి భయపడుతున్నావా? లేదా?"

"నే నెందుకు భయపడుతాను? నే నెన్నడూ ఎవర్నీ బాధించలేదే. ఒకరికపకారంచేయాలనేతలంపే నాకులేదు."

"నీవు ప్రార్ధనచేస్తుంటావా?"

"అప్పుడప్పుడూ"

ఫర్ఘిష్టాదృష్టి బ్రాందీసాపువేపే వుంటం గమనించి ఇక వానిని వదలిపెట్టటమే వుచితమనుకొని ఇలియా మరో అర్ధరూపాయి వానిచేతిలోపెట్టి అన్నాడు— "ఏమని ప్రార్థించుతావు?"

ఫర్ఘిష్కా ముఖం తెల్లబిళ్ళ దర్శనంతో కళకళలాడింది.

"ఏముంది, మామూలుగానే. విగ్రహం ముందు నిలబడి 'భగవాన్! నాపైన దయవుంచు'మని ప్రార్థిస్తాను." కొంచె మాగి "ఇక వెళ్ళనా?" అన్నాడు ఫర్ఘిష్కా.

"వెళ్లు; కాని, ఒకమాట చెప్పి పో. చావెప్పటికైనా తప్పదు. విచారణసమయంలో, భగవత్ సాన్నిధ్యంలో పాపపుణ్యాలజమాఖర్చు లడిగితే ఏంచెప్పుతావు?"

"నేను అధమజీవిని. నా జీవితమంతా తాగుడుతోనే గడిపేశానని యదార్థం చెబితే ఆయన నవ్వి నన్ను క్షమించుతాడు" అని ఉల్లాసంతో వెళ్ళిపోయాడు.

ఇలియూ అక్కడే వుండిపోయాడు. ఇక నక్కడ మూషా కన్పించదనీ, ఎప్పుడో ఒకప్పుడు ఘర్ షిష్టా కూడ ఆ కొంప వదిలి వెళ్ళిపోతాడనీ విచారపడ్డాడు.

# 20

ఇలియూ తిరిగి తిరిగి వచ్చాడు. టెరెన్సు గదిలోనే వున్నాడు. ఇలియూ గదిలో అడుగు పెట్టగానే "ఇలియూ! నీ విప్పుడే ఇక్కడినుంచి వెళ్ళిపోవటం మంచిది" అన్నాడు.

టెరెన్సుముఖం కలవరపాటును తెలుపుతోంది. స్వరం కంపించుతున్నది.

"ఏమిటి సంగతి?" అని ఇలియూ ఆత్రుతతో ప్రశ్నించాడు.

"సాయంత్రం నాలుగుగంటలకు జాకోబు త్రాగి స్పృహతప్పి వచ్చాడు. అదాటుగా పెట్రుహాపైనబడి దబాదిబాగుద్ది తిట్టసాగాడు. అంతట పెట్రుహా వాణ్ని చావమోదాడు. ఇప్పుడు జాకోబు చాల ప్రమాదస్థితిలోవున్నాడు.

ఆ కోపంలో పెట్రూహా కొడుకును నేలకు కుదేసి నావైపు తిరిగి ఇలియా నిప్పుడే ఇక్కణ్నుంచి వెళ్ళగొట్టు. యిక ఒక్క క్షణంకూడ నా యింట్లో వాడు వుంటానికి వీల్లేదు. ఈ రగడకంతటికీ వాడే కారకుడు'' అన్నాడు.

ఇలియా చొక్కా చేతులు పైకి దోపుతున్నాడు.

తెరెన్సు వణకిపోతూ ''ఏమిటా హడావుడి?'' అనడిగాడు.

''నీ కెందుకు వూరుకో. వాడిపొగరు రోజురోజుకు ముదురుతోంది'' అని ఎకాఎకీని హోటలుకు వెళ్ళాడు.

''అక్కడికి వెళ్ళకు. అతడు పోలీసుల్ని పిలిపించి నిన్ను అరెస్టు చేయించుతాడు. నామాట విను'' అంటూ తెరెన్సు గోలచేశాడు.

ఇలియా తిన్నగా హోటల్లోకి వెళ్ళాడు. పెట్రూహా ద్వారంవద్ద ఎవరితోనో నవ్వుతూ మాట్లాడుతున్నాడు. వాడు ఇలియానుగాంచి కనుబొమలెగరవేసి ''దా, నీ కొరకే చూస్తున్నా'' నన్నాడు.

ఇలియా వానిమాటలను లక్ష్య పెట్టలేదు. పోయి ''ప్రక్కకు తొలగు'' మని గద్దించాడు.

''ఎక్కడికీ? నుంచో.''

''తప్పుకో. నేను జాకోబును చూడాలి.''

''ఆగు, నీ కిక్కడే జాకోబును చూపిస్తానుండు.''

ఈ మాట పెట్రుహానోటినుంచి వెలువడిందో లేదో ఇలియూ ముష్టిబిగించి వానిముక్కుమీద బలంకొద్దీ గుద్దాడు. పెట్రుహా ఆ దెబ్బ కదిరిపడి కేక పెట్టాడు. నౌకర్లు, సర్వర్లు, యితరులు అన్ని వేపులనుండి అక్కడకొచ్చిపడ్డారు. 'పట్టుకో పట్టుకో' మన్న కేకలు ప్రతిధ్వనించాయి. అయినా ఇలియూ నిర్భయంగా జాకోబు గదిలో కెళ్ళాడు. లోపల గడియ బిగించాడు.

గది గాఢతిమిరావృతమై వుంది. ఏమీ కన్పించటం లేదు. బ్రాందీవాసనతో ముక్కుపగిలిపోతోంది. ఇలియూ దీపం వెలిగించాడు. జాకోబు నేలమీదపడి మూల్గుతున్నాడు. వానివొళ్ళు హూనమైవుంది. కళ్లు వాచాయి. ఇలియూ అడుగులసవ్వడి విని "ఎవరు?" అని మెల్లగా అడిగాడు.

"నేను."

"దాహం."

బయటవున్నవాళ్ళందరూ ద్వారంవద్ద మూగారు. కొందరు తలుపుతట్టుతున్నారు. "పారి పోనివ్వకండి. పోలీసు వారికి చెప్పిరండి. నేను వాణ్ని తాకనైనాలేదు. వాడి తల బిరుసు మీరంతా చూచారు గాదూ?" అని పెట్రుహా నోరు చించుకొని అరుస్తున్నాడు.

పెట్రుహానుకొట్టినందుకు ఇలియూకు సంతోషంగానే వుంది. తలుపుదరికి పోయి "ఏమండోయ్! ఎందుకీ గల్లంతు? నా గుద్దుతో వాడు చావలేదుగా. నేను చేసినదానికి కేసు

పెట్టుకోమనండి; కాని, అనవసరంగా మీరు గడబిడ చెయ్యట మెందుకు? నేనిప్పుడే తలుపు తీస్తున్నాను” అని బయటివారి నుద్దేశించి అన్నాడు.

తలుపు తెరచి పిడికిలిబిగించి ద్వారంపక్కగా నిలబడ్డాడు ఇలియా. అందాకా పరవళ్లుతొక్కిన వాళ్లెవరికీ ముందుకురావటానికి దమ్ములేకపోయింది. పెట్రుహా క్రోధోన్మత్తుడై “వెధవల్లారా! పిరికిపందలైతే పోండి, నేనే వాడి పనిపడతాను” అని డాబులుకొట్టాడు.

“అయితే రా” అని మిగతా వారితో “వీడు తన కొడుకును యెల్లా చావగొట్టాడో లోపలికెళ్లి చూడండి” అని ఇలియా దారిచ్చాడు.

హోటలుకు భోజనానికివచ్చిన పెద్దమనుషులు కొందరు లోపలికెళ్ళారు. జాకోబుస్థితి చూచి విచారపడి “అరె! పాపం చంపేశాడే!” అన్నారు.

“ముందు కొంచెం మంచినీళ్ళివ్వండి. తరువాత యెవరైనా వెంటనే స్టేషనుకుపోయి రిపోర్టు చేసిరండి” అన్నాడు ఇలియా.

జాకోబుస్థితిని చూచినతర్వాత అక్కడున్న వారిలో పలువురు ఇలియాపక్షం వహించారు. పెట్రుహాను తలొక మాట అంటున్నారు. ఇలియా బలం యినుమడించింది. “మీరంతా పెట్రుహా నెరుగుదురు. ఇంతకంటె కర్కోటకుడింకెవడుంటాడు. జాకోబు అమాయకుడని మీకు తెలుసు.

మీరు వానికనుకూలంగా వాఙ్మూల మివ్వాలి......ఈ దుష్టుడు కన్నకొడుకు కెట్టిగతి కల్పించాడో చూడండి! నే నా పాపిని ఒక్కగుద్దుగుద్దినందుకే మీరు వానికి మద్దత్తుగా వచ్చారు. ఇది న్యాయమేనా? ఒకడు పొగరెక్కి యిష్టంవచ్చినట్టు హింసించినా చూచి నోరు విప్పకూడదా?'' అన్నాడు గంభీరంగా.

కొందరు పెట్రుహాను నిందించుతున్నారు; మరి కొందరు మానందాల్చారు. ఇలియా యింకా యేమో చెప్పబోతున్నాడు; కాని, అంతలో పెట్రుహా గదిలో చొరబడి ''పొండి యిక్కడినుంచి; వాడు నా కొడుకు. నా యిష్టంవచ్చినట్టు బాదుకుంటాను. ఇందులో మీ కేమి సంబంధం? పోలీసుల లెక్కేమిటి? వెళ్ళరేం యిక్కడి నుంచి?'' అని అందరినీ నానామాటలు అన్నాడు.

ఇలియా జాకోబునోటినుండి కారుతున్నరక్తాన్ని తుడుస్తున్నాడు. మిత్రునిగతికి వానిహృదయం తరుక్కుపోతోంది. ''అబ్బ! బాధ...... నన్నిక్కణ్ణుంచి తీసికెళ్ళు'' అని, అతికష్టంతో అన్నాడు జాకోబు.

వానికళ్ళనుండి కన్నీరు ధారగా ప్రవహించుతోంది.

ఇలియా పెట్రుహావంక చూచి ''చూచావా నీఘనకార్యం? ఇప్పుడైనా వెంటనే హాస్పిటలుకు పంపు'' అన్నాడు.

పెట్రుహా కొడుకువంక చూచి మెల్లగా గొణిగాడు. ఇలియాగుద్దుతో వానికన్ను కూడా వాచింది.

"ఏం వినపడిందా" అని ఇలియా మళ్ళీ వురిమాడు.

"గోలచెయ్యకు. వీణ్ణి ఆసుపత్రికి పంపటానికి వీల్లేదు. అందరికీ తెలిసి అల్లరవుతుంది. నేను నలుగురిలో తిరిగే వాణ్ణి కూడాను."

"దుర్మార్గుడా! సిగ్గులేదూ? నేను చెప్పినట్టు చెయ్యటంలోనే నీకు మేలుంది. లేకపోతే యింకా పేరుమోగుతావు. కన్నకడుపు కాదూ నీది?"

"పెద్దగా తగల్లేదు. వాడు నాటకమాడుతున్నాడు అంతే."

ఇలియా కళ్ళెర్రజేసి లేచి నిటారుగ నిలబడ్డాడు. పెట్రుహా తారుకోని బయటికిపోయి నౌకరును పిల్చి "ఒక బండి తీసుకొనిరా, ఆసుపత్రికి వెళ్ళాలని చెప్పు. బాడుగ పదిఅణాలకంటె యెక్కువ మాట్లాడేవు" అని చెప్పి తిరిగి వచ్చి జాకోబుతో అన్నాడు- "వెధవా! వేషంవెయ్యకు. నిన్నెవరూ పరాయివాళ్లొచ్చి కొట్టలేదులే. నేను నీయంత వున్నప్పుడు నా పైన యింతకంటే యెక్కువే పడేవి. లేచి కూర్చో."

జాకోబుతో ఇలియా హాస్పిటలుకు పోయి మందు మాకులకు యేర్పాటుచేశాడు. జాకోబు కళ్ళతో కృతజ్ఞతను తెలిపాడు. ఇలియాకు తిరిగి పెట్రుహా యింటిలో అడుగు పెట్టటాని కిష్టంలేకపోయింది. హాస్పిటలునుండి సరాసరి లీపా వద్దకు వెళ్లాడు. నాటిఘటననుగూర్చి ఆలోచించినకొద్దీ వాని క్రోధ దుఃఖములు ప్రకోపించసాగాయి.

మరునాడు మకామును మార్చటానికి కృతనిశ్చయుడై గృహాన్వేషణకు బయలుదేరాడు. అద్దెకివ్వబడు నన్న యిల్లిల్లు తిరిగాడు. ఒక యింటివద్ద లేతవయసులో వున్న సుందరి గది అద్దెబేరం చెప్పింది. ఆ గది సౌకర్యాన్ని వర్ణించుతూ "ఇంత శుభ్రంగావుండి ధారాళంగా గాలివచ్చే గది నెల కయిదురూపాయలలో దొరకనే దొరక"దని చెప్పింది.

ఇలియా రెప్పవాల్చకుండ ఆ ఎమ్మెలాడిని చూస్తూ "నీ వీ యింటి పనిమనిషివా?" అని అడిగాడు.

ఇలియాను తనరూప మాకర్షించినట్టు గ్రహించి ఆ జవ్వని యేదో ఆలోచన అభినయించింది. ఇలియాప్రశ్నకు విస్మయంచెంది "నే నే యీ గృహయజమానురాలిని. నా భర్త........."

అని చెపుతూంటే ఇలియా మధ్యలో అందుకొని "మీకు వివాహంకూడ అయిందీ!" అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు.

ఆమె నవ్వి "మీరువిచిత్రమైన మనిషిలాగున్నారే! మొదట నన్ను దాసిగా భావించారు. ఇప్పుడు నేను వివాహితనైనందుకు కూడ అబ్బురపడుతున్నారే" అంది.

"మీ ప్రాయాన్నిబట్టి అప్పుడే వివాహమయివుండ దనుకున్నాను."

"నా పెళ్లయి మూడేళ్లయింది. నా భర్త పోలీసు ఇన్స్పెక్టరు."

ఇలియూ ఆమెవంక చూచి నవ్వి "అలాగా!" అన్నాడు.

"మీరు వచ్చినపనే మర్చిపోయినట్టున్నారు. త్వరగా తేల్చండి; గది కావాలా, వద్దా?" అని ఆ విలాసిని ఇలియూ కళ్లలోకి చూచింది.

"గదివిషయం ముందే ఖాయమైంది. బజానా యివ్వాలా?"

"రెండురూపాయలిచ్చి వెళ్ళండి. ఎప్పుడు ప్రవేశించుతారు?"

"ఎప్పుడోనా! రేపే. బజానా ఒక గంటసేపట్లో వచ్చి యిస్తాను"

"సరే, అలాగే యివ్వండి. మీరు మంచివారుగా కన్పిస్తున్నారు. మీ బోటివారికే మా గదిని అద్దె కివ్వటం మా కిష్టం."

ఇలియూ నవ్వుతూ "చాలామంచి కాదులెండి" అని అక్కడినుంచి కదిలాడు.

ఆ గదివిషయంలో ఇలియూ రెండులాభాలు చూచాడు. గదిలోకి గాలి, వెల్తురు ధారాళంగా వస్తే. అంతకంటె ముఖ్యం యింటియజమానిని రసికురాలుకావటం. సంసారులపొత్తులో వుంటే నూతనానుభవం చేకూరగలదని

ఇలియా సంబరపడ్డాడు; అయితే గృహయజమాని పోలీసు అధికారియన్నతలంపుతో కొంత అదటుకూడా కలుగక పోలేదు.

ఒక గంట కాకపూర్వమే బజాన్నాయిచ్చి హాస్పిటలుకు వెళ్ళాడు. జాకోబు నిద్రించుతూ వున్నందున పంచాదిలో నిలబడి తిరిగివెడదామా వద్దా అని తటపటాయించుతున్నాడు.

కుంటివాళ్ళు, గుడ్డివాళ్ళు, వానిప్రక్కనుండి వస్తూ పోతున్నారు. ఆ దృశ్యం ఇలియాహృదయాన్ని జాలితో నింపింది. ఇక వెళ్ళిపోదామనుకొంటూండగానే కుంటివాడొకడు వెనుకపాటుగా వచ్చి ఇలియాభుజంమీద చెయ్యి వేశాడు. ఇలియా వులికిపడి వెనక్కి చూచాడు. ఆ కుంటివా డెవరో కాదు; పాష్కాయే. నిలబడి నవ్వుతున్నాడు.

"అరె! నీవుకూడా యిక్కడా!" అన్నాడు ఇలియా ఆశ్చర్యంగా.

"నీవుకూడా అంటున్నావు; ఇంకెవరు?"

"జాకోబు. పెట్రుహా వాడిబొమికలు విరగ్గొట్టాడు. సరేగాని, నీ కీ గతేమిటి? ఎండి పుల్లైపోయావే?"

పాష్కా నిట్టూర్చాడు. వేదనాభరితస్వరంతో "ఏం చెయ్యను? కర్మ" అన్నాడు.

"అసలు విషయం ఏమిటి?"

"నీ కేం తెలియనట్టు?..." అని సిగ్గుతో తలవొంచు కొన్నాడు పాష్కా.

"ఈ ప్రసాదం వేరా వడ్డించిందేనా?"

"మరి?"

"అయితే యెప్పుడో ఒకప్పుడు నేనూ దీనికి గురి అవుతానన్నమాట" అని ఇలియా పకపకమని నవ్వాడు.

"నన్ను చూచి నువ్వు చీదరించుకుంటావను కొన్నాను. అందువల్ల నే ఇంతవరకు నీ యెదుటపడటానికి వెరిచాను."

"నా విషయంలో నీ వల్లా భావించటం న్యాయ మేనా?"

"మహా చెడ్డరోగం! ఎవరు అసహ్యించుకోరు? నే నిక్కడికి వచ్చి రెండువారాలు దాటింది. బాధ దారుణంగా వుంది. ప్రతి నిముషం యిదే వేధించుతోంది. కాలం మహా పర్వతములాగున తరుగకుండా వుంది. ఒళ్ళంతా మంటలు. సహాయం చెయ్యటానికి దగ్గర యెవరూ లేరు."

పాష్కా మెల్లగా చెపుతున్నాడు. వానిశరీరం కంపించుతోంది. ఎడంచేత్తో కమీజుకాలరు మెలిపెడు తున్నాడు. "అదృష్టం దయారహితమై దెబ్బకొడితే దాని గాయం భరించరాని బాధను కల్గిస్తుంది."

"వేరా రావటం లేదూ?"

పాష్కా లజ్జితుడై "ఆమె వచ్చింది; కాని నే నే వెళ్ళగొట్టాను. ఆ పాతకిముఖం చూడకూడ దనుకొన్నాను" అన్నాడు.

"ఇదే నీ దుర్బుద్ధి. ఒట్టి స్వార్థపరుడివి. నీకు న్యాయం జరగాలనుకుంటే నీ వితరులపట్లకూడ న్యాయంగానే ప్రవర్తించాలి. ఇందులో ఆమెదోష మేముంది? ఆలోచించు."

ఇలియూవాదనతో పాష్కా కుపితుడయ్యాడు; కాని పైకి మెల్లగానే అన్నాడు... "అయితే ఈ దోషాన్ని యెవరికి రుద్దాలి? నా కీ గతి యెందుకు కలిగిందోనని రాత్రి అంతా ఆలోచించాను. వేరాసాహచర్యం వల్లనేగా! నే నామె భర్తృణ్ణి. ఆమెయే నా సర్వస్వం."

వానికళ్లు ఎరుపెక్కాయి. కన్నీటిచుక్కలు వాని బుగ్గలపైనుంచి దొర్లిపోయినై. చొక్కాచేతితో కన్నీరు తుడుచుకొన్నాడు.

"ఆమె నా మార్గంలో శిలలాగుంది. ఎదురుదెబ్బ తగిలి పడిపోయాను."

ఇలియూహృదయంలో వేరాయందు అమిత సానుభూతి వుంది. పాష్కాతో యిలా అన్నాడు—"నీవు చాలా అన్యాయం చేస్తున్నావు పాష్కా! నీ కసలు మార్గ మెక్కడుంది? నీ వే త్రోవలోను అడుగుపెట్టనేలేదు. నీ వన్నీ గప్పాలు! నువ్వు గ్లాసును పెదవి కాన్చి చవిచూచావు; చాలా మధురమని ప్రశంసించావు. కొంచెం ఘాటుగా

వున్నప్పుడు నీ కది స్పృహలేకుండా చేస్తోందని నిరసించు తున్నావు. ఆమెవిషయం మాత్రం ఏమిటి? ఆమెకీ యెవడో నీలాంటి ప్రబుద్ధుడే అంటించివుంటాడు. అవునా?''

"ఆమెనుగూర్చి నాకుమాత్రం విచారం లేదను కున్నావా?''

"ఉండితీరవలసిందే.''

"నేను మాత్రం యెవరిని నిందించగలను? నేను తిట్టి, వెళ్లిపొమ్మంటే వేరా వెక్కి వెక్కి యేడ్చింది. నా హృదయం తుత్తునియలయింది. నేనూ యేడ్చేవాడినే; కాని, నాగుండె కరుడుగట్టింది. ఏం మిత్రమా! మాకింతకంటె సుగమమార్గ మేదీ లేదూ?''

"దారి లేదు, లేదు. ఈ సమాజమనే తిరుగలిలోపడి అందరం పిండికాకతప్పనట్టే తోస్తోంది. జాకోబుస్థితీ యింతే. వాడితండ్రే వానిఅగచాట్లకు కారకుడు. అమాయకమాషాను ఆమెజనకుడే యేబదేళ్ళముసలివానిమెడకు అంటగట్టాడు. మనవర్గంలో నే నొక్కడినే అదృష్టవంతుణ్ణి. నేను తలచు కొన్నది యిట్టే అయిపోతుంది.''

"అదైనా నిజమేనా?''

"నిస్సందేహంగా. భాగ్యదేవత నాకు ప్రత్యక్షమైంది. అది కాగడా పట్టుకొని దారిచూపిస్తూ నన్ను ముందుకు పొమ్మని ప్రోత్సహించుతోంది.''

"నవ్వులాట కలా చెపుతున్నావులే.''

‘‘నేను కాదు; గాని, మనల నెవరో హేళన చేస్తూనే వున్నారు. ఈ సందర్భంలో నే నెంతైనా చెప్పగలను. స్వానుభవాన్నిబట్టి నా కెక్కడా న్యాయం కన్పించనే లేదు.

‘‘నా అనుభవంకూడా అంతే. పద, మరో ప్రక్కకు పోయి కూర్చుందాము’’ అని పాప్కా ఇలియాతో వేరొక చోటుకు వెళ్ళాడు.

‘‘మనజీవతంలో సుఖపడేఅదృష్టం లేదు. మనం యెందులో చెయ్యెట్టినా చురుక్కుమంటోంది’’ అన్నాడు పాప్కా.

‘‘అవును.’’

‘‘మన బ్రతుకంతా శూన్యమే. ఉదాహరణకు నే నొకస్త్రీని ప్రేమించా ననుకో. ఇద్దరిహృదయాలూ కలిశాయి. కేవలం తాళిమాత్రం కట్టలేదు. మనఃపూర్వకంగా కావాలనుకున్నా ఆమె దక్కటం లేదు. ఆమె యేమీ యివ్వలేకున్నది; తానూ పొందజాలకపోతోంది. ఇంతకూ కారణం నా దరిద్రమే. నేను శ్రమపడలేదా? పదేళ్ళప్పటి నుంచీ కఠినపరిశ్రమ చేస్తూవచ్చాను; కాని, నా కందుకు లభించిన ప్రతిఫల మేమిటి?

‘‘అంతే కాదు. పెట్రుహోను చూడు! వా డన్ని భోగాలు అనుభవించుతున్నాడు. తలచుకొన్నది చేయగలుగుతున్నాడు. కోరినది తింటున్నాడు; తాగుతున్నాడు;

నచ్చినబట్ట కడుతున్నాడు" అని చెపుతూ చెపుతూ ఇలియా ఆవేశభరితుడయ్యాడు. వాని హృదయం ద్వేషంతో నిండిపోయింది.

"డాక్టరు నన్ను అపరాధివలె చూస్తున్నాడు. నేనేం చేశాను చెప్పు? చదువుకొన్నవాడు పెద్దమనిషివలె ప్రవర్తించాల్సింది...... నేను మానవుల్లో గణనకే రానా? నేను వేరాను తిరస్కరించినమాట వాస్తవమే; కాని, యేమీ తెలియని గబ్బిలాయిని కాను. ఇందులో నాతప్పేమీ లేదని యెరుగుదును."

"కత్రను చేతబట్టినవాడు దాన్ని విసరకుండా అది స్వయంగా యెవరిపైనా పడదు."

వాళ్ళిద్దరూ ఒకగదికిటికీవద్ద నిలబడి మాట్లాడుతున్నారు. గదిలోనుంచి రోగిమూలుగు స్పష్టంగా విన్పడుతోంది. ఆ సంకటావస్థలో తనకు సహాయపడగల సుహృదయు డెవడూ లేడని నిరాశతో చెపుతున్నట్టు ఆ ధ్వని క్రమంగా తీవ్రమౌతోంది. జీవితసంఘర్షణలో తగిలినదెబ్బ పాష్కాహృదయాన్ని బాధించుతోంది. అందువల్లనే వాడు కఠినోక్తులతో తనవేదనను వ్యక్తంచేస్తున్నాడు. పాష్కాహృదయం మండుతున్నదనీ, దానినుండి వెలువడుతున్న మంటలే వానిహృదయాంధకారాన్ని పటాపంచలు గావించి దాని కనంత శాంతిని ప్రసాదించుతాయనీ ఇలియాకు తోచింది.

"కేవలం శ్రీమంతుడైనంతమాత్రాన పాపంచెయ్యడనటంలోను, చదువుకొన్నంతమాత్రాన ఆనోటిమాటలు సర్వజనమాన్యాలవటంలోను న్యాయమెక్కడుంది? నేను మూర్ఖుడినైతే మాత్ర మేమిటి? నా ఆత్మ నశించిపోయింది. క్షుద్రార్తుని కసలు ఆత్మే వుండదు. నాకీ లోకమే శూన్యం. నా జీవితసూత్రం తెగ్గించివేయబడింది. నా కోరికలు అణచి వేయబడినై. నా చుట్టూ జైలు గోడ లాంటిది నిలబెట్టబడింది" అన్నాడు పాష్కా.

"మన గోడు నాలకించి జవాబిచ్చేవా డెవడు? మనయందెవరికీ సానుభూతి లేదు. ఈ సమాజంలో మన మందరి దృష్టికీ పరాయివాళ్ళమే" నన్నాడు ఇలియా.

"ఆమాట నిజమే. మన మేమైపోతే యెవరిక్కావాలి?"

ఇలియా యీ మాట విని చుట్టూ చూచి నిట్టూర్చాడు. గదిలో మూలుగు మరింత తీవ్రమయింది.

"లీపాతో నీ సంపర్కం యథాప్రకారమే వుంది గాదూ?" పాష్కా అడిగాడు.

"ఆ, యింతవరకూను" అని ధ్వని మార్చి "జాకోబు చదివి చదివి ఈశ్వరుని అస్తిత్వాన్నే అనుమానించ సాగాడు" అన్నాడు ఇలియా.

"ఏమిటీ? నిజంగానేనా?"

"వాడివద్ద అలాంటి పుస్తకాలున్నై. నీ వుద్దేశం యేమిటి?"

"ఈ విషయాన్ని గూర్చి నే నెన్నడూ ఆలోచించ నే లేదు; అసలు నే నింతవరకు చర్చికి కూడ వెళ్లి యెరుగను."

"నేను దీర్ఘంగా ఆలోచించుతూనే వున్నాను. భగవంతుడు యిదంతా యెందుకు సహించి మౌనంవహించుతున్నాడో నాకు బోధపడలా."

మిత్రులిద్దరూ యీ విధంగా చర్చించుకొంటూ సమయ విచక్షణే మర్చిపోయారు. హాస్పిటలుజవా నొకడు వచ్చి "విజిటర్సు అందరూ వెళ్లిపోతే నీ విక్కడ దాక్కొన్నా వెందు"కని ఇలియాను దబాయించాడు.

"అరె! నేను మాటల్లో మరిచిపోయ్యాను. ఇప్పుడే వెళ్తున్నా నుండు. పాష్కా! జాకోబును తప్పకుండా కలుసుకో" అన్నాడు ఇలియా.

"రేపు నీవు రావాలి సుమా!"

"త్వరగా పోతావా లేదా?" అని జవాను ఇలియాను నెట్టబోయాడు.

ఇలియా వానివంక చురచుర చూచాడు. వాడు భయంతో వెనక్కి తగ్గాడు. ఇలియా నవ్వుకొంటూ హాస్పిటలు కాంపౌండు దాటిపోయాడు.

ఇలియా దారిపొడుగునా తన మిత్రవర్గం దుస్థితిని గురించే ఆలోచించాడు. పోల్చిచూస్తే ముగ్గుర్లో తానే సుఖగా వున్నట్టు తోచింది; కాని, తనచుట్టూ కారు మేఘాలు భీకరగర్జనలతో నడయాడుతున్నట్టె కన్పడింది.

# 21

ఇలియాకు గది నద్దెకిచ్చిన విలాసినిపేరు లాసినా. ఆమె ప్రఫుల్లముఖి. చంచలాక్షి. సంభాషణ అంటే చెవి కోసుకుంటుంది. లాసినా క్రమంగా తన జీవితకథ, కుటుంబ విశేషాలు ఇలియాతో చెపుతూండేది. ఇలియాకి రోజులక్కడ ఆనందంగా గడచిపోతున్నాయి.

ఉదయంవేళ ఇలియా గదిలో వుండగా లాసినా వచ్చి తొంగిచూచేది. తరువాత యేదో కబుర్లు ప్రారంభించేది. ఒకరోజున యిల్లా చెప్పుకొచ్చింది:—"మేము శ్రీమంతులం కాము; కాని, చదువుకొన్నవాళ్లం. మాకు సభ్యత తెలుసు. ధనికులము కావాలని మా కోరిక. అది నెరవేరుతుంది కూడాను. ఇంతవరకు నిస్సంతుగావుంటంకూడా మేలే. పిల్లా జెల్లా వుంటే డబ్బంతా ఖర్చయిపోతుంది. కావలసిన వస్తువులన్నీ మేమే స్వయంగా ఖరీదుచేసుకొంటాము. ఇల్లూ-వాకిలీ వూడ్చటానికి, అంట్లు తోమటానికి వొక పనిమనిషిని పెట్టాం. దానికి నెలకు రెండురూపాయ లిస్తాము. మా నెలసరిఖర్చు మొత్త మెంతో తెలుసా?"

అని వ్రేళ్ళమీద లెక్క పెట్టి "వంటమనిషిని కూడ పెట్టుకుంటే నెలకు నాలుగు రూపాయలకు తక్కువ పుచ్చుకోదు. దాని భోజనానికి యెంతలేదన్నా యెనిమిది, పది

రూపాయ లవుతుంది. పైన నాలుగైదు రూపాయలకు తక్కువ కాజేయదు. ఉండటానికి ఒక గదికూడ ఇవ్వాలి. అందువల్లకూడ నాలుగైదు రూపాయల అద్దె లుగసానే. మొత్తంమీద వంటలక్క నుంచుకుంటే కనీసం యిరవై రూపాయల ఖర్చు. ఇదంతా మా కిప్పుడు మిగులే. ఇంతేకాక సంసారానికి కావలసిన సంబారాలన్నీ ఒక్కసారే టోకుగా కొని తెస్తాను. అందువల్ల కొంత కలిసి వస్తుంది. నేను వేరే నౌకరీ చెయ్యకపోయినా యింట్లో ఇంత నష్టాన్ని తప్పిస్తున్నాను. నే నెంతో జాగ్రత్తగా నేర్పుతో సంసారాన్ని యీడ్చుకుంటూ, పొదుపుగా వాడుతున్నాను. ఎవరైనా కాపురంచెయ్యటం మావద్ద నేర్చుకోవాల్సిందే.”

అని చెప్పి లజ్జ నభినయించుతూ ఇలియావంక చూచింది. ఆమె నవ్వుతోంది; కాని, ఇలియా ఏమాత్రం వుత్సుకత చూపించలా. అత డామెయెడల అత్యంతాదర భావం చూపేవాడు. ఆవిడ శుభ్రత, నిరాడంబరత్వం, పూనికలు ఇలియా నాకర్షించాయి. వాని కా సతీ–పతుల దాంపత్యం సుఖప్రదంగాను, ప్రేమమయంగాను కన్పించేది. ఒంటరిగా వున్నప్పు డామె కూనరాగంతీస్తూంటే ఇలియా తనగదిలో కూర్చుండి వింటూండేవాడు.

ఆమెభర్త నికోడిమిచ్ యిరవై ఆరేళ్ళ యువకుడు. ఒడ్డూ పొడుగూ కలిగిన ఆజానుబాహుడు. అందుకు తగిన

కండ పుష్టికూడా వుంది. నిడివైన ముక్కు, చక్కని పలు వరుస. ముఖమెప్పుడూ కళకళలాడుతూండేది. ఠీవిగా నడిచేవాడు.

అతడు తొలిసారి కలసుకొన్నప్పుడే "మీకు పక్షుల కిలకిలారావములంటే యిష్టమేనా?" అనడిగాడు ఇలియాని.

ఇలియా "అవు"నని సమాధానమిచ్చాడు.

"పిట్టలను పట్టుకొని పెంచే సరదా మీకూ వున్న దన్నమాట?"

"నే నెన్నడూ పట్టుకోలేదండీ."

నికోడిమిచ్ ఇలియా వేపు వింతగా చూచాడు. "అయితే మీకు వాటియందు నిజమైన మక్కువ లేదన్న మాట. నా కవంటే చాలా ప్రీతి. ఒకప్పుడు నేనా అపరా ధానికే సైనికశిక్షణాలయాన్నుంచి బర్తరఫ్ చేయబడ్డాను. పై అధికారులదృష్టికి గురికావటం యిష్టంలేదు; కాని నే నిప్పుడుకూడ పిట్టలను పట్టుకోటానికి తహతహ లాడు తూంటాను. అభిజాతుల మనుకొనే వాళ్ళపని నేవగించు కుంటారు; అయినా నేను మీవలె రికామీ మనిషి నైతే యెప్పుడూ వాటితోనే కాలంగడిపేవాణ్ణి" అన్నాడునవ్వుతూ.

అతడు ఇలియాపై దృష్టి నిగిడ్చి చూస్తూంటే ఇలియా అలజడిపడ్డాడు. ఆ పోలీసువుద్యోగి పిట్ట అనే వంకతో మాట్లాడుతున్నాడు; గాని అంతరార్థం వేరని భీతిల్లాడు. వాడిగుండె కొట్టుకోసాగింది; కాని, నికోడిమిచ్ చూపులోని

ప్రశాంతిని గాంచి వాని అదటు కాస్త తగ్గింది. ఆ అధికారి మంచివాడేనని నెమ్మదిమీద గ్రహించాడు. తరువాత కలసుకొన్నప్పుడు అతణ్ణి కపటమెరుగని సాధుమూర్తిగా భావించి నవ్వుతూ మాట్లాడేవాడు. ఇలియా స్వభావానికి నికోడిమిచ్ కూడ సంతృప్తి చెందాడు.

ఒకనాడు "అపుడపుడు మాతోపాటు టీతాగటానికి వస్తూవుండు. మేము స్నేహపాత్రులమేలే. మాముందు బిడియపడాల్సిన అగత్యం లేదు. ఇక్కడికి క్రొత్తవాళ్లెవరూ రారుకూడాను. మేము చీట్లాటకూడ ఆడుతుంటాము. తప్పక రావాలిసుమా" అని నికోడిమిచ్ ఇలియాను ఆహ్వానించాడు.

పరిచయం యెక్కువైనకొద్దీ ఇలియా వారితో చనువుగా మెలగుతున్నాడు. సాయంత్రం గదిలో కూర్చొనివున్నప్పుడు ఆదంపతుల ప్రేమాలాపాలు ఇలియాకు వినపడేవి. "సుఖమంటే వీరిదే" ననుకొనేవాడు. తన కట్టి సుఖజీవితము సంప్రాప్తమైనప్పుడు ఆనంద మనుభవించవచ్చని భావినిగూర్చి ఊహా సౌధాన్ని నిర్మించుతూండేవాడు. లూసినా తన పొదుపునుగూర్చి వర్ణించుతూంటే భర్త ఆమెవెన్ను చరచి "నువ్వు బలే చతురమతివి!" అని ప్రశంసించేవాడు.

నికోడిమిచ్ నిత్యము పట్టణంలోని సంఘటనలను గూర్చి భార్యకు సవివరంగా తెలిపేవాడు. వాటినిగూర్చి

తన రిపోర్టులు, పై వుద్యోగులఅభిప్రాయాలుకూడ చెప్పే వాడు. ఒక్కొక్కప్పుడు తన అభివృద్ధినిగురించి ముచ్చటించి, ప్రమోషను జరిగిన తర్వాత ఆ చిన్నయింటిని వదలి పెద్ద బంగాళాలో కాపురంపెట్టాలని కూడ చెప్పేవాడు. ఇలియా తనగదిలోనేవుండి వారిమాటలన్నీ ఆలకించేవాడు. అప్పుడప్పుడు ఆ దంపతులసంభాషణ విని తనమొండిబ్రతుకుకు వగచి యిక నక్కడ వుండలేక లీసాయింటికి చేరుకొనేవాడు.

లీసా యిప్పుడు వెనుకటి మనిషిగాలేదు. ఇలియా వద్దనుంచి డబ్బెక్కువగా గుంజటానికి ప్రయత్నించుతోంది. ఇద్దరిమధ్య కీచులాటలు తరుచైనవి. ఆమెముఖం పాలిపోయి కళ్లు లోతుకుపోయినై. శరీరంలో పూర్వపు బిగువు లేదు. ఆమె క్రిమక్రమంగా ధార్మికవిషయాలు, భగవద్భక్తిని గూర్చి చర్చించసాగింది. ఈ మార్పు ఇలియా కన్నిటికంటె దుస్సహమైంది. లీసా "యోగినినయి యేమఠంలోనో చేరి పోతా"నని కూడా చెప్పేది; కాని, ఆమె పురుషసంపర్కం లేనిదే వుండలేదని తెలిసివుంటంవల్ల ఇలియా కామె మాటలయందు విశ్వాస మేర్పడలా.

ఒకపర్యాయం ఇలియా లీసాతో "నీవు సన్యసించినా నాకోసం ప్రార్థించవద్దులే" అన్నాడు హేళనగా.

"ఏం, యెందువల్ల ?"

"నేను నాపాపఫలితాన్ని అనుభవించాలనే."

"నీ వల్లా అనకూడదు."

"సరేలే."

"నీకు నాయందు విశ్వాసంలేదు. ఒకనాటికి అంతా నీ కళ్లతోనే చూస్తావుగా."

"విశ్వసించకపోటానికి కారణంలేదులే. ద్వేషం తోను, సంసారం యీడ్వలేకా సన్యసించినవాళ్లు చాలా మంది వున్నారు."

లీపా కోప మాపుకోలేకపోయింది. ఈ విషయాన్ని గురించే యిద్దరికీ వాదన ముదిరి తగాయిదాపడ్డారు.

"దుర్మార్గుడా! నీ బుద్ధి పోనిచ్చావుగాదు! మిట్టిపడు తున్నావు; కాని, యీ మిడిసిపా టెన్నాళ్లో వుండదు. నీ గర్వ మేమిచూచుకొని? కండకావరమా? అదెన్నాళ్ళుం టుంది? నీటిబుడగలాంటిది. నీకు సందుగొందులు తిరిగి లోకుల దయాదాక్షిణ్యాలకు దేవురించుకొనేగతి తప్పదు. అందరూ నీ ముఖంమీద వుమ్మేస్తారు" అన్నది లీపా ఒళ్లూపై తెలియకుండా.

ఆమెకళ్ళు రక్తం చిమ్ముతున్నట్లు యెర్రబడినై. అయినా లీపా హత్యావిషయంమాత్రం యెత్తలా.

మరొకప్పుడు యిద్దరూ కూలాసాగా మాట్లాడుకొం టున్నప్పుడు ఇలియా "లీపా! నీకు కోపంవస్తే యెన్నైనా తిడుతావు; గాని, పోలటోవ్ హత్యనుగురించి యెత్తిపోడ వ్వేం" అనడిగాడు.

"ఆ విషయం అనవసరమని నా వుద్దేశం. నీవు నిమిత్తమాత్రుడవు. వాని కల్లా రాసిపెట్టి వుంది; చచ్చాడు."

లీసా జవాబు విని ఇలియా వికటంగా నవ్వాడు.

"ఎందుకూ నవ్వుతావు?" అని లీసా అడిగింది.

"మానవస్వభావ మెంత తాకికము! మానవుడు స్వార్థంకోసం అంతా న్యాయయుక్తము, సబబే నంటాడు. తన కయిష్టమైనదాన్నిమాత్రం అతిసులువుగా నిందిస్తాడు."

"నీ మాటల భావ మేమిటి?"

"నేను చెప్పినది అతిసామాన్య విషయం. ప్రపంచంలో నిందాస్తుతులు రెండింటికి పాత్రంకానిదేదీ వుండదనేదే నేను చెప్పిన దాని భావం! అంటే ఒకే వస్తువు మంచిదనీ, చెడ్డదనీ కూడ చెప్పబడుతుందన్నమాట. ప్రతివస్తువుకు రెండు రూపాలుంటై. మానవ హృదయం కూడ ద్విరూపమే."

లీసా వూం కొట్టి వూరుకున్నది. ఒకక్షణ మాగి "ఇప్పటికీ నేను నీ వుద్దేశాన్ని గ్రహించనేలేదు" అంది.

"నేను నుడివినదే మూలతత్వం. అందులోనే మనం మసిలవుతున్నాము."

తరువాత కొన్నాళ్ళకు ఇలియా లీసాతో జగడమాడి చక్కావచ్చాడు. నాల్గురోజులవరకు ఆమె యింటిముఖం చూడనేలేదు. నాల్గోనాడు లీసావద్దనుంచి వానికొక జాబు వచ్చింది. అందులో యిల్లావుంది.

"ప్రియతమా!

ఇదే నా అంతిమ ప్రణామ మందుకో. ఈ జీవితంలో నా పాపపుముఖాన్ని మరి చూడలేవు. నన్ను వెతకటానికి ప్రయత్నించినా వృథా శ్రమఅవుతుంది. నేను ముందుగా యే ఓడనో యెక్కి యీ చండాలపు బస్తీ విడిచిపెట్టి యెక్కడికైనా వెళ్ళిపోతాను. ఈ నగరమే నా సర్వనాశనం చేసి, అధఃపతనం గావించి, యీ స్థితిలోకూడ నాహృదయం అద్దపు పెంకుల్లాగా ముక్కచెక్కలయ్యేటట్టు గట్టిదెబ్బకొట్టింది. కాబట్టే దీన్ని చండాలపు నగర మంటున్నాను. నీవు నాకోసం నిరీక్షించవద్దు. నీ దయ, స్నేహం, వాత్సల్యాలను మరువలేను. నీ క్రూర- అత్యాచారాల స్మృతిని మాత్రమిచటనే వదలిపెట్టిపోతున్నాను. నేను అననాయిన్‌తో వెడుతున్నాను; అతడు కొంతకాలంనుంచీ నాపై మరలుగొనివున్నాడు. కాని, నేను అంగీకరించలా. అతను సామ, దాన, భేదోపాయలలో విఫలుడై నిరాశచెంది తుదకు నన్ను చంపివేస్తానని బెదరించాడు. నేను భయపడి అతనికి లొంగిపోయాను. ఇప్పు డతనితోనే వెళ్ళిపోటానికి సిద్ధపడ్డాను. ఎక్కడో సముద్రతీరాన ఒక పట్టణంలో షాపు పెట్టాడు. మేమిద్దరము అక్కడే ఆవాస మేర్పరచుకొని వుండబోతున్నాము. నా అపరాధాలన్నీ మన్నించు. నేను నిన్నెంతగా ప్రేమించానో నీ విప్పుడు గ్రహించగలిగినా యింకేమి ప్రయోజనం? మనమందరం క్షుద్రజీవులం. మన మెవరినీ

ద్వేషించకూడదు. నా కొరకు విచారించకు. వాస్తవిక వేదన యేదో నా కిప్పుడు తెలుస్తోంది. హృదయం కృంగిపోతోంది. ఇక నది చీలికలై పోతోంది. పోస్టులో నాస్మారక చిహ్నాన్ని పంపుతున్నాను. నా తుది బహూకరణగా దాన్ని స్వీకరించు.

నీ
లీ. పా"

ఇలియా ఆ జాబును చాలసార్లు చదువుకొన్నాడు. ప్రతిసారీ వానికి నూతనానందం లభించింది. లీపా తన్ను హృదయపూర్వకంగా ప్రేమించుతున్నదని నేటివరకు ఇలియాకు విశ్వాసం కలుగనేలేదు. వానిహృదయం విషాదభరితమయింది. "ఇక నే నెవరివాకిట నిలబడాలి? నన్ను ఓదార్చే వారెవరు?" అని తలచుకోవటంతో వానికన్ను లశ్రుపూరితమైనాయి. కిటికీగుండా బయటికి చూస్తున్నాడు. "కృతజ్ఞతతో తనకు అణగివున్నప్పటికి స్వతంత్రనే" నని లీపా చెప్పినమాట జ్ఞప్తికివచ్చింది. కృతజ్ఞత వుంటే యెల్లా వెళ్లగలిగింది? తనపట్ల ఆమెకున్న శ్రద్ధ అంతంతమాత్రపుదే ననుకున్నాడు. లీపాపై చేసిన అన్యాయత్యాచారాలను తలచుకొని తానే అపరాధిననుకొన్నాడు మళ్ళీ.

అప్పుడే పక్కగదిలోనుంచి లాసినాపాట విన్పించింది. వెంటనే ఆమెభర్త పకపకనవ్వటంకూడ వినవచ్చింది. తరువాత లాసినా వంటగదిలో కూనరాగంతీస్తోంది.

మరోకప్పుడైతే వెంటనే లేచివెళ్ళి ఇలియా లాసినాతో బాతాఖానీ వేయకుండా వుండేవాడు కాదు; కాని యిప్పుడు యెకసక్కెములాడేస్థితిలో లేడు. వాడు తనగదినికూర్చి తల పోసుకొంటున్నాడు.

ఉన్నట్టుండి "ఇలియా! టీ తాగుదువుగాని రా." అని కేకవేసింది లాసినా.

"ఇప్పు డొద్దు" అని వుదాసీనంగా సమాధాన మిచ్చాడు ఇలియా.

చర్చిలో గంటకొట్టినధ్వని వినపడింది. ఇలియా కప్పుడు తాను కొన్నిరోజులనుండి చర్చికి పోనిసంగతి తలపు కొచ్చింది. గదిలోనుంచిబయటపడాలని చర్చికి బయలుదేర బోతూంటే లాసినా గదిద్వారంవద్దకొచ్చి నిలబడింది.

ఇలియా నిర్లక్ష్యంగా యిచ్చిన ప్రత్యుత్తరంతో ఆమె చిన్నపుచ్చుకొన్నది. అక్కడికి వచ్చి లాసినా విస్మయ భావంతో ఇలియా నవలోకించసాగింది. ఇలియా ఆమెను గమనించి "నేను చర్చికి వెళ్ళబోతున్నా" నన్నాడు.

"వెళ్ళొచ్చు; కాని, టీ తాగిపోదువుగాని రా."

ఇలియా "వద్దు" అని తలాడించుతూనే బయట్రే రాడు. దారిలో వానికి అననాయిన్ తలపుకొచ్చాడు. అతడు శ్రీమంతులయింటిబిడ్డ. బక్కపల్చగా, అందంగా వుంటాడు. విలాసప్రియుడు, భోగలాలసుడు. "మానవుడు

కూడ గ్రద్దవలెకాచుకొని అవకాశంచూచుకొని వేటపైన విరుచుకొనిపడతా" డనుకొన్నాడు ఇలియా.

ఇలియా కలవరపాటుతోనే చర్చిలో ప్రవేశించాడు. అప్పుడు వానిముఖం వికృతమైవుంది. మౌనంగా నిలబడ్డాడు. అందరూ ఐక్యకంఠంతో ప్రార్థించుతున్నారు; కాని ఒక ఠింగణా స్వరం కలుపలేకపోయాడు. వానికంఠం గార్ధభ స్వరాన్నిపోలి శ్రోతలశ్రవణేంద్రియాలను బ్రద్దలుచేస్తోంది. ఇలియా అసహ్యాభావంతో మండిపడి వానికి రెండుచఱపు లంటించాలనుకొన్నాడు; కాని, అంతలోనే ఒకవృద్ధమహిళ వచ్చి "యువకుడా! ఇది నీవు నిలుచుండే తావుకాదు. వేరొక చోటుకు పో" మ్మని హెచ్చరించింది.

ఇలియా ఆమెఆడంబరాన్ని పరికించాడు. "దేవుని సన్నిధిలోకూడా శ్రీమంతులకు ప్రత్యేకస్థానమా!" అని మరోపక్క కెళ్ళాడు.

పోలటోవ్ హత్యానంతరం ఇలియా చర్చికిరావటాని కిదే మొదలు. ఆ విషయాన్ని స్మరించుకొని ఇలియా గడ గడవణకిపోతూడు. ఆ ఆందోళనతో సర్వాం విస్మరించాడు. వాని కే భయము లేదు; కాని, వాని ముఖమండలంమీద విషాదఛాయ లలముకొని వున్నై. "పరమేశ్వరా! నాపై కరుణించు" మని మదిలో ప్రార్థించాడు.

ప్రార్థన జరుగుతూంది. హెచ్చు—తగ్గు స్థాయిలలో ఇలియా కది విన్పడుతూనే వుంది. గణగణమోగే ఘంటా

రవం ప్రతిధ్వనిస్తోంది. ఆ వాతావరణం విచిత్రంగావుంది.

. అంతా ఐపోయింది. నిస్తబ్ధత వ్యాపించింది. పెద్ద నిట్టూర్పు వదలుటతో ఇలియాహృదయం శాంతించింది. చిత్తచాంచల్యం దూరమైంది. సంకోచ మంతరించింది. తన యీ ఆకస్మిక మానసికపరివర్తనకు ఇలియా విస్మయపడ్డాడు.

ఇంతలో వానికొకవిషయం జ్ఞప్తికొచ్చింది. 'లాసినా గదిలో చొరబడి నోట్లకట్టను చూస్తే!' ఇది తలచుకొన్న తరువాత అక్కడ ఒక్కక్షణంకూడ ఉండలేకపోయాడు. గుంపును త్రోసుకొంటూ బయటపడి ఒక జట్కానెక్కి యింటిముఖంపట్టాడు. బండి ఎంతవేగంగా పోతున్నా వాని కది మందగతిగానే తోచింది. దారిలో పరిపరివిధాల ఆలోచించాడు. ఒకవేళ ఆమె ఆ కట్టను చూచినా ఆ ధనాన్ని అపహరించి గప్‌చిప్‌గా వూరుకుంటుందే గాని రిపోర్టుచెయ్యబోదని మనసు కూరటకల్గించుకున్నాడు.

అయినా ఆందోళన తగ్గలా. ఆబిడ ఆ నిక్షేపాన్ని అపహరిస్తే తానే స్వయంగా స్టేషనుకు పోయి యదార్థ మంతా చెప్పివేసి, తన అపరాధాన్ని అంగీకరించా లనుకొన్నాడు. తా నిక్కట్టులపాలై దరిద్రమనుభవించుతూ యమయాతనపడుతూంటే, తనధనంతోనే యితరులు కాలుమీదకాలేసుకొని సుఖించటం సహించకూడదని నిశ్చయించుకొన్నాడు.

బండి యింటిముందుకు వచ్చి ఆగింది. ఇలియూ గబు క్కున క్రిందికి దూకి ద్వారంవద్ద కెళ్ళాడు. తలుపుమీద దబాదిబగుద్దాడు. లా సి నా వచ్చి తలుపుతీసి "ఏమిటి హడావుడి?" అని అడిగింది.

కాని, ఇలియూకు సమాధానమివ్వటానికి అవకాశ మేదీ! గభాలున గదిలో కెళ్ళాడు. ఆ దూకుడులో లాసి నాను త్రోసుకొనిపోయాడు.

గదిలోకెళ్లి చూచుకొంటే యెక్కడి దక్కడ చెక్కు చెదరకుండా వున్నై. ఇలియూఆరాటం తగ్గింది.

లాసినా వచ్చి "ఒంట్లో బాగా లేదా?" అని మృదువుగా అడిగింది.

"అవును. మిమ్మల్ని రాచుకొచ్చాను; క్షమించాలి."

"పర్వాలేదులే. బండివాడికి బాడుగ యివ్వ వద్దూ?"

"దయచేసి యిచ్చి పంపండి."

ఆమె గజ్జెలగుఱ్ఱంలాగా కాళ్లస్లిప్పర్సు టకటక లాడించుకొంటూ వెళ్లింది. ఇలియూ నోట్లకట్ట తీసి చూచు కున్నాడు. యథాప్రకారమున్నందుకు తృప్తి చెంది జేబులో దోపుకున్నాడు. తన అకారణ ఆందోళనకి, అనవసర భీతికి, అసాధారణ ప్రవర్తనకు సిగ్గుపడ్డాడు.

లాసినా తిరిగొచ్చి "వాడికి ఆరణా లిచ్చి పంపే శాను; ఎల్లావుంది? కళ్లు తిరిగాయూ?" అని అడిగింది.

"అవును. చర్చిలో నిలబడివుంటే అకస్మాత్తుగా–"

"అయితే మెదలకుండ పడుకో కాస్సేపు పరిచర్య చేస్తాను. ఇవాళ మావారు పొద్దుపోయిగాని రారు."

ఇలియా పక్కమీద పవళించాడు. లాసినా కుర్చీలో కూచుంది.

ఇలియా దరహాసవదనంతో "నా మూలంగా మీ కెందుకీ శ్రమ?" అన్నాడు.

"ఇంతమాత్రానికేనా?"

తరువాత యిద్దరూ మౌనంవహించారు. ఏ మనాలో ఇలియాకు తోచలా. లాసినా వానిముఖంలోకి చూస్తూ నవ్వుతోంది.

ఇలియా దృష్టినిమరల్చి "నవ్వుతా రెందుకు?" అన్నాడు.

"చెప్పనా?" లాసినా అంది.

"తప్పకుండా."

"మీకు నెపాన్నికల్పించటంలోకూడ నేర్పు లేదనే."

ఇలియా చకితుడై ఆమెవేపు దృష్టిని సారించాడు.

నేను నిజమే చెపుతున్నాను. మీకు సుస్తీగావున్నదని వంక పెట్టారు; కాని, దాన్ని నిర్వహించలేకపోయారు. మీకే జబ్బు లేదని నాకు తెలుసు. ఇవాళ అందిన వుత్తరం వల్లనే విచారపడుతున్నారు. నే నా వుత్తరాన్ని చదివాను లెండి"

లాసినా లీపా తనకు రాసిన జాబును చదివిందని ఇలియూ గ్రహించి "నిజమే" నని వొప్పుకున్నాడు.

ఆవిడ ఒకసారి కిటికీలోనుంచి బయటకిచూచి అన్నది- "నేను ప్రౌఢను కాను; అయినా మీకిష్టమైతే నా సలహా వినండి: ఆ లేఖను చించిపారెయ్యండి. ఆమె తిరస్కరించి మీకు వుపకారమే చేసింది. అప్పుడే మీవయస్సెంత! అంతేకాక, మీవద్ద తగినంత ధనం కూడ లేదు. ధనహీను డెన్నడూ వివాహబంధనంలో చిక్కుకోకూడదు. తరుణము వస్తే మీ కర్ధాంగి దొరక్కపోదు. మీవంటి అందగాణ్ణి, బలశాలిని యే అతివ కోరదు! మీరు ముందు బాగా కష్టపడి సంసారసాగరాన్ని యీదటానికి చాలినంతడబ్బును మూట గట్టండి. మీ భావి వుజ్వలంగా వుంటుంది. మీరు శ్రమ శీలురు, వ్యసనంలేనివారు. మీ శాంతస్వభావము, వుత్సాహాలే మీ కభ్యున్నతిని కల్గిస్తాయి."

ఇలియూ ఆబిడమాటలు వింటూ మధ్య మధ్య నవ్వు కుంటున్నాడు.

"ఈవిధంగా నవ్వి తప్పుకుంటే లాభంలేదు. ఇది పడుచుతనపుపొంగు. అది త్వరలోనే అణగిపోతుంది. దానికి చికిత్స సులువే. పెళ్లికిపూర్వం నేనుకూడ మూడుదఫా లీ ప్రేమజాలంలో చిక్కుకున్నదాన్నే. ఒకసారి నేను ఆత్మ హత్యకుకూడ సిద్ధమయ్యాను; కాని, క్రమంగా ఆమత్తు

విడిపోయి సుఖపడ్డాను. అసలు ప్రేమ వాగురలో పడకుండానే తరుణము వస్తే వివాహం దానంతటదే అయిపోతుంది.''

ఇలియా తలెత్తి లాసినావంక చూచాడు.

''క్రమక్రమంగా మా ప్రేమ వృద్ధికాజొచ్చింది. ఇప్పుడు మేము ప్రేమసామ్రాజ్యాన్నేలుతున్నాము. స్త్రీలు తఱచుగా వివాహానికిముందు ఉన్మాదినులవుతూంటారు.''

''మీ వుద్దేశం నాకు బోధపడలా.''

''నవ్వులాట కంటున్నాల్లే; కాని, వివాహ పర్యంతం తమ భర్తలవిషయంలో యేమీ యెరుగని వనితలే యెక్కువగా కన్పిస్తారు. అయినా అలాంటివాళ్లు ముడిపడినతర్వాత పతిప్రేమతో సమ్మోహితలవుతారు.''

లాసినా యిలా చాలాసేపటివరకు వుపన్యసించింది. ఇలియా తుదివరకు అతి శ్రద్ధాళువై విన్నాడు. ఆమె మాట్లాడుతున్నంతసేపు వానికి శాంతి, ఆనందాలు సంప్రాప్తమైనై. ఆమె అల్పవయస్సులోనే అంత నైపుణ్యము, అనుభవము కలిగివున్నందుకు మెచ్చుకొన్నాడు. అట్టిపడతిని భార్యగా కలిగివున్నవానికి దుఃఖం దరికైనా చేరలేదు. అదృష్టమన్న వారిదే ననుకొన్నాడు.

అతనిప్రక్కన శీలవతిఅయిన ఒక గృహస్థనారీమణి కూర్చుండి మనసిచ్చి మాట్లాడుతోంది. ఆవిడ ప్రతివాక్కు వాత్సల్యాన్ని ప్రతిబింబించుతోంది. ఇలియా హృదయం కృతజ్ఞతాభరితమైంది. లాసినా వెళ్ళటానికి లేచినప్పుడు

అతడు నతమస్తకుడై "మీ వుపదేశంతో నాకు శాంతి చేకూరింది. నేను మీ కేప్పుడూ కృతజ్ఞుడనై వుంటాను" అన్నాడు.

"నిజంగా నేను మీకు శాంతిని చేకూర్చగలిగానా?" అని అడుగుతూంటే లాసినా పెదాలపైన చిరునవ్వు దొంతరలు పరుగులీశాయి. ఆమెకపోలాలరుణిమదాల్చాయి. ఇలియా వేపు ఓరగా చూస్తూ "మళ్లీ వస్తా"నంటూ వెళ్లి పోయింది.

ఇలియా కామెపై ననురక్తి అంకురించి దిన దినాభివృద్ధి చెందసాగింది. అతడా ఆలు-మగల పరస్పర ప్రేమానుబంధము, శాంతియుతజీవితాన్ని గాంచి ఈర్ష్య పడేవాడు. పోలీసువుద్యోగులపేరు వింటే ఇలియా హృదయంలో ద్వేషాగ్ని రగుల్కొనేది. పోలీసుల క్రూరత్వం, స్వార్థ, లోభాలు ఇలియాకు చిరపరిచితాలే; కాని, నికోడిమిచ్ పట్ల మాత్రం ప్రత్యేకాభిమాన మేర్పడింది. ఇలియా కతడు శ్రమశీలి, న్యాయప్రియుడు, ఉదాత్తుడుగా కన్పించేవాడు. భర్త శరీరంగాను, భార్య ఆత్మగాను తోచింది ఇలియాకు. నికోడిమిచ్ యింటిపట్టున చాల తక్కువగా వుండేవాడు. లాసినా ఇలియాల మైత్రి వృద్ధి చెందుతూవచ్చింది. అతడామెకు చిన్న-పెద్ద పనులు చేసి పెడుతూండేవాడు. అందువల్ల వాని కానందం లభించేది. కొన్నాళ్ళకు లాసినాపనులు నిర్వర్తించటం ఇలియా దిన చర్యలో ఒక భాగమయింది. లాసినా చనువుకొద్దీ వానికి పనులు చెపుతూండేది.

# 22

అపుడపుడు కర్సకోవ్ అనే మరో పోలీసు అధికారి నికోడిమిచ్ గృహానికి వచ్చిపోతూవుండేవాడు. అతడు బక్కపలుచని మనిషే గాని, మహా ముక్కోపి. వక్రబుద్ధి వాడి సొంతసొమ్మే. ఆ ఘనుడు బళ్ళవాళ్ళనుచూచి మండిపడేవాడు. వాళ్ళ నెప్పుడూ నోరుచించుకొని తిట్టేవాడు. బళ్ళవాళ్ళు పట్టణశోభను నాశనంచేస్తున్నారనీ, యెంత చెప్పినా వాళ్ళబుర్రకెక్కదనీ, వచ్చేవారు యెడంవైపుగాను, వెళ్లేవాళ్లు కుడివైపుగాను నడవాలని ఒక బోర్డు తగిలించితే బాటసారులు తూ. చ. తప్పకుండ నియమాన్ని పాటించుతారనీ, బళ్లవాళ్లకు మాత్రం బుద్ధిరాదనీ యేమేమో చెపుతూండేవాడు.

ఎప్పుడూ బళ్ళవాళ్ళను కసరుతూనో, విసురుతూనో వచ్చేవాడు. మొహం చిటపటలాడుతూండేది. సౌమ్యత వానికోశంలోనే లేదు.

ఆ యింటికి వచ్చేవారిలో స్కూళ్లఇన్స్పెక్టరు ఒకడు. అతనిపేరు గ్రాలివ్. మితభాషి; కాని, అతిగా పాడేవాడు. అతనికళత్రం తిండిపోతు. ఆబిడ వచ్చినప్పుడెల్లా లాసినా చేసిన వంటకాలన్నీ స్వాహాచేసేది. లాసినా ఆమెవెనుకనే ఆడిపోసేది.

"వట్టి పందికొక్కు. మంచిపదార్థాలే యేరితింటుంది. ఆ పొట్టలో యే తుక్కో తొక్కరాదూ?" అనేది లాసినా.

అక్కడ చేరేవారిలో యింకో వ్యక్తికూడావున్నాడు. అతనికి ఆ బ్యాకరీ యిలాకాలో యేదో వుద్యోగం. అతడెప్పుడు వచ్చినా వానిఅర్ధాంగి అలెగ్జాండ్రా వెంట వుండేది. అత డేదో ధర్మసమాజంలో సభ్యుడు కూడాను. సతీ-పతు లెప్పుడూ ఆ సంస్థ విషయం ప్రస్తావించేవారు. ఒకనాడు వారిసంభాషణ యిల్లా నడిచింది.

"అక్కడేమి జరుగుతున్నదో తెలుసా?" అన్నాడు భర్త.

"నాకు తెలుసు"నంది భార్య.

భర్త అక్కడున్నవారి నుద్దేశించి చెప్పాడు- "ప్రతి రోజూ యేదో ఒక దరఖాస్తు వస్తూనేవుంటుంది. భర్త చనిపోయాడనో, కాలు విరిగిపోయిందనో, దిక్కులేని శవానికి దహనసంస్కారం జరిపించాలనో, యిల్లాగే వేనవేలు విజ్ఞప్తులు. అందరికి కాస్తో కూస్తో సహాయం చేస్తూనే వున్నాం; కాని, నా దృష్టిలో అందువల్ల లాభానికిమారు నష్టమే వాటిల్లుతోంది. సోమరితనం పెచ్చుపెరిగి ప్రజలు భ్రష్టులైపోతున్నారు. ఈమధ్యనే ఒక వినతిపత్రం వచ్చింది. ఒకావిడభర్త చనిపోయాడట. అక్కరకురాని పిల్లలు ముగ్గురున్నారట; కాని, వాళ్ళపాలన-పోషణకు దారిలేదట. ఇదీ ఆ దరఖాస్తులోవున్న విషయం. కమిటీ సమావేశమై

అయిదు రూపాయలు మంజూరు చేసింది; కాని, మా ఆవిడ ఆ దరఖాస్తులో వ్రాసుకొన్న సంగతులను విశ్వసించలేకపోయింది. తాను స్వయంగా వెళ్ళి విచారించుతానంది. పోయి దర్యాప్తు చేయగా, దరఖాస్తుదారిణిభర్త కొన్నిసంవత్సరాల క్రితమే మృతిచెందినాడనీ, ఆవిడ కిద్దరు కొడుకులు మాత్రమున్నారనీ, వాళ్ళందరూ పనిచేసి పొట్టపోసుకొనే స్థితిలోనే వున్నారనీ తేలింది. అంతట నే నా విధవను పిలిపించి "మోసగించటానికి ప్రయత్నించిననేరానికి నీ మీద కేసు పెట్టితే యే మవుతుం"దని అడిగాను. ఆమె నా కాళ్లావేళ్లా పడి బ్రతిమ లాడింది."

పో లీ సు ఆ ఫీ స రు పకపకనవ్వాడు. అందరూ అలెగ్జాండ్రా శేముషీవిశేషాన్ని శ్లాఘించారు. తరువాత పాటకప్రజనంమీద అనేకవిధాల ఆక్రోశించారు.

ఇలియా తనగదిలోవుండి వారి వాదోపవాదాలు వింటూ, వాటి నవగాహన చేసుకోటానికి ప్రయత్నించేవాడు; కాని, వానికేమీ బోధపడేది కాదు. అయితే వాళ్ళు మానవ జీవితసమస్యలను బాగా తరచితరచి ఆలోచించి శాశ్వత నియమాలు కొన్నిటి నేర్పరచినట్లు మాత్రం గ్రహించాడు. ఆ కట్టుబాట్ల నతిక్రమించి నడిచేవారిని విమర్శించి, దూరు టే వారికర్తవ్యం కాబోలు ననుకొనేవాడు. సాధారణంగా ఉద్యోగస్తుల యిళ్లూ–వాకిళ్ళు, చర్చి, ప్రార్థన, అలగాజనం

అసభ్యత, పరిచిత స్త్రీ-పురుషుల వ్యభిచార, భోగ-విలాసాలు వారి చర్చనీయాంశాలయివుండేవి.

ఈ రకం సంభాషణలు వినివిని ఇలియా విసుగు చెందాడు. అప్పుడప్పుడు గృహమేధి ఇలియాను తమ గోష్ఠిలోకి ఆహ్వానించేవాడు. ఇలియా మౌనంగా ఒకపక్కన కూర్చొని అందరిని పరీక్షగా పరికించేవాడు. లాసినా యెప్పుడూ నవ్వుతూ కులుకుతూవుండేది; కాని, ఆ మెభర్త ధనలక్ష్మిని జుట్టుపట్టుకొని యీడ్చుకొచ్చి తమయింట్లో బందీని చేసే దెట్లాగా అని తపనపడేవాడు.

ఒక పర్యాయం నికోడిమిచ్ యిల్లా అన్నాడు— "దేశదేశాల్నుంచి వివిధ పక్షిజాతులను తెప్పించి వుంచాలని ఆలోచిస్తున్నాను. వృత్తి చెడ్డది కాదు; ఆదాయం కూడ తగినంత రాకపోదు. ఈ భాడకావునా కరీకంటె అదే మంచిది."

ప్రతిష్ఠానుకు లాసినా నవ్వేది. ఇలియా వేపు భావయుక్తంగా చూస్తూ "నేనీ వేసంగిలో క్రిమియాకో, కకేషస్‌కో వెళ్తాను. చలికాలం వచ్చిన తర్వాత దానసమాజ సభల నేర్పాటుచేస్తాను. ఆడంబరం లేని చక్కని సాదా దుస్తులే ధరిస్తాను. ఒక బ్రోచి, లోలకులు మినహా తతిమ్మా ఆభరణా లేవీ పెట్టుకోను. పేదల రక్తము, కన్నీళ్ళే పునర్జన్మలో రత్నాలు, మణులుగా సంప్రాప్తమవుతాయని

యేదో ధార్మిక గ్రంథంలో చదివినట్టు జ్ఞాపకం" అని నిట్టూర్చింది.

ఇలియా వారిమాటలకు నవ్వుకొనేవాడు. ఆ గది లోని సరంజామా, అలంకారాలను గాంచి ముగ్ధుడయ్యే వాడు; కాని, వాని నేదో అజ్ఞాతవేదన వ్యాకుల పరిచేది. అమ్మకం తగ్గి పోయిదాకు లోటువచ్చిననాడు ఇలియా మనస్సు బాగుండేదికాదు. ప్రతివస్తువు పామై తన్ను కరవ వస్తున్నట్టుండేది. అటువంటప్పుడు లాసినాగృహాలంకారము వాని కప్రియంగా వుండేది. చేతికందిన ప్రతి వస్తువును గిరాటువెయ్యా లనిపించేది. ఇంతకూ కారణం మాత్రం వానికి తెలిసేదికాదు.

అట్టిస్థితిలో మౌనముద్రవహించేవాడు. పెదవి విప్పితే పరుల నొప్పించే మాటలేమి వెలువడునో యన్నభయంవల్ల యెవరితోను మాట్లాడేవాడుకాదు.

ఒకరోజున ఇలియా ఆ దంపతులతో చీట్లాడు తున్నాడు. మాటల సందర్భంలో "మీారు పోలటోవ్ హంత కుడిని పట్టుకోనేలేదుగదూ?" అని నికోడిమిచ్‌ను అడిగాడు.

లాసినాభర్త ఆటలో తన్మయుడై వున్నాడు. అతడు నిర్లక్ష్యంగా "మాకు పట్టుకోవాలన్న ఆత్రంలేదు. అసలు ప్రయత్నించితేగా! [భార్యతో] ఆటీన్‌రాణి యెవరిదగ్గరుంది? నువ్వు ఇస్పేటురాణి నిచ్చావు గదూ?" అన్నాడు.

"జ్ఞప్తికితెచ్చుకోండి. నేను చెప్ప"నంది లాసినా.

ఇలియా మళ్లీ ప్రశ్నించాడు–"హంతకుడు తప్పించు కొన్నట్టేగా?"

నికోడిమిచ్ పరధ్యానంగానే జవాబిచ్చాడు—"ఆ, తప్పిపోయినట్టే. మేముకూడా ఆ వ్యవహారాన్ని ముగించేశాము."

"ఇంత ఆలస్య మేమిటి? మీకు కావలసింది అడగండి" అని లాసినా భర్తను తొందరపెట్టింది.

"అడుగుతా నుండు."

ఇలియా తనకు సరియైన సమాధానం రానందున మళ్లీమళ్లీ హత్యా సంబంధమైన ప్రశ్నలనే వేస్తున్నాడు—"హంతకుడు పక్కా చతురుడై వుంటాడు" అన్నాడు.

"చతురుడా? ఏడ్చాడు! మా కంటే నేర్పరా?"

అని పోలీసుఇన్స్పెక్టరు సెట్టు (రాణీలు) తీసి బల్లమీద పెట్టాడు. ఇలియా కొక్క సెట్టయినా రాలేదు. ఓడినవాణ్ని 'గాడిద' అనటమే గెల్చినవారిప్రయోజనం. భార్యా భర్త లిద్దరూ ఇలియాను పరిహాసం చేయసాగారు. వానికి రోషం పొడుచుకొచ్చింది. చేతిలోని పేకముక్కల్ని బల్లపైన విసరి కొడ్తూ "పట్టపగలు నడిబజార్లో హత్యచేసి తప్పించుకోవడం సామాన్యమనుకున్నారా?" అని పౌరుషం ప్రదర్శించాడు.

"అది సాహసం కాదు; అదృష్టం!" అంది లాసినా.

ఇలియా యిద్దరిముఖాలు చూస్తున్నాడు.

నికోడిమిచ్ "హత్యచేయటం అదృష్టమా?" అన్నాడు.

"ఎందుకాకూడదు? హత్యచేసి తప్పించుకోవడమే అదృష్టం" అంది లాసినా

ఇన్స్పెక్టరు లాసినా నుద్దేశించి "ఈసారి నాకు డైమను ఆసుకూడా యివ్వు" అన్నాడు.

లాసినా యిచ్చింది, ఆమె ఇలియూ నేదో అడిగితే వాడు "లేద"ని చెప్పి "నాకు రావల్సిన ఆసును మీా ఆయన కిచ్చావుగదూ" అన్నాడు.

"ఏ వర్తకుడినో చంపు; అదేవస్తుంది" అంది లాసినా.

నికోడిమిచ్ ఆసును, రెండుచుక్కలముక్కను యిస్తూ ఇలియూతో అన్నాడు—"ముందీపేకముక్కలు తీసుకో. హత్య చేసింతర్వాత యింకేదైనా సంపాదిద్దువుగాని."

ఇలియూ అతడికళ్ళల్లోకి చూచాడు. హత్యావిషయంలో ప్రశ్నించాలన్నకుతూహలం మరి లేకపోయింది. వారితో కలసిమెలసివుండటం యెప్పటికైన ప్రమాదమనుకొన్నాడు. పెద్ద బరువునెత్తుకున్నట్టుంది. వాని కప్పుడు భగవంతుడంతా యెరిగివుండికూడ శిక్షవిధించటానికి జాగేల చేస్తున్నాడోనని సంశయాత్ముడైనాడు: ఇలాంటి సందేహం కలిగినప్పుడేదైనా ధార్మికగ్రంథం తీసి చదివేవాడు. బాల్యంలో వానికి అద్భుత చమత్కార కథలు మాత్రమే రుచించేవి. ఇప్పుడు వాస్తవిక జీవిత సమస్యలకుసంబంధించిన

గ్రంథాలు చదువసాగాడు; కాని, క్రమంగా వాటిపైనకూడ రుచి తగ్గిపోయింది. అవన్నీ మానవుడికి ధైర్యంకల్గించటానికే వ్రాయబడినాయని తోచింది. అయినా అనుభవం అధికమైనకొద్దీ జీవితంలోని యదార్థాన్ని గ్రహించాలనే జిజ్ఞాస కలిగింది. తన కళ్ళముందు జరిగిన ప్రతి చిన్నఘటనకు ఆద్యంతాలు తెలిసికొన ప్రయత్నించేవాడు.

పావ్కాను చూడటానికి హాస్పిటలుకు పోయినప్పుడెల్లా ఇలియా వాని కానాటి ఘటనలను వర్ణించి చెప్తూండేవాడు.

"నిన్న వొక వడ్రంగి, కొందరు గోడకట్టువాళ్ళు రోడ్డున నడిచిపోతున్నారు. కానిస్టేబిలు వారి నటకాయించి 'పక్కదారిని నడువలేరూ? ఈ రాస్తా శ్రీమంతుల కోసమని తెలియదూ? మీ గాలు వారికూడ గుమాయించాలా?' అని గద్దించాడు. భాగ్యవంతులకు సర్వసౌఖ్యాలు చేకూర్చుతున్నదా శ్రమజీవులే; అయినా వారు వాళ్ళప్రక్కన నడవటానికూడ అర్హతలేదు. ఎందుకో యీ హెచ్చు తగ్గులు!"

ఇల్లాంటివే అనేకవిషయాలు విమర్శనాపూర్వకంగా పావ్కాతో చెప్తూండేవాడు ఇలియా. పావ్కా ఊఁకొట్టేవాడు. వాడికి హాస్పిటలు బందిఖానాగా వుంది. శాంతిలేదు; సుఖం సున్నా. వేరాయోగక్షేమాలు తెలియక మరీ విచారపడేవాడు. ఆ చింతే వానిని కృశింపజేసింది.

జాకోబును ఏవగించుకొనేవాడు. ఒంటరిగా దుఃఖించటానికైనా సిద్ధపడేవాడు; గాని, జాకోబు యెదుటపడటానికి వాని మనసొప్పేదికాదు.

జాకోబు పళ్లూడటమేకాక రెండుపక్కటేకిలు కూడ చిట్లాయి. వానికి యింటివద్దకంటె హాస్పిటలులోనే సుఖంగా వుంది. ప్రక్కనున్న రోగితో పరిచయంచేసుకొన్నాడు. వాడొక చర్చిలో ప్రతీహారి. వానికాలి కేదో వ్రణంలేచి అక్కడ చేరాడు. ఇలియా వెళ్ళినపుడెల్లా జాకోబు వాని వద్దనే కూర్చొనివుండేవాడు. వాళ్లిద్దరూ బైబిలు చదువుతూండేవాళ్ళు.

జాకోబుస్వరం మందగించింది. వాడు మాట్లాడుతూంటే కీచుకీచుమన్నట్టుండేది. చదివేటప్పుడు చేతులాడించుతూంటే రోగులందరినీ తనవద్దకు రమ్మన్నట్టుగా వుండేది. ముఖంమీద దెబ్బలమచ్చలింకా కనిపించుతున్నై. వానిరూపం భయంకరంగా తయారైంది. ఒకరోజున ఇలియారాగానే పుస్తకంమడిచి చంకలోపెట్టి "మాషానెప్పుడైనా చూచావా?" అని అడిగాడు.

ఇలియా "లే"దన్నాడు.

"అంతా యింద్రజాలంగా అయిపోయింది. ఉదయం కన్పించింది; సాయంత్రానికి మాయమైపోయింది."

"మీనాన్న వచ్చి చూచాడా?"

"వచ్చాడు."

తండ్రిప్రసక్తితో జాకోబు ముఖం రంగుమారింది. భీతిగొన్నవాడివలె చూస్తూ మళ్లీ చెప్పాడు— "ఇవాళ వుదయం కొన్నిపండ్లుకూడ తెచ్చిచ్చాడు. హాస్పిటలులో చేరి చాలాదినాలైందట. ఇక నన్ను యింటికి వచ్చెయ్యమన్నాడు. నేను డాక్టరుగారితో నన్నిప్పుడప్పుడే పంపవద్దని బ్రతిమలాడుకున్నాను. నాకిక్కడే చాలబాగుంది. ఇక్కడే నాకీయనతో (ప్రతీహారిని చూపి) పరిచయమయింది. పేరు నికిటా. ఈయనవద్ద బైబిలు వుంది. మేము నిత్యము దాన్ని పారాయణంచేస్తున్నాము. ఎనిమిదేళ్లనుంచి మననంచేసి చేసి నికిటా "అంతా ఆకళింపుచేసుకొన్నాడు. చక్కగా వ్యాఖ్యానంచేసి చెప్పగలడు. బాగుపడినతర్వాత నికిటాతో నేనుకూడ చర్చిలోనే వుంటాను. ఇక యింటికిమాత్రం పోను."

నికిటా తలెత్తి ఇలియావంక తేరిపారజూచాడు. ఇలియా అక్కడనుంచి వెళ్లిపోడానికి వేగిరపడ్డాడు.

బైబిలునుగురించి ముచ్చటించాలని జాకోబు ఉబలాటపడుతున్నాడు. గద్గదకంఠంతో "బైబిలు యెంత మంచి గ్రంథం!" అన్నాడు.

వాడు బైబిలుపై నుంచి దృష్టిని ఇలియాపై నిల్పాడు. "బైబిలులో సర్వవిషయాలు రాసివున్నై. భగవంతుడు పాపకార్యాల నెట్లు ఖండించేదీ, పాపుల నేవిధంగా శిక్షిం

చేదీ, పుణ్యాత్ములపై నేరీతిని కృపాదృష్టిని బరపేదీ మొద లైన విషయాలెన్నో యిందులో వున్నా''యన్నాడు.

''అదంతా నిజమేనా?'' ఇలియా అడిగాడు.

''అక్షరాలా'' నని ఆ త్రైనాతి దృఢంగా అన్నాడు.

''మీ వుద్దేశం సరికాదని నా తలంపు'' అన్నాడు ఇలియా.

నికిటా రెప్పలు వాలాయి. కళ్లు మూతపడ్డాయి. వాని గడ్డం వూగులాడింది. ''సత్యాన్వేషణలో నిమగ్నుడవటం పాపాచరణ కాదు. భగవంతుడే అందుకు ప్రేరేపించు తున్నాడు.''

ఇలియా అదిరిపడ్డాడు. ప్రతీహారి నిట్టూర్పువిడిచి మళ్ళీ అన్నాడు– ''సత్యమే తన్ను వెదకుమని చెవిలో వూదుతోంది. సత్యమే భగవంతుడు. భగవదన్వేషణ చేయటంలోనే వాస్తవికానందం లభ్యమవుతుంది.''

అతనిముఖం తేజోవంతమయింది. ఇలియాకూడ ఆకర్షింపబడ్డాడు.

''దశమధ్యాయంచదివి వీరికి విన్పించు'' మని ఆ త్రైనాతి జాకోబును ద్దేశించి అన్నాడు.

జాకోబు గబగబా పుటలు తిరగేసి చదువసాగాడు.

''నా ఆత్మ యీజీవితంతో విసిగిపోయింది. అందుకు బాధ్యత నాదే. నే నెప్పుడూ నా ఆత్మను నిందించుకుంటాను. నన్ను శిక్షించవద్దని దేవుణ్ని ప్రార్థించుతాను. నీ కభిప్రాయ

భేద మెక్కడో ముందే చెప్పమంటాను. నీ చేతుల్తో చేసింది చెడగొట్టడం నీకు న్యాయమేనా అని అడుగుతాను.''

ఇలియా పుస్తకంవేపుచూచి కళ్లు నలుపుకోసాగాడు.

''నీకు దీనియందు విశ్వాస మేర్పడటంలేదు కదూ! బలే చిత్రమైనమనిషివి!'' అన్నాడు జాకోబు.

''దాన్ని విచిత్రమనటానికి వీల్లేదు. అది పిరికితనం. భయమనికూడా అనొచ్చు. భగవంతునిమోల కన్నెత్తి చూట్టానికే వీరికి సాహసంలేదు''అన్నాడు నికిటా నిమ్మళంగా.

పై మాటలని అతడు పైకప్పునుంచి దృష్టిని ఇలియా పైకి మరల్చి తనమాటలతో వానిహృదయాన్ని చీల్చుగోరుతున్నట్టు మళ్ళీ అన్నాడు...... ''ఇదేమిటి! ఇంతకంటె తీవ్రము, స్పష్టమైన సంగతులు యిరవయ్యో అధ్యాయంలో వున్నై. అందులో నీ సత్ప్రవర్తన, అభ్యున్నతులవల్ల భగవంతునికేమీ ప్రయోజనంలే'' దని రాసివుంది. కాని యీ విషయాలు సులభంగా బోధపడవు. బాగా మననం చేస్తేనే అవి గ్రాహ్యమవుతాయి.''

''మీరు వాటి అంతరార్థాలను పూర్తిగా గ్రహించి వుంటారనుకుంటా'' నన్నాడు ఇలియా.

జాకోబు అందుకున్నాడు— ''ఈయన కవన్నీ కొట్టినపిండే.''

''నేను తెలిసికొనేరోజులు గతించాయి. ఇక నేను తెలిసికోవాల్సింది మృత్యురహస్య మొక్కటే. నా కాలు

నరికివేయబడింది; అయినా వాపు పైకెక్కుతూనే వుంది. రెండో కాలుకూడ వాయ నారంభించింది. గుండెకూడ ఉబ్బరింపుగానే వుంది. నే నిక యెన్నాళ్లో జీవించను.” నికిటా నిరాశాభావంతో అన్నాడు.

వానిదీనదృక్కులనుగాంచి ఇలియా జాలిచెందాడు.

నికిటా మళ్ళీ ప్రారంభించాడు.

“నా కిక బ్రతకాలని లేదు. నా జీవితమంతా దుఃఖభాజనమే. సదా వేదన, పరితాపాలకే గురిఅవుతూవచ్చాను. సుఖం నామమాత్రంగానైనా నాకు దర్శన మివ్వనేలేదు. నా తండ్రి జాకోబుజనకునివలెనె క్రూరుడు, దయారహితుడూను. ఒట్టి త్రాగుబోతు; ద్విపాదపశువు. నా తల మూడు సార్లు పగులగొట్టాడు. ఒకపర్యాయం పొంగుతున్ననీళ్లు నా కాళ్ళమీద గుమ్మరించాడు. నా పుట్టుకతోనే నా తల్లి మరణించింది. నా భార్య నా ముఖం చూచి యెరుగదు. ఆమె బలవంతంగా నా కంటగట్టబడింది. పెళ్లయినమూడో నాడే ఆవిడ వురిపెట్టుకుంది. మాఅక్క మొగుడు నా ఆస్తిపాస్తులన్నీ అపహరించాడు. నా భార్య పెళ్లికిపూర్వమే తన హృదయాన్ని మరొకడికి అర్పించుకున్నదట. నాపై నిష్టములేకనే ఆత్మహత్యకుపాల్పడింది. నే నామెను తాకటానికైనా ప్రయత్నించి యెరుగను. అయినాకూడ నా అక్క, యిరుగుపొరుగువాళ్లు ఆవిడమరణానికి నన్నే బాధ్యునిగా యెంచి నానాఅల్లరిచేశారు. తరువాత తొమ్మిదేళ్ళు యొకాకిగానే

వుండిపోయాను. ఆ రోజు లెంత దుఃఖదాయకములు, భయా నకములో చెప్పలేను. నేను ప్రతిదినం సుఖంకోసం ప్రతీ క్షించుతూ వుండేవాణ్ని; కాని, అది లభ్యంకానేలేదు. ఇప్పుడిక్కడ మృత్యుఘడియలు లెక్కపెడుతున్నాను. ఇదే నా జీవితచరిత్ర.'' అని ముగించి నికిటా కళ్లుమూసు కొన్నాడు. ఒక క్షణమాగి ''ఇంకా నే నెందుకు జీవించాలో మీరే చెప్పండి'' అన్నాడు.

వానిజీవితగాథ వినటంతో ఇలియాముఖం వాడి పోయింది. వానికి వొణుకుపుట్టింది. జాకోబు భయంతో గజగజలాడాడు. వానికళ్లనుంచి భాష్పబిందువులు జలజల రాలసాగాయి. మిత్రులిద్దరూ మౌనంవహించారు.

అతడు మళ్లీ సాగించాడు— ''నాజీవితపరమావధి యేమిటా అన్న సమస్య రాత్రింబవళ్ళు నా హృదయంలో కలకవేస్తోంది. దేవుడు నాకు దురన్యాయంచేశాడు. నా కింక జీవించాలన్నఅభిలాష లేదు. ఏమి చెప్పటానికీ మాటలే స్ఫురించటంలేదు. నేను జీవించివుండు టెందుకనే ఆలోచించుతూంటాను.''

అతనిగొంతు గద్గదికమైంది. మరి మాట పెగలటమే కష్టమైంది. అతిప్రయత్నంతో చెప్పాడు— ''ప్రపంచంలో నాఅన్నవాళ్లుంటే బ్రతకడంలో అర్థముంది. ఎందువల్లనంటే, చచ్చినసింహంకంటె ప్రాణంతోవున్నశునకంమేలు. 'సుఖ సమయంలో సంతోషించు, ఆపత్కాలంలో విచారపడు' మని

ఒకచోట రాసివుంది. ఈశ్వరుడే రెండు తర్వాత ఒకటి నుంచటం వల్ల తుదకు మానవుని చేతికి చిక్కేదేమీ వుండదు.''

ఇక వినటానికి ఇలియాకు సాహసం లేకపోయింది. లేచి జాకోబు కరస్పర్శ చేశాడు. దేవునికి చేమోడ్చినట్లు ఆ త్రైనాతికి చేతులుజోడించి అక్కణ్నుంచి కదిలాడు. వానిఅంతరంగం కల్లోలంగావుంది. హృదయంలో మరొక గాయ మేర్పడింది. నికిటా ప్రతిశబ్దం ఇలియా అంతరాళంలో అంకితమైంది. వాటినిగురించే ఆలోచించుతున్నాడు. వాటి భావాన్ని గ్రహించటానికి ప్రయత్నించుతున్నాడు. కొత్త సమస్యలు వానిహృదయంలో తుపాను రేపి ద్వంద్వయుద్ధాన్ని లేవదీశాయి. ఇలియా మరింత కలవరపడ్డాడు.

అంతకుపూర్వం భగవంతుడు మానవులను వారి కర్మానుసారమే శిక్షించుతాడని ఇలియా విశ్వసించేవాడు; కాని, నేడు వానివిశ్వాసానికి ఆఘాతంతగిలింది. అది కూకటివేళ్లతో కదిలింది. నికిటాదీనచరిత్రప్రభావం ఇలియా పైన పనిచేసింది. వానిహృదయంలో పరస్పర విరుద్ధభావనలు రెండు జాగరితమైనై. ఒకటి అగ్నిశిఖలాంటిదైతే రెండోది మంచుగడ్డవంటిది. తన గతజీవితంమీద, సమాజంపైన జుగుప్స కలిగింది. నిత్యము నూతన భావాలు, ఆలోచనలు స్ఫురించుతూండేవి.

ఇలియా పాతభావాలన్నిటినీ త్రోసిరాజని యిక ముందు శాంతిమయము, సుఖప్రదమునైన చక్కని జీవితాన్ని గడపాలని ఆలోచించసాగాడు. ఇకముందెవరినీ కలుసుకోవద్దనుకున్నాడు. గతంలోవలె జీవితాన్ని వెళ్ళబుచ్చటాన్ని తెలివి తక్కువగా భావించాడు.

ఈ ఆలోచనలతోనే యింటికి చేరుకున్నాడు. తిరిగి తిరిగిరావటంవల్ల అలసిపోయాడు. లోపలికి అడుగు పెట్టగానే గృహాయజమాని తటస్థపడ్డాడు.

"మీరు జీవితాన్ని దుర్వ్యయం చేసుకుంటున్నారు. మీకోటియువకులకు వున్నతాశయా లుండాలి. నేను పోలీసు కమీషనరును కాగలపక్షంలో ఇన్స్పెక్టరుగానే వుండు కుండాలి?" అని నికోడిమిచ్ సలహా నిచ్చాడు.

ఇలియా కా దంపతులిద్దరూ సలహాలిస్తూండేవారు. లాసినా వాని బాగోగులనుగూర్చి తెలుసుకోవటంలో చాలా శ్రద్ధ చూపెట్టేది.

"నెల కెన్ని రూపాయలసరకు నమ్ముతున్నావు? ఖర్చులుపోను ఆదా యెంత వస్తోంది?" ఇల్లాంటి ప్రశ్నలడిగేది లాసినా.

లాసినామాట్లాడుతూంటే ఇలియాకు పరమానందంగా వుండేది. ఆమె నేర్పు, వ్యవహారకుశలత, కలుపుగోలుతనం వున్నతవంశసంజాత కుండవలసిన లక్షణాలని లాసినాయం దెంతో గౌరవం కలిగివుండేవాడు.

ఒకనాడు ఇలియా వుదాసీనంగా కిటికీవద్ద కూర్చుండి బజార్లోకి చూస్తున్నాడు. మాటిమాటికి వానికి లీపా జ్ఞప్తికి వస్తోంది. అదేసమయంలో లాసినా వానిని తేనీటి కాహ్వానించింది. ఇలియా కిష్టంలేకపోయినా వెళ్ళకతప్పింది కాదు. వెళ్ళి మెదలకుండాకూచున్నాడు. ఆ దంపతు లేదో గంభీరాలోచనాధీనులై వున్నట్టున్నారు.

లాసినా శాంతిభంగంచేస్తూ "మే మొక వ్యాపారాన్నిగురించి ఆలోచించుతున్నాం. ఆ విషయంలో నీతో కూడ మాట్లాడాలనుకొన్నాము" అన్నది ఇలియాతో.

నికోడిమిచ్ పకపకానవ్వుతున్నాడు. ఇలియా విస్మయంగా అతనివంక చూచాడు.

లాసినా "మీకు సమయాసమయ విచక్షణాజ్ఞానమే లేదు. ఏమిటా నవ్వు?" అని భర్తను కసరుకొన్నది.

"తప్పే, తప్పే." ఇలియావేపు తిరిగి "మే మొక వ్యాపారాన్నిగురించి యోచించాము. బలే వ్యాపారం!" అన్నాడు నికోడిమిచ్.

"మాదగ్గర కొంత డబ్బుంది" అంది లాసినా.

"అవునవును, మేము కొంతమొత్తాన్ని నిల్వచేశాము" ఆమెభర్త అన్నాడు.

"మీరు మాట్లాడకుండావుండలేరూ?" లాసినా విసుక్కుంది. ఇలియాచెవిలో "బ్యాంకులో పదిహేను

వందలు నిల్వచేశాము. సంవత్సరానికి నూటికి నాలుగు రూపాయలవడ్డీ వస్తోంది'' అని వానివంక రెప్పవాల్చకుండ చూస్తోంది.

ఇలియా మౌనంగానే వున్నాడు. వానిహృదయం మాత్రం అల్లకల్లోలంగా వుంది.

లూసినాభర్త బల్లమీదనుద్ది ''ఆమొత్తం చాలదు; అందువల్ల మేము......'' అని చెప్పబోతూంటే ఆమె చుర చుర చూచింది. ఆ భార్యాదాసునినోట మరి మాటరాలా.

''నాలుగురూపాయల వడ్డీకూడ తక్కువలోది కాదు; కాని, మేము నీ మేలునుగురించికూడ ఆలోచించాము. నీవు అభివృద్ధిలోకిరావాలని మా కోరిక. నువ్వు కష్టజీవివి. సమర్థుడివి కూడాను. ఫాన్సీషాపు పెట్టితే నూటికి ఇరవై రూపాయలలాభ ముంటుందని నువ్వే చెప్పావు. గుజిలీలో కొట్టుదారికి, పేరు పడితే అంతకంటె అధికంగాకూడ లాభించవచ్చు. దస్త్రం మాపేర పెట్టి హుండీలు వగైరా మా పేరనే జరిపే పద్ధతిని నువ్వు వ్యాపారం నడుపుతానంటే మాడబ్బు నీ కిచ్చేస్తాం. షాపు మా అజ్మాయిషీలో నడవాలి. లాభాన్ని సమవాటాలుగా పంచుకొందాము. నువ్వు మా కొక ఖరారునామామాత్రం రాసివ్వాలి. నీవు బాగా ఆలోచించుకొని చెప్పు'' మని లూసినా అంది.

ఇలియా ఆవిడమాటలన్నిటికి బుర్రూపుతున్నాడు. మధ్యమధ్య గోడను వేలాడుతున్న క్రీస్తుపటంవంక చూస్తు

న్నాడు. లాసినా ప్రస్తావనలో వాని కాశ్చర్యంకలుగలేదు; గాని, గాబరా, భయమూ కలిగాయి. నేడు తన చిర వాంఛితము ప్రత్యక్షరూపాన్ని దాల్చబోతోందని సంతోషించుటతోపాటు స్థంభితుడయ్యాడు. విచిత్రంగా నవ్వి ఆ సుదతి మోము నవలోకించుతూ "నిజంగా నాభాగ్యదేవత ప్రత్యక్షమవుతోందా!" అనుకున్నాడు.

"అన్ని అంశాలూ సాకల్యంగా ఆలోచించుకో. నీ వా పనిని నిర్వహించగలవో లేదో కూడ యోచించు; ఇంకో విషయం; పెట్టుబడికి మా మొత్తమే చాలదు. కాబట్టి నీవుకూడ మొంత తేగలవో చెప్పు" మని లాసినా తన వాక్చాతుర్యాన్నుపయోగించింది.

"నేను నాలుగైదువందలు తేగల్ను. మా బాబాయి కొంత మొత్త మిస్తానన్నాడని మీ కిదివరకె చెప్పాను. అయిదువందలకుపైగా యిచ్చినా యివ్వొచ్చు"నని ఇలియా వారిపథకానికి తనసుముఖతను తెలిపాడు.

కిరిక్ (నికోడిమిచ్ మరోపేరు) సంతోషంతో కుర్చీలో యెగిరికూచున్నాడు.

"అయితే మాతో జాయింటువ్యాపారానికి సంసిద్ధుడవన్నమాటేగా?" అని లాసినా అడిగింది.

"అవును, నాకిష్టమే."

కిరిక్ వుత్సాహంతో అన్నాడు "ఎందుకు తయారు కావు! లాభసాటి బేరమయ్యో! (రెండుచేతులూ జేబుల్లో

పెట్టి) యివ్వాళ నీకు విందుచేయదలిచాము. శ్రమఅనుకోక బజారుకెళ్ళి ఒకబుడ్డి బ్రాందీ తీసుకొనిరా. నా పేరు చెబితే యే షాపులోనయినా సరే మంచిదే యిస్తారు!''

ఇలియా ఒకసారి ఆ దంపతుల నెగాదిగచూచి దర హాసవదనంతో బజారుకు బయలుదేరాడు. దారిలో మళ్ళీ ఆలోచనలు వానిని చుట్టవేశాయి. తనలో యిలా అను కున్నాడు: "ఇంతవరకు అదృష్టం నాకు ప్రతికూలంగానే వుంది. నన్ను తప్పుదారి కీడ్చి అనేక యిబ్బందులు కలుగ జేసింది; కాని, యిప్పుడది నా కనుకూలంగావున్నట్టు కన్పి స్తోంది. నా బాధలు, వెతలను బాపి సుఖమార్గంలోకి తీసు కొనిపోగోరుతున్నట్టుంది. ఇక నేను వెల్తురు కన్పించి సుఖ ప్రదము, శాంతిదాయకమునైన చక్కనిజీవితాన్ని గడుప గలనని ఆశ కలుగుతోంది. నేనొక ప్రాణాన్ని తీసింది నిజమే; కాని, అందుకుబదులు నేనిక యెందరికి జీవనోపాధి కల్పిస్తాను! ఈ విధంగా బదులు తీరిపోదూ? నా అపరాధాని కిక అంతగా శిక్ష వుండదు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు. నే నా హత్యకు కారణమాత్రుడనని లీపా అన్నది సత్యమే. దానికి కారకుడు పరమేశ్వరుడే. ఆయనే సర్వకార్యనిర్వాహకుడు. ఆ పరమేశ్వరుడే నాకు ప్రాయశ్చిత్తానికి అవకాశంకల్పిస్తు న్నాడు. నేనిక నిర్మలమైన స్వచ్ఛందజీవితాన్ని గడపాలనే భగవదేచ్ఛ.'' ఈ భావనలతో వానిలో విచిత్రసాహస మంకురించినది.

ఈ ఆలోచనలతో ఇలియా బజారుకుపోయి విలువగల మేలురకం బ్రాందీబుడ్డిని కొని తెచ్చాడు.

ఇలియా చేతిలోని బుడ్డిని చూచి కిరిక్ యెగిరిగంతే శాడు. లాసినా మూతిముడుచుకుంది. ఆ సీసా లాక్కొని మార్కు చూచి ఇలియాతో "నువ్వు వట్టి దుబారా మనిషి లాగున్నావు. ఇంత ఖరీదుపెట్టి కొనవచ్చా?" అంది.

ఇలియా ఆవిడ కభిముఖుడై నిలబడి నవ్వుతున్నాడు. "నే నిదివర కెన్నడూ తాగి యెరుగను. ముందుగానే నకిలీ దెందుకు? ఇంతవరకు నేను కృత్రిమ జీవితాన్నే గడుపుతూ వచ్చాను. అందులో సుఖంలేదు, శాంతిలేదు, ఆనందమూ లేదు. అవమానము, అనాదరము, వేదనలే గతజీవితంలో నా సహచరులు. ఇదేనా మానవుడికి రాసిపెట్టివుంది?" అన్నాడు.

వానిహృదయం మళ్లీ వేదనాభరితమైంది. విషాద రేఖలు వానిముఖంమీద తాండవమాడసాగాయి. కళ్ళ ముందు చీకటికమ్మింది. పెద్దగా నిట్టూర్చి అన్నాడు— "నేను బాల్యమాదిగా సత్యపథాన్వేషణలోనే నిమగ్నుడనై వున్నాను; కాని, సుడిగాలి నన్ను గిరగిరాతిప్పి ఊబిలోకి గిరాటువేసింది. నా కెన్నడూ యెక్కడా సుఖశాంతులు లభ్యంకాలా. నా కీ జీవితంలో వేదన, అవమానము, నిరాదరణ, అన్యాయము, మోసము, దోపిడి, విశ్వాసఘాతు

కత్యాలే తప్ప యింకేమీ కనపడలా. శాంతి, ప్రేమలను మొట్టమొదటిసారిగా మీజీవితంలోనే చూడగలిగాను.''

ఈ మాటలని ఇలియా వారివంక చూడసాగాడు. ఆ దంపతులకు ప్రణమిల్లి తిరిగి చెప్పాడు— ''మీ సావాసంతో నా హృదయభారం చాలవరకు తగ్గిపోయింది. మీ సహాయంవల్లనే నాజీవితనావ ఒడుదుడుకుల్లేకుండా ముందుకు సాగిపోగలదు. నాకు వున్నతపథంలో కాంతికిరణం కనుపిస్తోంది. ఇకముందు వున్నతాశయంతోనే కృషిచేస్తాను. ఎవరికీ యెలాంటిచేటు కలిగించబోను. ప్రపంచంలో దీనులు దుఃఖితుల సంఖ్య అధికం. అనుదినము అకారణంగా యెందరు నాశనంకావటంలేదు! ఇదంతా నాకు అనుభవమే.''

పాడుతున్న పిట్టమీద మార్జాలం కన్ను వేసి పొంచి వున్నట్టు ఇంతసేపూ లాసినా ఇలియావంక చూస్తోంది. ఆమె కళ్లు మెరుస్తున్నై. పెదవు లదరుతున్నై.

నికోడిమిచ్ సీసామూతతీసి పానపాత్రలు నింపుటలో నిమగ్నుడై వున్నాడు. లాసినా, ఇలియాలకు చెరివొకటి అందించి తా నొకదాన్ని పెదాలకానించుతూ ''కొత్త కంపెనీకీ జై! కొత్తవ్యాపారం వర్ధిల్లాలి!'' అని జయనాదం చేశాడు.

# 23

ఆ యింట్లో కొన్నాళ్లపాటు జాయింటువ్యాపారాన్ని గురించిన చర్చ సాగుతూండేది. లాసినా తన గతజీవితమంతా ఆ వ్యాపారంలోనే మునిగితేలినట్టు అనేక విషయాలు చెప్తుతూండేది. ఇలియా నాగస్వరం విన్నకోడెతాచువలె తలూపుతూండేవాడు. త్వరలో కొట్టు కుదుర్చుకొని వ్యాపారం ప్రారంభించాలని ఇలియా ఆతురత చెందేవాడు. ఆ వేగిరపాటువల్లనే అతడు వెనక-ముందు లాలోచింపక లాసినా కోరిన నియమాలన్నిటికి ఒప్పుకున్నాడు.

లాసినా అద్దె మాట్లాడి ఒక కొట్టును కుదిర్చింది. అది చిన్నదైనా మంచి గుజిలీలోవుంది. వెనుక వుంటానికి ప్రత్యేకంగా గది వుంది. ఇలియాకా కొట్టు చిరపరిచితమే. అది అతనికి బాగా నచ్చింది.

ఇలియా తాను చేయబోతున్న జాయింటువ్యాపారాన్ని గురించి మిత్రులతో చెప్పాలని హాస్పిటలుకు వెళ్లాడు. పాష్కా అతణ్ని చూడగానే నమస్కారమైనా చేయకుండా "రేపు నే నిక్కణ్ణుంచి వెళ్లిపోతున్నాను. వేరావొద్దనుంచి జాబొచ్చింది. ఆమె దోషమంతా నాపైనే రుద్దింది." అని చెప్పాడు.

ఇలియా మొహంచిట్లించి "జాగ్రత్తగా మాట్లాడు" అన్నాడు.

"నే నొక నిశ్చయానికొచ్చాను. వేరావద్దకు పోయి నన్ను పెళ్ళిచేసుకోమంటాను. ఆమె నిరాకరించుతుంది. అప్పుడు నే నామెగుండెలో బాకుతో పొడుస్తా" నని చెపుతూంటే పాష్కా శరీరం వణికింది.

"బాగా పదనుగలబాకేనా?" ఇలియా హేళన చేశాడు.

"ఇం కెన్నాళ్లోర్వగలను! నే నామె లేనిదే జీవించ లేను. ఆమె అయినా నేను లేకుండా బ్రతకాల్సిన అవసరం లేదు. ఇంతవరకు ఆమె పతితజీవితం గడిపింది. ఇకముందైనా ఆమె ఆ కలుషమార్గంలోనుంచి బయటపడాలి. రేపు అమీ తుమీ తేలిపోతుంది"

'ఈ ఉలిపికట్టె అంతపని చేసినా చేయవచ్చును' కున్నాడు ఇలియా. ఒకక్షణమాగి చిరునవ్వుతో "పాష్కా! తుదకు నా సుఖస్వప్నం ప్రత్యక్షరూపాన్ని దాల్చబోతోంది" అన్నాడు.

తరువాత తన నూతనవ్యాపారాన్ని గురించి సవిస్తరంగా చెప్పాడు.

అంతా విన్న తరువాత పాష్కా ఒక వేడినిట్టూర్పు వదలి "నువ్వు అదృష్టవంతుడివి ఇలియా!" అన్నాడు.

"నీకు ఈర్ష్యగా వుందా?"

"ఎందు కుండదు?"

"నా ఒక్కడి బాగునుగురించి చెప్పటానికి సిగ్గుగానే వుంది."

"భేష్! ఎందుకూ సిగ్గు?"

"నేను చెప్పింది అతిశయోక్తి కాదు. ఎందుకో చెప్పలేను; గాని, సిగ్గుగానే వుంది."

పాష్కా అతనిముఖంలోకిచూచి తలొంచుకొన్నాడు.

"మనం కష్టకాలంలో కలసివున్నట్టే సుఖదినాలు కూడ జతగా గడుపుదా" మన్నాడు ఇలియా.

"నాతోనా? ఒక్క ప్రేయసితో తప్ప మరెవరితోను సుఖానందాలనుభవించటం సంభవంగాదని నావుద్దేశం."

"కావచ్చు; అయినా మనస్నేహం చిరస్థాయిగా వుండాలని నా కోరిక. నీవు కూడ వ్యాపారంలో కృషి చెయ్యాలని కోరుతున్నాను. నువ్వు సుగంధ ద్రవ్యాలబేరం చెయ్యి. అంచనావేసి చెప్పితే పెట్టుబడికి కావలసిన డబ్బు నే నిస్తాను."

పాష్కా పకపకా నవ్వాడు. ఇలియా వాని చెయ్యి పట్టుకొని నొక్కి "నీ కనుమానంగా వుందా? నేను నిజంగానే యివ్వదలచాను" అని చెప్పాడు.

ఇలియా తనకు డబ్బిస్తాడని పాష్కా నమ్మలేక పోయాడు. "అది సంభవమా?" అని సందేహించాడు.

ఇలియా చేతిలోచేయివేసి చెప్పినమీదట పాష్కాకు నమ్మకం కల్గింది. గద్గదకంఠంతో "మిత్రమా! నీకు కృతజ్ఞత నే విధంగా తెలుపగలను! నీవు మునిగిపోతున్న నన్నుద్ధరించాలనుకుంటున్నావు; కాని నేను వ్యాపారం గీపారం చేయ దలచటంలేదు. చేసి లాభంలేదు. నీవు నా కివ్వదలచింది యిచ్చేస్తే వేరాతో యిక్కణ్నుంచి యెక్కడికైనా వెళ్ళిపోతాను. నీకుకూడ మా తగులాటం వదలిపోతుంది. పెద్ద మొత్తంకూడ అవుసరముండదు. నాకూ ఆ విధంగా చేస్తేనే మేలుంది. మరో పట్టణానికి చేరుకొని నౌకరీ చేసుకొంటా" నన్నాడు దీనంగా.

"అల్లాకాదు. నువ్వు శ్రద్ధగా వ్యాపారంచేసి క్రమంగా యజమానివై పదిమందితో పనిచేయించుకోవాలని నా అభిలాష."

"నేనా? యజమానినా? పనివాళ్లతో కలసిమెలసి వుండటం నావల్లనయ్యే పనికాదు. నేను సొంతంగా వ్యాపారాన్ని నిర్వాకం చేస్తానన్నమాట అబద్ధం. నా కా యోగ్యత లేదు. సున్నం పూస్తే కాకి తెలుపవుతుందా?"

పాష్కా వ్యాపారంచేయటాని కేల నిరాకరించుతున్నాడో ఇలియా గ్రహించలేకపోయాడు. ఏదో ఒక విధంగా వాడి నౌకవృత్తిలో దించాలనుకున్నాడు. అయినా అప్పటికిమాత్రం ఆ విషయాన్ని వదలి పాష్కాస్వభావాని

కనుకూలంగా అన్నాడు— "అవున్లే. నీకు రంగుపూసి మార్చటం పనికిమాలినపనే. అసలు నీ రంగె తెలుపాయె! కాకపోతే కాలగతిని యిల్లా అయిపోయావు. పర్వాలేదులే. రేపు వచ్చి పైకం తీసికెళ్లు. నేను జాకోబునుకూడ చూచి వస్తా."

"సరేలే."

"జాకోబుతో సరసంగా మాట్లాడుతున్నావా?"

"ఏదో నీవు చెప్పావని."

"వాడు అదోతరహా మనిషి. వాడితో మనసుకలవటం కష్టమే!"

"వాడి మెదడుకు చెదలుపట్టిందని నా వుద్దేశం."

తర్వాత యిద్దరూ విడిపోయారు. పాష్కా నాలుగడుగులేసి తిరిగి వచ్చి ఇలియాచేతులు పట్టుకొని "నన్ను మర్చిపోకేం? నీకు నా జన్మాంతం కృతజ్ఞుడనై వుంటా" నన్నాడు.

ఇలియా నవ్వి జాకోబువద్దకు వెళ్లాడు.

జాకోబు మంచంమీద పవళించి రెప్పలార్చకుండా పైకప్పును చూస్తున్నాడు. ప్రక్కనేమి జరుగుతున్నదీ వానికి తెలియదు. ఇలియా వచ్చిన అలికిడికూడ వానికి విన్పించనే లేదు.

ఇలియా పల్కరించినమీదట "నికిటాను వేరే వార్డులో చేర్చారు" అని చెప్పాడు.

"మంచిపనే జరిగింది. అతడి మాటలు భయం కల్గిస్తాయి. యిక్కడే వుంటే నిన్ను మరీ పాడుచేసేవాడు."

జాకోబు ఆ మాట మనస్కరించలా. మాట్లాడక వూరుకున్నాడు.

"ఇప్పు డెలాగుంది నీకు?" ఇలియా అడిగాడు.

"ఏం చెప్పను? నేను యిచ్ఛాపూర్వకంగా రోగినై వుండటానికక్కడ వీల్లేదు. నిన్న మా నాన్న వచ్చాడు. ఆయన యీమధ్య యింకోయిల్లు కొన్నాడట. అందులో కూడ హోటలుపెట్టి ఆభారం నానెత్తిని వేయదలిచాడు."

ఇలియా తనభావినిగురించి జాకోబుతో చెబుదామనుకున్నాడు; కాని, మళ్లీ యేంతోచిందో ఆ ప్రసక్తి తేనేలేదు. సూర్యుని స్వర్ణకిరణాలు కిటికీగుండా లోపలికొచ్చి హాస్పిటలు గోడలరంగును కాంతివంతంచేస్తున్నై. ఆ కాంతి గోడల జీర్ణావస్థను మరింత స్పష్టంచేస్తోంది. యెదురుగా కుంటివాళ్లిద్దరు పేకాడుతున్నారు. బక్కపల్చని మనిషొకడు పచారు చేస్తున్నాడు. జాకోబుముఖం కళావిహీనంగా వుంది.

"నేను చచ్చిపోయినా బాగుండును. ఇక్కడ పడుకొని చావెంత సుఖదాయకమని ఆలోచించుతున్నాను. ఈ నికృష్టజీవితంకంటె అదే మేలు! శాంతి-విశ్రాంతులకు కొదవవుండదు. (ఇక్కడ జాకోబుస్వరం మందగించింది) స్వర్గంలో అంతా వెల్తురే. దేవతలు దయాస్వరూపులు. అన్ని

సంగతులు తెలియజేస్తాడు'' అని చెప్పి ఆగాడు. వాని కళ్లు మూతపడినై.

"స్వర్గాన్ని గురించి నీకు తెలుసా?'' అనడిగాడు ఇలియా.

జాకోబు విన్పించుకోకుండా "మాషా ఆచూకీ యేమైనా తెలిసిందా?'' అన్నాడు.

"తెలియలా.''

"ఆమెజాడ తెలుసుకొని కలుసుకోవాల్సింది.''

"నాకు కల్సుకోవాలని లేదు.''

"స్నేహితురాలిని చూడాలని లేదూ?''

ఇలియా సిగ్గుపడ్డాడు. పక్కమీద అటూ యిటూ దొర్లుతున్న జాకోబు "నికిటాకి చావాలని లేదు; కాని, అతనిక బ్రతికే ఆశలేదు. డాక్టరింతకుముందే నాతో చెప్పిపోయాడు. మృత్యుదేవతని కౌగలించుకుందామనుకున్నా అది నా దాపుకే రావటంలేదు. కోలుకున్న దర్మిలా నేను మళ్లీ ఆ నరకతుల్యమైన హోటలుకే పోవాలి. గత్యంతరం లేక నేను మళ్లీ తాగుడు ప్రారంభించాల్సివస్తుంది. తర్వాత సర్వనాశనమే నాకు గతి'' అని వేదనాపూర్వకంగా చెప్పాడు. కొంచెమాగి "ఈ లౌకికసమాజంలో జనసామాన్యంకోసరేదికాక, విశిష్టజీవితం గడపాలంటే ఉక్కుశరీరము, రాతిగుండె వుండాలి; లేదా అసలు హృదయమే లేకుండాలి'' అన్నాడు.

ఈ గొడవతో ఇలియా విసుగు చెందాడు.

"నా స్థితి రాళ్లమధ్యనున్న అద్దంలాగుంది. ఏరాయి కదిలినా పప్పు-పప్పయి పోతున్నా" నని జాకోబు మళ్ళీ అన్నాడు.

"నీ కెప్పుడూ మొర పెట్టుకోవటంలోనే ఆనంద మున్నట్టుంది."

"మరి నీకో?"

ఇలియా పెడమొగం పెట్టి మౌనంవహించాడు. జాకోబుకూడ మిన్నకుండడం చూచి "యిందులో యెవరికీ సుఖం లేదు. మనందరిస్థితీ అధ్వాన్నంగానే వుంది. పాష్కానే చూడు!" అన్నాడు.

"వాడిపేరు వింటేనే నాకు రోత."

"కారణం?"

"ఏమో! కారణం చెప్పలేను."

"నాకు పాష్కాయం దభిమానమే."

"మంచిదేగా!"

"ఇక వెళ్తా" నని ఇలియా లేచి నిలబడ్డాడు. జాకోబు కరస్పర్శచేస్తూ "దేవుడు నీకు మేలుచేస్తాడు; మాపా యోగ-క్షేమాలు తెలుసుకొంటూండు" అన్నాడు దీనంగా.

"సరే లె" మ్మని ఇలియా బయల్దేరాడు.

వచ్చేటప్పు డున్న సంతోషం ఇలియా కిప్పుడు లేదు. జాకోబుతోడి సంభాషణతో వానివుల్లాస మదృశ్యమయింది.

హాస్పిటలు గేటు దాటినతర్వాత మాత్రం కొంత శాంతి కలిగింది. మాషావిషయంలో తన అలక్ష్యాన్ని తలచుకొని సిగ్గుపడ్డాడు. మాషాకి మనువు కుదిర్చింది మతిస్సాయే. ఆమె కన్నివివరాలు తెలిసివుంటై. కాబట్టి మతిస్సాద్వారా మాషా మంచి – చెడ్డలు తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు.

## 24

మతిస్సా యథాప్రకారం పెట్రుహాకొంపలోనే అద్దె కుంటోంది. ఇలియా ఆమెనుకలుసుకోటానికి బయల్దేరాడు. నడుస్తూంటే గతవిషయాలన్నీ స్మృతిపథంలోకివచ్చి పరుగు తీస్తున్నై. స్మృతిచిత్రాలతరుములాటలో ఇలియా గమ్య స్థానాన్ని దాటిపోయాడు. పొరపాటును తెలిసికొన్నప్పుడు టక్కున ఆగాడు; కాని, వెనుదిరిగి పెట్రుహా యింటికి వెళ్ళ డానికి యిష్టంలేకపోయింది. సరాసరి ముందుకే సాగిపోయాడు. సంధ్యారుణకాంతులు మనోజ్ఞమై ఆహ్లాదాన్ని కల్గిస్తున్నై. ఎదుట విశాలమైన బయలుంది. ఇలియా తిన్నగా వెడుతూనే వున్నాడు. ఒకసారి తన వుజ్వలభావి నూహించుకున్నాడు. తనకు వుచ్ఛస్థితి కలిగిన తర్వాత పెట్రుహాతలదన్నవచ్చును కున్నాడు. మళ్లీ అంతలోనే తాను పెట్రుహాను జయించి

నట్టూ, వాడు తలవంచి ప్రాధేయపడుతున్నట్టూ, తను జాలిపడుతూ 'యింతవరకు నువ్వెవరి కొరకైనా జాలిపడ్డావా అనీ, కన్నకొడుకును దుర వస్థలపాలు జేసి యేం బావుకుంటావనీ, నా పినతండ్రి అధోగతికి కారకుడివి నువ్వేకదా అనీ, నీ కొంపలో యెవరూ సుఖపడలేదనీ, అక్కడ వలపన్ని వుంచావనీ, అటువచ్చినవా డందులో చిక్కుకుంటాడనీ' చెపుతున్నట్టుగా భావించుకున్నాడు.

పెట్రుహా తన్ను దీనంగా ప్రార్థించుతూంటే తాను కోపంతో మండిపడుతూ 'నీ కొంప విషపూరితం; దానికి నిప్పంటించి మసిచేస్తా. నీవల్ల నాశనమైనవాళ్ళవాకిళ్ళ ముందు నిలబడి క్షమాపణకోరుకుంటూ, నీ పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకుంటూ చావు' మని అంటున్నట్టు ఇలియాకు మరో తలంపు కలిగింది.

చీకటి పడబోతోంది. నిశాదేవి తన మసకదుప్పటి నెల్లెడల కప్పివేసింది. గబ్బిలాలు కీచుకీచుమని అరుస్తున్నై. అంధకారం క్షణక్షణము దట్టమవుతోంది. నదిలో పల్లెకార్లు గడలువేసినధ్వని పిట్టలు రెక్కల్ని రెపరెపలాడించుతూన్నట్టుగా వినవస్తోంది. ఇలియా తనపతనానికికారణ భూతులైనవారందరిపేర్లు జ్ఞాపకంవచ్చి వారిపైన పగ తీర్చుకోవాలని సంకల్పించుకున్నాడు. ఈ నిశ్చయంతో వానికి కొంత శాంతికలిగింది. వాడా నిస్తబ్ధాంధకారంలో కూనరాగం తీయసాగాడు.

అప్పుడు కుళ్లిన చెత్తలోంచి వచ్చే గాలి వాని ముక్కు పుటాల్లో ప్రవేశించింది. ఆలాపన ఆగిపోయింది. ఆ కంపు వానికి వృద్ధజర్మియా వెంట తిరిగి ముక్కు-చెక్కు లేరిన దినాలను స్మృతికి తెచ్చింది. అప్పుడీ గాలి యింత తీవ్రంగా తోచేది కాదు. జర్మియాతో కలసి విశ్రమించిన తావును కనుక్కునేందుకు ఆ చీకట్లోనే దృష్టిని దౌడాయించాడు; కాని అంతుచిక్కలా. ఇప్పుడది చెత్తపోగుల్లో అదృశ్యమై పోయింది.

ఇలియాకి అప్పుడాకస్మికంగా పోలటోవ్ హత్య జ్ఞాపకమొచ్చింది. ఆ హత్య చేసేవుండకపోతే తనజీవితం సుఖవంతంగా వుండివుండేదని స్ఫురించింది. మళ్లీ అంతలోనే 'నువ్వే పాపమూ చేయలా. అదొక దురదృష్టసంఘటన మాత్రమే' నని చెవిలో యెవరో చెపుతున్నట్టనిపించింది.

అదే సమయంలో కుంయ్‌కుంయ్‌మంటూ నక్కొకటి వానిపక్కగా పరుగుతీసింది. ఇలియా త్రుళ్లిపడ్డాడు. నిశాదేవే ఆ రూపంలో గుర్రుమంటూ వచ్చి అంతర్ధానమైనట్టు తలిచాడు.

పోలటోవ్‌ను చంపియుండకపోయినా తనజీవితంలో శాంతి వుండేదికాదనుకున్నాడు మళ్ళీని. 'రాత్రింబగళ్లు ఒకేరీతిని అవమానంజరుగుతూండె! ఒకసారి హృదయానికి దెబ్బతగిల్తే అది యికనెప్పుడూ బాధించుతూనే వుంటుం' దనుకున్నాడు.

అడుగులోఅడు గేసుకుంటూ ముందుకు సాగిపోతు న్నాడు. పెంటకుప్పల్లో, కశ్మలంలో కాలు బెసుకుతోంది. కొంతదూరంవెళ్ళినాక శుభ్రమైనజాగా కన్పించింది. ఇలియా చతికిలబడికూచున్నాడు. నదీప్రవాహం మక్కడి కెంతో దూరంలేదు. అందులో పడవలు నడుస్తున్నధ్వని, పల్లెకార్ల కేకలు వినపడుతున్నై. యెదుటిమైదానంకూడ నిశ్చలనదీ ప్రవాహాన్నే పోలివుంది. చెత్తా-చెదారం మురికాల్వలో పారుతున్నమురుగునీటి కడ్డుపడి ఢీకొంటోంది.

''ఇంతకుముందు యెంతో వుల్లాసంగా వుంది. హృదయం తేలిగ్గావుంది. ఇంతలోనే ఆ హుషారు పోయి యీ వేదనాపూర్వక భావతరంగాలేమిటి? మానవుడు తన కిష్టంలేనిమార్గంలోకి నెట్టబడుతున్నాడు. జీవితంయావత్తు అన్యాయ-అసమానత్వాలతో నిండివుంది. 'తన్ను తాను తెల్సుకోవా'లన్న జాకోబుమాటల్లోకూడ సత్యముంది; అయితే యితరులను అవగాహనచేసికోవాల్సిన అవుసరం కూడా వుంది. చుట్టుప్రక్కలవాళ్లెల్లా వుంటున్నారు? వాళ్లు పాటించుతూన్న నియమాలేమిటి- మొదలైనవన్నీ తెలుసు కొనితీరాలి.'' అనుకున్నంతలో మరోభావతరంగం లేచింది. జాకో బానాడు తనతో వుదాసీనంగా మాట్లాడినసంగతి తలపుకొచ్చి మరింత ఖిన్నుడయ్యాడు. ఏదో చప్పుడుకాగా తలెత్తిచూచాడు. మింట చుక్కలు కనపడుతున్నై. జాబిల్లి చెట్లపైకి లేస్తోంది. ఆ గుడ్డివెన్నెల మసకచీకట్లో గబ్బిలాలు

లేచి యెగురుతున్నట్టు ఇలియూష హృదంతరాళంలో ప్రయో జనంలేని భావాలెన్నో లేచి అంతర్ధానమవుతున్నై. వాటి వెనుకనే అంధకారం వానిహృదయంలో రాజ్యాన్ని స్థాపించు కుంటోంది. "ఒకడు మరొకడిని దోచుకుంటున్నాడు; పీడించుతున్నాడు; యేడ్పించుతున్నాడు; చంపివేస్తున్నాడు. ఎవనికీ యింకొకని పొత్తు గిట్టదు. అందరికి దూరంగా వుండాలనుకుంటాడు. మరి వానికి శాంతి యెల్లా లభిస్తుంది? నేనూ అదేవిధంగా ఒకమూల పాకులాడుతున్నాను. ప్రపంచంలో వాస్తవమైనదీ, నిర్వివాదమైందీ యేది?" అని ఇలియూష మనసులో వితర్కించుకున్నాడు.

వాడదేవిధంగా కొంతసేపటివరకు వ్యూహోతరంగాల్లో తేలియాడుతున్నాడు. ఒకసారి మైదానంలోకి, మరొకతడవ ఆకాశంవేపు చూస్తున్నాడు. అన్నివేపులా నిశ్శబ్దంగావుంది. వెన్నెలరేడు తన సైనికులనే కిరణజాలాన్ని పంపి అంధ కారాన్ని తరిమితరిమికొట్టి తన రాజ్యాన్ని విస్తరింపజేసు కుంటున్నాడు. పొదలు, చెట్లఛాయలు, భూమీ భయంకరా కృతులుగా కనబడుతున్నై. చలితీవ్రత హెచ్చుతోంది. ఇలియూష లేచి నగరాభిముఖంగా నడకసాగించాడు. అప్పుడు వానిహృదయం వికలమైవుంది.

ఇలియూష యింటికిచేరేసరికి చాలా ప్రొద్దుపోయింది. గడపలో నిలబడి తలుపుతట్టుదామా వద్దా అని తటపటా యించాడు. ఇంట్లో వెల్తురున్నట్టులేదు. అందరూ నిద్రించి

వుంటారని తలిచాడు: అతడెప్పుడువచ్చినా లాసినాయే తలుపుతీసేది. ప్రొద్దుపోయినతర్వాత యిప్పు డామెను మేల్కొల్పటం భావ్యంకాదనుకున్నాడు; కాని, అంత రాత్రి వేళ పీక్కుతినేచలిలో తలదాచుకునే దెక్కడ? తప్పనిసరిమై మెల్లగా గొలుసులాగాడు. వెంటనే తలుపు తెరువబడింది. మల్లెపువ్వంటి తెల్లబట్ట చుట్టుకొని లా సి నా యెదురుగా నిలబడుంది. "త్వరగా తలుపువేసెయ్యి. నేను పడుకుందామని దుస్తులుమార్చి గుడ్డ చుట్టుకున్నాను. ఈదురుగాలికూడ వేస్తోంది. ఆయన క్యాంపుకెళ్ళారుకూడాను" అని ఇలియాను త్వరపెట్టింది.

"సరే, అల్లాగేలెండి."

"ఇంతసేపెక్కడున్నావు?"

ఇలియా తలుపుగెడవేశాడు. ఆమెకు జవాబిచ్చేందుకు వెనక్కితిరిగాడు. లా సి నా వానిముందు నిటారుగా నుంచోనుంది. దారిలోనుంచి తొలగకపోగా యింకా ముందుకువస్తోంది. వెనక ద్వారం-ముందు లాసినా, యెటు తప్పుకుంటానికీ వీల్లేదు. లాసినా నవ్వుతోంది. ఆ నవ్వులో మాధుర్యముంది. ఇలియా ఆమెచూపులో చూపు కలిపాడు. వ్యవహారం వాటంగావున్నట్టు గ్రహించి ఆ కులుకులాడిమెడకు చేతులువెనవేశాడు. లాసినాకూడ వాని యెదపైన వాలింది.

"నువ్వింత రాత్రివేళ యెక్కడెక్కడో తిరుగుతా

వెందుకు? నాణ్యమైన సరుకు యింట్లోనే వుందిగా!'' అంది లాసినా ఇలియాను ముద్దాడుతూ.

ఇద్దరూ కండకావరంతోవున్న యువతీ-యువకులు. మోహాంధులై కామపిపాసనార్పుకుంటూ గడిపారు ఆ రాత్రంతా.

ఇలియా హృదయాన తాను రాత్రిచేసినపనికి పస్తాయించాడు. "నే నిక వీరి మొహాలు చూచేదెల్లా? స్నేహితునిలా నటించి నికోడిమిచ్‌కి విశ్వాసఘాతం చేశాను. అతడిప్పుడు కాకపోయినా నెమ్మదిమీద తనభార్యజారత్వాన్ని గ్రహించకపోడు. అప్పుడు నాగతి యేమవుతుంది? ఈ దుశ్శీల నాకు దాపురించిందేం? నా కెన్నడూ అల్లాంటి తలంపే లేదే!'' అనుకున్నప్పుడు ఇలియా తనప్రవర్తనకు తానే లజ్జపడ్డాడు. లాసినా బజారులంజ కాదనీ, అభిజాతయనీ, సుందరాంగియైన సంసారిణి తనకు పాల్పడిందనీ తలచుకున్నప్పుడు వాని కానందమే కల్గింది. పోలీసు యిన్స్పెక్టరుఅర్ధాంగి తన్ను కామించటం సామాన్యంకాదనుకున్నాడు. తనలో యేదో ప్రత్యేకత వుండబట్టే ఆ తరుణి తన్నువలచిందని తలచుకొన్నప్పుడు హర్షాతిరేకంచే ఇలియాకళ్లు జిగాలుమన్నై. 'నేను చేసింది తప్పే; కాని, చేయగల దేముంది? వడ్డించిన విస్తరిని వద్దని త్రోసివేయగలవాడెవ'డని తనచెయిదాన్ని సమర్ధించుకున్నాడు.

"ఇప్పటివరకు నా కిల్లాంటి ఆలింగనసౌఖ్యంగాని, ముద్దులమాధుర్యంగాని లభించనే లేదు. ఈమె పొందువల్ల నాకు లాభంకూడ వుంటుంది. నన్ను ప్రేమిస్తోంది కాబట్టి, నా మేలునే కోరుతుంది" అనుకున్న మరుక్షణంలోనె అందుకు ప్రతికూలభావంకూడ కలిగింది. "నేను మళ్లీ యీ కొత్త పితలాటకంలో చిక్కుకున్నానే! నే నీమె వల్లో పడాల్సింది కాదు. ఈమెనింతవరకు హృదయ పూర్వకంగా గౌరవ భావంతో చూస్తూవచ్చాను. నా మనసులో యెన్నడూ దురాలోచన కలుగనేలేదు; అయినా తుదకు పర్యవసాన మిల్లా తేలింది."

ఆ నాడుదయం చాల ప్రొద్దెక్కేవరకు ఇలియా పక్కమీాద పడుకొనేవున్నాడు. "లాసినా! మాంసం కమ్మగా వుండాలి సుమా! బాగా నేతితో వేల్చు" మని నికోడిమిచ్ భార్యతో చెప్పడం పడుకొనివుండే విన్నాడు.

"వెళ్ధురూ, మీా రుచి నాకు తెలియదా?" అంటోంది లాసినా.

నికోడిమిచ్ పోతూపోతూ 'ప్చ్' అని ముద్దుపెట్టుకోవటం కూడ ఇలియా ఆలకించాడు.

భర్త వెళ్లగానే తలుపుబిగించి లాసినా ఇలియా గదిలో దూరబడింది. పక్కమీాదపడుకొనివున్న ఇలియా సరసనె ఒరిగి లాసినా యెదగొడ్డులా "లేలే, త్వరగా కానీ" మ్మని వానికి చక్కలిగిలి పెట్టసాగింది.

"ఇప్పుడేగా నీ మొగుడు ముద్దులాడింది!" అన్నాడు ఇలియూ.

"అయితే ఏం? నీ కీర్ష్యగా వుందా? అదీ మంచిదే. ఈర్ష్యకలవాళ్లే బాగా ప్రేమించగల్గుతారు" అంది ఆ సిగ్గు లేని శిఖండి.

"నే నీర్ష్యతో అనలా......" లాసినా వాని నా పైన మాట్లాడనివ్వలా.

ఇలియూ ఆమె నాలింగన–చుంబనాదులచే తృప్తిపర్చి నవ్వుతూ అన్నాడు—"నువ్వు బలే జాణవి! పతివుండగా పరకూటమి కెవ రిల్లా సాహసించుతారు?"

కోపంతో లాసినాకళ్ళు ప్రజ్వలించినై. "నువ్వు శుద్ధ మూర్ఖుడివి. నీ కేం తెలుసు? ఈ విధంగా ప్రేమవిహారం చేయని దెవతె? అనాకారిస్త్రీలను మినహాయిస్తే అంతా యీ వ్యాపారంలో దిగేవాళ్లే"నంది సగర్వంగా.

లాసినా ఆ నాటి పగలంతా స్త్రీ లేవిధంగా భర్తల కనుబ్రామి స్వైరవిహారంచేస్తారో వివరించి చెపుతూనేవుంది. ఆమె తనకున్న వాటిలో విలువైనవలువ ధరించి సువాసనలు విరజిమ్ముతూ, సరస–సల్లాపాలతో ఇలియూ కి మైమరపు కలిగించింది. సాయంత్రం మాంసం వేపుడు వేసివచ్చి ఇలియూ ప్రక్కలో కూచుని యిల్లా చెప్పింది—"స్త్రీ పతి ఒక్కని తోనే సంతృప్తిపడుతుందని తలుస్తున్నావా? ఒక్కొక్కప్పుడు భర్త లెందుకూపనికిరాని దద్దమ్మలవుతారు. వాళ్ళ భార్యల

నిర్మలప్రేమనే లక్ష్యపెట్టరు. ఏ కాంతో కన్నుగిలిపితే చాలు' జర్రున జారిపోతూరుకుంటారు. అదీకాక, యే స్త్రీ మాత్రం ఆజన్మాంతం పతినే ఆరాధించుతూ యేం సుఖపడుతుంది? పరపురుషుల్తో సయ్యాటలాడుతూంటే కలిగే ఆనందమే ఆనందం! ఆ విధంగా వివిధజాతులపురుషులస్వభావాలు పరిచయమై కావలసినంతఅనుభవము గడించవచ్చు. నిత్యము ఒకేకూర రుచించుతుందీ? మనస్సు విరక్తి చెందకుండా యెల్లా వుంటుందో చెప్పు? జిహ్వాని తృప్తిపర్చటానికి దినదినము వేర్వేరుపక్వా లవసరమైనట్టే మానసికసంతృప్తికి రకరకాల మగవాళ్ళపొందుకూడ ముఖ్యమే.''

ఇలియా ఆ మెహమాటల్ని ధ్యానంతో వింటున్నాడు. లాసినావాదనతో ఒక్కొక్కప్పుడు వానిమనసు చివుక్కుమంటోంది. ఆ ధోరణి వానికి రోతకలిగించింది. 'లీసా పడుపువృత్తిలో వున్నా యింతగా సిగ్గు-బిడియాలువిడిచి బరితెగి మాట్లాడేది కాదే!' అనుకున్నాడు. మారు చెప్పటానికి యేమీ తోచలా. నవ్వి "నీ జీవితంలోకూడ యిల్లా జరుగుతుందని నేను కలనైనా తలచలేదు సుమా!'' అని వూరుకున్నాడు.

"జీవితక్రమం అన్నియెడల అందరిపట్ల ఒకేరీతిగా వుంటుంది. ఆ క్రమము మానవులు యేర్పరచుకున్నదే. మానవులందరూ సుఖజీవితం గడపాలనే కోరుతారు. ప్రతి వ్యక్తీ శాంతియుతంగా, సంతుష్టాంతరంగుడై ఆనందమయ

జీవితాన్ని గడపాలని వాంఛిస్తాడు. అయితే అందుకు పుష్కలంగా డబ్బుండాలి. 'ధనమూల మిదంజగత్' అన్నట్టు అన్నిటికి దుడ్డే ప్రధానం. ధనార్జన కున్నవి మూడేమార్గాలు. పూర్వార్జిత ఆస్తి వుండాలి; లేక అదృష్టవశాత్తు జేవార్సు ఆస్తి రావాలి; లేదా కష్టపడి కూడబెట్టాలి. లాటరీ పిచ్చి వున్నవాళ్ళు అదృష్టాన్నే నమ్ముకుంటారు. స్త్రీకి రూపమే అదృష్టం. అందమైన ఆడుదానికి అన్నీ అరచేతిలో వున్నట్టే. ఏ ఆధారమూ లేని వాళ్లు రెక్కలు ముక్కలు చేసుకోవాలి. జీవితంపొడుగునా సంపాదించుతూ వెళ్ళబుచ్చటం తెలివి మాలినపని. నా అదృష్టానికి రెండు బీగాలున్నై. నే నా రెండింటిని మన వ్యాపారంలో ప్రియోగించదలిచాను; కాని, అంతటితోనే నాకు తృప్తిలేదు. కేవల మాయన ఒక్కని వల్లనే నా కానందం కలుగదు. నే నెవర్నీ ప్రేమించలా. కాబట్టే నీకు పాలుపడ్డా'' నని చెప్పి లాసినా ఒకక్షణమాగి ఇలియా నడిగింది— ''ఎందుకల్లా మిరిమిరిచూస్తావు? నా మాటలు బాగా లేవా?''

ఇలియా గదిద్వారంలో నిలబడి కనుబొమలు ముడిచి లాసినావంక చూస్తున్నాడు. లాసినా లేచెళ్లి రెండు చేతులూ వానిమెడకు లంకెవేసి ఇలియాకళ్లలోకి చూడ సాగింది. ఇలియా ఆమెనుముద్దెట్టుకొని కావిలించుకున్నాడు.

లాసినా కిలకిలనవ్వి ''నీ హృదయమెంత మెత్తనిది!'' అంది.

"నువ్వు చెప్పినదంతా నిజమే కావచ్చు; కాని, అవి నోటితో వుచ్ఛరింపతగ్గమాటలు కావని నా వుద్దేశ" మన్నాడు ఇలియా.

"చిత్రమైన మనిషివి! అందులో యేది బాగుండ లేదో చెప్పు."

ఇలియాకి జవాబు స్ఫురించలా. ఆవిడ చెప్పినదాన్లో తా నసభ్యంగా భావించినదేదో వివరించలేకపోయాడు. లీపా యీాబిడకంటె జోరుగానే కబుర్లు చెప్పేది; కాని, ఆమె మాటలు వానికెప్పుడూ యింతగా రోతకల్గించలా. ఆ నా డంతా వాడు తన యీా నూతనసంపర్కం భావిలో యెల్లా పరిణమిస్తుందోననే ఆలోచించాడు; కాని, యేమీా నిశ్చయించుకోలేకపోయాడు.

డ్యూటీనుంచి తిరిగివచ్చి నికోడిమిచ్ భోజనానికి కూచునేముందు "ఇలియా! నా భార్య నెంతని ప్రశంసించను! మాంసం యెంత బాగా వండిందనుకున్నావ్! నోరూరుతోంది. వారెవా! కాళ్లూ చేతులూ కడుక్కొని రా; నువ్వుకూడ రుచిచూద్దువుగాని" అని ఆహ్వానించాడు.

ఇలియా అపరాధివలె బిత్తరపోతూ లేని నవ్వు తెచ్చుకొని "కృతజ్ఞతావందనాలు. మీా రెంత వుదారులు!" అని నిట్టూర్చాడు.

"ఏమిటీ! ఇంత మాత్రానికేనా! నేను పోలీసు కమీాషనరునయితే చూచేవాడివి! కాని, నా కా అదృష్టం

లేదు. నే నీ నౌకరీకూడ వదిలెయ్యాలనుకుంటున్నాను. ఏ కంపెనీలోనో మేనేజరుగా చేరిపోతాను. దీనికంటె అదే నయం'' అన్నాడు నికోడిమిచ్.

లాసినా వంటగదిలో కూనరాగంతీస్తోంది. ఆమె భర్తనుచూచి ఇలియా విచిత్రమైన అలజడిపడుతున్నాడు. అయితే కాస్సేపటికి కుదుటపడ్డాడు.

రోజులుగడుస్తున్నకొద్దీ ఇలియా ఆ వేగం అణగిపోయింది. కొత్తవ్యాపారాన్నిగూర్చిన ఆలోచనతో అది అడుగునపడింది. ఇలియా లాసినాప్రేమవాహినిలో బుటకలు వేస్తున్నాడు. వాని కదివర కామెయందున్న గౌరవభావం మాసిపోయింది. ఇద్దరూ ప్రేయసీప్రియులయ్యారు; కాని, ఇలియా నపుడపుడు అజ్ఞాతభయ మేదో పీడించుతూండేది. లాసినా భర్తను సాగనంపుతూనే వచ్చి ఇలియాతో సరససల్లాపాలు సాగించేది. ఆమె నిత్యము వానికి మానవజీవితంలోని అనేక వాస్తవికసంఘటనలను చెపుతూండేది. అవి అతి సరళంగావుండేవి. ఆ ఘటనలు కేవలము కామపిపాసుల కావాసంగావున్న దేశంలో మాత్రమే జరిగివుంటాయని ఇలియా తలిచేవాడు. వాని కామెమాటలయందు విశ్వాసం కలిగేదికాదు. ఊఁకొట్టి వూరుకునేవాడు. ఒకపర్యాయం "నువ్వు చెప్పేవన్నీ నిజమేనా?'' అని సందేహం వెలిబుచ్చాడు.

ఆమె ఫక్కున నవ్వింది. తాను చెప్పినది నిజమేనని సమర్థించటానికి పూనుకుంది.

"ఉదాహరణకు యేఅధికారినో తీసుకో. అధికారి తన సహోద్యోగిసతిపైన కన్నువేస్తాడు. ఆ సహోద్యోగి తన గుమాస్తాభార్యని చేరదీస్తాడు. గుమాస్తా బంట్రోతు పెళ్ళాన్ని వుంచుకుంటాడు. ఎక్కడచూచినా యిదేతంతు."

లాసినా యిల్లాగే విసుగూ-విరామం లేకుండా చెప్తూం డేది. శ్రీమంతు లేవిధంగా పేదకన్యల్ని కొని వాళ్ళ సర్వనాశనంచేసేదీ, భ్రూణహత్యలకు నిర్బంధించేదీ, ఆభోగ పరాయణులభార్యలే, విధవకన్యలే నౌకర్లు, జవాన్లతో కూడిచరించేదీ, పశువులపాకల్లో, మరుగుదొడ్లలో కోడె కాండ్రితో సరాగాలుసాగించేదీ వర్ణించుతూం డేది.

ఇవన్నీ వింటూంటే ఇలియూ కీ జీవిత మొక మురికి గుంటగాను, మానవు డందలి క్రిమిగాను తోచేది. "ఈ ప్రపంచంలో మంచిదనేది, పవిత్రమైనదీ లేనేలేదా?" అని ఒకసారి లాసినా నడిగాడు.

లాసినా ఆశ్చర్యపడి "ఇంతకూ నీ వుద్దేశ మేమిటి? నేను చెప్పినది నిత్యము మన కళ్ళముందు జరుగుతున్నదే. ఇందులో నా కల్పితమేమీ లేదే" అంది.

"నా అభిప్రాయ మదికాదు లాసినా! నే నింతకంటె పవిత్ర విషయాలను వినాలని అడుగుతున్నాను."

లాసినాకి వానిపుద్దేశం బోధపడలా. నవ్వి వూరుకుంది.

ఆమె అపుడపుడు "నీకు తొలిసారి రతిసుఖం లభించిం దెవరివద్ద?" అని ఇలియా నడుగుతుండేది. ఇలియా సిగ్గుతో తలొంచుకునేవాడు. వాని కసహ్యంగావుండేది. అల్లాం టప్పుడు దృష్టిని పక్కకుమరల్చి "ఏమి టీ అసభ్యపు కూతలు? నీబోటివిద్యావతినోటితో అడుగతగ్గ మాటేనా?" అని ముఖంచిట్లించేవాడు.

అంతటితో ఆమె విడిచిపెట్టేది కాదు. మళ్లీ మళ్లీ అడుగుతూనే వుండేది. ఆ ప్రసక్తితో ఇలియా కమితవేదన కలిగేది. అది గ్రహించి లాసినా వెంటనే చేజేతలా వాని కామతృష్ణను రేకెత్తించేది. ఇలియా యిక నా విషయాన్నే విస్మరించేవాడు.

ఒకరోజున ఇలియా బజారునుంచి తిరిగివచ్చేసరికి మతిస్సా లాసినాతో మాట్లాడుతోంది. ఆమె నక్కడ చూచి ఇలియా విస్తుపోయాడు. లోపలికి అడుగుపెట్టాండ గానే "ఈమె మధ్యాహ్నంనుంచి నీకోసం యెదురుచూస్తోం" దని లాసినా చెప్పింది.

"కులాసాగా వున్నావా?" అని ఇలియా మతిస్సాని పలకరించాడు.

"యముడుకూడ నన్ను మరిచిపోయాడుగా" అంది మతిస్సా.

చాలారోజులనుంచి ఇలియా పెట్రువిచ్ హాటలువేపు కే పోలా. ఇంతకాలానికి పరిచితురాలొకతె కనపడినందుకు వాడు సంతోషించాడు. ఆమెదుస్తులు చిరిగివున్నై. కాళ్లకు జోడయినా లేదు. మతిస్సా చాల చిక్కిపోయింది. మెల్లగా లేచి ఇలియాగదిలోకి వెళ్ళింది. కుర్చీలోకూలబడి బొంగురు గొంతుతో యిల్లా చెప్పింది. "నాకు రోజులుదాపురించు తున్నై. కాళ్ళలో సత్తువ క్షీణించింది. ఇక పట్టుతప్పిపో వచ్చు. అప్పు డాకలితోమాడి చచ్చిపోతాను."

మతిస్సాముఖం వుబ్బరింపుగా వుంది. ఒళ్ళంతటా మచ్చ లున్నై. కళ్లు చెట్టుతొర్రలోవున్న పిట్టల గుడ్లున్న ట్టున్నై. ఇలియా రెప్ప వాల్చకుండ ఆమెవంక చూస్తు న్నాడు. మతిస్సా మళ్లీ అంది— "ఎందు కల్లా మిరిమిరి చూస్తావు? నన్నెవరూ పీక్కుని తినలేదులే. జబ్బువల్ల యిల్లా అయిపోయాను."

"జరుగుబా టెల్లా వుంది?" అనడిగాడు.

"బిచ్చమెత్తుకొని యెల్లాగో బ్రతుకుతున్నాన్లే. నీవద్ద కొకపనిమీద వచ్చా. నువ్విక్కడుంటున్నట్టు ఫర్ఫిష్కా చెప్పాడు."

ఆమెదుస్థితికి ఇలియా జాలిపడ్డాడు. తీకుతూకుగా తిరుగుతుండే మతిస్సా నా స్థితిలో చూచి దురపిల్లాడు. "టీ తాగుతావా?" అనడిగాడు.

"నీ టీ నీ దగ్గరే వుంచుకో, నా కేమీ అక్కర్లేదు లే. ముందు నే వచ్చినపనిసంగతి విను."

మతిస్సా పూర్వమొకసారి ఇలియా నిల్లాగే అవమానించింది. వాని కిప్పు డాసంగతి జ్ఞప్తికొచ్చింది. ముఖం పక్కకుతిప్పుకొని "చెప్పు" అన్నాడు.

"మాషా జ్ఞాపక ముందా? ఎందు కుంటుంది లే. నువ్విప్పుడు భాగ్యవంతుడి వయ్యావుగా!"

"జ్ఞాపకంలేకే! అయితే యేమిటి సంగతి?"

"జ్ఞాపకంవుంటేమాత్రం యేం లాభం? ఆమెకష్టాలు తేలిగ్గా తీరేవి కావు"

"అసలువిషయ మేమిటో చెప్పు. మాషా యెల్లా వుంది?"

"ఇంకా వురిమాత్రం పెట్టుకోలా."

ఇలియా మండిపడుతూ అన్నాడు— "నా పైన నిష్టూరంవేస్తున్నావు గాని, మాషా నయిదురూపాయల కోసం అమ్మింది నువ్వు కాదూ?"

"నన్ను కూడ నేను తిట్టుకుంటూనేవున్నాను. చేసిన దానికి పస్తాయించుతున్నాను. ఆ దురదృష్టవతిస్థితి దుర్భరంగా వుంది. మొగు డామెని నానా తిప్పలు పెడుతున్నాడు. గడప దాటి కదలనివ్వడు. బయటిముఖం చూచేప్రాప్తి లేదు. రాత్రింబగళ్ళు నిఘాలో వుండాల్సి వస్తోంది. మొదటి పెళ్ళాం పెడ తొక్కటం, పుట్టినపిల్లలుకూడ క్షేత్రజులుకావటంవల్ల

మాషా కాళ్ళూ-చేతులూ కట్టి హింసిస్తున్నాడా దుర్మార్గుడు. ఆ పిల్ల రెండుసార్లు పారిపోయింది; కాని వెంటనే పట్టుబడింది. తర్వాత ఆమె బాధలు మరీ మితిమీరినై. ఇదీ మాషా స్థితి.''

ఇలియా దుఃఖావేగంవల్ల గద్గదకంఠంతో ''అది మీరామెకు చేజేతలా తెచ్చి పెట్టిన బహుమానమేగా'' అన్నాడు.

'' అప్పట్లో మే మామె మేలుకోరే ఆ పనిచేశాము. అతనిప్రాపున పవిత్రంగానైనా బ్రతుకుతుందని ఆశించాము. కాక, యే ధనికునికో అమ్మితే మా కెక్కువగానే డబ్బు ముట్టేది. ఆమె తర్వాత వదిలెయ్యబడినా జీవితానికేదో మంచియేర్పాటే జరిగేది.''

ఈ మాటల నామె చీకూ - చింతా లేనిదానివలె చెప్పింది. ఆమెహృదయం కఠినశిలానిర్మితమేమో నను కున్నాడు ఇలియా. ''ఇంతకూ యిప్పు డిక్కడి కెందుకు వచ్చా'' వని అడిగాడు.

'' నువ్వు పోలీసువారిపొత్తులో వుంటున్నావు. మాషా పారిపోయినప్పుడెల్లా వారే పట్టుకొని ఆ నర పిశాచానికి వొప్పగించుతున్నారు. నీ వామెస్థితిని వారికి చెప్పి యిక ముందు పట్టియివ్వొద్దని చెప్పు. ఆ ప్రాణానికి ప్రపంచంలో అంతకంటె చల్లనిచోటే దొరకదా?'' అంది మతిస్సా.

''నిజంగా నువ్వు నా దగ్గర కొచ్చింది యిందు కేనా?''

"నిజంగా యిందుకే. నువ్వు చెప్పితే పోలీసువారు వింటారు. ఇక ఆమెని బాధించవద్దని చెప్పు ఇలియా!"

ఇలియా నిట్టూర్చాడు. మాషాని తానే విధంగా వుద్ధరించగలనా అని ఆలోచించుతున్నాడు.

మతిస్సా లేచి మెల్లగా వెడుతోంది. చూచేవారి కామె మానవాకారంగా లేదు. పెళ్ళగిలి కూలిపోతున్న చెట్టులాగుంది. "ఇదే ఆఖరుచూపు. నే నింకెన్నాళ్ళో బ్రతకను" అంటూనే మతిస్సా వెళ్లిపోయింది.

ఆమె వెళ్ళగానే లాసినా గబగబా ఇలియాగదిలోకి వచ్చింది. వాడిభుజంమీద చెయ్యేసి "ఈబిడేనా నీకు తొలి పొందుసౌఖ్యమిచ్చింది?" అనడిగింది.

ఇలియా మాషానిగురించి ఆలోచించుతూ "ఎవరు?" అని పరధ్యానంగా అడిగాడు.

"ఇప్పుడు నీతో మాట్లాడిపోయినావిడ."

ఇలియా తనభుజంమీదనుంచి లాసినాచేతిని త్రోసివేసి "కుళ్లి రాలిపోయేపండులాగున్న మనిషినిగూర్చి వెరపు లేకుండా మాట్లాడుతున్నావా? ఒంట్లో త్రాణలేకపోయినా కష్టాలపాలయిన ఒక యువతికి సహాయంచేసేందు కింకా కృషిచేస్తూనేవుంది" అన్నాడు తీవ్రంగా.

"ఓహో! అయితే ఆ యువతిని నీతో కలిపేదూతిక కాబోలు!"

"ఛీ, యిక నీ వాగుడు కట్టిపెట్టు. పరిహాసానికి యిదేనా సమయం?" అని ఇలియా మాషాకథ యావత్తు లాసినాతో చెప్పాడు. "ఇప్పు డేం చెయ్యాలో తోచటం లే"దని లాసినాసలహాకోరుతున్న ట్టామెవంక చూచాడు.

"ఏమిటి చేసేది. న్యాయశాస్త్రప్రకారం భర్తకి భార్యపైన సర్వాధికారం వుంటుంది. భార్యా-భర్తల తగవులో యితరులు వేలెట్టకూడదు. ఆమె నోరుమూసుకొని కుక్కిన పేనులా పడివుండాల్సిందే. అయినా వృద్ధుడింకెన్నాళ్లు జీవిస్తాడులే. వాడిప్రాణం గుటుక్కుమనేదాకా ఓర్చుకుంటే ఆస్తి అంతా ఆమెకే దక్కుతుంది. ఆ తర్వాత నువ్వా ధనిక వితంతువుని చేపట్టొచ్చు."

లాసినా పై మాటల్ని న్యాయశాస్త్రం తనకు కరతలామలకమైనట్టూ, యిల్లాంటి విషయాల్లో తన కెంతో అనుభవమున్నట్టూ చెప్పేసింది. నవ్వుతూ యింకా యిల్లా అన్నది— "నువ్వు నీ పూర్వపరిచితులందరినీ మర్చిపోవటం మేలు. వాళ్లకీ నీకూ సామ్యం లేదు. వాళ్లు నీచులూ, పతితులూను. నీవద్దకు డబ్బుకోసం వస్తూంటాడే వాడిరూపం యెంత మోటుగా వుంటుంది!"

"నువ్వనేది పాష్కానిగురించేనా?"

"అవును, వాడే. అసలు మీ పేర్లే చిత్రమైనవి. మీ కీ పేర్లు యెల్లా పెడతారో!"

ఇలియా అవమానం చేసుకుమిలిపోతున్నాడు. పెత్రుహా హోటలుజీవితము భావిలోకూడ తనశాంతికి అడ్డమవుతుంది కాబోలనుకున్నాడు.

# 25

ఇలియా చిరమనోరథం యీడేరింది. కొత్తవ్యాపారం జోరుగా సాగుతోంది. వాడుదయంలగాయతు సాయంత్రం వరకు వ్యాపారంలో నిమగ్నుడై వుంటున్నాడు. దుకాణం లోని వస్తువులన్నీ బజారునపోయేవారికి చక్కగా కనపడేలా అమర్చాడు. ఇప్పుడు వానికితర వ్యామోహమేదీ లేదు. ఒక్క వ్యాపారవిషయాలుమాత్రమే వాని బుర్రలో మెదుల్తున్నాయి. అమ్మకం బాగా సాగుతున్నందున కార్య భార మధికమై గైబ్రిక్ అనే కుర్రాణ్ణి చేతికింద పెట్టు కున్నాడు.

నీటుగా వుండాలన్న వ్యసనం వుండనేవుంది. "దుకాణంలోవుండేవాళ్లు శుభ్రతగా వుంటే గ్రాహకు లెక్కువవుతా"రని గైబ్రిక్‌తో చెప్పేవాడు.

గైబ్రిక్ పన్నెండేళ్ల బాలుడు. గట్టిశరీరం. చక్కని కళ్ళు. నవ్వుముఖం. లేమివల్లనే వాడు నౌకరీలో ప్రవేశ

పెట్టబడ్డాడు. దుకాణపుపని వాడికి సరదాగానే వుంది. వచ్చిన వారికి కావలసిన వస్తువుల్ని వుత్సాహంతో చకచకా అందించేవాడు. మర్యాదగా ప్రవర్తించటానికూడ ప్రయత్నించేవాడు. అయితే వాని దసలు చిటపటస్వభావం. అదొక్కటే వాడికి కళంకంగా వుంది. 'అది తే, ఇది చూపు' మని చివర కేమీ కొనకుండా యెవరైనా వెళ్ళిపోతూంటే వాడికి ఒళ్లుమండేది. పెద్దవారితో వచ్చినపిల్లల చిలిపి చేష్టల్ని సహించేవాడు కాడు. అపుడపుడు వాళ్లని గద్దించి కసరుతూండేవాడు. ఇల్లాంటి ప్రవర్తన దుకాణంలోవుండే వాడికి తగదనుకొన్నా ఇలియా తాను చేపలదుకాణంలో వున్నప్పటిస్థితిని స్మరించుకొని గ్రైబ్రిక్‌ను అదమాయించేవాడు కాదు. బుజ్జగింపుగా బోధించుతూ వానిపై వాత్సల్యం చూపేవాడు.

"గ్రైబ్రిక్! తీరికగావున్నప్పుడు చదువుకుంటూండు. కాలమూ గడుస్తుంది; లాభంకూడాను" అనేవాడు. తన కా అదృష్టంకల్గినతరువాత ఇలియా సరళస్వభావీ, వుదార హృదయుడూ అయ్యాడు. "నా అదృష్టం పండింది. మీరు ఓపికపట్టండి. మీకూ మంచి రోజులు వస్తాయిలె" మ్మన్నట్టు వుండేవి వాని చూపూ, వ్యవహారమూను.

ఉదయాన యేడుగంటలకే దుకాణం తెరచి చీకటిపడే దాకా వుంచేవాడు. కొనటాని కెవరూ రాకపోతే ఇలియా కుర్చీ నారుబయట వేయించుకొని తనజీవితాభిలాషలన్నీ తీరి

పోయినట్టు నిశ్చింతగా కూచునేవాడు. గ్రైబ్రిక్ దుకాణంలో కూర్చొని బజారున వచ్చిపోయేవాళ్లని చూస్తుండేవాడు.

ఇలియా కిప్పుడు గ్రంధపఠనాసక్తిలేదు. ఏకాంతంగా కూర్చొని ఆత్మ పరిశోధన చేయాలన్న కోరిక మాత్రం మిగిలింది. వాని కాత్మవిచారణతో ఆనందం కలుగుతూం డేది. ఎప్పుడైనా మనసు వ్యాకులంగావుంటే గ్రైబ్రిక్‌తో పిచ్చా-పాడీ మాట్లాడుతూ మనస్సు కుల్లాసం కల్గించుకో ప్రయత్నించేవాడు. గ్రైబ్రిక్ తనవద్ద నౌకరుగా వున్నా వాత్సల్యంతో చనువుగా మాట్లాడేవాడు. ఒకసారి "మీ నాన్న యేం చేస్తుంటా" డని గ్రైబ్రిక్ నడిగాడు.

"పోస్టుజవాను."

"మీ కుటుంబంలో యెందరున్నారు?"

"బోలెడంతమందిమి. చిన్నా పెద్దా కలిసి మానాన్న సంతానం యెనమండుగురం. అయిదుగురు పిల్లలు, ముగ్గురు పెద్దవాళ్లము. పెద్దవాళ్ళం సంపాదించుతున్నాము. నేను మీవద్ద వున్నానా, వాసిలీ సైబీరియాలో టెలిగ్రాఫ్‌మాష్టరు. మా అక్క బడిపంతులు. ఆమె నెలకి పాతికరూపాయలు తెస్తోంది. మిష్కా నాకంటె పెద్దాడేగాని, యింకా చదువు కుంటున్నాడు.

"అయితే పెద్దవాళ్లు నలుగురన్నమాట?"

"అదేమిటి? మిష్కా చదువుకుంటున్నాడుగా. సంపా దించేవాళ్లేగా పెద్దవాళ్లు."

"మీకు జరుగుబాటు కష్టంగా వుందనుకుంటాను" అన్నాడు ఇలియా సానుభూతిసూచకంగా.

"అవును, యిప్పుడు దరిద్రంలోనే వున్నాం; గాని, నేను గడితేరితే యిల్లాగే వుండిపోము. వయసురాగానే సైన్యంలో చేరి శత్రువులమీద దెబ్బతీస్తాను. వాళ్ళ జండా నూడలాగి తెస్తా. సర్కారువారు నన్ను బహూకరించి పెద్ద వుద్యోగం యిస్తారు. మా పినతండ్రికూడ అల్లాగే పతకం సంపాదించాడు."

ఇలియా గ్రైబ్రిక్ ఆశాభరితమైన మాటలు విని వాడి ముఖాన్ని చూస్తూ లో లోపల నవ్వుకొనేవాడు. దుకాణం మూసివేసినాక యిద్దరూ ఒక్కసారే భోజనానికి కూచునే వారు. గ్రైబ్రిక్ ఇలియాకు వడ్డించి, తాను యెడంగా కూచుని తిని, దుకాణంముందు కెళ్ళి పడుకొనేవాడు. ఇలియా నింపాదిగా నమిలిమింగుతూ చాలాసేపు తినేవాడు. వెనక గదిలోనే పడుకునేవాడు. ఆ గది నన్నివిధాల పరిశుభ్రంగా వుంచటానికి ప్రయత్నించేవాడు. అద్దాలు, పటాలు, తెరలతో గదిని చక్కగా అలంకరించాడు. పటాలన్నిటిలోను 'మానవ జీవితావస్థ'లన్న చిత్రాన్ని వాడెంతో మోజుపడి తెచ్చుకున్నాడు.

ఆ చిత్రం ధనురాకారంలో వుంది. దాని వుపరి భాగంలో దేవుడు ఆదం-హవ్వాలతో మాట్లాడుతున్న దృశ్యం చిత్రింపబడింది. ఆ పటంలో మానవుని వివిధ

జీవితావస్థలు పదిహేడుచిత్రాలుగా చిత్రింపబడినై. తొలి దశలో ఒక పసిపాప తల్లి ఒడిలో ఆడుకుంటున్నాడు. మలి అవస్థలో ఐదేళ్ళ పిల్లాడు పిల్లంగ్రోవి వూదుతున్నాడు. ఏడు సంవత్సరాల బాలుడు వర్ణక్రమం దిద్దుకుంటున్నాడు మూడో దాన్లో. నాల్గో చిత్రంలో పదేండ్ల కుర్రాడు చంకలో పలక-పుస్తకాలు పెట్టుకొని బడికిపోతున్నాడు. ఐదోదశలో యిరవై వసంతాలు చూచిన తరుణుడు మీసాలు మెలివేస్తూ భుజాన తుపాకి ధరించి కవాతు చేస్తున్నాడు. ఆరో అవస్థలో పాతికేళ్ల పడుచువాడు ప్రేయసీ సందర్శనానికి ముస్తాబవుతున్నాడు. తరువాత దశలో ఆ యువకుడే ప్రియురాలితో చెట్టపట్టాలు పట్టుకొని వాహ్యాళి కెడుతున్నాడు. ఎనిమిదో అవస్థలో ధనార్జనకు మంచి-చెడ్డ వుపాయాలన్నిటికి ప్రయోగించుతున్నాడు. కుర్చీలో సుఖాసీనుడై పత్రిక చదువుకుంటూంటే పిల్లలు కాళ్ళవద్ద చెలగాటలాడుతున్నారు తొమ్మిదో చిత్రంలో. ఇది వాని జీవితంలో మధ్యమావస్థ. వానిముఖంలో సంతుష్టి, ఆనందాలుద్యోతమానమవుతున్నై. అప్పటికి వాని కేబదియేండ్లప్రాయం వచ్చింది. పదో చిత్రంలో అతడు కాషాయాంబరాలు దాల్చి కూరగాయలు తెచ్చుకుంటున్నాడు. అనంతరదశలో వానిని మనుమలు, మనుమరాండ్రు చుట్టుకొనివున్నారు. ఒకడు భుజంమీాద గుర్రమెక్కాడు. ఒకపిల్ల గడ్డంలాగుతోంది. ద్వాదశావస్థలో వాని జవ-సత్వాలుడిగిపోయాయి. కర్ర నూతగాగొని లేచి

కూర్చుంటున్నాడు. పదమూడోదానిలో పడకకుర్చీలో పడు కొని వున్నాడు. అటూ యిటూ తిరగటానికి శక్తిలేదు. కాలకృత్యాలన్నీ అక్కడే జరుగుతున్నై. పద్నాలుగో చిత్రంలో మంచమెక్కి తుదిఘడియలు లెక్కించుకుంటున్నాడు. పదిహేనోదశలో మరణాసన్నుడయివున్నాడు. యమకింక రులు వానిచుట్టూ చేరివున్నారు. పదునారవ చిత్రంలో వానిఆత్మ దేహాన్ని విడిచిపెట్టింది. పీనుగపైన గుడ్డకప్పబడి వుంది. తుదిదశలో వాని కంతిమ సంస్కారం జరుగుతోంది.

ప్రతిఅవస్థను వ్యక్తంచేస్తూ చిత్రంక్రింద యెర్రసిరాతో వివరాలు ముద్రితమై వున్నై. ఇలియా ఆ చిత్రం మీదనే దృష్టినిల్పిచూస్తూ అవ్యక్తానందమనుభవించేవాడు. "మానవజీవిత మెంత చక్కగా చిత్రింపబడిందీ!" అను కొనేవాడు. ఆ చిత్రదర్శనంతో వానికి శాంతి చేకూరు తూండేది. అందులో మానవజీవితపరిణామము సుబోధకం చేయబడింది. ఇలియా తనజీవితరహస్యంకూడ అదే నను కున్నాడు. ముందు వృచ్ఛదశకుచేరి, కుప్పతిప్పలుగా ధన మార్జించిన తర్వాతే చదువుకున్నసుందరిని పెళ్ళాడటం వుచితమని భావించాడు.

" బాగా వయసొచ్చినమీదటనే వివాహంచేసు కోవాలి. భార్యరావటంతో అనేకబాధ్యతలు, నెత్తినపడి లాయిలాసా యెక్కువవుతుంది. కాబట్టి కనీసం పెళ్ళినాటికి

నలభై సంవత్సరాలవయస్సైనా వుండాలి; అయితే వయసు మరీ మించితే పిల్లల చదువు-సంధ్యలకు యేర్పాట్లు చెయ్యటం కష్టమవుతుంది; కాబట్టి ముప్పైయేళ్ళకే పెళ్లిచేసుకోవా'' లనుకున్నాడు ఇలియా.

ఒకనాటిరాత్రి టీకి పొయ్యిమీద నీళ్లుపెట్టాడు. అప్పుడు వానికేవేవో ఆలోచనల్లుకలిగాయి. పొయ్యిమీద నీళ్ళు పొంగుతున్నై. ఇలియా పరధ్యానంగావుండి వాటివంక చూడనేలేదు.. కాస్సేపటికి మంటకూడ ఆరిపోయింది. గదిలో నిశ్శబ్దంగా వుంది. ఇలియా కప్పుడనేక భావాలు స్ఫురించసాగాయి. ఆ గదిలోమాదిరిగా యేకాంతంగా ఆలోచించుకోటానికి వానికింకెక్కడా అవకాశం చిక్కేది కాదు.

ఇలియా దృష్టి పైనచెప్పినచిత్రంమీద పడింది. పతనావస్థను తెల్పే చిత్రాన్ని చూచి 'అసలు మానవు డెందుకు చావాలి?' అని ప్రశ్నించుకున్నాడు. 'మృత్యువులోనే ఆనంద మున్న' దన్న జాకోబుమాట జ్ఞప్తికొచ్చింది.

మరుక్షణంలోనే వానికి పాష్కా, వేరాలు జ్ఞాపకం వచ్చారు. వారే స్థితిలో వున్నారో నన్న చింత కలిగింది. అంతలో మళ్ళీ పోలటోవ్ హత్యాదృశ్యం ఇలియాస్మృతి పథంలోకి వచ్చింది. 'ప్రతివానికర్మలు పరిశీలింపబడతాయి. నేడో రేపో ప్రతిమనిషీ తనతన కర్మఫలితాన్ని అనుభవించి తీరాల్సిందే' ననుకున్నాడు నిర్వికార భావంతో. ఈ విధంగా

ఆలోచనలు చెలరేగుతూంటే వాడికి విసుగుకలిగింది. లేచి బట్టలుమార్చుకొని దీప మార్పబోయాడు. దీపంవత్తి తగ్గించి మళ్ళీ పెంచాడు. అంధకారం దూకుతూ వచ్చి పారి పోయింది. ఆ విధంగా కొంతసేపటివరకు దీపంతో ఆడు కుంటూ చీకటి – వెల్తురులను ముందు వెనకలకు దౌడు తీయించాడు. ఆ ఆట వానికి వినోదంగా వుంది. ఇలియా కది నిత్యము అలవాటైన ఆట అయింది.

కాస్సేపా ఆట ఆడి దీపమార్పేసేవాడు. నిశాదేవి రాజ్యం క్షణంలో నల్దిక్కులా విస్తరించేది. వెన్నెల రాత్రి అయితే కిటికీచువ్వల మధ్యగా చంద్రిక లోపలికి జొరపడి మసకవెల్తురుగా వుండేది. ఆ నీరవప్రదేశంలో ఇలియా పక్కమీదికిచేరి గొంగళిముసుగుపెట్టుకొని నిద్రపట్టేదాకా చీకట్లో కళ్ళుతెరచి చూచేవాడు. ప్రొద్దున నిద్రనుంచి లేచి నప్పుడు రాత్రి తాను చేసిన బాల్యచేష్టకి నవ్వుకునేవాడు.

అప్పుడప్పుడు పాష్కా దుకాణానికొచ్చి ఇలియాను కలుసుకొని పోతూండేవాడు. వాడి మురికి గుడ్డలు, మడ్డి తనం చూచి ఇలియా చీదరించుకొనేవాడు. పాష్కా యెన్నడూ అక్కడ స్థిమితంగా కూచుని మాట్లాడేవాడు కాడు. ఎప్పుడైనా ఇలియా మరి కాస్సేపుండమంటే "నా వ్యవహారం నీకు తెలియదులే. నేనొక క్షణంకూడ వుంటానికి వీల్లేదు. పంజరంమూత తీసివుంచితే పిట్ట యెగిరి పోతుందని నా అలంకు. వేరా యెప్పుడూ యేదోఆలోచిస్తూనే

వుంటుంది. ఒక బిడ్డపుట్టినా బాగుండు''నని యిల్లాగేయేదో చెప్పి నిట్టూర్చి లేచి చక్కాపోయేవాడు.

ఒకతడవ పాష్కా వచ్చినప్పుడు ''కవిత్వం సాగుతోందా?'' అనడిగాడు ఇలియా.

''కాయితంమీద కాదు గాని, ఆకాశాన రాస్తున్నా'' నని నవ్వి పాష్కా యింకా యిల్లా చెప్పాడు- ''ఆరోజులు గతించాయి. మాకు సుఖపడేరాత లేదు. నా సర్వస్వం కోల్పోయాను. ఇక నాకు మిగిలిందేమీ లేదు. ఎప్పుడూ వేరానుగూర్చినచింత వేధించుతోంది. ఏపని చేస్తున్నా యీ విచారం నన్ను వదలకుండావుంది. నువ్వు అదృష్ట జాతకుడివి. నీ కన్ని విధాల సౌఖ్యముంది. నాకు స్వంతాన్ని గూర్చి చింతలేదు కాని, వేరా విషయంలోనే......''

''నిన్ను గూర్చి యెందుకు లేదు?'' ఇలియా మధ్యలో ఆపి అడిగాడు.

''నే నామెని సంతృప్తిపర్చగల్గితే నాకేచింతా వుండదు. వేరావల్లనే నాకీ దుఃఖ మంతాను. ఆమె విలాసిని. దుబారాఖర్చు చేస్తుంది. ఎంతడబ్బైనా చాలదు. ఏవిధంగా నయినా డబ్బులభిస్తుందని తెలిస్తే ఆమెలో విచిత్రపరివర్తన కన్పిస్తుంది. ఒక్కొక్కప్పుడు నన్ను దొంగతనానికూడ పురికొల్పుతోంది. నే నొప్పుకోకపోతే పిరికిపందననీ, అప్రయోజకుడిననీ హేళనచేస్తుంది. ఆమెకీ జీవితం మహా

దుస్తరంగా వుంది'' అని చెప్పి పాష్కా వ్యాకులచిత్తంతో వుడాయించాడు.

అప్పుడప్పుడు ఫర్ఫిష్కా కూడ ఇలియాను చూచి పోతూండేవాడు. ఎప్పుడూ సితార వెంటవుండేది. పెట్రుహా హోటలువార్తలు, జాకోబుస్థితి-గతులూ చెపుతూండేవాడు. నవ్వుతూ కబుర్లుచెపుతూ నిశ్చింతగా కనపడేవాడు.

''పెట్రుహా మళ్లీ పెళ్ళిచేసుకున్నాడు. అతని కొత్త పెళ్ళాం వెదురుగడలాగుంటుంది. కొడుకుకూడ అమ్మలాగానే వుంటాడు. ఆ ముసలిపెళ్ళికూతురును చూస్తుంటే మూడం తస్తులమేడ తలపుకొస్తుంది. కళ్లు బటాణీగింజలంత చిన్నవి. కొడుకు కళ్ళజోడు తగిలిస్తాడు. మహాపొగరుబోతు. ముక్కుతో మాట్లాడుతాడు. తల్లి యెదుట గడగడలాడినా వెనకాల వెక్కిరిస్తూంటాడు. మొత్తంమీద పెట్రుహా కొంపలో బలే సజ్జు చేరిందిలే! ఇంతకూ జాకోబుకు చిక్కొచ్చింది. వాడికి నుంచోటానికి నీడలేకుండాపోయింది. చాటుమాటుగా తాగుతూనే వున్నాడు. తండ్రి బాదినప్పుడు పుర్రెపిరితిత్తులకు దెబ్బతగిలిందో యేమో రోజురోజుకు వాడు దగ్గుతో దిగనారిపోతున్నాడు. వాళ్ళంతా కలిసి జాకోబు నెప్పుడో నమిలిమింగేస్తారు. వాడసలే యేబ్రాసిరకం. ఎవరితోను యేమీ చెప్పడు. ఎప్పుడో ఠపీమని యెగిరిపోతాడు...... మీబాబాయి కీవ్ కు చేరుకున్నాడటగా! ఆయన లేనిపోనియాతనపడుతున్నాడు; ఆయన కసలు

మోక్షంసిద్ధించదనే నా నమ్మకం......... మతిస్సాకాళ్ళు పట్టుతప్పిపోయినయి. ఒకగుడ్డివాణ్ని సహాయానికి కుదుర్చుకుంది. తాను చక్రాలబండిలో కూచుని దారిచెపుతూంటే గుడ్డివాడా బండి నీడుస్తుంటాడు. ఆ దృశ్యం బలే తమాషాగా వుంటుంది. పాపం! ఏదోవిధంగా పొట్టపోసుకుంటోంది. చాలా మంచిముండ! నా పెళ్ళాం మంచిదే కాకపోతే నేను మతిస్సాని పెళ్ళాడివుండేవాణ్ని. ఈ ప్రపంచంలో ముక్తకంఠంతో మెచ్చుకోతగ్గఆడవాళ్లు యిద్దరే యిద్దరని నేను బల్లగుద్ది చెప్పగల్ను. ఒకతె నా భార్య, రెండోది మతిస్సా. మతిస్సా తాగుతుందన్నమాట నిజమేగాని, అసలు మంచివాళ్లందరూ తాగాల్సిందే. తాగనివాడు మంచివాడు కాలేడు.'' ఇదీ ఫర్‌ఫిష్కా వాగ్ధోరణి.

ఒకరోజున ''మాషా యెల్లా వుం''దని ఇలియా వాడి నడిగాడు.

కూతురుపేరు వినపడటంతో ఫర్‌ఫిష్కానవ్వు చైత్రమాసపు చెట్లఆకుల్లాగా యెగిరిపోయింది. వానిమొహం నల్లబడింది. ''నా కామె సంగతులే తెలియవు. ఒకనాడు చూచివద్దామనిపోతే నానాతిట్లుతిట్టి కర్రపుచ్చుకొని వెంటపడ్డాడు......'' అని మెల్లగా చెప్పి ''ఇక వెళ్తాను, ఒక పావలా యి''మ్మని అడిగాడు.

''నువ్వు నానాటికి పతనమైపోతున్నావు ఫర్‌ఫిష్కా!'' అన్నాడు ఇలియా.

"నువ్వన్నదాన్లో పొరపాటేమీ లేదు. నేను చచ్చి పోతే విచారపడేవాళ్లు ఎవరు? ఎప్పుడూ నవ్వుముఖంతో నే నందర్నీ నవ్విస్తూంటాను. లేకపోతే మామూలుగా వా ళ్లేడుస్తూనేవుంటారు. ఎవర్ని చూచినా తాము చేసిన పాపాలు, దేముడు తమకు విధించే శిక్షలనుగురించే చర్చించుతూంటారు; కాని, నేను పాటలు-పద్యాలతో వాళ్ల కానందం కల్గించుతూంటాను. కొద్దోగొప్పో పాపఫలితాన్ననుభవించక యెల్లాగూ తప్పదు. మరి అల్లాంటప్పుడు యిప్పట్నుంచీ అఘోరించటం యెందుకు చెప్పు" మని ఫర్‌ఫిష్కా సమాధాన మిచ్చాడు.

ఈవిధంగానే జవాబు లిస్తూ నవ్వుతూ, పాడుతూ వెళ్ళిపోయేవాడు. వెళ్లేటప్పుడు ఇలియా పావలో అర్థో వాడి చేతిలో పెట్టేవాడు. ఫర్‌ఫిష్కా దుస్థితికి ఇలియా విచార పడుతూండేవాడు. తన గతజీవితాన్ని కూడ తల్చుకొనేవాడు. ఆ స్మృతితో వాడు గిలగిలకొట్టుకునేవాడు. వాని ప్రస్తుతస్థితి విషయజీవితంమీద విరక్తి కలిగి యేకాంతవాసం చేస్తున్నట్టున్నా నిత్యము అనేక నూతనసమస్య లెదురై వానికి శాంతి లేకుండా చేస్తున్నై. పాష్కా, ఫర్‌ఫిష్కాల మాటలు వింటున్నా, వాళ్లెప్పుడు వదలిపోతారా అని ఆతురత చెందే వాడు. పాష్కాతో మాట్లాడుతున్నప్పుడు వ్యాకులమగ్నల మయితే చప్పున కొంతడబ్బిచ్చి వారిని సాగనంపేవాడు.

ఒకసారి "నే నిం కెంతని సహాయంచేయగలను? నువ్విక వేరాతోటిసంబంధాన్ని వదలుకోవటమే మంచి" దని ఇలియా పాష్కాతో చెప్పేశాడు.

"అదిమాత్రం అసంభవం. అక్కరలేని దెల్లాగూ విసర్జింపబడుతుంది; కాని, వే రా తో నాకున్నఅవసరం యింతింతని చెప్పలేను. ఆమె యితడులక్ష్యాడ కావాలి. కొంద రామెని నానుంచి లాక్కొనిపోటానికి ప్రయత్నించుతున్నా రనేదే నా దిగులు. నాకైనా ఆమెయందు హృదయపూర్వకమైనప్రేమ లేదు కాని, క్రోధ-ద్వేషాలు న న్నామెవేపుకే నెట్టుతున్నై. వేరాయే నా జీవితాశ. మరి నే నామెని విడిచి పెట్టే దెలాగో చెప్పు? ఇక నాకు మిగిలే దేముంటుంది? నా బొందిలో ప్రాణముండగా వేరాని తీసుకొనిపోటానికి దమ్మెవరికుంది? నా గురించి నువ్వు నిశ్చింతగావుండు. నేను దాని గొంతుపిసికి చంపనైనా చంపుతా గాని, వదలిపెట్ట" నని పిడికిలి బిగించాడు. వాడిముఖం జేవురించింది.

"వేరాయింటిచుట్టూ కోడెగా శైవరైనా పడిగాపు లుంటున్నారా?"

"లేదు."

"మరి నీనుంచి ఆమె నెవరో లాక్కొజూస్తున్నా రన్నావు?"

"నానుంచి ఆమె నాకర్షించేశక్తి యేదో వుంది. నా తండ్రి స్త్రీమూలంగానే అంతరించిపోయాడు. నేనూ

అట్లాగే మాసిపోతాను'' అంటూనే పాష్కా లేచి పోయాడు.

ఇలియా పాష్కానిగూర్చి చాల యిదయ్యేవాడు. ఒక్కొక్కప్పుడు వాని హృదయంలో అజ్ఞాత హింసాభావం పొడకట్టేది. పాష్కాజీవితాన్నావిధంగా నాశనం చేస్తున్న దెవరో ఇలియా వూహించలేక పోయాడు. అందువల్ల పరిహాసంతో ప్రయోజనంలేనట్టే కోపించటంకూడ వ్యర్థమని తోచింది ఇలియాకి.

మరొకప్పుడు మాటలసందర్భంలో పాష్కా ఇలియాతో యిల్లా అన్నాడు—''మిత్రమా! న న్నుద్ధరించటం నీవల్ల కాదు. ఎవరు యెవరి నుద్ధరించగలరు? అందరం యీ లోకానికి వొంటరిగా వచ్చినవాళ్ళమే. అందరి జాతకంలోను వొక్కటే రాసివుంటుంది. 'పనిచేసి చావు, ఆత్మని సైతా నుకు వప్పజెప్పు' మనేదే అందరిముఖాలపైన రాసివుంటుంది. (కొంచమాగి) నువ్వు యేకాకివి; నిశ్చింతగావుంటున్నావు; కాని, రాత్రింబగళ్ళు యెవడో ఒకడు నీ సర్వనాశనం కోరుతూవుండడూ?''

''ఏమో! అయినా నన్ను కన్నెత్తి చూచేందుకు గుండె యెవడి కుంటుంది? నడుం విరగదన్ననూ!''

''చాల్లేవోయ్! గప్పాలుకొట్టమాకు. జీవితాంతం దాకా వ్యాపారంచేస్తూ యిల్లాగే కులాసాగా వుంటావనేనా నీ వుద్దేశం?''

''ఎందు క్కాదు.''

"ఎప్పుడో ఒకప్పుడు నువ్వీ దుకాణంలోనుంచి తరిమేయబడతావు. అల్లాకాకపోతే నువ్వే స్వయంగా దీన్ని వదిలేసిపోతావు."

"చూద్దాంగా!"

పాష్కా అంతటితో పూరుకోక మళ్ళీ అన్నాడు—నువ్వెప్పటికైనా దుకాణంవదిలిపెట్టి పోతావని నేను ఘంటాపథంగా చెపుతున్నాను. నువ్వీవిధంగా ఒకేచోట స్థిరంగా వుండలేవు. అది నీ స్వభావానికే విరుద్ధం. నువ్వు తాగుబోతువైనా కావచ్చు; లేదా మరోరీతినైనా సర్వనాశనం చేసుకుంటావు. ఈ రెండింటిలో యేదోఒకటి జరిగితీరుతుంది."

పాష్కాజోస్యంతో ఇలియా ఆశ్చర్యాన్వితుడయ్యాడు. పాష్కా యే నమ్మకంతో అంతధీమాగా మాట్లాడుతున్నాడో ఇలియాకి బోధపడలా "ఎందువల్ల?" అని ప్రశ్నించాడు.

"శాంతి నీ మనస్తత్వానికే సరిపడదు. నువ్వు బోళామనిషివి. ఉదారహృదయుడివి. నీలాంటివాళ్ళు ఆనంద జీవితాన్ని గడపటం సహజమేగాని, ఆకస్మికంగా అంతరించి పోతారు."

"ఏవిధంగా?"

"మృత్యుగర్భంలో నిద్రపోయి."

ఇలియాకి నవ్వొచ్చింది. ఆవులింతతో ఒళ్ళువిరుచుకుంటూ "నీది వితండ వాదం పాష్కా! ఇవన్నీ అర్థంలేని మాటలు" అన్నాడు.

ఆ నాటి సాయంత్రం టీ తాగుతూండగా ఇలియాకి పాష్కా మాటలు జ్ఞప్తికొచ్చాయి. అవి తన వున్మాది వ్యాపారానికి తగినట్టే వున్నయ్యనుకున్నాడు. ముందు దూరమాలోచించకుండానే తొందరపడి లూసినాపరతు లన్నిటికి ఒప్పుదలఅయాడు. అయిదారువందలు పెట్టుబడిలో కలిపాడు. అయినాకూడ జీతగాడివలె చాకిరీ చెయ్యాల్సి వస్తోంది. ప్రతిపైసకు జమాఖర్చు చెప్పితీరాలి. తన శ్రమ ఫలితాన్ని స్వాహాచేయటానికే లూసినా తన్ను బాహుపాశంతో బంధించిన దనుకున్నాడు. ఆమె పెట్టుబడి సొమ్మును లాభంతో సహా సుప్తాగా యిచ్చేసి స్వంతంగా వ్యాపారంసాగించాలని నిశ్చయించుకున్నాడు. లూసినాతో యిక యెల్లాంటి సంపర్కం కలిగివుండకూడ దనుకున్నాడు. ఆ విధంగా చెయ్యటంకూడ సులువే. ఇలియా అసలు లూసినా నెప్పుడూ ప్రేమించనే లేదు. ఆమెపొందు వాని కాదినుంచి భారంగానే వుంది. ఇప్పుడు వానికది మరీ అసహ్యంగా వుంది. ఆ టక్కులాడిఆలింగన-చుంబనాదులచే వానికి వాస్తవికానంద మెన్నడూ లభించనే లేదు. పైగా యేవగించుకునే వాడు.

ఒకతేప "లూసినా! నీకు సిగ్గుబిడియా లే మాత్రం వున్నట్టు లేదే!" అన్నాడు మొహంమీదనే.

కాని ఆ జాణ వాని మాటల్ని నవ్వులాట క్రింద త్రోసిపుచ్చింది.

ఆ కులట నిత్యము తనలాంటి మధ్యతరగతి స్త్రీలవే వేనవేలకథలు చెపుతూండేది. వాటిని విని విని ఇలియా అధీరుడయ్యేవాడు. "నువ్వు చెప్పేవన్నీ నిజమే అయితే మీరు స్నేహానికి తగ" రని మరొకప్పుడు మొహమాటం లేకుండా అనేశాడు.

"అల్లా అంటున్నా వేమిటి? మా స్నేహంలో యెంత మజా వుంది!" అంది లాసినా నవ్వుతూ.

"ఏమి టా మజా? పగలంతా డబ్బుకోసం టక్కులు, రాత్రు ళ్ళీ విధంగా వ్యభిచారం! ఇదేనా ఆనందం?"

"నువ్వు ఒట్టి పశుప్రాయుడివి. నీకు ఆనందమంటే యేమిటో యేం తెలుసు?" అని లాసినా మళ్ళీ మధ్యతరగతి కుటుంబాల్లోని వ్యభిచారలీలలను వర్ణించసాగింది.

"సరే కాని, యిదంతా మంచిపనే నంటావా?" ఇలియా ఆమెకళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

"నే నిప్పుడు మంచి-చెడ్డల్ని విమర్శించేందుకు తీరిగ్గా కూర్చోలా. ఈ విధమైన విలాసాలే లేకపోతే జీవితం నిస్సారమూ, నీరసమూ అయిపోతుందని నావుద్దేశం" అంది లాసినా.

తర్వాత ఒకటిరెండుసార్లు "ఇప్పుడే నీ అభివృద్ధికి ప్రయత్నించు. పల్లెటూరివేషాలు మార్చుకొని పట్టణవాసుల ఫక్కీ నేర్చుకో" మని లాసినా ఇలియాకు బోధించింది.

ఆ బోధ ఇలియానుమరింత బాధించసాగింది. లీసా సంపర్కంవల్ల చేకూరిన శాంతి–సుఖాలు లాసినాపొందులో నామమాత్రంగానైనా లభించటం లేదు. అంతవరకు వాని హృదయంలో లాసినాయందు గల అభిమానాదరభావాలు లేశమయినా లేకుండాపోయినై. లాసినా ప్రార్థనచేస్తుండేది. ఆమె విగ్రహంముందు ప్రణమిల్లి కళ్లు మూసుకొని ప్రార్థించేది. ఆ సమయంలో పతి పల్కరించితే లాసినా కళ్ళెర్రజేసి చీవాట్లుపెట్టేది. ఆవిడ ప్రార్థన ఇలియాకి నాటకంగా తోచింది. అయితే ఆ నటన కర్థం మాత్రం తెలియలా. ఒకరోజున లాసినానే అడిగాడు— "నీకు నిజంగా దేవునియందు విశ్వాసముందా?"

"ఎంత చక్కగా అడిగావు! భగవంతునియందు నా కేల విశ్వాస ముండదు?"

"భేష్! నువ్వింత సులువుగా దేవుని మోసగించి నీ వాంఛ లీడేర్చుకో జూస్తున్నావా?" అని ఇలియా వెగ తాళి చేశాడు.

"తప్పూ, తప్పూ! అపవిత్రంగా మాట్లాడకు...... నేను మోసమేమిచేస్తున్నాను? భగవంతుడు చూడటం లేదూ? పగ లేదోఒకపనిలో మునిగి వుంటంవల్ల నేను పొరపడుతూ వుండవచ్చు. దేవుడు నన్ను క్షమించడూ? (కళ్లు మూసుకొని) ఆయన దయాళువు! ఉదారుడు! నన్ను తప్పకుండా క్షమిస్తాడు." అన్నది లాసినా అతి భీమాగా.

లీసాకూడ ఈశ్వరు నారాధించుతూండేది. కాని, లాసినా లీసాల దైవోపాసనలో పరస్పర విరుద్ధాంశాలెన్నో ఇలియాకు గోచరించినై. లీసా యేకాగ్రచిత్తంతో మోకరిల్లి అర్ధనిమీలితనేత్రయై ప్రార్థించేది. చుట్టు-పక్కల యేమి జరిగినా చలించేది కాదు. యెవరైనా పెడబొబ్బలు పెట్టి పిల్చినా ఆమెకు వినపడేది కాదు. మరి లాసినాకో! ప్రార్థనసమయంలో కూడ అన్ని యావలూ వుంటున్నై. అల్లాంటప్పుడు లాసినా ప్రార్థనచేయటంలో అంతరార్థ మేమిటా అనే ఇలియా ఆలోచించేవాడు.

వ్యాపారవిషయంలో లాసినా తన్ను వంచించిందని గ్రహించినప్పుడు ఇలియా వుగ్రుడయ్యాడు. "పరాయివ్యక్తి మోసంచేసినా క్షంతవ్యమే; కాని, ప్రేయసిగా నటించి నన్ను టక్కరిచేసిందే! అయినా కులటను నమ్మటం నాదే త"ప్పని పరిపరివిధాల తలపోశాడు. తదాది ఇలియా ఆమెను ద్వేషించి అసహ్యించుకోసాగాడు. క్రమంగా ఆమె వద్దకు పోవటం తగ్గించివేశాడు.

ఆరోజుల్లోనే వానికి మరో యువతితో పరిచయ మేర్పడింది. ఆ పడుచు నైట్రిక్ అక్క. తమ్ముణ్ని చూచి పోయేందు కామె దుకాణానికి తరచుగా వస్తూండేది.

ఆ యువతి రూపసి కాకపోయినా సామాన్య దుస్తుల్లోనే నీటుగా వుండేది. మనిషి పొడగరి కావటంవల్ల

ప్రాయానికి మించినదానివలె అగపడేది. వచ్చినప్పుడెల్లా ఇలియా ఆమెని మర్యాదచేస్తూండేవాడు. ఆమె తమ్మునితో మాట్లాడుతున్నంతసేపూ ఇలియా తృషితనేత్రాలతో ఆమె వేపే చూస్తూండేవాడు.

"జాగ్రత్తగా వుండు. యాగీలేమి తేకు" మని తమ్మునితో చెప్పి వెళ్లటానికుద్యుక్తఅయ్యేది. వేళ్ళేముందు ఇలియాకు అభివందనంచేసి ఠీవిగా నడచిపోయేది.

ఒక నాడు "మీ అక్క పేరేమి" టని ఇలియా గైబ్రిక్ నడిగాడు.

"సోంకా,"

"చక్కని పేరే! మీ అప్ప గడసరిలాగుందే?"

వాడు నొసలుచిరిచి ఇలియావంక చూచాడు.

"అవును, అది ఆమె తెచ్చిపెట్టుకున్న గుణమే" నన్నాడు.

"అందువల్ల ప్రయోజనం?"

"ఆమె కదే యిష్టం. ఎవరి కిష్టమైనట్టు వారు నడచుకుంటారు"

ఇలియాకి సోంకాపై మనసుపోయింది. ఆదిలో లొసినాపట్ల యెల్లాంటిభావం కలిగిందో యిప్పు డట్టి తలంపే సోంకావిషయంలో అంకురించింది. "ఈబిడ నిప్కుపటి లాగుంది. ఈమెని పెళ్లిచేసుకుంటే సుఖంగా గడపొచ్చు" ననుకున్నాడు.

ఒకపర్యాయం సోంకా బైండుపుస్తక మొకదాన్ని తమ్మునికిస్తూ "అది చాల మంచి పుస్తకం, చదువుకో" మని చెప్పింది.

"నేను దానిని చూడొచ్చా?" అనడిగాడు ఇలియా.

ఆమె గ్రైబిక్ చేతిలోనుంచి పుస్తకం తీసుకొని ఇలియా కందించింది. "ఇది ఒకవీరుని జీవితచరిత్ర" అని చెప్పింది.

ఇలియా నవ్వి "వీరగాథలు చాలా చదివా" నన్నాడు.

సోంకా కన్బొమ్మలెగరేసి టక్కున అన్నది— "మీరు భూత-భేతాళ కథలు, అప్సరసల కథలు చదివి వుంటారు. ఇది కల్పితకథ గాదు. ఒక ప్రజాసేవకుని జీవిత గాథ. పేదప్రజలకోసం, దీనజనోద్ధరణనిమిత్తం జీవితాన్న ర్పించిన యోధాగ్రణి సాహసచర్యలు యిందులో వర్ణించ బడ్డాయి. ఆ త్యాగధనుడు ప్రజలకు సహాయపడటానికి సదా సంసిద్ధుడై వుండేవాడు. రచనాసంవిధానం కూడ చాలా బాగుంది. అయితే దీన్ని కాకమ్మకథలా కాక మనసుంచి చదవాలి."

"అయితే శ్రద్ధగానే చదువుతాలే."

సోంకా ఇలియాతో అధికంగా మాట్లాడటానికిదే మొదలు. ఈ సంభాషణతో ఇలియా పరమానందభరితు డయ్యాడు; కాని, సోంకా వుదాసీనంగా "మీ కీపుస్తకం

మనస్కరిస్తుందని నాకు తోచ'' దని ప్రత్యుత్తరానికైనా వేచివుండకుండా వెళ్ళిపోయింది.

ఇలియా కీ తుదిమాట వెగటుగాతోచింది. సోంకా తన్నవమానించేతలంపుతోనే అట్లన్నదని తలిచాడు. వాని ముఖం వికృతమయింది.

గ్రైబ్రిక్ అతిఉత్సాహంగా పుటలు తిరగేస్తున్నాడు. సోంకా తన్నవమానించినందుకు ఇలియా తన క్రోషాన్ని ఆమెతమ్ముడిమీాద వెళ్ళగ్రక్కాడు. "ఆ పుస్తకాన్ని దూరంగా పారెయ్యి. చదవటాని కిదేనా వేళ?" అని కసిరాడు.

గ్రైబ్రిక్ చలించలా. దృష్టిని యథాప్రకారం పుస్తకం మీాదనే నిల్పి "కానేవాళ్ళెవరూ రాలేదుగా?" అన్నాడు.

ఇలియా ఇక మాట్లాడలా.

సోంకామాటలే వానివీనుల్లో గింగురుమంటూ ప్రతిధ్వనించుతునై్న. ఖిన్నుడై "బలేతమాషా పిల్ల!" అనుకున్నాడు.



# 26

కాలం గడిచిపోతోంది. ఇలియా వ్యాపారం చేస్తున్నాడే గాని, పూర్వంలాగ వానిమన సిప్పుడు వర్తకం మీాద లగ్నంకావటం లేదు. ఒక్కొక్కప్పుడు విసుగెత్తి దుకాణంమూసేసి షికారుపోదా మనుకునేవాడు. మళ్లీ నష్టంవస్తుందని ఆలోచించుకొని అల్లాగే కూచునేవాడు. దుకాణంమూలంగా ఇలియా సాయంకాలపువాహ్యాళి కూడ మానుకున్నాడు. దుకాణాన్ని గ్రైబిక్ మీాద వదలి ఆదమరచివుండేవాడుకాదు.

ఇలియా లాసినాల ప్రేమబంధం క్రమంగా సడలిపోతోంది. లాసినాకూడ అందు కేమాత్రం చింతపడలా. ఆమె ముసిముసినవ్వులతో వచ్చి జమాఖర్చులు చూచిపోతూండేది. ఇలియా కామెయందు ద్వేషం దిన దినాభివృద్ధిచెందసాగింది. కాని, లాసినా తన్ను మెచ్చుకొన్నప్పుడు వుబ్బిపోయి మళ్లీ ఆ కామిని మోహవాగురలో చిక్కుకొనేవాడు.

అప్పుడప్పుడు నికోడిమిచ్ కూడ దుకాణానికి వచ్చిపోయేవాడు. వచ్చినప్పుడుమాత్రం గంటలకొద్దీ తిష్టవేసి బాతాఖాని దంచేవాడు. అత డీటీవల పోలీసువుద్యోగం

వదులుకున్నాడు. ఒక గొప్ప షావుకారువద్ద మేనేజరుగా వుంటున్నాడు. జీతం నెలకి నూటపాతిక రూపాయలేనట గాని, పైరాబడి అంతకు మించివుంటుందని అతడే స్వయంగా ఇలియాతో చెప్పాడు. స్వామిద్రోహానికి పూనుకుంటే యింకా సంపాదించే అవకాశం వుంటుందని కూడ వివరించాడు. పూర్వపుయిల్లు మార్చి యిప్పుడు పెద్ద బంగళాలో వుంటున్నారు. వంటమనిషిని కూడ పెట్టుకున్నారు. "మా వంటమనిషి పిండివంట లెంత బాగా తయారుచేస్తుందనుకున్నావు! వేసవిలో మా యింటికి అతిథులు చాలామంది వస్తుంటారు. చీట్లాటతో కాలం బలే మజాగా గడిచిపోతుంది. లాసినా కూడ పేకాడుతుంది. యెప్పుడూ మాలో యెవరోఒకరం గెలుస్తూంటాము. గెలుపు సొమ్ముతో అతిథిసత్కారం జరిగిపోతోంది. చేతిచమురు యెన్నడూ వదల్లేదులే." యిల్లాంటి కబుర్లే చెబుతుండేవాడు నికోడిమిచ్.

ఒకసారి నే నొక పల్లెటూరు వెళ్ళాను. అక్కడ కావలసినంతమంది చక్కనిచుక్కలు! సులువుగా లోబడిపోతారు. బేరంకూడ కారుచౌక! పావలా-అయిదణాల మిఠాయితో పనిజరిగిపోతుంది." అని యింకేమేమో చెప్పుకొచ్చాడు నికోడిమిచ్. ఇలియా మెదలకుండా విన్నాడు. పెళ్ళాం యితరులకోసం యెదగొడ్డులా యెగబడుతూంటే పర స్త్రీలనుగూర్చి చుల్కనగా మాట్లాడుతున్న కిరిక్ పైఖరికి ఇలియా జాలిపడి నవ్వుకున్నాడు.

నికోడిమిచ్ చెప్పిన దంతా నిజమని ఇలియా నమ్మలేక పోయాడు. ఎవరో చెప్పింది విని లేత సొరకాయలు తెగ్గోస్తున్నాడని తలిచాడు.

ఆ అమాయకుడు యింకా వాగుతూనేవున్నాడు. "మిత్రమా! పల్లెపడుచుల పొందులో వున్న సౌఖ్యానం దాల నెంతని వర్ణించను!"

"లాసినా కీ విషయం తెలిస్తే?" అన్నాడు ఇలియా.

"ఆబిడ కివన్నీ పట్టవు. ఆమె కంతా తెలుసు. లాసినా కీ విషయంలో పట్టింపులేదు. సరే గాని, నువ్వె వర్నయినా ప్రేమించావా ఇలియా?"

"ఏమో! నే నెల్లా చెప్పగలను?"

"ఆ మిషనుకుట్టే యువతితో సంబంధం లేదూ?"

"ఊఁహూఁ"

"ఏ వంటకత్తెనో ప్రేమించివుంటావులెద్దూ. వంట చేసేవాళ్లు చాలా బాగుంటారు."

కిరిక్ మాటలకు ఇలియా నవ్వాడు. అందువల్ల ఇలియా కే వంటకత్తెతోనో సంబంధ ముండివుంటుందని నికోడిమిచ్ కి నమ్మకం కలిగింది. ఆ విశ్వాసంతోనే "రెండు నెలల కొకసారి వంటకత్తెను మార్చుతూండు. అల్లా అయితే పాతరోత లేకుండా యెప్పటికప్పుడు తాజాసరుకు దొరుకుతూంటుంది." అన్నాడు.

"నేను దాసీలను, వంటకత్తెలనే ప్రేమించివుంటానని మీ రెందు కనుకోవాలి? అంతకంటె వున్నత కుటుంబ స్త్రీకి తగనా?" అని ఇలియా అడిగాడు.

"నీ సంఘస్థితి అల్లాంటిది. నువ్వు సామాన్య రైతు కుటుంబానికి చెందినవాడివి కదూ!"

ఇలియా నవ్వాపుకుంటూ అన్నాడు—"మరి నా ప్రేయసి చదువుకున్నదీ, వున్నతవంశానికి చెందినదేనే!"

నికోడిమిచ్ నమ్మలేకపోయాడు. హేళనగా "అసంభవం. బడాయికి అల్లా అంటున్నావులే" అన్నాడు.

కిరిక్ వెళ్లిపోయినా ఇలియా అతనిమాటల్ని మరువలేకపోయాడు. అవి వాని హృదయానికి శూలాలై గుచ్చుకున్నై.

ఇలియాతో స్నేహంగా వుంటూ, వాని శరీరశ్రమతో అనేకరీతుల లాభంపొందుతున్న లాసినా, నికోడిమిచ్ లే వానిని తమకంటె హీనునిగా ఎంచుతున్నారు; గేలిచేస్తున్నారు. ఇలియాని పెట్రుహా అవమానకరమగు మాటలంటున్నాడని ఫర్ఫిష్కా లోగడే చెప్పాడు. 'నీకు గర్వం బలిసింది. పూర్వపు సుహృద్భావం యిప్పుడు నీలో లేశమయినా లే'దని జాకోబు ఇలియా మొఖంమీదనే అనేశాడు. ఇక గైబ్రిక్ అక్కకీ వానిపైన చిన్నచూపే. ఒకసామాన్య తపాలాబంట్రోతు కూతురు—ఒళ్లు దాచుకోటానికి చాలినంత గుడ్డకే గతిలేని ఆడుది వానిని చూచి ముక్కువిరిచి మాటి

ముడుచుకుంటోంది. ఇవన్నీ ఇలియాహృదయంలో కలక వేస్తున్నై. ఇంతమందీ తన్ను చులకనచేయడానికి గల హేతు వేమిటా అని వితర్కించుకొనేవాడు.

అయినా వానికి సోంకాయందు కలిగిన ఆసక్తి వృద్ధి అవుతూనే వుంది. ఆమె కంత అహంభావ మెందుకో, ఆవిడ యెదుట తానేల అణగివుంటున్నాడో ఇలియా గ్రహించలేక పోయాడు. మొదట్లో కొన్నాళ్ళవరకు సోంకా వానితో మాట్లాడేదే కాదు. ఇలియా కది దుస్సహంగానే వుండేది. ఆమె తనవద్ద నౌకరుగా వున్నవాడి అక్క! తనకు వినయ-విధేయత లేల చూపదని ఇలియా రోషంతో వుడికేవాడు.

ఒక రోజున సోంకా వచ్చి వెళ్ళబోతూండగా "మీ రిచ్చిన పుస్తకం చదువుతున్నా" నన్నాడు ఇలియా.

సోంకా వానివేపు చూడకుండానే "ఎల్లా వుం"దని అడిగింది.

"చాలా బాగుంది. కథానాయకుడు విచిత్రవ్యక్తి!"

సోంకా ఇలియావంక చూచింది. నల్లని విశాల నయనాల నతని ముఖంమీద నిల్పి "మీ రిల్లా అంటారని నాకు ముందే తెలుసులెండి" అంది.

ఈ మాటల్తో ఇలియాకు ఒళ్లుమండింది. "నేను పల్లెటూరిగబ్బిలాయిని కదూ మరి!" అన్నాడు.

ఆమె మారుమాట్లాడలా. ఇలియా వుద్విగ్నుడ య్యాడు. సోంకా వెళ్లిపోయింది. చాలారోజులకు మళ్ళీ

నేడు వెనకటి భావాలు ఇలియాను ముట్టడించినై. మానవు లందరిపైన వాని కసహ్యాభావం కల్గింది. తన దురాగతాన్ని గూర్చి, అందుకు పొందనున్న శిక్షనుగురించీ చింతించాడు. గతంలో కంటె ప్రస్తుతజీవిత మెంతో వుత్తమమైనదిగా భావించాడు. కాని, "ఈ స్థితి యెన్నాళ్లుంటుం"దని సందేహం కలిగింది. పగలూ రాత్రీ వ్యాపారంలోనే మునిగి తేలుతూండడం అసహ్యమనిపించింది. ఎవరితోనైనా మాట్లాడటానిగ్గాని, యెటైనా పోటానిగ్గాని యెనులుబాటే లేదు. ఎప్పుడూ పీఠం వేసుకొని కూర్చోటం కష్టంగా తోచింది. దుకాణదారు లందరిస్థితీ యింతే. అయితే వాళ్లు ఒంటరిగాళ్ళు కారు. వాళ్లకి మధ్య మధ్య తీరిక వుంటుంది. వాళ్లకి భార్య, పిల్లలు, తల్లి, తండ్రి వుంటారు. ఇంటికి పోయి కొన్ని గంటలపాటైనా ఆనందంగా గడుపుతారు. ఇలియా జీవితమో! పూర్తిగా వారి జీవితాలకి భిన్నం.

"నువ్వు పరమలోభి వయ్యావు. భగవంతుడు నీకు మేలుచేయకుండుగాక!" అన్న జాకోబుమాటలు ఇలియాకు జ్ఞప్తికొచ్చినై. నేడవి వాని హృదయంలో పోటు పొడుస్తున్నై. నిజానికి ఇలియా లుబ్ధుడు కాడు. శాంతికలిగి సుఖంగా జీవితం వెళ్ళబుచ్చాలనేదే వాని ఆకాంక్ష. ప్రజా మన్ననకు పాత్రుడై కీర్తిపొందాలన్న అభిలాష కూడా వుంది. తన్నెవరూ హీనంగాను, అనాగరికునిగాను తలచ రాదని ఇలియా తీరని వాంఛ.

ఇలిచ్ తన భావినిగూర్చి తలపోయసాగాడు. పోలటోవ్ హత్యాపరాధానికి శిక్ష ననుభవించక తప్పనో లేదోనని చింతించాడు. ఆ హత్య బుద్ధిపూర్వకంగా చేసింది కాదనీ, అది అనూహ్యంగా జరిగిపోయిందనీ, కాబట్టి తను శిక్షార్హుడు కాడనీ, శిక్షింపబడితే అంతకంటే దురన్యాయం వేరే ఉండదనీ భావించాడు. 'నే నా హత్యను వుద్దేశపూర్వకంగా చేయలే'దని కొన్నివందలసార్లు గొణుక్కున్నాడు. "ఈ పట్టణంలో యెందరు దొంగలు, వంచకులు, హంతకులు లేరు! కాని, వాళ్ళని వేలెట్టి చూపేవా డొక్కడూ లేడే! వాళ్లు సమాజంలో స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు కలిగి నిరభ్యంతరంగా సంచరించుతున్నారే. వాళ్ళని శిక్షించే వాడే లేడు. అపరాధిని పశ్చాత్తాపపడేటట్టుచేసి బుద్ధిగరపడమే న్యాయశాస్త్రసిద్ధాంతం. కక్షతో బాధించడం న్యాయమెల్లా అవుతుంది?" ఇల్లా తర్క వితర్కాలు చేసిచేసి తెరపిచేసుకొని తనపతనానికి కారకులైనవారిపట్ల ప్రతీకారభావప్రేరితుడయ్యాడు. ఆవళంగా పోయి పెట్రుహాకొంపకు నిప్పంటించి మంటలు చెలరేగుతూండగా జనం పోగయితే "నేనే నిప్పంటించాను. పోలటోవ్‌ను చంపింది కూడ నేనే" నని బిగ్గరగా అరిచి చెప్పాలనుకున్నాడు. అప్పుడు వాళ్లు తన్ను పట్టుకొని స్టేషనులో ఒప్పగించుతారనీ, కోర్టులో తంత్రికివతె తన క్కూడ సై బీరియాప్రవాసం విధింపబడి తీరుతుందనీ వూహ కలిగింది. మానవజాతిపైన వానికి కలిగిన

ద్వేషమప్పుడు మరీ ప్రజ్వలించింది. ప్రతిహింసాభావం ప్రబలమయింది. ఆ భావోద్రేకంలో "నీ పెళ్ళాంతో నాకు రహస్యసంబంధ ముం"దని నికోడిమిచ్‌తో చెప్పివేయాలనీ, మాషాభర్త ఆమెను నానాబాధలూ పెడుతున్నాడు కాబట్టి అతణ్ని హతమార్చి రావాలనీ అనుకున్నాడు.

ఒక్కొక్కప్పుడు రాత్రివేళ ఒంటరిగా పక్కమీద పడుకొని త్వరలోనే భయంకర తుపాను రాబోతున్నదనీ, ఆ తాకిడికి తలుపూ-ద్వారబంధమూ, గోడలూ-పైకప్పూ కూలిపడతాయనీ సుడిగాలి తన్నెటో ఎగరేసుకెళ్లి గిర గిరా తిప్పి పారవేస్తుందనీ భావనకలిగి భీతికొల్పేది. ఇలియా భయంచే గజగజలాడేవాడు.

ఒకనాడు దుకాణంమూసివేసేసన్నాహంలో వుండగా పాష్కా వచ్చి "వేరా వుడాయించిం"దని చెప్పాడు.

తర్వాత కుర్చీలో కూలబడి చేతుల్లో గడ్డ ముంచు కొని బజార్లోకి చూస్తున్నాడు. మధ్య మధ్య యీాల వేస్తు న్నాడు. అప్పుడు వానిముఖంలో జీవకళే లేదు.

"ఒంటరిగానా? ఇంకెవరితోనైనానా?" అనడిగాడు ఇలియా.

"నాకా వివరాలేమీ తెలియవు. పోయి మూడు రోజు లయింది."

ఇలియూ మిత్రునివంక చూచాడు. పాష్కా ప్రశాంత ముఖము, ధీమాగావున్న మాటలను బట్టి వాని మనఃస్థితి యెట్లున్నదీ గ్రహించలేకపోయాడు. ఏదో ఒక నిశ్చయంతో గుండె రాయిచేసుకున్నాడని మాత్రం ఇలియూ వూహించాడు. "ఇప్పుడేం చెయ్యాల్లనుకున్నా"వని పాష్కా నడిగాడు.

పాష్కా నిశ్చలంగా కూచుని యీలవేయటం మాని "దాన్ని ఖూనీచేసేస్తా" నని అతి సుళువుగా చెప్పాడు.

"మళ్ళీ ఆ పిచ్చేనా!" అన్నాడు ఇలియూ కోపంతో.

"నా హృదయం వదావద లయింది ఇలియూ! నేనన్నిటికి సిద్ధపడే బయల్దేరి వచ్చాను. ఇదుగో; బాకు! (చురకత్తి చూపుతూ) దీనితో వేరాపీక తెగ్గోస్తా" నని మంచి నీళ్ళు తాగినట్టు లోడలోడ చెప్పాడు.

ఇలియూ వాడిచేతిలోని బాకును గబుక్కున లాక్కున్నాడు. దాన్ని లోపలికి విసిరేస్తూ "సింహం యీగ మీదపడి చంపిందట. మహా వీరుడివి బయల్దేరావు!" అని పరిహాసించాడు.

పాష్కా ఇలియూముందుకు పోయి నుంచున్నాడు. వాడి కళ్ళు చింతనిప్పుల్లాగ వున్నై. ఒళ్లు కంపించుతోంది. ఒకక్షణ మాగి మళ్ళీ కుర్చీలో కూచుని "నువ్వు ఒట్టి చవటవి!" అని సణిగాడు.

"నువ్వు మహా వీరుడివిలే."

"కాక? కత్తి లేకపోతే యేం? చేతుల్లేవూ?"

"అయితే చేయదలచిం దేదో పోయి త్వరగా కానీ" అన్నాడు ఇలియా.

"అది నా చేతికి చిక్కితేనా! పళ్ళతో పీకుతా."

"ఘనకార్యమే!"

పాష్కా కొంచెం మెత్తబడి "నాకిప్పుడు కోపం తెప్పించకు ఇలియా; విధి నన్నసలే వుడికిస్తోంది."

"తొందరపడక బాగా ఆలోచించుకోవోయ్ పిచ్చోడా!" అన్నాడు ఇలియా పాష్కాభుజం తట్టుతూ.

"రెండేళ్ళనుంచి ఆలోచించుతూనేవున్నా. నాకంతా తెలుసు. అసలు నీతో వాగటం కూడ అనవసరం. దేవుడు నీ కన్నీ యిచ్చాడు. కాబట్టే నిమ్మకు నీరెత్తినట్టున్నావు. నీకూ నాకూ సామ్య మేమిటి?"

"చాల్లే, ఇక నోరుముయ్."

"నా ఆత్మ, హృదయం, శరీరం క్షుత్పిపాసల్తో గిల గిల కొట్టుకుంటున్నై. అదే నీకు పిచ్చిగా కనపడుతోంది."

ఇలియా భుజం యెగరేసి అన్నాడు— "మనుషుల మాటలు, వాళ్ళు తమ చేతల్ని సమర్థించుకోటానికి పన్నే కుయుక్తులు వింటే ఆశ్చర్యం కలుగుతుంది. ఆపురుషశ్రేష్ఠులే స్త్రీలను పశు-పిక సమానంగా పరిగణించుతున్నారు. స్త్రీయే ఒక్కసారి మగవానికి వ్యతిరేకంగా ప్రవర్తించినా ఆ అబలకు అధోగతి తప్పదు. స్త్రీ కూడ మానవేనని మగ వాడు యెంచనే యెంచడు.

పాష్కా ఇలియాను చురచుర చూచి నవ్వాడు. "నే నెవర్ని? మనిషినేనా?" అన్నాడు.

"మరి నువ్వు న్యాయంగా ప్రవర్తించవద్దూ"

పాష్కాకి కోపం వచ్చింది. "నీ న్యాయ-ధర్మాలను నీ వద్దే వుండనీ. కడుపు నిండుగావున్నప్పు డెన్ని నీతులైనా స్ఫురిస్తై." అని పాష్కా లేచి తుఱతుఱ వెళ్లిపోతున్నాడు.

ఇలియా వాని నాపటానికి వెంటపడ్డాడు; కాని, పాష్కా అప్పటికే నడిబజార్లో కెళ్ళాడు. "పాష్కా! ఒక్క మాట విని పో"మ్మని కేకవేశాడు; కాని, పాష్కా వెనక్కి తిరిగైనా చూడలా.

ఇలియా వుద్విగ్నహృదయంతో దుకాణంలోకి తిరిగొచ్చాడు. వాని హృదయం దహించుకొనిపోతోంది. "భయంకర వ్యక్తి!" అన్న గ్రైబ్రిక్ మాట ఇలియాచెవిని పడింది. వానికి నవ్వొచ్చింది.

"ఎవర్నండీ ఆయన చంపుతా నన్నాడు?" అనడిగాడు గ్రైబ్రిక్.

"తన పెళ్ళాన్నే!"

గ్రైబ్రిక్ యేదో ఆలోచించుకొని "ఈ మధ్య మా పొరుగున వున్న ఒకామె మొగుణ్ని చంపేశింది. ఎప్పుడూ తాగుతున్నాడని విషం పెట్టింది." అని చెప్పాడు.

"ఇల్లాంటివి నిత్యము జరుగుతూనే వుంటై." అన్నాడు ఇలియా పాష్కాను గూర్చి చింతిస్తూనే.

"నిజంగానే చంపుతాడంటారా?"

"నీకెందుకుపోదూ" అని ఇలియా వాణ్ని కసిరాడు.

గ్రైబ్రిక్ గప్‌చిప్‌గా అవతలికి జారుకున్నాడు. "అయినాకూడా స్త్రీ-పురుషులింకా పెళ్ళిళ్లు చేసుకుంటున్నారే!" అన్నమాటలు వాడినోటినుంచి జారాయి.

కాస్సేపాగి "దుకాణంమూసివేసేవేళ దాటిపోయిం"దని గ్రైబ్రిక్ ఇలియాను హెచ్చరించాడు.

ఎదురుగా వున్న మేడపైగదికిటికీలోంచి దీపం వెల్తురు వస్తోంది. కిటికీఅద్దాలు తళ్తళలాడుతున్నై. ఇలియా అటువేపే చూస్తున్నాడు. కిటికీమధ్యలో పూలగుత్తొకటి వ్రేలాడుతోంది. కిటికీరెక్కలు తెరచినప్పుడు లోపల్నుంచి పాట వినవస్తోంది. ఆ సౌధంలో ఒకన్యాయమూర్తి వుంటున్నాడు. పేరు గ్రోమోవు. ఆయన సతి, చెల్లెలు అపురూపసుందరులు. చెల్లెల్ని చేపట్టాలని శ్రీమంతుల బిడ్డలు, అధికారుల తనయులు ఎందరెందరో కాచుకుని తిరుగుచున్నారు.

నిత్యము సాయంకాలం ఆ మేడ వచ్చి-పోయే వారితో కిటకిటలాడుతూంటుంది. గ్రోమోవునొకరొకడు ఇలియా దుకాణానికి వచ్చినప్పుడెల్లా యజమాని లుబ్ధత్వాన్నిగురించీ, వారి ఆడంగుల భోగ-విలాసాలనుగురించి చెబుతూండేవాడు. ఆ కుటుంబంలోని వారందరూ సుఖజీవులని ఇలియా భావించేవాడు.

గ్రైబ్రిక్ మరోదఫా హెచ్చరించినమీదట దుకాణం మూసివేశారు. బాగా చీకటి పడింది. అన్నితావులా దీపాలు వెలుగుతున్నై. మామూలువేళ దాటిపోయింది. “ఇంతకంటె జైలే నయ” మనుకున్నాడు ఇలియా.

పాష్కారూప మింకా వానికళ్ళముం దాడుతూనే వుంది. ఆ రాత్రి మిత్రునిగురించే ఆలోచించుతున్నాడు. పాష్కా వేరాని చంపలేడనే నిశ్చయానికి వచ్చాడు. “అయినా నేను వేర్వాపక్షం వహించాల్సింది గాదు. వీళ్ళందరూ యేట్లోపడి చావనీ; నాకేం? వీళ్ళు తాము శాంతిగా జీవించలేరు సరిగదా, పక్కవాళ్ళనికూడ శాంతిగా బ్రతకనివ్వరు” అనుకున్నాడు.

గ్రైబ్రిక్ టీకి నీళ్ళుకాస్తున్నాడు. బల్లక్రింద కాళ్ళాడిస్తూ వున్నట్టుండి “ఈపాటికి చంపేసివుంటాడా?” అనడిగాడు.

“నోర్మూయ్! టీ యిచ్చి, పోయి పడుకో” మని ఇలియా వురిమాడు.

పొయ్యిమీద నీళ్ళు పొంగుతున్నై. ఎగిరి బల్లమీదకి దూకబోతున్నట్టు చిందులేస్తోంది. ఎదురింట్లో మహాకోలాహలంగా వుంది. ఇలియా ఆలోచనాధీనుడయి వున్నాడు. దుకాణం తలవాకిలివద్ద యెవరో “ఇలియా లూనఫ్ వుండేది యిక్కడేనా?” అని సన్నని గొంతుతో అడిగారు.

ఇలియా నోరు తెరువకముందే ‘అవు’నంటూ గ్రైబ్రిక్ తలుపు తెరిచొచ్చి “ఆవిడే కాబోలు” లన్నాడు.

"ఎవరు?"

"ఇందాకటాయన భార్య."

అంతలో ఒక బక్కావిడ లోపలి కొచ్చింది. ఆమె ముఖానికి రుమాలు కప్పుకొని వుంది. ఏదోమాట చెప్పి వెళ్ళగోరుతున్న దానిలా నిలబడింది.

తన కెందుకొచ్చిన పీకులాటమని ఇలియా లో లోపల మండిపోతున్నాడు. ఆమె యెవరో గుర్తించక పోయినా "రా, కూర్చో" మన్నాడు.

ఇలియాకంఠస్వరం కనిపెట్టి ఆ యువతి తలమీద ముసుగు తొలగించింది. ఆమె వేరా కాదు, మాషా! ఇలియా అబ్బురపడ్డాడు. ఆమె చేసన్నతో బయటితలుపు మూసి యిద్దరూ వెనకగదిలోకి వెళ్ళారు. గదిమధ్య నిలబడి "నువ్వు నన్ను గుర్తించనేలేదే!" అంది మాషా.

"నువ్వు ఆనవాలుపట్టేలా గున్నావా మాషా! నీ ముఖం యెంత మారిపోయింది! నిన్ను గుర్తించటం చాలా కష్టం" అన్నాడు ఇలియా.

మాషా పూర్వపు మనోజ్ఞమూర్తిలా లేదు. ఎండి పుల్లయింది. నడుస్తుంటే తూలి పడిపోతుందేమో నన్న ట్టుంది. ఇలియా తనచేతిఆసరాతో ఆమెని తీసుకెళ్లి కుర్చీలో కూర్చోబెట్టాడు. రెప్పవాల్చకుండా ఆమె మొహంవంక చూస్తున్నాడు." ఎక్కణ్నుంచి వస్తున్నావు? ఇల్లా అయి

పోయావేఁ? ఓయి దేవుడా! ఎల్లాంటి గతి పట్టింది! నిన్ను చూస్తుంటే గుండె చెరువవుతోంది మాషా!'' అన్నాడు.

మాషా ఇలియావంక చూచి ''దీన్నిబట్టే ఆయన ......'' అని కంఠావరోధమై యిక చెప్పలేకపోయింది.

ఇలియాహృదయం వేదనాభరితమయింది. వెల్తురులో ఆమెని పరిశీలించి చూచాడు. మాషారూపం బొత్తుగా మారిపోయింది. ముఖం వాడి పాలిపోయింది. కళ్లు నూతిలో వున్నట్టున్నై. పెదాలు యెండి బీటలువార్నినై. ఒంట్లో రక్త మున్నట్టేలేదు.

''నువ్వు రుగ్మతగా వున్నావా?'' అనడిగాడు.

''ఎన్నడూ తలనొప్పైనా యెరగను. ఆయనే నాకీ స్థితిని కల్పించాడు.''

''నీ భర్తా?''

''ఊఁ''

అంతవరకు గ్రైబిక్ మాషాపక్కనే నుంచున్నాడు. భయంతో వాడు పెదిమ కరుచుకుంటున్నాడు. ఇలియా వాణ్ని చూచి ''పోయి పడుకో'' మన్నాడు.

గ్రైబిక్‌కు నిద్రపోవాలని లేదు. అక్కడినుంచిపోయి ఆ గదికి దుకాణానికి మధ్యనున్న ద్వారాన్ని పట్టుకొని నుంచున్నాడు. మాషా నిశ్చలంగా కుర్చీలో కూర్చొనుంది. చూపుమాత్రం గది నాలుగుమూలలకు పరుగులెడుతోంది.

ఇలియా టీ తయారుచేసి కప్పు నామె ముందుంచాడు. ఆమె నిం కేమని పల్కరించాలో వానికి తోచలా.

"ఆయన న న్నన్నివిధాల హింసపెడుతున్నాడు. .........." మాషా యిక చెప్పలేకపోయింది. కళ్ళు మూసుకొని కన్నీరు కారుస్తోంది.

"ఏడవకు మాషా! ముందు టీ తాగి నీ కథంతా నాతో చెప్పు, హృదయం తేలికపడుతుంది" అన్నాడు ఇలియా ఆమె ననునయించటానికి.

"నన్ను వెతుక్కుంటూ ఆయన యిక్కడి కొస్తా డేమోనని భయంగావుంది."

"ఇక్కడికి వస్తే తన్ని పంపుతా. నీకు భయమొద్దు మాషా!"

"ఆయన సామాన్యుడు కాదు. అంతంతమాత్రంతో వదిలిపెట్టడు."

"ను విప్పుడు వాడివద్దనుంచే పారిపోయొచ్చావా?"

"మరే. ఇది నాలుగోసారి. ఆయన పెడుతున్న బాధలు సహించలేక తెగించి పారిపోతున్నాను. క్రితం సారి నూతిలో పడి ప్రాణత్యాగం చెయ్యటానికే సిద్ధపడ్డాను గాని, అంతలో ఆ దుర్మార్గుడు వచ్చి నా జుట్టు పట్టుకొని యీడ్చికెళ్లి చావబాదాడు."

తా ననుభవించిన కష్టపరంపరను తలచుకొని మాషా గజగజలాడింది. భయంతో వెర్రిగా చూస్తోంది. తలొంచు

కాని "ఆయన నన్ను యెముకలు విరిగేటట్టు నిర్దాక్షిణ్యంగా కొట్టుతుంటా''డని చెప్పింది.

ఇలియూ కోపోద్దీపితుడై "నిన్ను హింసపెడుతున్నా డని కేసెందుకు పెట్టలా? తిక్క వదిలేదిగా'' అన్నాడు.

"కేసులు విచారించేదీ ఆయనేగా."

"నీ భర్త మెజిష్ట్రేటా?" అనడిగాడు ఇలియా ఆశ్చర్యపడుతూ.

"నా కదంతా తెలియదు. ఒకతడవ కేసు విచారించటానికని వరుసగా పదిరోజులు కోర్టు కెళ్ళారు. ఒకనాడు కోర్టునుంచి ఆకలితో వచ్చారు. వచ్చీరావటంతోనే నా స్తనాల్ని గుడ్డపీలికల్లాగా నలిపేశారు'' అని మాషా తన గౌనుగుండీ విప్పి చనుకట్టు చూపింది. కొరికినగంట్లు స్పష్టంగా కనపడుతున్నై.

మాషాస్థితికి ఇలియా నిలువునా నీరయ్యాడు. "చెల్లీ! ఇక నీ ఒళ్లు దాచుకో'' అన్నాడు మెల్లిగా.

కాని, మాషా ప్రతి అవయవాన్ని చూపుతూ "ఆయన నన్నెల్లా హింసించాడో చూడు!" అంది.

"ఇంతకూ వాడి కా బుద్ధి యెందుకు పుట్టినట్టు?"

"తన్ను నేను ప్రేమించలేదని. ఆమాటే మాటిమాటికి గొణుగుతు నన్ను చెండుకుతింటున్నాడు."

"నువ్వైనా పెళ్లినాటికి చిన్నపిల్లవి కాదే. మరి మీ యిద్దరికీ మనసెందుకు కలవలా?"

"చిన్నప్పటినుంచి నేను నీతోను జాకోబుతోను కలిసిమెలసి వుండేదాన్ని. నా ఒంటిమీద యెవరూ చెయ్యేసి యెరుగరు. మా నాన్నకి బరువు తగ్గిపోతుందని ఆయన యింట్లో వుండిగం చెయ్యటానికి వొప్పుకున్నాను; కాని, ఆయన నాపైన చెయ్యివెయ్యటం సహించలేక పోయాను. ఆయనచేష్టల్లో నాకు ద్వేషము, అసహ్యం కలిగాయి. ఆయన్ని చూస్తేనే నా ఒంటిమీద చీమలూ - జెర్రులూ పాకినట్టుటుంటుంది."

"ఇక వినలేను, వూరుకో మాషా!" అన్నాడు ఇలియా ఆమె వుద్వేగాన్ని గ్రహించి.

మాషా కుర్చీలో వెనక్కి చేరగిలబడింది. ఆమె వక్షమస్లె అనాచ్ఛాదితంగా వుండిపోయింది.

"నీ గౌను సర్దుకో" దుఃఖంతో మిళితమైన సిగ్గుతో ఇలియా హెచ్చరించాడు.

"నీ ముందు నాకు సిగ్గెందుకు?" అంటూ మాషా గుండీ పెట్టుకుంది.

అప్పు డపతలి (దుకాణంలో) నుంచి మెల్లిగా యేడుపు వినపడింది. ఇలియా మధ్యదర్వాజా దాటివెళ్లి గై్రబిక్ వీపు తట్టుతూ "యేడవకు" మని ఓదార్చాడు.

మాషా "ఆ అబ్బాయి యేడుస్తున్నాడా?" అంది.

"అవును."

"చీకట్లో జడుసుకున్నాడు కామోసు."

“కాదు. నీ దుస్థితి విని దుఃఖ మాపుకోలేక పోయాడు.”

మాషా మరి మాట్లాడక టీ కప్పు తీసుకొని నోటి కందించింది. ఆమెచేతులు కంపిస్తున్నై. కప్పు పళ్ళతో ఢీకొని కటకట శబ్దంచేస్తోంది. ఇలియా ఆమెవెనక నిలబడి చూస్తున్నాడు.

ఇద్దరూ కొంతసేపటివరకు మౌనంగానేవున్నారు. “ఇక యేం చేయాలని?” అని ఇలియా కదిలించాడు.

“నే నేం చెప్పగల్ను? నన్ను మళ్లీ పట్టుకొని తీసి కెడుతారేమో”నంది మాషా భయంతో వణుకుతూ.

“నా మాట విని వాడిమీద కేసుపెట్టు. నిన్నెం దుకు బాధపెట్టాలి? ఒకర్ని హింసించేందు కింకొడి కధికార మెక్కడిది?”

“ఆ దుష్టుడు తన మొదటిపెళ్లాన్నికూడ యిల్లాగే బాధించాడట. ఆవిణ్ణి మంచానికి కట్టేసి తొడపాశంపెట్టే వాడట. నే నొకనాడు గాఢనిద్రలో వుండగా తేలు కుట్టినట్టు చురుక్కుమంటే అరుస్తూ లేచాను. తీరా చూస్తే ఆయన అగ్గిపుల్ల గీసి నా శరీరాని కంటించుతున్నాడు.”

ఇలియా యెగిరి లేచి నుంచున్నాడు. “నువ్వు రే పుదయమే పోలీసుస్టేషనుకు పద. ఇన్స్పెక్టరుకు నీ గాయాలు, మచ్చలు చూపించి కేసు దాఖలుచేసి రావాలి” అని కోపావేశంతో బిగ్గరగా అరిచాడు.

వాని ఆవేశాన్ని చూచి మాషా గాబరాపడింది. "కేకలు పెట్టొద్దు ఇలియా! చుట్టుప్రక్కలవాళ్లు వింటారు" అంది భయపడుతూ.

ఇలియా గజగజలాడుతున్న మాషాని మరొకసారి పరీక్షగా చూచాడు. తన చిన్ననాటి స్నేహితురాలు-చక్కని మనోజ్ఞమూర్తి అనతికాలంలోనే అంత వికృత రూపి కావటానికా నరపిశాచం యెలాంటి హింసలు పెట్టి వుంటాడో ఇలియా సులువుగానే వూహించాడు.

"సరే, అంతా నేనే పూర్తిచేస్తాన్లే. ఈ వ్యవహారంలో నేను కలుగచేసుకోక తప్పదు. నువ్విక్కడే వుండు. నా పక్కమీద నువ్వు పడుకో. నేను దుకాణంలో పడుకుంటాను. రేపు వుదయమే............"

ఇలియా చెబుతున్నాడుగాని, మాషా పూర్తిగా అలిసిపోయింది. వినటానికి ఓపిక లేక "ఇక పడుకుంటా"నంది.

ఇలియా పక్క దులిపేశాడు. మాషాని పవళింపజేసి కంబళి కప్పబోతూంటే "నాకు భయమేస్తోంది. ఒంటరిగా వుండలేను. ఆ భయంకరరూపం కళ్లముందు అట్టహాసం చేస్తుంది ఇలియా!" అంది మాషా.

ఆమెగుండె చెదిరిందని ఇలియా గ్రహించాడు. కుర్చీ నామె ప్రక్కకు లాక్కొని కూచున్నాడు. తదేక దృష్టితో ఆమెని చూడసాగాడు. మాషా నిర్జీవప్రతిమలా

పడివుంది. జాకోబు మతిస్సా లామెనుగురించి చెప్పినాకూడా తానంతవరకు శ్రద్ధవహించనందుకు సిగ్గుపడ్డాడు.

"జాకోబుకు కూడ నాగతే పడుతోందని మతిస్సా చెప్పింది. పెట్రుహా అతణ్ణి నానా హింసలు పెడుతున్నాడట. ఇక మా కర్మ మింతేనా?" అనడిగింది మాషా.

"అల్లాంటి తండ్రుల్ని దేశాన్నుంచి తరిమెయ్యాలి. మీయిద్దరి అబ్బలూ పశువులే" నన్నాడు ఇలియా కోపంతో.

నాతండ్రి దుర్బలహృదయుడు. ఆయన్నేమీ అన కూడ" దన్నది మాషా.

"పిల్లల్ని పెంచి పోషించలేని వాళ్ళసలు సంతానా న్నెందుకు కనాలి?"

ప్రక్కయింట్లో యెవడో పాడుతున్నాడు. ఆ పాట కిటికీగుండా వినపడుతోంది.

"నాకు నిద్రవస్తోంది... ఇక్కడ ఎంత శాంతిగా వుంది! జనం యెంత సుఖంగావున్నారు! ఎవరో పాడుకుంటు న్నా"రని మాషా కన్నుమూసింది.

"సామాజికరీతి-రివాజు లివే. ఒకరిచర్మం ఒలుచ బడుతూంటే యింకొకడు పాటలో తన్మయుడవుతుంటాడు."

ఇలియా యిట్లనుకుంటూండగా పాటకుడు స్వరం మార్చాడు. ఆరాగం ఇలియాకి వెక్కసంగా వుంది. లేచెళ్లి కిటికీరెక్కలు మూసివేశాడు. ఆ ధ్వనికి మాషా వులిక్కిపడి కళ్ళు తెరిచింది. "ఎవరు? నాకోసం వచ్చారా?" అనడిగింది.

"ఎవరూ లేరు. నేనే కిటికీ మూశాను."

"నువ్విక్కడినుంచి వెళ్ళిపోతావా?"

"వెళ్ళన్లే. నీకేమీ భయంలేదు, పడుకో" మని ఇలియా ఆమెకి ధైర్యం చెప్పాడు.

మాషా ఒత్తిగిలి పడుకొని నిద్రపోయింది. ఇలియా కాలు కదిపినా, దగ్గినా మాషా అదిరిపడిలేచి "వెళ్ళిపోతున్నావా?" అనో, లేక ఇలియాచెయ్యి గట్టిగాపట్టుకొని "నాకోసం వచ్చిపడ్డారా?" అనో భీతిని వెలిబుచ్చేది.

ఇలియా ఆమెప్రక్కనె కూర్చొని తా నామె కే విధంగా సహాయంచేయాలా అని ఆలోచించుకుంటున్నాడు. పోలీసులకు ఫిర్యాదుచేసేదాక మాషా నక్కడినుంచి కదల నివ్వరాదనీ, యీ వ్యవహారంలో నికోడిమిచ్ సలహా తీసుకోవాలనీ నిశ్చయించుకున్నాడు.

పాట యింకా వినపడుతూనేవుంది. ఇలియా హృదయం నిరాశతో నిండివుంది. బయటికిపోయి అటూ యిటూ రాళ్ళు గిరాటువేద్దామా లేక తుపాకితో ఫైర్ చేద్దామా అనుకున్నాడు. 'అప్పుడెంత హుషారుగావుంటుంది! గుండు దెబ్బలు తిన్న జనం రక్తం వరదలై పారుతోంటే కంగారుతో పరుగుతీస్తారు. అప్పుడీ వెధవ గల్లంతు, పాటలు మొగిరిపోతా' యని తలచుకొని ఒక క్షణం ఆనంద పరవశుడయ్యాడు. 'ఏమిటీ పాటలు? అందులోవున్న మజా యేమిటో! వీళ్ళకు తమ ప్రక్కనే భగవంతుని సృష్టిలోని

ఒక అమూల్యరత్నం స్వజాతిచేతుల్లో నలిపివేయబడి జీవచ్ఛవంలాగా పడివుందని తెలియదు. ఎవరేమైపోతే యెవరికేం?' అనుకున్నాడు ఇలియా తనలో.

మాషా పలవరిస్తోంది. శరీరమంతా భగ్గుమని మండుతూన్నట్టు మూల్గుతూ పక్కమీద దొర్లుతోంది. కంబళిని కాళ్ళతో తన్నేసి చేతులు యెడంగాపెట్టి, నోరు సగంతెరచి పడుంది. ఆమెకు మరణ మాసన్నమైనట్టే భావించాడు ఇలియా. అనుమానంతో లేచి ఆమెపైకి వొంగిచూచాడు. శ్వాస ఆడుతున్న ధ్వని విని ధైర్యం కలిగింది. మళ్ళీ కంబళిని కప్పి కిటికీవద్దకుపోయి గ్రోమోవ్ సౌధం కేసి చూస్తూనుంచున్నాడు. అక్కడింకా కోలాహలంగానే వుంది. కిటికీల గుండా కనపడుతున్న సుందరాంగుల సిల్కుదుస్తుల నిగనిగలకు, హారాలు-ఆభరణాల తళ్ళళలకు ఇలియా కళ్ళు జిగేలుమన్నై. అక్కడ కొంతసేపట్టే ఆ దృశ్యాన్ని తిలకించుతూ నుంచున్నాడు. జడ్జీగారిచెల్లెలు జావళీ పాడుతోంది. మధ్య మధ్య యికయికలు పకపకలు విన్పిస్తున్నై.

ఇలియా తిరిగి మాషామంచందరికి వెళ్ళాడు. ఆమెని చూస్తుంటే వాని కనేక తలపులు కలుగుతున్నై. "మాషాని చూచి లాసినా యేమనుకుంటుంది? నా పరిచితులేమనుకుంటారు?" అనుకున్నాడు. మాషా కలవరింతలు, యెదుటింటి సంగీతము, కేరింతలు వానిని వ్యాకులపరిచాయి. కునికిపాట్లు రాసాగినయి. రెప్పలు వాలుతున్నై. ఇలియా యిక నిద్ర

నాపలేక మంచందరినే నేలమీద కోటుపరుచుకొని మేను వాల్చాడు. కలతనిద్రలో మాషా చనిపోయినట్టూ, శవం చుట్టూ ఆడవాళ్ళుచేరి శోకాలుపెడుతున్నట్టూ, వాళ్లొక సారి విలపిస్తూ మరొకసారి నవ్వుతున్నట్టూ కలగన్నాడు. తర్వాత సావెలు దిమ్మమీద సుత్తితో కొడుతున్నట్టూ, యింకెవడో మిద్దెమీద పచారుచేస్తూ తన్ను పిలిచినట్టూ, తాను లేవబోయి కాళ్లూ చేతులూ బంధింపబడి వుంటంవల్ల కదల్లేకపోయినట్టూ యింకో కలవచ్చింది.

# 27

"ఇలియా! ఇక లెగవోయ్!"

ఇలియా మెల్లిగా కళ్ళువిప్పి చూచాడు. ప్రక్కనే పాష్కా కూచొనివున్నాడు. ఉషఃకాంతులప్పుడే కిటికీగుండా లోపలికొచ్చి పడుతున్నై. ఇలియా మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

"నన్ను చూచికూడ కళ్ళుమూస్తావేరా? లే, లె"మ్మన్నాడుపాష్కా.

వాడి గొంతు గద్గదికమైవుంది. జుట్టు చెదిరివుంది. ఇలియా కంగారుగా లేచి కూచున్నాడు. "ఏమిటి విశేషం?" అనడిగాడు.

"ఆమెను పట్టుకున్నారు."

"ఎవర్ని? వేరానే! ఎక్కడుంది?"

"జైల్లో వుంది. నిన్నవుదయం పట్టుకున్నారు."

"ఎందుకు పట్టుకున్నా"రని ఇలియా ఆతురతగా అడిగాడు.

వారి మాటలసవ్వడితో మాషా లేచికూచుంది. పాష్కావాలకంచూచి ఆ ముగ్ధ బీతుగొన్నది. గ్రైబిరిక్ మధ్యద్వారంవద్ద నిలబడి చూస్తున్నాడు.

"వేరామీద చోరీనేరం మోపారు. నిన్నరాత్రి యెవడో వర్తకుడివద్ద ఆరొందలరూపాయల నగదు, డైరీ, చెక్కుబుక్కు కొట్టేసిందట!"

"ఏమిటీ! నువ్వు చెప్పేది నిజమేనా?" ఇలియా కలతచెందినట్టడిగాడు.

"సోదాలో అవన్నీ ఆమెవద్ద దొరికాయట. అప్పుడు వేరా పోలీసుఇన్స్పెక్టరును ఒక లెంపకాయ కొట్టిందట కూడాను."

"అంతేలే. పట్టుబడినాక యెన్నినేరాలైనా మోపుతారు."

మాషా నవ్వి "నేను జైల్లో నిర్బంధింపబడితే!" అనుకుంది మెల్లిగా. పాష్కా మాషావేపొకసారీ, ఇలియా నొకసారీ చూచాడు.

"నువ్వామెను గుర్తించనే లేదా? మన ఫర్ఫిష్షా కూతురోయ్! నేనీమె సంగతి నీతో చెప్పటమే మరిచాను" అన్నాడు ఇలియా.

మాషా పాష్కా నానవాలుపట్టింది. వాడివంక చూచి నవ్వింది. పాష్కా ఇలియా అన్నదానికి "ఆఁ, జ్ఞాపకం వచ్చింది!" అని ఆవిడ సంగతి తన కెందుకన్నట్టు ముఖం ప్రక్కకి తిప్పుకున్నాడు. మళ్ళీ తనసొద ప్రారంభిచాడు. "వేరా ఆ పని నాకోసమే చేసిందేమో! ఇదివరకల్లా చేస్తానని అపుడపుడు చెపుతూండేది."

"ఎవరికోసం చేసినా ఒకటే. ఇక ఆమె సుఖపడే రోజులు గతించాయనుకోవాలి." ఇలియా నిద్రమత్తు పూర్తిగా వదల్లా. కళ్ళు మూతపడుతూనేవున్నై. కళ్ళు నలుపుకుంటూ "ఇదంతా మంచికిరాలా" అన్నాడు.

"వేరా నేను చెప్పినట్టు వినందే!"

"వినకపోతే నువ్వేంచెయ్యాల్సింది?"

"నా కామెయందు ప్రేమ వుందోయ్! వదిలిపెట్టలేకపోయాను."

"నీ వుత్తుత్త ప్రేమవల్ల ప్రయోజన మేమిటి? నువ్వా వేరాని పరిపోషించ లేకపోయావు."

"అదీ నిజమే."

ఇలియాను మళ్ళీ విషాద మావరించింది. పాష్కా మాషాల దుస్థితికి వగపు కలిగి అది కోపంగా మారింది.

ఇలియా ఆ కోపాన్ని పాష్కాపైకి తిప్పి "ప్రతి వ్యక్తికీ సుఖపడాలనేవాంఛ వుంటుంది. ఆమెకూ అట్టి అభిలాషే వుంది; కాని, నీ వామె నెప్పుడూ నీతోపాటు దరిద్రావస్థలోనే వుంచాలనుకున్నావు. ఆమె యీ వెత లన్నిటికి కారణభూతుడవు నువ్వే" నన్నాడు.

"నే నంతకంటే యేం చెయ్యగలను చెప్పు?" పాష్కా నిష్కళంగా అన్నాడు. వాడి జవాబు ఇలియాను నిరుత్తరుని గావించింది. ఆలోచనలో పడ్డాడు. "ఆమెని నా చేతుల్తో చంపేసినా బాగుండేది!" అన్నాడు పాష్కా నిరాశా సంతప్త హృదయంతో.

"దుకాణం తెరవనా?" గ్రెబిక్ మెల్లిగా అడిగాడు.

"దుకాణానికి నిప్పెట్టు. ఈ గొడవలో బేరం యేమి సాగుతుంది?" అని ఇలియా విసుక్కున్నాడు.

"నా మూలంగా నీ వ్యాపారానికి యిబ్బందేమో!" అన్నాడు పాష్కా.

ఇలియా మోకాళ్ళమీద చేతులు పెట్టుకొని నేల మీద పాదమాడించుతూ "మీలో యెవరివల్లా నా కిబ్బంది లేదు. పైనుంచి యేదో అజ్ఞాతశక్తి మనందర్నీ ఆడిస్తోంది. అదే మనల్ని సరైన మార్గంలోకి రానివ్వటంలేదు. మన తప్పువల్లగాని, మరెందువల్లగాని మనం శాంతిగా బ్రతకడం కల్ల" అన్నాడు.

తర్వాత ఇలియా అటూ యిటూ చూచాడు. మాషా వుదాసీనంగా వుంది. గ్రైబిక్ దుకాణంలో నిలబడున్నాడు. బజారు నిశ్శబ్దంగా వుంది. ఇలియా మళ్లీ మొదలెట్టాడు— "జీవితము నా నాటికి దుస్సహమవుతోంది. ఏ సావకాశమూ లేదు. అనుమానము, జంజాటము యెవర్నీ నిశ్చింతగా వుండనివ్వవు. ముందుకు పోదామన్నా దారీ-తెన్నూ కనపడదు. అంతటా కృత్రిమ విలాసమే. ప్రతిదీ చిక్కులు కల్పించటానికి సిద్ధంగా వుంటుంది. పాడుకొనే వాళ్ళని చూచి వాళ్ళు సుఖంగా వున్నారనుకుంటాము. మనస్సు కలత చెందినప్పుడా పాటే హృదయానికి శూలమై గుచ్చుకొంటుంది."

"ఏమిటీ గొడవ?" అన్నాడు పావ్కా.

"ఏం చెప్పను? ఎటుచూచినా అంధకారబంధురంగా వుంది. మనం సుఖమార్గం కోసం దేవులాడుతున్నాంగాని, యెక్కడా వెలుతురే కన్పించటం లేదు." అని ఆగిపోయాడు.

"అయితే యేమంటావు?" అన్నాడు పావ్కా.

"నే నా పని నుద్దేశపూర్వకంగా చెయ్యానేలే" దని ఇలియా అసందర్భంగా గొణిగాడు.

"నీవు నీ గొడవేగాని........." అని పావ్కా యేమో అనబోతూంటే ఇలియా మధ్యలో "మరి నువ్వో? నీ పాట యెవర్ని గురించి? ఆ వేరాని గూర్చేగా. ఆమె యెవరిది? నీదా? నాదా? ప్రతివాడు తన బాధనే వెళ్ళబోసు

కొని యేడుస్తాడు, మూల్గుతాడు, అరుస్తాడు. నేను నా బాధనే చెప్పటంలా. అస లందరిస్థితీ యింతే. అందరూ నన్ను వేధించేవాళ్ళే" నన్నాడు.

"అయితే నీ కెందుకు బాధ? నేను పోతున్నాన్లే." అని పాష్కా లేచాడు.

"నా మీద కోపమెందుకోయ్! నన్ను సాంతం చెప్ప నివ్వు. నేను మాత్రం తక్కువ పీడించబడ్డానా! స్వయంగా శోకసంతప్తహృదయమైతేనే గాని మరొకని వేదనని గ్రహించ లేడు" అని ఇలియా దీనంగా చెప్పి వూరుకున్నాడు.

"నాలో చైతన్యం లుప్తమైపోయింది. ఎవడో నా బుర్రమీద బడితెతో బాదటంవల్ల మెదడు బయటికి కక్కి నట్టుగావుంది. వేరానుగూర్చినచింత నన్ను వదలకుండా వుంది. ఏంచెయ్యటానికీ తోచటం లే" దన్నాడు పాష్కా.

"పాష్కా! నువ్వేమీ చేయనక్కర్లా. వేరాధ్యాస మాత్రం వదిలిపెట్టు. ఆమె దగ్గర చోరీఆస్తి దొరికింది; కాబట్టి ఆమె కెల్లాగూ శిక్ష తప్పదు."

పాష్కా మళ్లీ కూచున్నాడు. "ఆమె ఆ దొంగ తనం నాకోసమే చేసిందని నే నెళ్లి చెప్పితే వేరాని వదిలి పెట్తారేమో!" అన్నాడు.

"ను వెక్కడి నుంచైనా దిగొచ్చిన దొరవాయేఁ? ఆమెతోపాటు నువ్వుకూడ నేరస్తుడి వవుతావు. పిచ్చిభ్రమలో పడక జాగ్రత్తగా వుండు" మని మాషా నుద్దేశించి

''మేము పోయి దుకాణంలో కూర్చుంటాము. నువ్వు మొహం కడుక్కొని టీ తయారు చెయ్య'' మని స్టౌ, తేయాకు వగైరా సామగ్రి చూపెట్టాడు.

"సరే గాని, నా గతేమిటీ? నే నెక్కడికి పోవాలి?" అని మాషా అడిగింది.

''ఎక్కడికీ పోవద్దు. వ్యవహారం తేలేవరకు యిక్కడే వుండు. ఇది నీ యిల్లే ననుకో. నీ కెక్కడ శాంతి లభిస్తే అదే నీ కి''ల్లని చెప్పి ఇలియా దుకాణంలోకి వెళ్ళాడు.

అక్కడికిపోయి కూర్చున్నతర్వాత "మాషా చచ్చే దానిలాగుందే! నీ దగ్గ రెందుకుంది?" అనడిగాడు పాష్కా.

ఇలియా ఆమె విషాదగాథను సంక్షేపంగా చెప్పాడు. తనతోపాటు మరోవ్యక్తికూడ దురవస్థలో వున్నందుకు పాష్కా తృప్తి చెందాడు. ఇలియా ఆశ్చర్యంగా వాని మోము నవలోకించసాగాడు. పాష్కా నవ్వి "ఆ దుర్మార్గుడు ..." అని మాషాభర్త నుద్దేశించి యేమో తిట్టాడు.

ఇలియా దుకాణంలో బీరువాలో అమర్చిన వస్తువుల్ని చూస్తూ అన్నాడు- "మన జీవితాలు మోసము, వంచన, తాగుడు, వ్యభిచారాది అవలక్షణాలతో నిండివున్నై. ఏ ఒక్కని మనస్సు అంతకంటె సత్పథం వేపుకు మొగ్గటంలేదు. అందరి హృదయాలు ఒకేరంగు పూత పెట్టబడినట్లున్నై. ఇష్టమున్నా లేకపోయినా తప్పనిసరిగా మనమిల్లాగే జీవించవలసివస్తోంది. మన కెక్కడా రక్షణలేదు; ఆశ్రయ మసలే లభించదు.

ఎప్పుడో ఒకప్పు డీ వ్యాపారంమీద రోతపుట్టి నే నీ దుకాణాన్ని వదిలేస్తానన్నావు జ్ఞాపకం వుందా? నీ జోస్యం యదార్థమే అయింది. నా కీ దుకాణంమీద నిజంగానే యేవగింపు కలిగింది. రాత్రింబగళ్ళు కుళ్లుతూ యిందులో పడివున్నందుకు నాకు లభించే దేమిటి? ప్రపంచంలోని శోక-దుఃఖాలకు నా స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను అమ్ముకున్నాను. ఇక్కడినుంచి ఒక్కనిమిషమైనా కదలటానికి వీల్లేదు. ఈ రొంపిలో కాలు పెట్టకముందు స్వేచ్ఛగా తిరుగుతూండేవాణ్ణి. పట్టణంబయటికి పోయి ప్రకృతిసౌందర్యశోభను తిలకించుతూ, మందమారుతాన్ని సేవిస్తూ మైమరచేవాడిని. ఇప్పుడో! కూపస్థమండూకంలాగా యిందులోపడి కొట్టుకుంటున్నాను.''

''నువ్వు వేరా నీ దుకాణంలో సహాయినిగా వుంచుకొనివుంటే బాగుండేదేమో!''

ఇలియా పాష్కావంక చూచి మౌనంవహించాడు. మాషా ''టీ తయారైంది, రం''డని పిల్చింది.

ముగ్గురూ టీ తాగటానికి కూచున్నారు. ఎవరూ మాట్లాడటం లేదు. అప్పటికి యెండ బాగా వచ్చింది. అది వసంతఋతువు. ప్రకృతిసౌందర్యం ఆహ్లాదాన్ని కలుగజేస్తోంది; అయినా ఆగదిలోమాత్రం శోకదేవత తాండవమాడుతోంది.

''మనం శవంముందు కూచున్నట్టుగా వుం'' దన్నాడు ఇలియా నిస్తబ్ధతను భంగపరుస్తూ.

"వేరా శవాన్నా?" అనడిగాడు పాష్కా. వాని హృదయం తూట్లుపడినట్టుంది. కాళ్లు–చేతు లాడటంలేదు. స్వరం మందగించింది.

"పాష్కా! ధైర్యంగా వుండవోయ్. ఈ విధంగా బెంబేలుపడి ప్రయోజన మేముంది?" అన్నాడు ఇలియా.

"అంతరాత్మ నన్ను ధిక్కరిస్తోంది. నామూలంగానే ఆమె వెతలపా లయిందనేభావం నా హృదయంలో పదే పదే రేగుతోంది."

"అందులో నిజం లేకపోలేదు లే"

ఈ మాట విని పాష్కా తిరస్కారసూచకంగా ఇలియావంక చూడసాగాడు.

"ఎందు కల్లా చూస్తావ్?" అన్నాడు ఇలియా.

"నువ్వు చాలా నిష్ఠురంగా మాట్లాడుతున్నావు. నా యందు నీ కే మాత్రం జాలిలేదు."

"నేను దయాళువునని చెప్పుకో లేదే. నే నుదారుడనుగా యెందుకు నటించాలి? ఎవడైనా యెప్పుడుగాని నా కోసం జాలిపడినవా డున్నాడూ? ఇంతవరకు నా జీవితంలో నన్ను హృదయపూర్వకంగా ప్రేమించింది ఒకేఒక వ్యక్తి; కాని, ఆ మనిషి వెలయాలు! తతిమ్మావాళ్ళందరూ నా రక్తాన్ని పుడుకెత్తించిన వాళ్ళే. అటువంటి వాళ్ళకోసం నే నెందుకు జాలిపడాలి? ముఖప్రీతికి యిచ్చకాలాడటం నాకు చేతకాదు."

ఇలియాముఖం యెఱ్ఱబడింది. కూర్చున్నచోటునుంచి లేచి మధ్యద్వారాన్ని సమీపించాడు. వాని హృదయం అల్లకల్లోలంగా వుంది. బిగ్గరగా అరవాలనిపించింది. కుర్చీలు, బల్లలు, తలుపులు, గోడలు విరగదన్ని కూలద్రోయా లనిపించింది ఇలియాకి.

మాషా వాని మానసికాందోళనను గ్రహించి గాబరాపడింది. చిన్నపిల్లవలె రోదనమారంభించింది. ఏడుస్తూనే "నే నిప్పుడే వెళ్లిపోతాను. నన్నిక పోని" మ్మంది ఇలియాతో.

ఇలియా తన విషయంలో అందరికి అసంతృప్తిగానే వుందని తెలుసుకున్నాడు. "ఏడుస్తా వెందుకు? నేను నిన్నే మీ అన్నేదే! వెళ్తా నంటున్నావు, యెక్కడికి? ఎవరూ యెక్కడికీ పోనక్కర లేదు. నేనే వెళ్లిపోతాను. నీతో పాటు పాష్కాకూడ యిక్కడే వుంటాడు. (గ్రైబిక్ వేపుచూచి) లాసినా వస్తే........" అని చెప్పి దుకాణంలో అడుగు పెడుతున్న సోంకా కనపడటంతో ఆపివేశాడు. "నమస్తే!" అని ఆమెకు స్వాగతం చెప్పాడు.

సోంకా వస్తూనే లోపలి వారిని చూచింది. క్రొత్త వారిని వింతగా చూస్తూ కాస్సేపటివరకట్లై నిలబడుండి ఇలియాకి ప్రతివందనం చేయాలన్న సంగతే మర్చిపోయింది. మొహం మురమురలాడుతోంది. మెల్లగా తమ్ముణ్ని దగ్గరకు రమ్మని పిల్చింది.

ఇలియాకు ఒళ్లుమండింది. దగ్ధహృదయంతో "ఏయ్! పడుచుపిల్లా! వందనానికి ప్రతినమస్కారం చేయకుండా అవమానించటం సముచితమేనా?" అని అడిగేశాడు.

ఆ మత్తకాసిని తలెత్తి చూచింది. మోహం చిట్లించి ఔడుకరచుకుంటూ ఇలియా నెగాదిగా చూచింది. గ్రైబిక్‌కు కూడ రోషం వచ్చింది. వాడు ఇలియావైపు చురచుర చూస్తున్నాడు.

"ఇక్కడ దొంగలు, తాగుబోతులు, రౌడీలు లేరు. నిన్నితరులు గౌరవించినట్టె నువ్వెదుటివారికి మర్యాద చూపాలి. విద్య, సభ్యతలు మనకు నేర్పేదిదే" నన్నాడు ఇలియా.

"నీకింత అహంభావం కూడ దక్కా!" అంటూ గ్రైబిక్ సోంకాదరికి పోయి చేయిపట్టుకున్నాడు.

ఒక్కసారిగా నిస్తబ్ధత అలముకుంది. ఇలియా సోంకాలిద్దరూ ద్వేషభావంతో పరస్పరావలోకనం చేసుకొంటున్నారు. మధ్య యీ మిడిమేల మేమిటనుకుంటూ మాషా ఒకమూల కొదిగింది. పాష్కా కళ్ళునలుపుకుంటున్నాడు.

"సోంకా! మాట్లాడవే? ఆయన నిన్నవమానించాలనుకొంటున్నారనా నీ తలంపు? (నవ్వు తెచ్చుకొని) వీరందరూ చాల మర్యాదస్తులు, తెలిసిందా?" అన్నాడు మళ్లీ గ్రైబిక్.

సోంకా గ్రైబిక్ చొక్కాపట్టుకొని లాగి, ఇలియా వేపు తిరిగి "మీ ఉద్దేశమేమి" టని అడిగింది.

"ఏమీ లేదు. కేవలం......" అని వాక్యం పూర్తి చేయకముందే మనస్సులో యేమి తట్టిందో సోంకా చెంతకు పోయి "మేము ముగ్గురము విద్యాహీనులమే! నువ్వే చదువుకొన్నదానివి" అన్నాడు.

ఏమేమో వెళ్ళగ్రక్కాలని ప్రారంభించాడు; కాని ఆమె నిశితదృష్టికి చల్లబడ్డాడు. కోపం అదృశ్యమయింది. సోంకా రెప్పవాల్చకుండా చూస్తోంది. గ్రైబ్రిక్ చేతిని గట్టిగా పట్టుకొనేవుంది. ఆమె ముఖభంగిమనుగాంచి ఇలియా తల వొంచుకున్నాడు. "నేను చెప్పవలసింది చాలా వుంది. మీరు శ్రమఅనుకోకుండా కాస్సేపు కూర్చుంటే బాగుంటుంది. లోపలిగదిలోకి రం''డని ఇలియా అతి వినయంగా చెప్పాడు.

సోంకా గప్‌చిప్‌గా గదిలోకి వెళ్లింది. ఇలియా కుర్చీ చూపించాడు. ఆమె కూర్చున్నది. పాష్కా చల్లగా దుకాణంలోకి జారాడు. మాషా ఒక మూలగా నుంచోనుంది. ఇలియా సోంకా కెదురుగా నిలబడ్డాడు; కాని, మాట్లాడేందుకు సాహసించ లేకపోతున్నాడు.

"మీరు చెప్పదలచిన దిక చెప్పం''డంది సోంకా.

"అదిగో, ఆ మూలనున్న తరుణి కర్కోటకుడగు ఒక వృద్ధునికి అంటగట్టబడింది. వాడీమెను నిత్యము వేపుకొనితింటున్నాడు. ఒళ్ళంతా హూనంచేశాడు. ఆ యాతన పడలేక పారిపోయివచ్చింది. మీ కది తప్పుగా తోచవచ్చు కాని, యేం చేస్తుంది చెప్పండి?"

ఇలియూ మాషాదీనచరిత్రమంతా సోంకా కెరింగించాడు. చివరకు తన వుద్దేశాన్ని చెప్పాలనుకున్నాడు; కాని, వానికందుకవకాశమీయకుండానే సోంకా యిల్లా చెప్పింది— "నేను మీ అభిప్రాయాన్ని గ్రహించాను. ముందు మీ రామెను డాక్టరుకు చూపించవలసివుంటుంది. డాక్టరీమెను పరీక్షించి ధ్రువపత్రిక నిస్తాడు. నాకు పరిచితుడైన డాక్టరొకాయన వున్నాడు. మీ కిష్టమైతే నే నీమెనిప్పుడే తీసుకెళ్తాను. ఆయన యిప్పుడింటివద్దనే వుంటారు."

ఈ మాటలు చెపుతూంటే సోంకాముఖం గాంభీర్యత దాల్చివుంది. ఆమె నుదుల్లో జాలీ, ఔదార్యము యిమిడివున్నై. ఇలియూ విస్మయంగా ఆమె నవలోకించుతున్నాడు. అప్పుడు వానికి సోంకా మాషాలకు పరిచయం చెయ్యాలనైనా తోచలా.

సోంకా స్వతంత్రించి మాషావద్ద కెళ్ళింది. ఆమె కన్నీరు కార్చుతూండటం చూచి "ఏడవకమ్మా! డాక్టరు చాలా మంచివాడు. నిన్ను పరీక్షించి నీ దెబ్బలకు ఋజుపత్రిక నిస్తాడు. మళ్ళీ నేను తీసుకొచ్చి దిగబెడుతా" నని సోంకా సానునయంగా మాషాభుజంమీద చెయ్యేసింది. ఆ హతభాగినిని తనవద్దకు లాక్కోవాలనుకున్నది.

కాని మాషా కెవ్వున కేకపెట్టి వెనక్కితగ్గి "అక్కడ వుండు వుం"దని చెప్పింది.

ఇలియూ భ్రమాన్పడిచూస్తున్నాడు

"పాపం! ఆ దుష్టుడెంత కఠినహృదయుడో!" నని సోంకా విచారాన్ని వెలిబుచ్చింది.

ఇలియూ ఆవేశంతో "ఇది మా జీవితాలకు వుదాహరణ మాత్రమే. ఇప్పుడు మరొక నిర్భాగ్యునితో కూడ మీకు పరిచయంచేస్తాను. అతనిజీవితమూ సాక్షిగా లేదు" అని పాష్కాని పిలిచాడు. పాష్కా మెదలకుండా వచ్చి కరస్పర్శకు చేయిజాపాడు.

"మీరు మరికొంచెంసేపు ఓపికపట్టి వీనికథకూడ వినం" డన్నాడు ఇలియూ.

సోంకా పాష్కాచేయి వదలి వానిముఖంలోకి చూడ సాగింది. ఇలియూ పాష్కా, వేరాలనుగూర్చి శ్రుతపర్చాడు. పాష్కాని ప్రశంసించుతూ "ఈయన గొప్ప కవి కూడాను. అయితే యేం లాభం? సంసారం చిక్కులో పడటంవల్ల కవితాధార కట్టడిపోయింది. ఇతడు వేశ్యాసంపర్కం కలిగి వున్నాడని హీనంగా చూడరనుకుంటాను. మంచి-చెడ్డలు కలిసేవుంటాయి కదూ!"

"అవును, నిజమే" నంది సోంకా. ఒక క్షణమాగి ఆమె పాష్కా నుద్దేశించి "మీరు వ్యాకులపడితే ప్రయోజనం లేదు. వెంటనే ఆమెతరపున ఒకన్యాయవాదిని యేర్పాటు చెయ్యండి. సమర్థుడైన వకీలును నియమించి ఆమె కొరకు బాగా వాదించేటట్టు చూడాలి. నేను మాట్లాడి యేర్పాటు చేస్తాలెండి. ఆమె తప్పకుండా విడుదల కావచ్చు" నన్నది.

"ఇదివరకు ముక్కూ—మొహ మెరుగని నాకు మీ రీ విధంగా సహాయపడుతున్నందుకు యెంతైనా కృతజ్ఞుడ్ని. మీ యీ ప్రయత్నం ఫలిస్తుందన్న ఆశ నాకే మాత్రం లేదు; అయినా ప్రస్తుతం మీరు చెప్పినట్టు చెయ్యటంకంటె గత్యంతరం లేదులెండి" అన్నాడు పాష్కా నమ్రభావంతో.

"సాయంత్రం యేడుగంటలకు నన్ను కలుసుకోండి. గ్రైబిక్ మిమ్మల్ని మాయింటికి తీసుకొస్తాడు."

"మీ కింకొకసారి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు."

"అవన్నీ అనవసరం. మీరు హుషారుగావుండండి."

"మీ వుపకారానికి కృతజ్ఞత తెలుపకుండా యెలా వుండగలను?"

"అందరము పరస్పరసహాయం చేసుకోవలసిందేగా" అని సోంకా చెపుతూండగా గ్రైబిక్ తన సోదరి నుద్దేశించి "నువ్వు మాటలధోరణిలో వేళ మర్చిపోతావు. ఇప్పుడెన్ని గంట లయిందో చూచావా?" అని హెచ్చరించాడు.

"చెల్లీ! వెళ్దాంరా" అని సోంకా మాషాను పిల్చింది.

"బయటికి వచ్చేందుకు తగిన దుస్తులైనా నా వద్ద లే"వని మాషా బిక్కమొగంతో చెప్పింది.

"పర్వాలేదులే రావమ్మా! ఆపళంగా వ్యాపోదాము. (పాష్కాతో) మీరు సాయంకాలం తప్పక వస్తారుకదూ?" అన్నది సోంకా.

బయల్దేరేటప్పుడు సోంకా ఇలియూకు నమస్కరిస్తూ అంది— "ఇందాక నేను మీకు ప్రతి నమస్కరించి వుండ వలసింది. నేను చేసినది అనుచితమే. మీరు నన్ను మన్నించాలి."

ఆమె సిగ్గుతో తల వంచుకున్నది. ఇలియూ యేదో అజ్ఞాత భావ ప్రేరితుడై "నేనూ లజ్జపడుతున్నాను. అప్పుడు నన్ను మీరవజ్ఞ చేశారన్న తలంపుతో చాల పరుషంగా మాట్లాడాను" అన్నాడు.

"మీ స్వాభిమానం ప్రశంసార్హమైనది. అన్యుల తిరస్కారాన్ని సహించలేకపోవడం తప్పు కాదు. మీవంటి వారితో యింత సేపు మాట్లాడే సదవకాశం లభించినందుకు నా కానందంగా వుంది" అని సోంకా వెళ్ళడాని కాయత్తమయింది.

ఇలియూ మోము వికసించింది. సోంకా మాషాని తోడ్కొని వెళ్లిపోయింది. చెలికాం డ్రిద్దరు మిగిలిపోయారు. వాళ్ళిద్దరూ సోంకాను గురించే లోలోపల ఆలోచించుకొంటున్నారు. సోంకా తలబిరుసు తగ్గించుకొని చక్కగా కలసి మెలసి మాట్లాడిందని ఇలియూ సంతృప్తి చెందాడు. "మీ అక్క బలే చిత్రమైన మనిషోయ్!" అన్నాడు ఇలియూ గ్రైబ్రిక్‌తో.

"ఇంతకూ యివాళ దుకాణం తెరిచేదుందా లేదా?" అనడిగాడు గ్రైబ్రిక్.

"ఇవాల్టికి సెలవేలే. సరదాగా తిరిగొస్తాను."

"నేను స్టేషనుకు పోయి వీలైతే వేరాను చూచి మాట్లాడి వస్తా" నని పాష్కా లేచాడు.

"సరే, పోయిర" మ్మని ఇలియాకూడ లేచి బయటికి వెళ్ళాడు.

# 28

ఇలియా చాలా రోజులకు మళ్ళీ నేడు దుకాణం విడిచి బయల్దేరాడు. నడుస్తున్నాడేగాని మనసులో సోంకాను గురించే ఆలోచించుతున్నాడు. తన పరిచితురాండ్రతో ఆమెను పోల్చిచూస్తున్నాడు. వానిదృష్టికి ఆమె సుశీలగాను వుదాత్తహృదయినిగాను కన్పిస్తోంది. 'ఆదిలో నాపట్ల తిరస్కారభావం చూపినా, తరువాత యెంత సౌమ్యంగా మాట్లాడింది!' అనుకున్నాడు.

బజారు మహా సందడిగా వుంది. విద్యార్థులు యీలలు-కేకలతో పాఠశాలలకు పోతున్నారు. బిచ్చగాండ్రపాటలు, అరవులు సరేసరి. బండ్ల బడబడ, కుక్కల బౌబౌల ధ్వని కర్ణకఠోరంగా వుంది. కాఫీహోటళ్ళు, క్షౌరశాలల్లోని గ్రాంఫోనుపాటల్తో చెవులు చిల్లులుపడుతున్నై. ఎండ తీక్ష

ణంగావుంది. పైన గ్రద్దలు, డేగలు యెగురుతున్నై. రాక రాక బయల్దేరిన ఇలియాకు పరమానందంగావుంది. బజార్లోని ప్రతిదృశ్యము వానికి వింతగా అగపడుతోంది. ఇలియా ప్రక్కగా ఒక యువతి వచ్చి తారాచువ్వలా దూసుకొనిపోయింది. ఆ పడుచుచూపు వానిఅందాన్ని మెచ్చుకుంటున్నట్టుంది. ఆమెని చూచి ఇలియా నవ్వుకున్నాడు.

ఒక్కొక్క దృశ్యమే చూస్తూ ఇలియా స్మశానవాటికను చేరుకున్నాడు. అత డక్కడికి వుద్దేశరహితంగానే వెళ్ళినా అందలి ప్రతిసమాధిని పరిశీలనగా చూస్తూ వాటిపై అంకితమైయున్న అక్షరాలను శ్రద్ధగా చదువుతున్నాడు. ఒక సమాధిమీది రాతను చూడగానే ఇలియా భయకంపితుడయ్యాడు. వానిగుండె దడదడలాడింది. స్థంభించిపోయిన వాడు మెల్లగా అడుగుతీసి అడుగేస్తూ ఆ సమాధిదాపులోకెళ్ళాడు. ''వణిక్పుంగవుడు పోలటోవ్ మృతదేహము యిందుంచబడిన''దని దానిమీద రాయబడివుంది.

ఇలియా కొంతసేపటికి తేరుకున్నాడు. తాను భయకంపితుడవటం యెవరైనా గమనించుతున్నారేమోనని నలువైపులా పారజూచాడు; కాని, ఆ చుట్టుపక్కల యెవరూ లేరు. దూరానమాత్రం యెవరో ఒకసమాధిముందు మోకరిల్లి ప్రార్థనలో లీనమైయున్నట్టు కనపడింది.

పోలటోవ్ సమాధిమీద రెండస్థికలు యేటవాలుగా ఒకదానికొకటి అడ్డంగా చిత్రింపబడినై. అక్కడే ఒకపుస్త

కము, ఒక పుర్రెకూడ అంకితంచేయబడినవి. ఆ సమాధికి పార్శ్వమందింకొక సమాధికూడ వుంది. దానిమీద 'యూఫ్రోషియా పోలటోవ్, వయస్సు 22 సంవత్సరాలు' అని చెక్కబడింది.

అది పోలటోవ్ ప్రథమసతిదయి వుంటుందనుకున్నాడు ఇలియా. అప్పుడు దానిని గతసంఘటనల స్మృతిచుట్టవేసింది. పోలటోవ్‌ను మొదటిసారి తానెప్పుడు చూచినదీ, బజారున పోతూ వానిదుకాణంముందాగటమెల్లా తటస్థించినదీ, ఆ సమయంలో తనమనోవీధినెట్టి భావాలు సంచరించినదీ, తలవనితలంపుగా తానెట్లు పోలటోవ్‌ను హత్యచేయుట సంభవించినదీ తలపుకొచ్చాయి. ఈ తలంపుతో వానియందెట్టి వికారము కలుగలా. ఇలియా ఆ సమాధియందె చూడ్కినిల్పి నిలబడి వున్నాడు. ఈశ్వరవిచారణ, తన పాపఫలితంగా విధింపబడే శిక్షలనుగూర్చి ఆలోచనకలిగింది. "ఓ మానవరూప పిశాచములారా! మీ మూలంగానే నా జీవితము ధ్వంసమైపోయింది. మీ కెన్నడు శాంతి వుండదు. మీవల్లనే నేను అధఃపతనమయ్యాను. నా బ్రతుకు నరక తుల్యమయింది" అని మానవసమాజంపై ఆక్రోశించసాగాడు.

తన తిట్లు మానవులందరికి వినపడేటట్టు నోరుచించుకొని అరవాలనుకున్నాడు. ఇలియా పళ్ళునూరుతూ సమాధి వేపు చూస్తున్నాడు. పోలటోవ్ స్మరణతో వానికి ఒళ్ళు మండుతోంది. బొజ్జనిమురుకొంటూ దొంగచూపుతో వాడు

తన కళ్ళముందు నాట్యమాడుతున్నట్టుంది. మాషా ముసలి మొగుడు, లాసినాభర్త పోలటోవ్ కిరుప్రక్కలదరువు వేస్తూ, తనపైకి హూంకరించుతున్నట్టు తోచింది.

ఇలియా తా నానుకొనివున్న చెట్టు ఆసరాను వదలి నిటారుగా నిలబడ్డాడు. వాని టోపీ జారి క్రిందపడింది. దాన్ని తీసుకోటానికి క్రిందికి వొరిగాడు. అయినా సమాధిపైన నిలిచివున్న దృష్టిని మరల్చుకోలేకపోయాడు. టోపీ నందుకొని అక్కడినుంచి కదిలాడు; ఎల్లాగో ఒలుకులు దాటి బయటపడ్డాడు.

దుకాణానికి వెళ్ళడానికి ఇలియా కిష్టంలేకపోయింది. ఉద్దేశహీనంగా రోడ్డువెంట పోతున్నాడు. వానిదృష్టి వచ్చే-పోయేవారిమీద లేదు. చుట్టుప్రక్కల యేమి జరుగుతున్నదీ వానికి పట్టలా. పోయి పోయి పెట్రుహా హోటలుముందుకు చేరాడు. ఇష్టంలేకపోయినా జాకోబు నొకసారి చూచిపోదా మనుకున్నాడు. గేటులో అడుగుపెడుతూనే "సోదరులారా! దయవుంచి నన్నొదిలిపెట్టండి. నా యెముకలు విరిచెయ్యకం" డంటున్న ఫరిషిష్టాదీనాలాపాన్ని విన్నాడు.

ఇలియా హోటలు ద్వారంలో నిలబడి లోపలికి చూచాడు. జాకోబు గల్లాపెట్టిముందు కూచునివున్నాడు. ఎవరికేంకావలసినవి వారి కిప్పించుతూ బిల్లులకు సొమ్ముపుచ్చుకొని సొరుగులో వేసుకుంటున్నాడు.

జాకోబు రీతిని వ్యాపారంలో లీనమైవుండటం చూచి "వీడికి వ్యాపారం బాగానే పట్టుపడింది!" అనుకున్నాడు ఇలియా.

ఇలియాను చూచి జాకోబు సంతోషంతో యెగిరి గంతేశాడు. ఎదురెళ్ళి ఇలియాచేతిని గట్టిగానొక్కి కౌగ లించుకున్నాడు; కాని, అంతలో మళ్లీ యేంతోచిందో వెనక వేపు ద్వారంకేసి బిత్తరపోయి చూచాడు. అది మూసి వుండటంచూచి కుదుటబడి "ఏమిటి విశేషాలు!" అనడిగాడు.

"సరేగాని, నీ పని యెలావుంది?" అని ఇలియా ప్రశ్నించాడు.

"చూస్తున్నావుగా!"

"చివరకు నిన్నందరూ కలిసి పంచారన్నమాట?"

"ఇంతకంటె దారేముంది?"

అని ఇలియావంక దీనంగాచూస్తూ చాలా రోజులకు కలుసుకున్నాము. మానాన్న యింట్లో లేడులే. అమ్మ నిక్కడ కూర్చోబెట్టి వస్తానుండు. కాస్సేపు ఖులాసాగా కబుర్లు చెప్పుకుందా"మని జాకోబు వెనకద్వారం వద్దకుపోయి అమ్మా కొంచెంసే పిక్కడ కూర్చో; నేనిప్పుడే వచ్చేస్తానని అతిగౌరవంగా సవతితల్లిని పిల్చి చెప్పాడు.

ఇలియా పూర్వం తాను పినతండ్రితో నివసించిన గదిలోకెళ్లి కూచున్నాడు. గది నాలుగుమూలలా పరి కించాడు. గోడరంగు వెలిసిపోయింది. ఒక మంచం వాల్చి

వుంది. పుస్తకాలతో ఒక బీరువాకూడ వుంది. ఇలియా పడుకొనే చోట ఒక చెక్కలపెట్టె వుంది.

జాకోబు గబగబా వచ్చి "ఒక గంటసేపు వ్యవధానం చిక్కింది. టీ తెప్పించనా?' అని ఒక సర్వరును తేనీరు తెమ్మన్నాడు. అంతలో వాడికి దగ్గుతెర వచ్చింది. ఊపిరాడక రొప్పుతున్నాడు.

"నీ ఆరోగ్యం బొత్తుగా చెడిపోయిందే?" అన్నాడు ఇలియా విచారంగా.

"రోజురోజుకు నేను క్షీణించిపోతున్నాను...... అదృష్టవశాత్తు నువ్వు కన్పించావు. నీ వ్యవహారం ఎల్లా వుంది?"

"నాకేమీ పర్వాలేదులే. నీ సంగతే విచారించాలి."

ఇలియా తనవిషయాలుకూడ చెప్పి మిత్రుని వ్యాకుల పరచ దలచలా. అసలు మాట్లాడాలన్న వుత్సాహమే వానికి లేదు. జాకోబుదీనస్థితి వానిని బాధించ సాగింది.

"ఏదోవిధంగా ప్రాణం నిలబెట్టుకొస్తున్నా" నని జాకోబు నిరాశాభావం వెలిబుచ్చాడు.

"మీనాన్న నీరక్తమంతా పీల్చి పిప్పిచేశాడోయ్!"

"తనూ అనుభవించు తున్నాడులే. బలేవాళ్ల పాల బడ్డాడు!"

"శాస్తి జరగాల్సిందే!"

"మా మారుటితల్లే మానాన్న యావదాస్తికి యజమానురాలయింది. ఈయింట్లో ఆవిడమాటకి తిరుగు లేదు."

"ఆ పెట్టెలోని దేమిటి?"

"హార్మోనీ. నాన్న కొనిచ్చాడు. ప్రస్తుతం దీనితో నేర్చుకొంటే నెమ్మదిమీద మంచిది తెస్తానన్నాడు. నే నెందుకూ కొరగానసీ, హోటలుకు వచ్చేవారి వినోదానికి హార్మోనీమీద పాడటమైనా నేర్చుకోమనీ చెప్పాడు. ఆయన చెప్పినదాన్లో అర్థం వుంది లే. ప్రతిహోటల్లోను జనాకర్షణకు యేదో ఒక వాయిద్య ముండాలి."

"మీ నాన్న పక్కా సైతాను!"

"ఏం?"

"నీ ప్రాణంపోయేప్పుడు నిన్నీడ్చికెళ్ళి హోటల్లో పెట్టి, నీ అంతిమఘడియలు చూడటానికి వచ్చేవాళ్ళకు టిక్కెట్టు పెట్టమని మీ నాన్నతో చెప్పు. నీ చావుకూడ డబ్బు చేసి పెడుతుంది."

జాకోబుకు నవ్వొచ్చింది. నవ్వు దగ్గులోకి ఫిరాయించింది. చేతుల్తో రొమ్ము పట్టుకొని దగ్గుతున్నాడు.

ఫర్ఫిష్కా సితారు వాయించుతున్నాడు. దగ్గు వుపశమించిన తర్వాత ఇలియూ జాకోబు నడిగాడు— "నీ సవతిసోదరుడు నీతో కలసిమెలసి వుంటున్నాడా?"

"వా డిక్కడ వుండటంలేదుగా. కాలేజిహాస్టలులోనే వుండి చదువుకొంటున్నాడు. వాడిముఖ మెప్పుడూ కళ కళ

బాడుతూంటుంది. డబ్బు జోరుగానే తగలేస్తున్నాడు. (కొంచెమాగి) నీకా పుస్తకం జ్ఞాపకం వుందీ? పచ్చట్ట పుస్తకంరా, దాన్ని వాడు తీసికెళ్లాడు. అది చాలా వుత్తమ గ్రంథమనీ, యిప్పుడు కొందామన్నా దొరకదనీ చెప్పాడు. నేను తెచ్చిపెట్టమన్నా మళ్ళీ తేనేలేదు.''

జాకోబుమాటలకు ఇలియా నవ్వాడు. తర్వాత మిత్రులిద్దరూ సర్వారు తెచ్చిన టీకప్పులందుకొని నోటి కందించారు.

''నాకీమధ్య యింకో మంచిపుస్తకం చిక్కింది. చాలా బాగుంది. తీరికగా వున్నప్పుడు దానితోనే కాల క్షేపం చేస్తున్నా''నని జాకోబు పుస్తకాలప్రసక్తి తెచ్చాడు.

ఇలియా ఆ గొడవ చెవినిపెట్టకుండా ''అబ్బ! ఇది నరకతుల్యం! నేనుంటున్న చోటకూడ సుఖ-శాంతులు శూన్యమే; కాని, మీ కొంపకంటె యెన్నోరెట్లు మే'' లన్నాడు.

''అయితే నీకూ సుఖం లేదన్నమాట!''అని జాకోబు విస్మయంగా చూచాడు.

ఇలియా జవాబివ్వలా. మాషాసంగతి వానితో చెపుదామా వద్దా అని ఆలోచించుతున్నాడు. అప్పుడు జాకోబు మెల్లగా అన్నాడు- ''నువ్వెప్పుడూ యేదో ఒకటి ఆరోపించుతుంటావు. నాకు నీ స్వభావం బాగాలేదు. మానవుడు లలాటలిఖితాన్ని అనుభవించకతప్పదు. అందు

కితరులపైన దోష మారోపించడ మెందుకు? రాసిపెట్టిన గీతను చెరపడం యెవరితరం?"

ఇలియా మాట్లాడకుండా టీ తాగుతున్నాడు.

"మా నాన్న చేతులార చేసుకొని అనుభవిస్తు న్నాడు. భార్య యెంత చెపితే అంత. రాత్రింబగళ్లు తాగి పడుంటున్నాడు."

"మరి యిక నీ భావి కర్తవ్య మేమిటి?"

జాకోబు ప్రత్యుత్తర మివ్వలేక మాట్లాడకుండా కూచున్నాడు. మిత్రుని అయోమయావస్థ చూచి ఇలియాకు విచారం కలిగింది. "నే నడిగిన దానికి సమాధానం చెప్పవేం?" అనడిగాడు మళ్ళీ.

జాకోబు ప్రక్కకు చూస్తూ "నే నేం చెప్పను? నా భావి అంధకారబంధురంగా వుంది. నే నింకెన్నాళ్లో బ్రతక" నన్నాడు.

ఇలియా వెళదామని లేచాడు.

"అప్పుడే లేస్తావేం? యిం కొంచెంసే వుండూ." అన్నాడు జాకోబు.

ఇలియా జాకోబు కళ్ళలోకి చూచి "మిత్రమా! నీతో మాషా సంగతి చెప్పడమే మర్చిపోయాను. ఆమె చాలా కష్ట దశలో వుంది. పాష్కా పరిస్థితీ అధ్వాన్నంగానే వుంది. నేనూ అనంత వేదనకి గురిఅవుతున్నాను. నీ సంగతి చెప్పనే అక్క ర్లేదు. మనందరిస్థితి ఒకలాగే వుంది. అంతా భగవదేచ్ఛ! ఇక వెళ్తా" అన్నాడు.

"అప్పుడప్పుడు వస్తుంటావు గదూ?" అనడిగాడు జాకోబు ప్రార్థనాపూర్వకంగా.

ఇలియా మారు మాట్లాడకుండానే బయల్దేరాడు. హోటలు దాటివచ్చేప్పటికి ఇలియా తాజా మనిషయ్యాడు. జాకోబు స్థితినిబట్టి వానికి త్వరలో మృత్యువు తప్పదనుకున్నాడు! జాకోబువంటి అమాయకుడీ సమాజంలో బ్రతకడం కష్టమే ననుకున్నాడు. వాడల్ప వయస్సులోనే బలవన్మరణానికి గురిచేయబడుతున్నాడన్నవిషయం ఇలియా నెక్కువగా బాధించసాగింది. సమాజ, న్యాయశాస్త్రాల దృష్టిలో అది హత్యగా పరిగణింపబడదని తలచుకొన్నప్పుడు వానికి మానవజీవితమంటె రోత జనించింది.

ఇలియా కా రాత్రి కళ్ళు మూతపడలా. కిటికీగుండా చల్లనిగాలి వస్తున్నా వానికి వుక్కపోస్తున్నట్టుంది. ఆరు బయట ప్రక్కమీద వెల్లకిలపడుకొని ఆకాశంలోకి చూస్తున్నాడు. "నిర్మానుష్యాకాశాన్ని అంతచక్కగా అలంకరించడ మెందుకో! అశేషజనం వుండే యీ పృథ్వీతలాన్ని మురికితోను, కళ్మలంతోను నింపివుంచడంలోని అంతరార్థమేమి"టనుకొంటూ మిలమిల మెరిసే చుక్కల మీద చూడ్కి నిల్పాడు. చెట్లకొమ్మ లెగిరిపోతున్నట్టూ, ఆకులు లేచిపోయి తారలచాటున దాక్కున్నట్టూతోచింది. జాకోబు రూపం కళ్ళముందున్నట్టుగా వుంది. జాకోబు నీలవర్ణాకా

రంలో తేజరిల్లుతున్నాడు. కళ్ళు మెరుస్తున్నై.'' పాపం! శాంతిగా బ్రతకాలనుకున్నాడు. కాని, బలాత్కారంగా మృత్యుగహ్వరంలోకి పడద్రోయబడుతున్నాడని ఇలియా గ్రహించుకున్నాడు.

# 29

ఇలియాఆశాలతను కదల్చివేసే తుపాను రేగింది. అది వానిని మరింత కలవరపరిచింది. గ్రైబ్రిక్ భగిని నిత్యము వచ్చి వెడుతోంది; ఎప్పుడూ కొంపమునిగిపోతున్నట్టు హడావుడిగా వెళ్ళిపోతోంది. ఇలియాతో ముక్తసరిగా ఒకటి రెండుమాటలు మాట్లాడి వానిని సంధిగ్ధావస్థలో వదిలేది. ఒక రోజున ''మీ కీ వృత్తి బాగుందీ?'' అనడిగింది సోంకా.

''ఏం బాగు! కాని, యింతకంటె చేసేదిలేదు. ఏదో విధంగా భుక్తి గడించుకోవాలిగద'' అన్నాడు ఇలియా.

ఆమె వానిని తేరిపారజూచి ''కష్టించి సంపాదించటాని కెప్పుడైనా ప్రయత్నించారూ?'' అనడిగింది మళ్లీ.

ఇలియా ఆమెవుద్దేశాన్ని గ్రహించలేక ఆశ్చర్యంతో ప్రశ్నార్థకంగా చూచాడు.

''మీ రెప్పుడూ శ్రమపడలా?''

"నా జీవితమంతా శ్రమతోనే గడిపాను. ఇప్పుడూ కష్టించక తప్పటంలా."

సోంకా నవ్వింది. ఇలియా కామెవుద్దేశం బోధపడక చిన్నపుచ్చుకున్నాడు.

"దుకాణంలో కూర్చొని అమ్మటంకూడ శ్రమ అనే భావిస్తున్నారా?" అంది సోంకా.

"శ్రమగాక మరేమిటి? పగలస్తమానం ఆయాసపడి అలసిపోతుంటేను!" అని ఇలియా ఆమెవంక చూచాడు. సోంకా మొహంమీది చిరునవ్వుచిహ్నాలు అదృశ్యమైనై. గంభీరవదనంతో యిలా అంది— "అది శ్రమ అనిపించుకోదు. కష్టపడి యేదైనా జీవితావసరవస్తువు నుత్పత్తి చేయటం మాత్రమే శ్రమ అవుతుంది."

ఇలియా తలాడించుతూ ఆమె అభిప్రాయానికి ఆమోదం తెలిపాడు. లజ్జతో తలొంచుకున్నాడు. శ్రమ శబ్దార్థమే గ్రహించలేనందుకు ఇలియా సిగ్గుపడ్డాడు.

"దుకాణంలోకూర్చుని వస్తువులను విక్రయించటంలో శ్రమేముంది? మీ కష్టంతో యేవస్తువు తయారవుతోందో చెప్పం" డని సోంకా తర్కించింది.

"వర్తకంమాత్రం సులువా? మర్మం తెలిసి వ్యాపారం చెయ్యాలి. కష్టపడి దుకాణం నడిపితేనే లాభం; లేకపోతే దండుగేగా!" అన్నాడు ఇలియా.

సోంకా మరి మాట్లాడలా. తమ్మునితో యేదో చెప్పి చక్కాపోయింది.

తన మాటలకు సోంకా నొచ్చుకుందేమోనని ఇలియా భయపడ్డాడు. తా నన్న మాటల్ని నెమరువేసుకున్నాడు. అందులో ఆవిడను నొప్పించేమాటేదీ లేదు. తర్వాత ఆమెవాదాన్ని గురించి పర్యాలోచించాడు. ఆ యువతిని గూర్చి ఆలోచించినకొద్దీ వాని కానందం కల్గుతోంది. వస్తూత్పత్తిచేసే శ్రామికు వస్తువినిమయ కృషికి గల భేదాన్ని వివరించింది. అంతవిశాలహృదయిని తనముందు గంభీరంగా వుండి యెందు కంత తీవ్రంగా, ముభావంగా మాట్లాడుతోందో ఇలియాకు గ్రహింపశక్యం కాలేదు. పాష్కా ఆమె నదేపనిగా మెచ్చుకుంటున్నాడు. ఇంటికివెళ్తే చాల మర్యాదచేస్తుందట. అతిథుల్ని సత్కరించి వేళకు భోజనంపెడుతుందట. హృదయమిచ్చి మాట్లాడుతుందట. పాష్కా యీవిధంగా సోంకాగుణగానం చేయటానికి హేతువేమిటా అని ఇలియా ఆలోచించాడు. ఆమెయింటికి చాల మంది వస్తూంటారనీ, వాళ్ళందరూ వుత్సాహంగా వుంటారనీ, యెప్పుడూ యేమేమో చర్చించుతూ కాలక్షేపంచేస్తారనీ, పాష్కా చెప్పాడు. వా డెప్పుడు వచ్చినా సోంకానుగూర్చి చెపుతూండేవాడు.

ఒకపర్యాయం పాష్కా ఇలియాతో యిలా చెప్పాడు——"సోంకావద్ద పత్రికలు, పుస్తకాలు కుప్పలు-తిప్ప

లుగా వున్నా. ఆమె స్నేహితులందరు విద్యావంతులే. ఒకా యన వకీలు, యింకొకాయన డాక్టరు. పెద్ద డిగ్రీలు పొంది నిరుద్యోగులుగా వున్నవాళ్లు, కాలేజి విద్యార్థులు కూడ వున్నారు. అక్కడికి వెళ్ళినప్పుడు నన్ను నేను మర్చి పోతుంటాను."

"అలాగా? నన్నెప్పుడూ ఆమె రమ్మని పిలవలా. సోంకా మహా గర్వపోతు" అని ఇలియా వెక్కసపడ్డాడు.

"ఎబ్బే! ఆమె చాల మంచిది. సరళహృదయ. పిలవాలేమిటి? ఒకసారి చూచివద్దువుగాని రా. అక్కడ యెవరికీ అడ్డు లేదు. వారిలో కృత్రిమము మచ్చుకైనా లేదు. ఎంత మంచివాళ్ళనుకున్నావు" అని పాష్కా వుబ్బిపోతూ చెప్పాడు.

"సరేగాని, మాషాసంగతు లేమి" టని ఇలియా అడిగాడు.

"క్రమంగా కోలుకొంటోంది. ఆ నరపిశాచం మీద కేసుపెట్టడానికి వకీలుతో సంప్రదించారు. వాడికి తప్పకుండా శాస్తి జరిగితీరుతుంది. వేరావిషయంలో కూడ శ్రద్ధగా పని చేస్తున్నారు. ఆమెయిల్లు చాల చిన్నది కావటంవల్ల యిబ్బందిపడుతున్నారు."

"అసలు సోంకాస్థితి యేమిటి?"

"ఆమెసంగతు లేమడుగుతావు? సోంకా మకుటం లేని రాణి. మిత్రులందరిపైన హుకుం చలాయించుతుంది.

అందరూ ఆమెముందు తలొగ్గుతారు. ఎదురు చెప్పిన వారిని దబాయించి నోరుమూయించుతుంది."

"ఆ సంగతి నే నిదివరకే గ్రహించాను."

పాష్కా సోంకాను ప్రశంసించినప్పుడెల్లా ఇలియా ఉడికిపోతూండేవాడు. పాష్కాయందు ఈర్ష్య పొందేవాడు. ఒకతడవ పోయివద్దామా అనిపించింది; కాని, ఆత్మాభిమానం అడ్డుతగుల్తోంది. దుకాణంలో తీరిగ్గా కూచుని 'ఈ ప్రపంచంలో ప్రతివాడు మరొకని వల్ల ప్రయోజనాన్ని ఆశించేవాడే. అయితే మరి సోంకా మాషా, వేరాలకు తోడ్పడి యేమాశిస్తుంది? తానూ గర్భదరిద్రురాలేనే. ఉదరపోషణే గడ్డుగావుంది. దీన్నిబట్టి ఆబిడ జాలిగుండెగలదని విదితమవుతోంది. మరి నా యందంత విముఖత్వ మెందుకో? నేను పాష్కాకంటె దిగజారిపోయానా?' అని ఆలోచించుతూ సర్వం మర్చిపోయాడు. వానిజీవితము గాఢాంధకారమయమై వుండగా అందులో ఒక బీట, దానిగుండా తా నదివరకెన్నడూ చూచివుండని దివ్యతేజము ఇలియా కా స్థితిలో దృగ్గోచరమైంది.

అదేసమయంలో లాసినా వచ్చింది. ఆవిడ వస్తూనే "ఇలియా! మన దుంకా కొత్తరకాలుకూడ దుకాణంలో పెట్టాలి. ఏజెంటు ఒకణ్ని పంపాను; వచ్చాడా?" అంది.

"రాలేదే!"

ఇలియూకు లాసినాయందంతులేని అసహ్యం కలిగింది. ఆమె యీ మధ్య కర్నకోవ్ వెంటపడి చిత్తకార్తె కుక్కలా తిరుగుతూన్నట్టు ఇలియాచెవినిపడింది. తన కామెపై నెంత రోతగా వున్నా పైకిమాత్రం కనపర్చేవాడు కాదు. వాని ప్రవర్తనలో యెలాంటిమార్పు లేదు; అయినా లాసినా వెనకటిలాగా ఇలియావద్దకు రావటంలేదు. అందువల్ల వాని కూ్కడ బాధ లేకుండాపోయింది. వాని కామెను కల్పుకో వాలన్న అభిలాషే లేదు; కాని, మొన్న మొన్నటివరకు తన పొందుకోసం తహతహలాడిన లాసినా తన్నిప్పుడు కామిం చటంలేదనుకున్నప్పుడుమాత్రం ఇలియా వుక్రోషంతో వుడికిపోయేవాడు.

దుకాణానికి వచ్చినప్పుడు లాసినాప్రవర్తన వింతగా వుండేది. ఒక్కక్షణమైనా కుదురుగాకూర్చు నేది కాదు. "దుకాణంలోవుండేవాళ్ళెప్పుడూ చలాకీగా వుండాలి. వినయ-విధేయతలు కలిగుండాలి. మేము నీకు జీతమిచ్చేది కాపలాకు, హాజరు వేయించుకున్నందుకే కాదు" అని యిలాగే గైబ్రిక్‌తో యేమేమిటో చెప్పేది.

గైబ్రిక్ సామాన్యుడు కాడు. లాసినా చీవాట్లు వేస్తుంటే తన్నుకాదన్నట్టు పెడచెవినిపెట్టేవాడు. ఆమె టీకెక్కి రాక్‌లపైనున్నవస్తువుల్ని తీయటానికి చేతులు పైకెత్తినప్పుడు ఆమె కుచాలవంక చూచి కొంటెగా నవ్వే వాడు. వాని కామెయందు యేమాత్రం గౌరవభావ ముండేది

కాదు. లాసినా చటాకారీతన మెరిగివుంటంవల్ల నిరసన భావంతో చూచేవాడు. ఆమె వెళ్లినాక "వయ్యారిభామ వెళ్ళిపోయిం"దనేవాడు ఇలియాతో హేళనగా.

ఇలియా నవ్వుకొని "ఆమె యజమానిని కదా! అలా అనవచ్చా? జీతమిచ్చి పోషించే ఆమెకు విధేయత చూపాలి సుమా!" అనేవాడు.

వచ్చినప్పుడల్లా నాలుగు తిట్టి, గంతులేసి పోతుంది. అలాంటిమనిషితో నాకేం పని? నేను మిమ్మల్నే కొలుస్తా" నసేవాడు గ్రైబిక్.

గ్రైబిక్ తనకే మాత్రం విధేయతచూపనందుకు లాసినా అలిగి ఒకసారి ఇలియాతో యిలా అంది—"నువ్వు వీడికి మర్యాద-మన్ననలు నేర్పటం లేదు. నీ కసలీ వ్యాపారంలో మనసున్నట్టే లేదు."

లాసినామాటలకు ఇలియా తనలో "దేవీ! ఆ ముక్కాలిపీటమీం దెక్కినప్పుడు కాలుజారి క్రిందపడి కాలోచెయ్యో విరగొట్టుకున్నప్పుడుగాని నీ కక్కడి నౌకరీబాధ తెలియదు. పైపెత్తనం చెలాయించుతూంటే లోలోపల కుళ్ళేవారి సంగతి నీకెలా బోధపడుతుంది!" అనుకున్నాడు.

ఒకరెన్ను తీర్థ-యాత్రాపర్యటన ముగించుకొని వస్తున్నట్టు ఇలియాకు జాబువచ్చింది. తన కాయన దూరంగా వుంటేనే బాగుంటుందనుకొని, అందు కుపాయ మేమిటా అని ఆలోచించుతుండగా దుకాణంలోకి సరకులకోసం జనం

వచ్చారు. అందరినీ పంపించేసరికి సోంకా వచ్చిపడింది. వస్తూనే మంచినీళ్ళు కావాలంది.

"ఆ, తెస్తా" నంటూ ఇలియా లేవబోతూంటే "మీరు కూచోండి; నేను వెళ్లి తాగుతాలెం" డంటూ సోంకా లోపలి కెళ్లింది.

ఇలియా వచ్చిన మనిషి కేదో యిచ్చి పంపి ఆమెవద్ద కెళ్ళాడు. సోంకా మానవజీవితావస్థలను తెల్పే చిత్రాన్ని రెప్పవాల్చకుండా చూస్తోంది. ఇలియారాకను గమనించి "అస్వాభావికంగా వుంది" అని నిరసనభావాన్ని వెలిబుచ్చింది.

తా నెంతో వుత్తమచిత్రంగా యెంచుతున్నదాన్ని సోంకా అంత చుల్కనచేయటంతో ఇలియా వెలవెల పోయాడు.

"అతి అసహజంగా వుంది. అంతా కృత్రిమమే" నంటూ సోంకా దిగ్గున లేచిపోయింది. ఇలియాకిప్పుడు ఆ చిత్రం మరో నూతనసమస్య అయింది.

ఇంకోరోజున సోంకా గైబ్రిక్ కు కొత్తబట్టలు తెచ్చింది. వాటినిస్తూ తమ్ముణ్ని వానిమడ్డితనానికి, గుడ్డల విషయంలో అజాగ్రతకు కూకలేయసాగింది.

"ఊరుకో అక్కా! యజమానురాలి సతాయింపు చాలదనా నువ్వుకూడ నోరుచేసుకుంటున్నా" వన్నాడు గైబ్రిక్.

సోంకా ఇలియావేపుతిరిగి "నీకు మసురుతనమేమీ చూపటంలేదుగద?" అనడిగింది.

"ఎక్కువగా కాదులే" అని ఇలియా నవ్వాడు.

"నే నసలు తిన్ననివాణ్నే లే" అన్నాడు గ్రైబ్రిక్ తనఅక్కతో.

"నోటిదూలమాత్రం వుం"దని ఇలియా అంటించాడు.

"వింటున్నావా?" అని సోంకా తమ్ముణ్ని గద్దించింది.

"వింటున్నాలెద్దూ" అని గ్రైబ్రిక్ సోంకావంక చురచుర చూచాడు.

"మీ వాడి అల్లరేమీ లేదు. మొత్తంమీద మంచివా"డని ఇలియా గ్రైబ్రిక్‌ను మెచ్చుకున్నాడు. తనమాటల్తో సోంకా పరిసన్నురాలైనట్టు గ్రహించి "నేను మీ మొక సంగతి అడగాలనుకొంటున్నా" నని ఆమె కళ్లలోకి చూచాడు.

"ఏమిటి, చెప్పం" డంది సోంకా.

ఇలియా తలవొంచుకొని "మీకు వ్యాపారమంటే ద్వేషమెందుకో అడగవచ్చా? —" "ద్వేషింపనుకుంటూనే?" అన్నాడు.

"కొంతవరకు."

"కారణం అడగవచ్చా?"

"వర్తకులంటే యితరుల శ్రమఫలితాన్ని లాభంగా పొందుతున్నారు కాబట్టి."

ఇలియూ తలెత్తి చూచాడు. సోంకా మాటలు వానికి కటువుగాతోచటమేగాక కోపంకూడ వచ్చింది. "మీ రన్నది అందరిపట్ల వర్తించ" దన్నాడు తీవ్రంగా.

సోంకా మో మెర్రబారింది. ఆమె బీరువాలోని ఒకరిబ్బను చూపుతూ "మీరు దా న్నెంత కొన్నా" రని అడిగింది.

"రూపాయి పావలా."

"మీ రమ్మే వెల?"

"రూపాయ న్నర."

"అంటే మీ లాభం నాల్గణాలు; అవునా? అది మీకు ముట్టాల్సింది కాదు. ఆ పావలా ఆ రిబ్బనును తయారుచేసిన కార్మికునికే దక్కాలి. మీరే కాదు. ఆ రూపాయి పావలాలో సగానికి మించి మధ్యదళారులు దోచేస్తున్నారు."

"అరె; ఇదంతా నిజమేనా!"

"మీ రతి సామాన్యవిషయాన్నికూడ గ్రహించలేక పోతున్నారు. మీరే వస్తూత్పత్తిదారులనే దృష్టితో ఆలోచించండి" అని సోంకా ఒక్కొక్క వస్తువును చూపుతూ వాటి తయారుకు వుత్పత్తిదారు లెట్లు చమటోడ్చేదీ, అయినా వారు నిత్య దరిద్రమనుభవించుతూ తా ముత్పత్తి చేసిన జీవితావసరవస్తువులకే యెలా యిబ్బందిపడుతున్నదీ, ఒళ్ళేమాత్రంవొంచని సోమరిపోతులెట్లు వస్తుపరిశ్రమలలో వ్యాపారంలో లక్షలు కోట్లు గడించి భోగవిలాసాల్లో మునిగి

వుంటున్నదీ బోధపర్చసాగింది. మొదట్లో ఆమె సరళంగానే ఆరంభించింది కాని, క్రమంగా ఆమెవచనము, ధోరణి గంభీరమైనయి. "వ్యాపారం ఒట్టిమోసం. వర్తకుడు కార్మికులవద్ద చౌకగా కొని, ప్రజలకు ప్రియంగా అమ్ముతాడు. ఇంతకంటె దగా యేముంది?" అని ముగించింది.

సోంకావాదన ఇలియాకు తలవంపులుగా తోచింది. ఆమె 'నువ్వు దొంగవి, దగాకోరు' వని స్పష్టంగా తన్నవమానించటానికే మొహంమీద అన్నదని ఇలియా తలిచాడు; అయితే తగుసమాధానమిచ్చేందుకు వానికి మాటలే స్ఫురించలా. లోలోపల వుడికిపోతున్నాడు. సోంకావాదనతో వాడేకీభవించలేక పళ్ళు పటపటలాడిస్తున్నాడు. మొహంవాచేటట్టు జవాబివ్వాలని మాటలకోసం దేవులాడుతున్నాడు. మరోప్రక్క ఆమెసాహసాన్నీ, యదార్థ వాదాన్నీ మెచ్చుకుంటున్నాడు. కాస్సేపు వితర్కించుకొని "మీరు చెప్పినదంతా నిజంకాదు. మీ వాదాన్నెవరు నమ్ముతారు?" అని వూరుకున్నాడు. వాని హృదయంలో గాలిదుమారం లేచింది. మొహం కోపంతో నిప్పులు చెరుగుతోంది.

సోంకా మెల్లగా "అయితే నా వాదాన్ని ఖండించి మీ వుద్దేశం చెప్పండి" అంది.

ఇలియా పక్కచూపుల్తో "నా జీవితాన్నే వుదాహరణగా మీ వాదాన్నెదిరిస్తాను. ఈ దుకాణం పెట్టడానికి నేను చెయ్యాని దురాగతం యేముంది?" అన్నాడు.

"అది మరీ ఘోరం; మీరు నా వాదనని ఖండించు టకుమాత్రం బలపరుస్తున్నా" రని సోంకా మందహాసం చేసింది.

ఇలియూ చల్లబడ్డాడు. ఇక వానినోట మాటరాలా. మనస్సును కుదుటబెట్టుకోడానికి ప్రయత్నిస్తూ ఆమెవంక చూస్తున్నాడు.

సోంకాకు న వ్వాగలా. విజయగర్వంతో "నేను చెప్పింది వాస్తవమే. దానికి ప్రతివాదం లే" దన్నది.

"ఏమిటీ! నేను ఖండించలేనూ?" ఇలియూ వున్మా దునివలె అరిచాడు.

"ఖండించలేరు. మీ ప్రతివాదన కాధారమే లేదు" అని ఖండితంగా చెప్పేసింది.

పై మాటలని సోంకా మృదువుగా నవ్వింది. ఆ తర్వాత లేచి దారిపట్టింది. వెనకనుంచి "మీ మాటలు సర్వాబద్ధాలు, నిస్సారాలు. వాటిలో తత్వంలేదు, సారం లే" దంటూ ఇలియూ బిగ్గరగా అరిచాడు; కాని, సోంకా వెనక్కితిరిగిచూడకుండానే వెళ్ళిపోయింది.

ఇలియూ లేచెళ్లి సోంకాపోకడను గమనించి వచ్చి పీటమీదకూచున్నాడు. సోంకామాటలు గ్రైబిక్ కు సంతోషాన్నే కల్గించాయి. వాడి మొహం కళకళలాడుతోంది. వాడోరకంటితో ఇలియూ ముఖభంగిమ కన్పెడుతున్నాడు.

ఇ లి యూ వాడి మెచ్చును సహించలేకపోయాడు. "ఆ చూ పేమిట్రా" అని వురిమాడు.

"ఏం లేదండి."

"సరే నీ కివాళ సెలవిచ్చా పో" అని వాణ్ణి పంపేశాడు. తాను యేకాంతంగా వుండాలనుకున్నాడు.

ఇలియా సోంకామాటల్లోని యదార్థాన్ని తెలుసుకోవాలన్న ప్రయత్నమే చేయలా. ఆమె తన్నవమానించటానికే అలా మాట్లాడిందని మాత్రం నిశ్చయించుకున్నాడు. ఆమె నన్నెందుకవమానించాలి? నేనామెకేమపకారం చేశాను? వచ్చింది వచ్చినట్టు పోక నా వ్యాపారప్రసక్తి తనకెందుకు? నన్ను చెడతిట్టిపోయిందే! అది చదువుకొన్న అహంకారమా? ఈతడవరానీ చెపుతా' నని మదనపడ్డాడు.

తరువాత తాను సోంకానవమానించే మాటేమీ అనలేదుగదా అని ఇలియా కలతచెందాడు.

'ఆమె పాష్కాతో సంపర్కం పెట్టుకోదనే నా విశ్వాస' మనుకొని ఇలియా అద్దంలో ముఖం చూచుకున్నాడు. కళ్ళలో విచారం తొలుకుతోంది. మొహం కళాహీనంగా వుంది. అవమానభారంతో కృంగిపోతున్న చిహ్నాలింకా కనపడుతూనే వున్నై. అయినా తానెంతో అందంగా వున్నా ననుకొన్నాడు. సుఖరోగపీడితుడగు పాష్కారూపానికీ తన రూపానికీ పోలికేమిటనుకున్నాడు.

సోంకా తన్నుకాదని పాష్కాను ప్రేమించటం సంభవమేనా అని ప్రశ్నించుకున్నాడు. మరుక్షణంలోనే 'ఆ మదిరాక్షి నన్నెలాగూ ప్రేమించదు. ఆవిడను గురించి

నా కాలోచన లెందుకు? సోంకా యే డాక్టర్నో, వకీల్నో పెళ్ళాడుతుంది. నావంటి సామాన్యుడియందు మోజెల్లా కలుగుతుంది?' అని సమాధానం చెప్పుకున్నాడు.

అప్పుడు వాని పెదాలమీద చిర్నవ్వు పరుగు తీసింది. 'కాని, మాటి మాటికీ కాను పాప్యానే పిలవటానికి కారణం? సామాన్యుడు కానివాడూ దొంగా సమానమేనా? నేను వృత్తికి శ్రమపడని మాట నిజమే; ఇతరుల శ్రమవల్లనే నేను లాభం పొందుతున్నాను. అయితే నేను మాత్రం ఎవరికి కావలసిన వస్తువుల్ని వారికి సప్లయి చేసేందుకు అస్తమానం కళ్ళు తెరుచుకొని కూర్చోటంలా? ఈ పని నింకొకరితో చేయించి నేను కూచుని తింటున్నానా?' అని మళ్లీ వితర్కించుకున్నాడు.

సోంకా వాదాన్ని ఖండించడానికి దారి దొరికింది గదా అని సంబరపడ్డాడు; కాని వినటాని కామె లేదుగా. ఆమె వెళ్ళిపోకముందే యిదంతా స్ఫురించనందుకు వానికి తనపైన కోపం వచ్చింది. అవమానాఘాతంచే యేర్పడ్డ గాయం వానికి తీరని బాధగా వుంది. లేచి వెనక గదిలోకెళ్ళాడు. రెండుగుక్కలు నీళ్ళు తాగి అటూ యిటూ చూచాడు. వానిదృష్టి తన అభిమానచిత్రంమీద నిల్చింది. తదేకధ్యానంతో చూస్తూ 'నిజానికిది అసహజంగానే వుంది. ఇందులో మాదిరిగా యెందరికి గనుస్తోంది?'' అనుకున్నాడు.

ఆ పటాన్ని పరిశీలనగా చూస్తూ, అందలి ప్రత్యేక స్థను తనజీవితంతో పోల్చుకొని 'ఎబ్బే! ఇందులో మాత్రం సుఖ మేముంది? అస లీ విధంగా మాత్రం యెందరు బ్రతక గలుగుతున్నారు?' అని ఆ చిత్రాన్ని వూడలాగి నలుపుతూ దుకాణంలోకి తెచ్చాడు. నలిపినమడతల్ని విప్పి నేల మీద పరచి అందలి వివిధావస్థలను మరొకసారి చూచాడు. అంతకు క్రితం సోంకా అనిపోయినమాటలన్నీ జ్ఞప్తి కొచ్చాయి. 'నేనే పోలటోన్ హంతకుడనని ఆమె గ్రహించినట్టుంది, మరి నన్నెలా చేపడుతుంది?' అనుకున్నాడు మళ్లీ.

ఇలియూహృదయంలో భావతరంగాలు దొంతర దొంతర్లుగా బయలుదేరుతున్నై. చిత్రాన్ని చూడగా చూడగా వానిదృష్టి మందగించింది. అపుడా చిత్రాన్ని నలిపి నేలకేసికొట్టాడు; కాని, గాలి కది తిరిగొచ్చి వాని పాదాల వద్దే పడింది. ఈ సారి చించి ముక్కల్ని వీధిలోకి విసిరేశాడు. ఆ ముక్కలు గాలి కెగిరిపోతుంటే చూస్తూ కూచున్నాడు.

మర్నాడు సోంకా మళ్లీవచ్చింది. ఆమెను చూస్తూనే ఇలియూ పగబట్టినత్రాసులా బుసకొట్టాడు. సోంకా వాని వాలకం కన్పెట్టి నవ్వుతూ "మీముఖం వాడినట్టుందే? ఒంట్లో ఖులాసాగా లేదా?" అనడిగింది.

మనసులోవున్నభావాన్ని వెలిబుచ్చకుండా "బాగా నే వున్నా" నన్నాడు ఇలియూ.

సోంకా మధురస్వరము, తీయనినవ్వు వానికోపాన్ని ప్రశమింపజేశాయి. అయినా కృత్రిమకోపాన్ని చూపాలనుకున్నాడు ఇలియా.

"నిన్నటి నామాటలు మీకు కష్టంకలిగించా యనుకుంటాను" అంది సోంకా సహజ గంభీరస్వరంతో.

"అవమాన, నిరాదరణలు నా కలవాటేలే" అని ఇలియా తా నేదో దెబ్బతిన్నట్టు సోంకావంక చూచాడు. ఆమాటల్లో ప్రతీకార భావన నిమిడివుంది. 'ఒకనాడు చీవాట్లు వేసి, యింకొకనాడు బుజ్జగించే నీ ఆట లిక నాముందు చెల్లనివ్వను' అంటున్నట్టుంది వాని చూపు.

"నాకు మి మ్మవమానించాలన్న తలంపే లేదు. నేను నమ్ముతున్న విషయాన్ని మీతో వాదించా నంతే" నన్నది సోంకా.

"న న్నవమానించటం నీతరమా? నీ తాహతు నాకు తెలుసు" అని ప్రతిమాటా నొక్కి పలికాడు.

సోంకా పెదవులు నిక్కపొడుచుకున్నై. ఏమి టిలా మాట్లాడుతాడని విస్మయపడింది. ఆమె చిన్నబోవటం ఇలియా గమనించుతూనే వున్నాడు. అయినా వాడు తన ధోరణి మార్చుకోలా. కసితీర్చుకోవాలన్న వాంఛ ప్రబలంగావుంది. అందుచే మైమరచి నోటికివచ్చినట్టు అనేస్తున్నాడు.

"నీలాగా పొగరుగా మాట్లాడటం సులువే. అది తేలిగ్గానే పట్టుబడుతుంది. అదృష్టవశాత్తు యేవో నాలుగు అక్షరంముక్కలు అబ్బించుకున్నావు గాని, లేకపోతే నువ్వీ పాటికి యెక్కడైనా నా దాసిగానో, దాదిగానో వుండేదానివి. నీవంటి పేదపిల్ల కంతకంటె మంచినౌకరీ యెవడిస్తాడు?" అని, ఇలియా తనవాక్బాణాలావిడపై నెలా పనిచేస్తున్నవో కన్పెడుతున్నాడు.

"మీ మాటలకు అర్థమేమి"టని సోంకా మెల్లిగా అడిగింది.

తనమాటలు బాగానే నాటినట్టు గ్రహించి ఇలియా సంతృప్తి చెందాడు. "నాయిష్టంవచ్చినట్టు మాట్లాడుతు న్నాను. ఇక నీబడాయి నాముందు సాగదని తెలుసుకో" మన్నాడు.

"నా బడాయి మీ కేం కనపడింది? నేడు కార్మికులకు జరుగుతున్న అన్యాయాన్ని వివరించానే గాని, అందులో నా ప్రత్యేకతను ప్రదర్శించాలని యేమీ అనలేదే!" అంది సోంకా అతి శాంతంగా.

అక్కకు జరుగుతున్న అవమానాన్ని పైట్రిక్ ఓర్వ లేకపోయాడు. సోదరిచేయిపట్టుకొని "ఇక్కడి నుంచి వెళ్ళి పో అక్కా!" అని ఇలియావంక మిరిమిరి చూచాడు.

"మీ రిద్దరూ వెళ్ళిపొండి. నా కెవరూ వ"ద్దని ఇలియా ఆవుద్రేకంలో సోదరీసోదరులకు దారిచూపించాడు.

సౌంతామీద కసి తీర్చుకున్నానన్న తృప్తితో వాని హృదయారాటం కొంత తగ్గింది. కంగారుపడి బిత్తరచూపులు చూచిన సౌంతాముఖమూ, ద్వేషాగ్నిని చిమ్ముతున్న ఆవిడ కళ్లూ వాళ్లు వెళ్లిపోయిన తర్వాత కూడ ఇలియా కళ్ళకు కన్పిస్తున్నట్లుగా నేవుంది.

తానంతో నయగా చూస్తూవచ్చిన గైబ్రిక్ కూడ అక్కడను పనికేసుకొన్నాడని ఇలియా సంశీపడ్డాడు. అప్పట్లో లౌసినా రావటం తటస్థించినా సరే ఆమెపైన కూడ యిలాగే కన్నువేస్తునేవాడు.

కాని, లౌసినా ఆనాడు రానేలేదు. ఇలియా ఒక్కడే దుకాణంలో కూచుని వున్నాడు. ఎంతసేపటికీ ప్రొప్రొ గనుపిస్తున్నట్లు లేదు. పెందలాడే దుకాణం మూసి వేశాడు. తనకగదిలో పక్కమీద వాలాడు. అక్కడి ప్రశాంతవాతావరణం వానికి మరింత దుర్భరమయింది. అప్పుడు వానికి లీపా జ్ఞప్తికొచ్చింది. తన్ను మనసార ప్రేమించి నిష్కపటంగా వర్తించినది లీపా ఒక్కతే ననుకున్నాడు.

ఆ రాత్రి వానికి కునుకురానేలేదు. ఏమాత్రం అలికిడైనా తనకోస మెవరో వచ్చినట్లు లేచి కూర్చునేవాడు. ఒంటరితనం వానిని వేధిస్తోంది. రేయంతా జాగారంచేసి కోడికూయగానే లేచి కాలకృత్యాలు నివృత్తిచేసుకున్నాడు. నిద్రలేమివల్ల తల దిమ్ముగావుంది. టీ తాగాలనిపించింది

కాని, కాచుకోలేక మానుకున్నాడు. గ్లాసుడు చన్నీళ్ళు తాగి దుకాణం తెరిచాడు.

మధ్యాన్నం పాష్కా వచ్చాడు. వాడిమొహం ధుమధుమలాడుతోంది. "ఇలియా! నీకు రోజురోజుకు వున్న మతి పోతోందే" అన్నాడు రాగానే.

ఇలియా వాడివుద్దేశాన్ని గ్రహించాడు. వాడు కూడ తనకు ప్రతికూలుడవ్వాడనుకున్నాడు. పైకి మాట్లాడకుండా తల పంకించి వూరుకున్నాడు.

"సోంకా నవమానించటంలో నీ వుద్దేశమేమి" టని పాష్కా తీవ్రంగా అడిగాడు.

ఇలియా వానిప్రశ్నను ఖాతరు చెయ్యకుండానే "దేవునిపటంముందు నుంచున్నావు. నీ టోపీతీసి అభివాదం చెయ్యవోయ్, మాటామంతీ తర్వాత చూద్దాం" అన్నాడు.

పాష్కా టోపీని మరింత అదుముకొని కోపావేశంతో "కానియ్యవోయ్ నీ డాబు! ఎక్కడిదీ బడాయి? నాలుగు రాళ్లు చేతిలో చేరాయనా? మసల్ని చూచేవాడొక డున్నా డనేదే మరిచావుగా! నీకంటికి మే మిప్పుడు కనపడుతామా? మీా వ్యాపారస్తులనైజమే అంత!" అనేశాడు నిప్పులు కక్కుతూన్నట్టు.

ఇలియా కొంచెం మెత్తబడ్డాడు. పాష్కాకి పిచ్చెం త్తిందేమోననుకున్నాడు. ఆ శుంఠకి జవాబిచ్చేదేమిటని మౌనంధాల్చాడు. ఆవిడ పోయి మొరబెట్టుకుంది కాబోలు,

టానికే యిష్టంలేకపోయింది. అలసివున్నట్టు బడలికగా కూడా వుంది. ఏకాంతంగావుంటే బాగుండు ననిపించింది.

"సరే, నేను వెళ్తున్నాన్లే. ఒక సంగతి విను: వారితో కలసి మెలసి తిరుగుతున్నందువల్లనే నాకు జీవితంలోని వాస్తవం బోధపడుతోంది. వారి దరమరలేని జీవితం. వారనుసరిస్తున్నదే సత్యపథం. ఇల్లాంటి ఆనందజీవితాన్ని గడిపే సౌభాగ్య మిదివర కెక్కడా నాకు లభించలేదు. వారివలె నా కాశ్రయమిచ్చి ఆదరించినవారూ లే'రని పాష్కా బిగ్గరగా చెప్పాడు.

" అలా అరుస్తా వెందు" కని ఇలియూ కసిరాడు.

" ఓరి దుర్మార్గుడా! అందాక వచ్చిందీ నీ వ్యవహారం?". అని పాష్కా మొహంచిట్లించాడు.

అప్పుడొక బాలిక రాగా ఇలియూ ఆమెకు కావలసినది యిచ్చాడు. ఆపిల్ల యిచ్చిన రూపాయి తిరిగియిచ్చి "తరువాత యిద్దువులె" మ్మని పంపేశాడు. చిల్లర యివ్వటానికక్కడ బద్ధకించాడు. ప్రక్కన పాష్కా వున్నట్టే మర్చిపోయి యీలవేస్తున్నాడు.

పాష్కా మరి మాట్లాడకుండా లేచిపోయాడు. ఇలియూ ముఖం త్రిప్పైనా చూడలేదు. ఓరచూపుతో పాష్కా వెడుతున్నట్టు మాత్రం గమనించాడు.

అప్పుడొక కుక్కవచ్చి దుకాణంలోకి తొంగిచూచి వెళ్ళిపోయింది. తర్వాత ఒక బిచ్చకత్తె వచ్చి చెయి

చాచింది. ఇలియా చేస్తో వెళ్ళిపోతున్నాడేగాని ముష్టి పెట్టలా.

రోడ్డు మీద సందడిగానే వుంది; కాని, ఇలియా హృదయం శూన్యంగావుంది. వాడేదో అవ్యక్త వేదన ననుభవించుతున్నాడు.

ఈ విధంగా రోజులు గడిచిపోతున్నై. ఇలియా నియమంగా తన కొట్టం తెరచి వ్యాపారం సాగిస్తూనే వున్నాడు. తనతోటి మనుషుల కవసరం లేదని, తనకూ యిక యెవరితోను పనిలేదని. ప్రస్తుతం ఎక్కువెక్కువ సంపాదించున్నా క్రమంగా అలవాటయితే ఎవరి పొత్తూ లేకుండానే ఒంటరిగా సుఖజీవితం గడపవచ్చని అనుకున్నాడు.

మైత్రికను నౌకరీలో నుంచి తీసివేసిన తర్వాత ఒక వంటకత్తెను కుదుర్చుకున్నాడు. ఆమె అనాకారి. చూడటానికి అసహ్యంగా వుండేది. ఆమెను చూచి "నాకళ్ళ కింత కంటె అందమైనవాళ్ళను చూచే అదృష్టం లేదు కాబోలు! నాజన్మ నిరర్థకం. నాజీవితం నిష్ప్రయోజన" మనుకొని నిరాశ చెందేవాడు.

మిత్రుల రాకపోకలు ఒక్కసారిగా కట్టుబడిపోయినై. ఆదిలో కొత్త కొత్తగా వున్నా, క్రమంగా ఇలియా ఒంటరి జీవితానికి అలవాటుపడ్డాడు.

# 30

ఒకనాటి సాయంత్రం ఇలియా దుకాణంమూసివేసి షికారు బయల్దేరాడు. అక్కడక్కడ తిరిగి చివరకు మైదానంలో ఒక చెట్టుక్రిందికి చేరి కూర్చున్నాడు. సమీపంలో ఒక యువతి పెంపుడుకుక్కను ముద్దులాడుతూండడం చూచాడు. కుక్క ఎగిరి ఎగిరి యువతిభుజంమీద కెక్కటానికి ప్రయత్నిస్తోంది. కుక్కతో ఆడుకోవడం ఆ పడుచుకెంతో వుల్లాసంగా వుంది.

ఇలియా ఆ దృశ్యాన్ని చూచి 'కలవాళ్ళు కుక్కల్ని ప్రేమించుతున్నారు. ప్రేమించటానికి పిల్లకు మనుషులు దొరకనట్టు' అనుకున్నాడు. అప్పుడు వానికి సోంకా, పాష్కా జాకోబులు తలపుకొచ్చారు. పని వున్నంతవరకు అంతా తనచుట్టూ చేరేవారనీ, యిప్పుడొకడూ కంటికి కన్పడటం లేదనీ, అందరూ స్వార్థలేననీ తలపోశాడు. ఎదురుగా వున్న తరుణిని చూచి "ఇప్పుడు లాసినా వుంటే యెంత బాగుండేది! ఆవిడకి వేసవిలో పల్లెటూరిగాలి కావాల్సొచ్చింది! ఆమె వున్నా కాలక్షేపమయ్యేది" అనుకున్నాడు.

మర్నాటిఉదయం జాకోబును చూచి రావాలనుకున్నాడు, కాని అందుకొక అభ్యంతరంవచ్చింది. టెరెన్సు యాత్ర ముగించి ఆపూటే వస్తున్నానని రాసిన జాబు

ఇలియా కందించి. వాడు గదిలో కూర్చొని పిన్నబ్బ వస్తే తన యేకాంతం భంగమవుతుందే అని ఆలోచిస్తున్నాడు. అడుగడుగునా తన కేదో అవాంత్రం వచ్చిపడుతున్నట్టు తోచింది. తన శాంతి కెవరో ఒకరు అడ్డుపడుతున్నారని భావించాడు.

ఇలియా యీవిధంగా యోచనానిమగ్నుడయి వుండగా ముందరితలుపు తట్టినచప్పుడయింది. వంటమనిషే నోనని ఇలియా వెళ్లి తలుపు తీసిచూస్తే వాకిట్లో టెరెన్సు నిలబడున్నాడు.

"ఏమోయ్! వ్యాపారస్తుడు! రెండుబారలు ప్రొద్దెక్కినా యింకా దుకాణం మూసేవుంది!" అని టెరెన్సు నవ్వాడు.

ద్వారంమధ్య నిలబడివున్న ఇలియా మందహాసం చేస్తూ పినతండ్రికి స్వాగతంచెప్పాడు. టెరెన్సు అలసి నట్టున్నా వుత్సాహంగా వున్నాడు. "వీటిని లోపలికి తీసుకొనిపద" మని టెరెన్సు పెట్టి-బేడ చూపించాడు.

ఇలియా మౌనంగా సామాను జేరవేస్తున్నాడు. టెరెన్సు లోపలి కెళ్ళగానే యెదురుగా కనపడిన క్రీస్తుపటానికి ప్రణమిల్లాడు. "నీదయవల్ల సుఖంగా తిరిగి వచ్చా" నంటూ కూచున్నాడు. సామాను లోపలికి చేర్చివచ్చి ఇలియా పినతండ్రిముందు కూచుని కుశలప్రశ్న లడిగాడు.

జెరెన్సు పూర్వంకంటె లావుపారాడు. కళ్ళలో కాంతి వుంది. మనిషి దిగులులేనట్టున్నాడు.

తర్వాత జెరెన్సు స్నానంచేసివచ్చాడు. తనయాత్రా వివరాలు చెపుతూ చూచినప్రదేశాలనుగూర్చి కళ్ళకు కట్టినట్టు వర్ణించాడు. చెపుతూంటే సంతృప్తి, సంతోషాలచే వానికళ్ళు మెరిసేవి. పినతండ్రిలో కలిగిన మార్పుకు ఇలియా సంతోషించాడు.

బయట చినుకులుపడనారంభించి క్రమంగా తీవ్ర మయింది.

"మీ మానసికసంతాపం వుపశమించినట్టేనా? పాప భారం తగ్గిందిగద?" అన్నాడు ఇలియా.

జెరెన్సు ఒకక్షణమాగి "అబ్బాయ్! నే నాపాపం యిచ్ఛాపూర్వకంగా చేసింది కాదు. అయినా అది బిగుతైన కొత్తచెప్పు పాదాన్ని కరచినట్టు నాహృదయంలో పుండుచేసి వేధించింది. నే నా పనిని బలాత్కారంగా చేయాల్సి వచ్చింది. నేనందుకు అంగీకరించియుండకపోతే పెట్రుహా నన్నప్పుడే పనిలోనుంచి తొలగించేవాడు" అని చెప్పాడు.

"అలాగా!"

"అందువల్లనే నేను తీర్థయాత్రకు వెళ్లాను. పుణ్యక్షేత్రాలను దర్శించటంతో నాహృదయభారం తగ్గిపోయింది. నేను పాపినే కాని, ప్రాయశ్చిత్తానికి సిద్ధంగావున్నానని భగవంతునికి విన్నవించుకున్నాను."

"అయితే మీరు పాపపుణ్యాల జమాఖర్చుల్ని బరాబరి చేశారన్నమాట?" అని ఇలియా బిగ్గరగా నవ్వాడు.

"అది భగవదనుగ్రహంమీద ఆధారపడివుంటుంది."

"మీఆత్మ యేమంటోంది?"

"అంటే?"

"మీకు శాంతి లభించిందా?"

"ఆ, నాహృదయం శాంతించింది."

ఇలియా మళ్ళీ నవ్వాడు.

"నవ్వుతా వెందుకు? ఏకాగ్రచిత్తంతో భగవంతుని ప్రార్థించితే శాంతి లభించితీరుతుం"దన్నాడు టెరెన్సు ఆత్మవిశ్వాసంతో.

ఇలియా లేచివెళ్ళి కిటికీదరికి పోయి వర్షంలోకి చూస్తూ నిలబడ్డాడు. వర్షాధిక్యంవల్ల జనసంచార మాగిపోయింది. వాననీరు కాల్వలుగట్టి కలవరంచేస్తూ పారుతోంది. చూరులక్రింద నక్కినజనాన్ని చూచి ఇలియా నవ్వుకున్నాడు.

"ప్రార్థనమినహా మానవునివశంలో యింకేముంది!" అన్నాడు టెరెన్సు.

"అయితే మంచి వాటమే! నిత్యము పాపంచేసి ప్రార్థనతో మాపుకోవచ్చుగా!"

"ఒకదఫా ప్రాయశ్చిత్తం అయినతర్వాత మానవుడు మళ్లీ పాపానికి ఒడిగట్టలేడు". అన్నాడు టెరెన్సు గంభీరంగా.

"ఎందువల్ల?"

"ఆత్మను పవిత్రంగా వుంచుకోటానికే."

"అసలు పవిత్రంగా వుండాలన్న అవసర మేమిటని నాజిజ్ఞాస."

ఔరెన్సు మొహం చిట్లించి "నీమాటలన్నీ చిత్రంరా" అన్నాడు.

ఇలియా పెడమొగం పెట్టి "అందులో చిత్రమే ముంది? నేను నిజాన్నే అడుగుతున్నాను" అన్నాడు.

"అలా అనొద్దు నాయనా! పాపం వుపశమించుగాక!"

"పాపం యేం చేస్తుం దేమిటి."

"భగవంతుడు శిక్షిస్తాడు."

"అది మాత్రం అబద్ధం."

"ఎందుకాకూడదు? భగవంతుడు శిక్షించితీరుతాడు. పాపంచేసి నే ననుభవించలా?"

"ఎప్పుడు? మీ రనుభవించిందేమి" టని ఇలియా ఔరెన్సువంక చూచాడు.

"నా ప్రాణంతీయటానికి కహార్నిశలు మెవరో పొంచి వున్నట్టు నే నెప్పుడూ భయపడుతూండేవాడిని."

"నేనూ పాపంచేశాను కాని, నా కలాంటి భయ మేమీ లేదే?"

"అది పొరపాటు. నువ్వు మైకంలోవుంటంవల్ల కన పడటంలా; అంతే."

"నేను చెపుతున్నది నిజమే బాబాయ్!... అయితే మొత్తంమీద జీవితం దుర్భరంగానే వుంది. అందుక్కారణం మాత్రం తెలియటంలా."

టొరెన్సు బల్లగుద్ది "ఆఁ, అదీ! జీవితం దుఃఖదాయకంగా వుందని ఒప్పుకుంటున్నావుగద?" అన్నాడు.

"మిత్రులంతా నన్నొదిలేశారు"

"ఇంకేఁ, అది తక్కువ శిక్షా?" అన్నాడు టొరెన్సు.

ఇలియా అరచేత్తో గోడమీద రుద్దుతున్నాడు. వాని వైఖరి టొరెన్సును కలత పెట్టింది. ఇలియా స్వవిషయాన్నితరులతో చెప్పుకొని యెన్నాళ్లో అయింది. ఇవాళ హృదయంలో పేరుకున్నదంతా వెళ్ళగక్కి బరువు తగ్గించుకోవాలనుకున్నాడు.

"మీ తీర్థయాత్రలు నిరర్థకము, నిష్ప్రయోజనం కూడాను. నిత్యము లూటీలు, దోపిడీలు జరుగుతూనే వున్నై. వాటినిగూర్చి ఆలోచించే దెవడు? ఒకని కష్టనష్టాలతో యింకొకడి కేం పని? ఈ జరిగే అక్రమాలను యెవడు శిక్షించుతున్నాడు? ఎవడూ లేడనే చెపుతాను. సంఘశాసనా లెవన్ని శిక్షిస్తున్నాయి? నిరపరాధులూ, దురదృష్టవంతులూ శిక్షింపబడుతున్నారు. శ్రీమంతులు, తెలివిగలవాళ్ళు, యుక్తిపరులు శిక్షార్హులయిన్నీ తప్పించుకొంటున్నారు"

అని ఇలియా చెప్పుకొనిపోతూంటే టొరెన్సు వానిని సమీపించి రెండుచేతులూ పట్టుకొని "నీకీ ప్రపంచగోష

వలు వద్దురా అబ్బాయ్! అవన్నీ బుర్ర కెక్కించుకొని వుద్రిక్తుడవై జీవితం పాడుచేసుకోకు నాయనా" అన్నాడు.

అప్పుడు బయట యేదో చప్పుడయింది. వాన జోరుగానే కురుస్తోంది. "ఏమిటయి వుంటుం"దని టెరెన్సు అడిగాడు.

ఇలియా తలుపు తీసి చూచివచ్చి "దేవదారు పెట్టెల దొంతర పడిందిలే" అన్నాడు.

టెరెన్సు సామానుమూటలు విప్పుతూ "ఈ విధమైన తర్కవితర్కాలతో దేవుని కయిష్టం కల్గించటమే కాక నీ ఆత్మనుకూడ అపవిత్రంచేసుకుంటున్నావు. నీ యీ ధోరణి సుఖ-శాంతులను దూరంచేస్తుంది. తీర్థయాత్రల్లో నా కనేక మంది పుణ్యాత్ములదర్శనం లభించింది. వారి సత్సంగంలో నే నెన్నో సదుపదేశాలు పొందాను" అని చెప్పాడు.

ఇలియా ఆ మాటలు వింటూనే యిక ముం దాయనతో కలిసివుండటం మెలాగా అని ఆలోచిస్తున్నాడు.

తండ్రి, కొడుకులకు రోజు లానందంగానే గడిచిపోతున్నై. టెరెన్సు గ్రైబిక్ స్థాన మాక్రమించాడు. రాత్రుళ్ళు నిద్రించేముందు టెరెన్సు ఇలియా కనేక ఆధ్యాత్మిక విషయాలు బోధించుతూండేవాడు; కాని, ఇలియా కవి చెవికెక్కేవి కావు. వాని అంతరంగంలో మామూలు భావయుద్ధం సాగుతూనే వుండేవి.

ఒకరోజున టెరెన్సు పెట్రుహాను చూచిరావటానికి వెళ్ళాడు. తిరిగివచ్చినప్పుడు వాని మొహం కందగడ్డలాగుంది. ఇలియా "విశేషా లేమి" టని అడగ్గా "ఏమీ లే" వని మాత్రం చెప్పి వూరుకున్నాడు.

"జాకోబు బాగున్నాడా?" అని ఇలియా మళ్ళీ ప్రశ్నించాడు.

"వాడిచావు దగ్గరకు వస్తోంది. దగ్గు వాడిని క్రుంగ దీసివేసింది. నిన్నడిగానని చెప్పమన్నాడురా అబ్బాయి!" అని టెరెన్సు అవతలి కెళ్ళాడు.

తరువాత మరికొన్నిరోజులు సాఫీగా గడచిపోయాయి. ఇలియాహృదయం లోలోపల కుములుతూనే వుంది. వానికి మిత్రులు, పరిచితులతోడి సంబంధం బొత్తిగా తెగిపోయింది. పాష్కా, మాషాలు నూతనమిత్రులతోనే వుంటున్నారు. బండి బోల్తాపడి దెబ్బలు ప్రమాదంగా తగలటంవల్ల మతిస్సా చచ్చిపోయింది. ఫెర్ఫిష్కా జాడే తెలియదు. ఇలియా ఒకటి రెండుసార్లు జాకోబును చూచివద్దామనుకున్నాడే గాని, వెళ్ళలేక పోయాడు.

ఇలియా ఒకనాడేదో వారపత్రిక పుటలు తిరగేస్తున్నాడు. అందులో ఒకచోట పాష్కా పేర ప్రకటింపబడ్డ గీతాన్ని చూచి అప్యాయంగా చదివాడు. వానికళ్ళముందప్పుడు పాష్కారూపం నాట్యమాడినట్టుంది. పాష్కా ఆ గీతంలో తానె ట్లనాథుడై గాలిగా తిరిగిందీ, నా అన్న

వాళ్లు లేక పంచపంచలబడి గ్రుమ్మరుతూండగా నూతన సమాజాన్ని నిర్మించే ఆశయంగల కొందరు వ్యక్తులు తన కాశ్రయమిచ్చి నూతనమార్గంలో పెట్టించీ వర్ణించాడు.

ఆ గీతాన్ని సాంతం చదువుటతో ఇలియాసు ఒళ్ళు మండింది. పత్రికను విసరి నేలకేసికొట్టాడు. "తొందరెందుకోయ్? వాళ్ళదయ యెంతవరకో చూస్తాగా!" అని పళ్ళు పటపటలాడించాడు. కొంచెమాగి 'వాళ్ళవద్దకు పోయి క్షమాపణ కోరితే! అయినా వాళ్ళు నన్నెందుకు క్షమిస్తారు?" అనుకున్నాడు.

కోపం చల్లారినతర్వాత పారేసినపత్రికను తెరచి మళ్లీ ఆ గీతాన్నే చదివాడు. ఈసారి వానిస్మృతిపథంలో సోంకారూపం పొడకట్టింది. 'ఆబిడకు తలబిరుసు మహాజాస్తి' అనుకున్నాడు.

పత్రిక పుటలు త్రిప్పుతూవుంటే మరోచోట వేరా కేసు విచారింపబడుతున్నవార్త కనపడింది. వేరామీద చోరీనేర మారోపించబడినదన్న తలంపుతో ఇలియాహృదయం క్షోభించింది. పాష్కానుద్దేశించి 'కిరాతుడా! బాగా వున్నన్నినాళ్ళు అనుభవించి, యిప్పుడామె కారలో కుళ్ళుతూంటే నువ్వు నిశ్చింతగా కవిత రాసుకొంటున్నావా?" అని ఆక్రోశించాడు.

అదేసమయంలో ఔరెన్బు కళ్ళుమూసుకొని, చేతులు ముకుళించి "భగవాన్! నీ దయాభిక్షకు చేతులు చాచాను. నన్ను కరుణించు స్వామీ!" అని ప్రార్థన చేస్తున్నాడు.

జాంవాన్ యువతిలికొచ్చి పత్రిక పుటలు తిరగేస్తున్న ఇలియాతో "ఓరే అబ్బాయ్! పెట్రుషా నన్ను మోసం చేశాడు నాయనా" అన్నాడు.

ఇలియా పినతండ్రివంక చూస్తూ "నీకు తగినశాస్తే జరిగిందిలే" అనుకున్నాడు తనలో.

"ఇలియా! వాడు నన్ను దగాచేశాడురా" అని టెరెన్సు మళ్లీ చెప్పాడు.

"అసలు మీరు అపహరించినమొత్తమెంత?"

టెరెన్సు పీట సవతిలికి లాగి కూచుని వ్రేళ్లపైన లెక్కపెడుతున్నాడు.

"పదివేలుంటుందా?" అనడిగాడు ఇలియా మళ్లీ.

"ఎక్కడ! అంత లెక్కడిది? మూడువేలకు పైగా వుంటుంది."

"నేను నమ్మను. జర్నియావద్ద యింకా యెక్కువే వుండాలి."

"లేదు ఇలియా! నువ్వు పొరపడ్డావు."

"పొరపాటేటి? నా కాయన స్వయంగా చెప్పి లేదు" అన్నాడు ఇలియా దృఢంగా.

"జర్నియాకు లెక్క తెలుసా?"

"మీకంటె బాగానే తెలుసు."

టెరెన్సు ఆలోచనలో పడ్డాడు. తలూంచుకొని "అయితే పెట్రుషా నన్ను పూర్తిగా దగాచేశాడన్నమాట?" అన్నాడు.

"ఇంతకూ వాడు మీ కిచ్చిన దెంత?"

"ఏ డొందలే, నిజంగా పదివేలు వుండివుంటుం దంటావా?"

ఇలియా జవా బివ్వలా. పెరెన్ను దీనవదనం చూస్తు న్నకొద్దీ ఇలియాకడుపుమంట రగుల్తోంది.

"పెత్రుహా నన్నింత మోసంచేస్తాడనుకోలా." పెరెన్ను మెల్లగా అన్నాడు.

"చాల్లే, యిక నోరుమూసుకోండి."

"అంతకంటె చేసేదిమాత్రం యేముందిలే."

ఇలియాకి ఆలోచన కలిగింది. 'డబ్బుకోసం మానవు లెట్టి నీచానికైనా సిద్ధపడుతున్నారు. నాకే రెండులక్షల రూపాయలుంటే వీళ్ళకి నా శక్తిని చూపిద్దును. ఈ స్వార్థ పరు లొక్కొక్కడినే నా యెదుట పొట్టతో ప్రాకించేవాడి' నని తలపోశాడు. వానిక్రోధం ముమ్మరమై మోామెర్ర బడింది. సమాజంపైన రోత యెక్కువై పిడికిలి బిగించాడు. ఆ ఆవేశంలో ఘట్టిగా బల్లమీాద గ్రుద్దబోయి అంతలో వుద్వేగంతో కంపిస్తూ తనపైనె చూడ్కి నిల్పియున్న పెరెన్నును గాంచి ఆగిపోయాడు.

ఇలియా అక్కడనుంచి మెల్లగా వెళ్ళిపోయాడు. పెరెన్ను వానివైపే వింతగా చూస్తూ వుండిపోయాడు.

పినతండ్రి తన మనోవైకల్యాన్ని గ్రహించి, తన హృద్గతభావాలను తెలిసికోగోరుతున్నట్టు ఇలియా ఆకళిం

పోయాడు. అందుచేత వీలైనంతవరకు పెరెన్నుకు మొహం తప్పించేందుకు ప్రయత్నిస్తున్నాడు.

ఇలియాకు తన యీ స్థితి దుస్సహంగావుంది. ఎప్పుడూ చింతాక్రాంతుడై వుంటున్నాడు. రోజురోజుకు తాను పతితుడవుతున్నట్లు తలిచాడు. తన కెవరో ఘోర దురన్యాయం చేస్తున్నట్లు కలత చెందేవాడు. తుదకు తన పాపం తనను వెన్నంటి వేధిస్తోందనుకున్నాడు.

వస్త్రాల దుకాణానికి వెళ్లిన లూసినా పెరెన్ను వచ్చిన కొన్నాళ్ళకు తిరిగి వచ్చింది. ఆవిడ దుకాణంలో పెరెన్నును చూడగానే పలకరించింది.

పెరెన్ను తీసుకున్నా చూచి "ఇతడేనా మీ పిన్నబ్బ?" అడిగింది.

"అవును" అని ఇలియా చెప్పాడు.

"ఇక నీతోనే వుంటాడాయేం?"

"తప్పకుండాను."

ఇలియా జవాబు తీవ్రస్వరంలోవుంది. ఆ సంగతి గ్రహించి లూసినా యింకేమీ ప్రశ్నించలా. ఇలియా ఆమెతో జగడంకోసం సిద్ధంగావున్నాడు; కాని, అందుకవకాశ మీయకుండా లూసినా గప్‌చిప్‌గా చిత్తా, ఆవర్జాలు చూసుకోసాగింది. మధ్యమధ్య తాను పల్లెటూళ్ళలో చూచిన వింతలు, విశేషాలు చెపుతోంది.

ఉన్నట్టుండి ఇలియాకళ్లలోకి చూస్తూ "నాయందు నీ కంత కోప మెందుకు ఇలియా?" అనడిగింది.

ఆమె మొహంమీద ముడత లేర్పడ్డై. కళ్లు మెరుస్తున్నై. ఇలియా కప్పు డామె జగన్మోహినిగా కనపడింది. అటూ యిటూ చూచాడు. తా మిద్దరే వున్నారు. ఇలియా లేచి వెళ్ళి లూసినాభుజాలమీద రెండుచేతులూ వేశాడు. ఆమె యందు ద్వేష మున్నప్పటికీ కామోద్రేకంలో వాని కళ్ళు మూసుకొనిపోయినై. ఆమెను గట్టిగా కావిలించుకోవాలన్నకోరిక ప్రబలమయింది. లూసినా వానిబాహుపాశంలోనుంచి విడివడటానికి గింజుకుంటోంది. "నీకు పిచ్చి యెత్తిందా యేం? ఏమిటీపని? ఇది సరసాలకు తగిన తావేనా? ఎవరైనా చూస్తే! నన్నొదిలిపెట్టు ఇలియా! మీ బాబాయి నిక్కడినుంచి పంపివెయ్యి. వాడిగూనిచూచి దుకాణానికి వచ్చినవాళ్లు తిరిగిపోతారు కూడాను" అని వాని చేతుల్ని తోసివేస్తోంది.

ఇలియా ఆమెవిముఖత్వాన్ని లక్ష్యపెట్టలా. మోహాంధుడై బాహుబంధాన్ని మరింత బిగించాడు. ముద్దుపెట్టుకోటానికి లూసినామూతికి మూతిని చేర్చబోతుండగా ఆమె చప్పున క్రిందికి జారి నేలమీద చతికిలబడింది. తర్వాత లేచి దూరంగా పోయి నిలబడి కురులు సరిచేసుకుంటూ "నీవు శుంఠలాగున్నావు. వేళాపాళా లేదూ? ఛండాలుడా! నీ పల్లెటూరివాసన పోనిచ్చావు కా" దన్నది మురముర లాడుతూ.

ఇలియా దెబ్బతిన్నపాములాగయ్యాడు. వాని మెదడు వేడెక్కింది. వాని కామె మాట్లాడుతూంటే నీటి కలకలం లాగుంది. పిడికిలిబిగించి తన దురవస్థ కాబిడే హేతువన్నట్లు మిరిమిరిచూస్తున్నాడు.

"ప్రేమోన్మాదం మంచిదేగాని, మనసును వశంలో వుంచుకోవాలి" అంది లాసినా.

"ఛీఛీ! పాతకీ! నా యెదుటినుంచి పో" అన్నాడు ఇలియా కసిపట్టలేక.

"నేను వెళుతున్నాన్లే. ఇప్పుడు నీతో మాట్లాడి ప్రయోజనం లేదు. అయితే ఒకమాట: ఎల్లుండి నా పుట్టిన రోజు పండుగ!"

ఇలియా ఆమెను లంకించుకొని నలిపివేయాలను కున్నాడు; కాని, మళ్లీ యేంతోచిందో "ఇంకా వెళ్లక నుంచున్నావేం? పో" అని వురిమాడు.

ఆమె పోగానే టెరెన్సు లోపలికొచ్చాడు. "ఈ బిడేనా నీ భాగస్వామిని?" అనడిగాడు. ఇలియా తలూపాడు.

"చూపులకీమె సుజాతగా కన్పించటంలేదే?"

"అవగుణాల కాటపట్టులెండి."

టెరెన్సు ఇలియావంక అనుమానంగా చూచాడు.

"ఎందుకలా చూస్తా"రని ఇలియా తీవ్రంగా అడిగాడు.

"ఏంలేదు."

"నే నామెను గురించి చెప్పింది యదార్థమే. ఇంకా అంతకంటే పాపాత్మురాలు!" అని ఇలియా నవ్వాడు.

"ఇందువల్ల తేలే దేమంటే—"

ఇలియా పెరెన్నును పూర్తిగా చెప్పనివ్వకుండా "ఏమి తేలిం"దని ప్రశ్నించాడు.

పెరెన్ను తొట్రుపడ్డాడు. ఇలియా ధోరణి వానికి క్షోభ కలిగించింది. నీళ్లునములుతూ "ఆమెను గురించి నాకంటె నీకే బాగా తెలుసు" అన్నాడు.

"అవును, నాకు బాగా పరిచితమే" నని ఇలియా గొణగసాగాడు. వీళ్ళమధ్య తనకిక సుఖంలేదనీ, యెక్కడైనా పారిపోతే శాంతిగా బ్రతకవచ్చునీ అనుకున్నాడు. వాని కిప్పుడు మళ్ళీ సంఘంపైన రోత కలిగింది. వీళ్ళు వేధించి వేధించి యెప్పుడో తన ప్రాణం తీసేస్తా రనుకున్నాడు. ఈ విధమైన భావపరంపర చుట్టుముట్టుతూంటే యికనక్కడ వుండలేక "కాస్సేపలా నాపోయి తిరిగివస్తా" నని పెరెన్నుతో చెప్పి బయల్దేరాడు.

బయటికొచ్చినా ఇలియా మానసికాందోళన తగ్గలా. ఆకాశంనిండా మబ్బు కమ్మింది. క్రితంనాటి వర్షంవల్ల రోడ్లు జీరుకుగా వుంది. మైదానంలో పల్లపల్లాలు నీటితో నిండి వున్నై. చెట్ల ఆకులింకా తడిగానేవున్నై.

"దుకాణం వదిలిపెట్టి వచ్చినా నాకు శాంతి లభించే టట్టు లేదు. శాశ్వత శాంతికి ఆత్మహత్య ఒకటే మార్గ" మనుకుంటూ నడుస్తున్నాడు.

# 31

అది సెప్టెంబరు యిరవై మూడో తేది. వేరా విచారణ ఆవాళే. ఇలియూ వుదయాన్నుంచే కోర్టుకు వెళ్ళేసన్నాహంలో వున్నాడు. పెందలాడే భోంచేసి బయల్దేరాడు.

ఇంకా వేళ కాకముందే ఇలియూ కోర్టుకు చేరుకున్నాడు. ఒకరొకరే అక్కడికి చేరుతున్నారు. ఇలియూ వరండాలో కూచుని ముందున్న ఖాళీప్రదేశంలోకి చూస్తున్నాడు. మేఘాలు పరుగులుతీస్తూ సూర్యుని మరుగు పరుస్తున్నై. ఎండ తెరలుతెరలుగా పడుతోంది పచ్చికమీద.

అక్కడికి వచ్చిన వారిలో అనేకరకాలమనుషులున్నారు. కేసులకు సంబంధించినవారు యెదురుపార్టీలను చూచి మొహాలుచిట్లిస్తున్నారు. చేతులుతడైన సాక్షులు వకీళ్ళు నేర్పిన పాఠాలు వల్లెవేస్తున్నారు. చెట్లక్రింది ప్లీడర్లు పల్లెటూరి అమాయకులకు ధైర్యం నూరిపోస్తున్నారు. చంకలో కాయితాలకట్ట ఇరికించుకొని ప్లీడరు గుమాస్తాలు హడావుడిగా తిరుగుతున్నారు. విచారాక్రాంతులై ముద్దాయిలాందోళన పడుతున్నారు.

ఇలియూ తనప్రక్కన కూచొని మాట్లాడుకొంటున్న కోర్టుపక్షుల సంభాషణ నాలకించాడు. ఆరకం మనుషులు

మోసగించి, వంచించడానికే పుట్టి, బ్రతుకుతున్నారా అను కున్నాడు. అంతలో "అదిగో! కోర్టు తెరిచా" రన్నాడొకడు.

అందరూ అటువేపుకు కదిలారు. ఇలియా లోపలి కెడుతూంటే ఒకరిద్దరు వానిని ప్రక్కకునెట్టి ముందుకు చొరబడ్డారు. ఇలియా ఒళ్ళుమండి "దొంగముండా కొడుకులు! ఏమి ఠీవిగా పోతున్నారు! వీళ్ళకు జడ్జీదరిసే ఆసనాలేసి వుంచారు కాబోలు" లన్నాడు పైకి వినపడకుండా.

విశాలమైన కచ్చేరీహాలులో యెదురుగా యెత్తైన దిమ్మమీద ఒక మేజా, దానివెనక మూడు వున్నతాసనాలు వున్నై. హాలుమధ్య నిలువుగా పచ్చనిగుడ్డతో కప్పబడిన పొడుగాటి బల్ల; దానికిరుప్రక్కల కుర్చీలు వున్నై. వాటిలో నల్లకోట్లుధరించినలాయర్లువచ్చి కూర్చుంటున్నారు. ఉన్న తాసనాలకు వెనుకగోడను క్రీస్తు, చక్రవర్తిపటాలు వ్రేలా డుతున్నై. కిటికీలకు తెరలున్నై. జవాన్లు చప్పుడుకాకుండా తిరుగుతున్నారు. ఒక బంట్రోతు వచ్చి 'న్యాయమూర్తులు వేంచేస్తున్నా'రని హెచ్చరించాడు. అదివరకున్న సద్దణిగి నిశ్శబ్దమావరించింది.

వెనకద్వారంగుండా న్యాయమూర్తులు ముగ్గురు ప్రవేశించారు. అందరూ లేచి నిలబడ్డారు. ప్రధాన న్యాయ మూర్తి—గ్రోమోవ్ మధ్యనున్నఆసన మలంకరించాడు. అయనకుకుడివైపున వృద్ధ న్యాయాధిపతి ఆసీనుడయ్యాడు. మూడోపీఠాన్ని యువకజడ్జీ ఆక్రమించాడు. వారికి ప్రక్కగా

జూరీలు కూచున్నారు. కాస్సేపు పందహా ఎదుట బల్లలపై నున్న కాయితాలను చూచుకుంటున్నారు. ఇలియా గౌరవ భావంతో వారివంకే చూస్తున్నాడు.

ఇలియా దృష్టి జూరీలలో సుఖాసీనుడయివున్న పెత్రూహాపైన పడింది. ఒకటిరెండుతడవలు ఇలియా పెత్రూహాల చూపులు కలిశాయి కూడాను. జూరీలలో పెత్రూహానుగాంచి ఇలియాకడుపుడికింది. 'వీడు పక్కా బన్యాన్! జూరీగా వుండటాని కనర్హు'డని జడ్జీలతో చెప్పదామా అనుకున్నాడు ఇలియా.

అప్పుడు గ్రోవాన్ "నీ మీద అపరాధం......" అని మొదట అభియోగాన్ని గూర్చి ప్రారంభించాడు. ఆ మాటలు వినను కష్టించి అన్నదో ఇలియాకు తెలియలా. వానిదృష్టి పెత్రూహాయందే వుంది. అలాంటి క్రూరుడు, వంచకుడు జూరీలా కాగలిగాడా అని తనలో తాను వితర్కించుకొంటున్నాడు.

ప్ర. న్యా. మూర్తి మళ్ళీ ప్రశ్నించాడు— "నీ వా వస్తువులన్నిటిని తిరిగి యిచ్చి వేస్తానని వర్తకునితో చెప్పావా?"

"అవును" అని బోనులోవున్న ముద్దాయన్నాడు.

ఇలియా జూరీలను పారజూచాడు. వారిలో తా నెరిగిన వాడింకొక డున్నాడు. అతడొక దివాలాకోరు.

జడ్జీ అడిగాడు— "నీవు వర్తకునియింటికి నిప్పంటు కోవటం చూచావా?"

"చూచానండి" అన్నాడు ముద్దాయి.

ఇలియా ప్రక్కనున్నవారిలో ఒకడు "తెలివితక్కువ దద్దమ్మ!" అన్నాడు.

"ఎవరు తెలివితక్కువదద్దమ్మ?" అనడిగాడు ఇలియా వూరుకోలేక.

ఇలియా ప్రక్కనున్న నల్లటిమనిషి "ఇంకెవరు, ఆ ముద్దాయే. కేసును తల్లక్రిందులుచేసేసాయింటును పాడు చేసుకున్నా"డన్నాడు.

ఇలియా బోనులోనిమనిషివంక చూచాడు. దుక్కలాగున్నాడు. పల్లెటూరియువకుడు. చోరీలో ఆరితేరిన వానివలె లేడు. బిక్కమొగంతో బిత్తరచూపులు చూస్తు న్నాడు. ప్రేక్షకులందరిదృక్కులు వానిపైనె నిలిచివున్నై.

"ఈ కేసు విచారణ మజాగాలేదు. ముద్దాయి ఒట్టి గబ్బిలాయి. వాడి ప్లీడరు అంతకంటె గాడిద! సాక్షులు అమ్ముడుపోయారు. నేనైతే కేసును బుట్టదాఖలు చేయించే వాణ్ని" అని నల్లటివ్యక్తి గప్పాలుకొట్టాడు.

"అతను నేరంచేశాడనేనా మీ వుద్దేశం?" అనడి గాడు ఇలియా.

"వానివైఖరినిబట్టి నేనలా అనుకోను; కాని, ఏం లాభం? చెడగొట్టేశాడు. శిక్ష తప్పదు. పల్లెటూరి వెధవకి

కేసు నడుపుకోవడం ఏం తెలుసు?'' అని నల్లటాయన చిన్న ప్రసన్నాగ్రహించాడు.

''మీరు చెప్పింది నిజమే''నని ఇ లి యా వానితో ఏకీభవించాడు.

నల్లటివానికి జేబు తడివిచూచుకొని ''అరె, సిగరెట్లు అయిపోయాయే! (ఇలియాతో) ఒకరూపాయి వుంటే యివ్వండి. మళ్ళీ యిచ్చేస్తా''నని చెయిజాపాడు.

ఇలియా మాట్లాడకుండా జేబులోనుంచి రూపాయి తీసి యిచ్చాడు. తర్వాత ''ప్రక్కవాళ్ళని దోచుకుంటానికి మీరు నుంచిపుచ్చాయమే కనిపెట్టా''రని నవ్వాడు. నల్లటాయన చల్లగా లేచి బయటికి దారిపడుతూంటే వాని స్నేహితుడు వింకొకడు లేస్తూ '' మర్యాదలేకుండా నటయ్యా మాట్లాడేది?'' అని చక్కాపోయాడు.

అంతలో ప్రభుత్వన్యాయవాదిసింహగర్జన వినపడింది. ఇలియాచూపు పట్టు మళ్ళింది.

'' న్యాయమూర్తులారా! జూరీమహాశయులారా! నిందితునివాఙ్మూలాన్ని తమ రాలకించారు. సాక్షుల కైఫియతులటుంచి, ముద్దాయివాఙ్మూలమే నేరాన్నంగీకరించుతోంది......... కాబట్టి యితడు ప్రజాశాంతి-భద్రతలకు ప్రమాదకరుడని స్పష్టమే. అందువల్ల.........'' అని ప్ర. న్యాయవాది వాదించాడు.

ప్ర. న్యాయవాది తనపేరెత్తినా, గట్టిగా బల్ల గ్రుద్దినా, బిగ్గరగా హుంకరించినా ముద్దాయి వులిక్కిపడేవాడు.

ఇలియా తలవొంచుకొని వింటున్నాడు. వానికంతా అయోమయంగావుంది. వానిబుర్రలో అల్లకల్లోలంగావుంది. వానికళ్ళముందు పెట్రుహా మబ్బులో చంద్రునిలా తేజరిల్లుతున్నాడు.

న్యాయమూర్తులు ఫలహారానికి లేచారు. అందరితో పాటు ఇలియాకూడ చెట్టుక్రింది కెళ్ళాడు. నల్లటి మనిషితో వున్న పొట్టివ్యక్తి "వాడు తాను నిప్పుపెట్టలేదని ఒట్టుపెట్టుకొన్నాడు; కాని, యిక్కడ ఒట్లు, ప్రమాణాలను లక్ష్యపెట్టే దెవరు? కోర్టుకీడ్వబడినతర్వాత వీపు ఒప్పజెప్పి కొరడా దెబ్బలకు సిద్ధపడాల్సిందే. కేసు అవకతవకగావుంది. వర్తకుని యిల్లు తగులబడిపోయింది. ఇంట్లోసామాను దోచుకోబడింది. కాబట్టి యెవడికో ఒకడికి కోర్టులో శిక్ష విధింపబడితీరాలి. వీడు పట్టుబడ్డాడు; కాబట్టి అపరాధి అయినా, కాకపోయినా శిక్ష ముట్టజెప్పాల్సిందే" నన్నాడు.

"ముద్దాయినిగూర్చి మీ అభిప్రాయమేమి" టని ఇలియా వాని నడిగాడు.

"వాడు శుంఠ. అదే వాని దోషం. తెలివిగల వాడైతే తప్పించుకోగల్గేవాడు" అని పొట్టిమనిషి అనుభవశాలిలా సమాధానమిచ్చాడు.

"ఇక్కడున్న వాటిల్లో—" అని ఇలియా ప్రారంభించేసరికి "ఎక్కడనుంచి వచ్చిన ప్రముఖు"లని నల్లటాయన ప్రశ్నించేశాడు.

"నేను వాటిల్లో యిద్దర్ని బాగా ఎరుగుదు" నన్నాడు ఇలియా.

"చాలా పెద్దమనుష్యులే!" అని పై వ్యక్తి నవ్వాడు.

"పచ్చి మోసగాళ్లూ, దోపిడీగాళ్లూ" నన్నాడు ఇలియా గట్టిగా.

నల్లటాయన సిగరెట్టుముక్కను పారేసి "న్యాయవిచారణ అనే దొక్కటున్న నాటకం. శ్రీమంతులు న్యాయమూర్తులు, వాళ్లు అంటూ గర్వపడి ప్రాణాల్ని, అన్నార్తులను విచారణ చేస్తారు. వాళ్లని నరకకూపంలోకి తోల్లించుతారు...... దరిద్రుడు వాళ్లలో ఒక్కడు భాగ్యవంతులను విచారించడం నేనెన్నడూ చూడలేదుగనుక" అన్నాడు.

"కడుపునిండా వున్న వాళ్ళకు అన్నార్తుల బాధ తెలియదుగా."

"అది పొరపాటు. తెలిసే వాళ్లు పేదలను మసి చేస్తున్నారు."

"శ్రీమంతులైనా, విద్యాధికులైనా న్యాయానికి బద్ధులై వ్యవహరిస్తే మంచిదే; కాని, అన్యాయానికి ఒడిగట్టే వాళ్లు న్యాయమూర్తులెలా అవుతారు?" అన్నాడు ఇలియా.

"మర్యాదస్తులు, కౄరులే తీర్పరులౌతారు. వాళ్ళయి తేనే దయాదాక్షిణ్యాలు లేకుండా కఠినశిక్షలు విధించ గల్గుతారు. సరే, పోదాం పదండి. ఇంకేదో కేసు పిలుస్తు న్నారు" అని నల్లటివ్యక్తి లేచాడు.

"ముందుకూర్చుందాము, త్వరగా పదం" డన్నాడు పొట్టిమనిషి.

ఇలియా తనతో మాట్లాడిననల్లటాయన్ని కోర్టు వ్యవహారాల్లో రాటు తేలినమనిషిగా భావించి యేదో అడిగి తెల్సుకోవాలనుకున్నాడు; కాని, వాడొక చేదెబ్బలుకొట్టే ఆనెస్టురోగ్ అని మళ్లీ ఆలోచించుకొని మానుకున్నాడు. పెట్రుహా జూరీలో వున్నాడని తలచుకొన్నప్పుడల్లా వాని హృదయం వ్రయ్యలవుతోంది.

తిరిగి కోర్టుహాలులో ప్రవేశించినప్పుడు ఇలియా దృష్టి ఆజనంలో నిలబడున్న పాష్కాపైన పడింది, ఇలియాకి పట్ట రాని ఆనందంకలిగింది. పోయి వానిచెయి పట్టుకున్నాడు. పాష్కా వెనుదిరిగి చూచాడు. ఇద్దరూ నవ్వుకున్నారు.

"చూద్దామని వచ్చావా?" అనడిగాడు పాష్కా.

"అవునుగాని, ఆమె వచ్చిందా?" అని ఇలియా ప్రక్కప్రక్కల చూస్తూ అడిగాడు.

"ఎవరు?"

"ఆవిడే, మీ సోంకా."

"మా సోంకా యేమిటోయ్? నీకెంతో, నాకూ అంతే" నన్నాడు పాష్కా.

ఇద్దరూ మౌనందాల్చారు. తరువాత పోయి కూర్చుందాం రమ్మని ఇలియా ఖాళీగావున్న స్థలం చూపించాడు.

"నాతో యింకా మిత్రు లున్నారులే" అని పాష్కా మరోవైపు కెళ్లాడు.

ఇలియా వానివంకే చూస్తున్నాడు. పాష్కా తన పుండుమీద ఒత్తినట్టు బాధపడ్డాడు. పాష్కా వేసుకున్న కొత్తకోటు, వాడి శుభ్రత, కళకళలాడే ముఖము చూచి ఇలియా కీర్ష్యకలిగింది. పాష్కా ప్రక్కనే సోంకా కూర్చొని వుంది. వాడామె చెవిలో యేదో చెప్పగా సోంకా తలత్రిప్పి ఇలియావేపు చూచింది. అది గమనించి ఇలియా మొహం ప్రక్కకుత్రిప్పుకున్నాడు. వానిహృదయంలో ద్వేషాగ్ని మళ్లీ రగుల్కొన్నది. తల తిరుగుతున్నట్టుంది. కళ్లముందు చీకటి కమ్మింది. వాడప్పుడు తన చుట్టూ యేంజరుగుతున్నదీకూడ తెలియనిస్థితిలోవున్నాడు.

వేరా పోలీసు పహరాలో కోర్టుకు తీసుకొని రాబడింది. బోనులో నిలబెట్టారు. ఆమె రెప్పవాల్చకుండా ప్రధాన న్యాయమూర్తి గ్రోమోవ్ వంక చూస్తోంది.

గ్రోమోవ్ వేరావంక జాలిగాచూచి "వర్తకుని సొమ్ము వగైరా అపహరించావని నీమీద నేర మారోపించ

బడింది. అందుకు సంజాయిషీ యేం చెప్పుకుంటా” వని అడిగాడు.

ఇలియూ అన్ని వైపులకు దృష్టిసారించాడు. పాష్కా తలవంచుకొనివున్నాడు. సోంకా స్వాభిమానంతో మోరపైకెత్తి చూస్తోంది.

వేరా తడబడుతూ జవాబిచ్చింది—“నేను నేరాన్ని అంగీకరిస్తున్నాను.”

పంచాయితీ దారు లిద్దరు మెడలు వంకరగాపెట్టి తల్లూపుతూ వేరాను తేరి చూస్తున్నారు. పెత్రుహా నవ్వుతున్నాడు. తతిమ్మావాళ్లు కూడ అదోమాదిరిచూపు నామెపైన నిలిపారు. ఆ చూపులోని మర్మాన్ని గ్రహించి ఇలియూ వాళ్ళ నసహ్యించుకున్నాడు. ఇంత కుత్సితులింకేమి న్యాయంచేస్తారని గోడిగి పళ్ళునూరాడు. “ఓరి పాతకుడా! ఏమి టాలోచిస్తున్నావు? నువ్విప్పుడున్న దెక్కడో తెలుసా? నీ వా స్థానానికి అర్హుడవేనా?” అని పెత్రుహాను గద్దించాలనుకున్నాడు.

కాని, వానినోటినుంచి ఒక్క పలుకైనా బయటపడలా. ఏదో గొంతులో అడ్డు పడినట్టుంది. ఒకతడవ ఆ ఆవేశంలో సగం లేచాడు కూడాను; కాని, ప్రక్కనున్నవారి అదమాయింపుతో చతికిలబడ్డాడు.

“నువ్వీ వృత్తిలో యెన్నాళ్లనుంచి వున్నా” వని గ్రోమోవ్ వేరా నడిగాడు.

వేరా నీ ప్రశ్న చాల నొప్పించింది. రెండు చేతుల్తో ముఖాన్ని కప్పుకొని "చాలా కాలాన్నుంచీను" అంది మెల్లగా.

వేరా స్వరం దృఢంగానే వుంది. ఆమెనిబ్బరానికి ప్రేక్షకులు విస్మితులయ్యారు. వారిలో గుసగుస లారంభ మైనై. తన్నెవరు గుర్తిస్తారోనని పాష్కా తల క్రిందికి వంచుకున్నాడు.

"ఎన్నాళ్ళనుంచో సరిగా చెప్పు" మన్నాడు న్యాయ మూర్తి మళ్లీను.

వేరా పాలవిగ్రహంలా నుంచొనుంది. ఆమెతలకు చుట్టబడ్డ రుమాలు అంచుమాత్రం గాలికి కదుల్తోంది.

గ్రోమోవ్ గడ్డం సవరించుకొని "పోనీలే, యిష్టం లేకపోతే చెప్ప నవసరంలేదులే" అని యింకేవో కొన్ని ప్రశ్న లడిగాడు.

తర్వాత ఒక వకీలు లేచాడు. జడ్జీలకు అభివాదం చేసి, కోటు సరిచేసుకుంటూ "నువ్వీ సలీ వృత్తి నెందుకు అవలంబించాల్సివచ్చిందో చెప్పు" మని వేరా నడిగాడు.

"అందుకు ప్రత్యేక కారణమంటూ ఒకటి లే" దని చెప్పి వేరా న్యాయమూర్తులవంక చూచింది.

"సందేహ మెందుకు? మొన్న నాతో చెప్పావే అదంతా చెప్పు" అన్నా డామె వకీలు.

వేరాకి కోపమొచ్చింది. ముఖ మెర్రబడింది. "నేను మీతో నేమీ చెప్పలా. మీరే యేదో కల్పితకథ

చెప్పమన్నారు'' అని న్యాయమూర్తులవైపు తిరిగి ''నాకు ప్లీడరుతో పనిలేదు. ఆయన్నిక కూర్చోబెట్టం''డని చెప్పు కుంది.

ఇలియాకి కలవరంపుట్టింది. పాష్కా లేచి యేమైనా చెపుతాడేమోనని ఆవేపుకు చూచాడు; కాని, వాడు మిత్రు లతో హాస్కుకొడుతున్నాడు. గ్రోమోవ్ మళ్లీ వేరా నేదో ప్రశ్నించాడు.

వేరా పూర్వాంకన్న ఘట్టిగా సమాధానమిచ్చింది- "నేను దరిద్రంలో నుంచి బయటపడాలనుకున్నాను. లేమి వల్లనే యీ వృత్తి నవలంభించాను. ఇంతకంటె నేను చెప్పాల్సిం దేమీ లేదు''

జూరీ సభ్యులు గుసగుసలాడుతున్నారు. న్యాయ మూర్తుల మొహాల్లో గంభీరత కనబడుతోంది. కచేరీహాల్లో నిశ్శబ్దంగా వుంది. ముందరి మైదానంలో కవాతు చేస్తున్న సిఫాయిల బూట్ల టకటకమాత్రం విన్పిస్తోంది.

"ముద్దాయి స్వయంగా నేర మంగీకరించుతూంటే-'' అని వేరావకీ లేదో చెపుతున్నాడు. ఇలియా యిక నక్కడ కూర్చోలేక వెళ్లబోయాడు; బంట్రోతు వాని నదలించి కూచోబెట్టాడు.

గత్యంతరంలేక ఇలియా పాష్కావలె తలొంచుకొని కూచున్నాడు. పెట్రుహా యెదురుగా కనపడుతూండడము, వానిపదవి ఇలియాకు కంటగింపుగా వున్నై. 'చిత్రకారుడు

...మ్మును సుళువుగా గీసినట్టే న్యాయమూర్తులకు ప్రజల్ని విచారించటం సులభంగా వుంది. నేనుకూడ హత్యాపరాధాన్నింకొకరిస్తే యిలాగే చులాకనగా విచారణ అయిపోతుంది. పెట్రోసహో నగరంలోవుండి నన్నకామెకేని సైబీరియాకి సాగనంపుతారు. తాను మహా కృూరుడయ్యుండికూడ యిక్కడ సర్వభోగాలు అనుభవించుతూంటాడని భావించుకొని ఇలియా గజగజలాడాడు. అప్పుడు వానికి బాహ్యజ్ఞానమున్నట్టేలేదు. ఎవరేమి చెప్తున్నది వానికి విన్పడనేలేదు.

ప్రభుత్వన్యాయవాది గంభీరగర్జనలతో మాట్లాడుతూండగా వేరా అడ్డొచ్చి "మీ కింకా కంఠశోష యెందుకు? నే నొప్పుకున్నమాటే పదిసార్లు నొక్కిచెప్పాల్సిన అవసరమేముంది?" అని వెక్కివెక్కియేడ్వసాగింది.

ఆమె రోదనంతో కోర్టుహాలు ప్రతిధ్వనిస్తోంది. వేరా యేడుస్తూనే "నన్నింతగా వేధించడమెందుకు? దిక్కుమొక్కులేని ఆడుదాన్నేడ్పించడం మీకు ధర్మమేనా? మీకు తోచిన శిక్ష విధించండి" అంది.

ప్రేక్షకులొకరొకరే బయటికి దారిపట్టారు. ఇలియా జనాన్ని తోసుకుంటూ వరండాలోకి చేరాడు. "ఆమెను వృథాగా వేధించుతున్నా"రన్న మాటలు వాని పెదాలు దాటివచ్చాయి.

పావెల్ గోడనానుకొని నుంచున్నాడు. వాడి మొహంలో కళ లేదు. జుట్టు చెదరివుంది. లోలోపల దిగులు

పడుతున్నాడు. ఇలియా వానివద్ద కెళ్ళాడు; కాని, యేమి మాట్లాడ్డానికి పాలుపోక గ్రుడ్లు మిటకరించి చూస్తున్నాడు. వరండాలో చేరినజనం వేరా కేసునుగూర్చి పరిపరివిధాల చెప్పుకొంటున్నారు.

వాళ్లు చెప్పుకొన్నవి ఇలియా చెవినిపడుతూనే వున్నై. వాడిక వూరుకోలేక పాష్కాచేతిని గట్టిగా నొక్కుతూ "నిన్ను ప్రేమించినందుకు వేరా కెల్లాంటి గతి పట్టిందో చూచావా?" అన్నాడు.

పాష్కా ఇలియాభుజంమీద చెయ్యేసి "ఇందులో నాదోష మేముంది?" అన్నాడు.

ఇలియాకి ఒళ్లుమండింది. 'ఆమెసర్వనాశనానికి నువ్వే బాధ్యుడ' వని చెప్పాలనుకున్నాడు; కాని, ఆ మాటను దిగమ్రింగి "వేరాను విచారించేందుకు పెట్రుహా కేమి హక్కుంది?" అన్నాడు.

ఆ మాట అని అక్కడినుంచి యిసురుగా బయల్దేరాడు. ఆ నడక వాడేదో త్రాటితో యీడ్చుకొనిపోబడుతున్నట్టుగా వుంది. ఇలియాకి తనహృదయమే భారంగా తోచింది. మనస్సు చీకాకుగావుంది. పిచ్చెత్తినట్టు సాయంత్రందాకా అటూయిటూ చెడతిరుగుతున్నాడు. ఇలియా ఆకలిదప్పులుకూడ మరిచాడు.

---:---

# 32

చీకటిపడుతోంది. నలుముఖాల దీపాలు వెలిగించారు. ఇండ్లలోని వెలుగు కిటికీలగుండా బయటపడుతోంది. వెర్రి గంగులెత్తినట్టు తిరుగుతున్న ఇలియా కప్పాడు గ్రోమోవ్ భవనము, దాని కిటికీ తెరలు, రంగద్దాలు, ఇల్లాలి చక్కదనము తలపుకొచ్చాయి.

ఆవిధంగా నడచిపోతుండగా వానికి క్షుద్బాధ తెలిసింది. హోటలుకు దారితీశాడు. అంతలో ఒక జట్కా మహావేగంగా వెనకనుంచి వచ్చి ఇలియాప్రక్కగా దూసుకొనిపోయింది. నూలువాసిలో ప్రమాదం తప్పింది.

ఇలియాకి మాటిమాటికి వేరా జ్ఞప్తికొస్తోంది. ఆమె చిక్కులపాలయినందుకు చింతపడుతున్నాడు. తన స్థితి మాత్రం ఏం బాగుంది! వానిబుద్ధి పదేపదే 'వేరా సంగతెందుకు! స్వవిషయ మాలోచించుకో' మని చెపుతోంది; ఎంత వద్దనుకున్నా వేరా వాని స్మృతిపథంలో నుంచి తొలగటమే లేదు.

"వేరా స్వాభిమానం మెచ్చుకోతగ్గది. పాష్కా పేరే ఎత్తలా. ఎంత విశాలహృదయం! లీపా అయితే చెప్పివుండేదేమో! ఎవ్వే, ఆమె యింతకంటే వుత్తముకాలు. మరి

లాసినా అయితేనో?" ఇలా అనుకొనేటప్పటికి వానికి లాసినా పుట్టినరోజుపండుగసంగతి జ్ఞప్తికొచ్చింది. ఆమె స్వయంగా ఇలియా నాహ్వానించింది కూడాను. ఆవుత్సవం ఆనాడే. ఇలియా మొదట వెళ్ళవద్దనుకున్నాడు; కాని, మళ్ళ యేం తోచిందో పోయివద్దామని నిశ్చయించుకున్నాడు. హోట లుకు వెడుతున్నవాడు చప్పున ఒక జట్కాలో యెక్కి సరాసరి లాసినాయింటికి వెళ్లాడు.

ఇలియాను చూచి నికోడిమిచ్ యెదురొచ్చి స్వాగత మిచ్చాడు. "నువ్వు రాలేదనే అనుకుంటున్నాము. సమ యానికే వచ్చావు" అన్నాడు.

"ఇలియా! నీ మొహం వాడిపోయిందే?" అని లాసినా వాని రిక్తహస్తాలను చూచి "అరె! ఉత్తచేతుల్తో వచ్చావా? నాకు బహుమతి తెచ్చావుకాదే? అలా మిడి గ్రుడ్లుపెట్టి చూస్తావెందుకు? పగలంతా యెక్కడి కెళ్లా" వని గుక్కతిరక్కుండా అడిగింది.

కిరిక్ ఇలియా చెయి పట్టుకొని తీసుకెళ్ళి కుర్చీలో కూర్చోబెట్టాడు. అతిథులందరికి పరిచయంచేశాడు. అంద రితో చేతులుకలిపినతర్వాత ఇలియా కుర్చీలో ఒదిగి కూచు న్నాడు. బాగా అలసి వుంటంవల్ల వానిపాదాలు తేలిపోతు న్నట్టున్నై. అత్తాకల్తో వున్నాడేమో, ముందున్న పదార్థా లను గబగబా తినసాగాడు. వడ్డన యింకా పూర్తికాక

మునుపే ఇలియా అసభ్యంగా భోజనాని కుపక్రమించడం చూచి అభ్యాగతులొకడు నవ్వాడు.

"నువ్వు నాకు సుభాకాంక్షనైనా తెల్పకుండా తిండికి త్వరపడుతున్నావే. బలేమనిషివి! వచ్చినవాడివి ఒక్క పలుకైనా పలికావు?" అని ఇలియాకెదురుగా కూర్చున్న లాసినా టేబిలుక్రింద తన కాలివ్రేళ్లతో వానిపాదాన్ని త్రొక్కుతూ మెల్లిగా యింకా యిలా అంది—"కొంచెం తెలివిగా ప్రవర్తించు."

ఇలియా చేతిలోనిరొట్టెముక్కను క్రిందపెట్టి "నేనివాళ పగలంతా కోర్టుచుట్టూ తిరగటంవల్ల బాగా ఆకలయింది" అని చెప్పాడు.

అతిథులు మౌనంగావున్నారు. అందరూ రెప్పవాల్చకుండా ఇలియావంకే చూస్తున్నారు. వాడేదైనా వినోద విషయం చెపుతాడేమోనని ఎదురుచూస్తున్నారు. గదిలో నిశ్శబ్దంగా వుంది. ఇలియామనోవీధి నెన్నెన్నో భావాలు పొడకట్టి అంతలో అదృశ్యమవుతున్నాయి.

"న్యాయవిచారణ ఒక్కొక్కప్పుడు బలే తమాషాగా వుంటుంది" అన్నది గ్రిస్లోవా అనేఆవిడ.

లాసినా మొహం జేవురించింది.

కిరిక్ ఇలియానుద్దేశించి "నువ్వేదో వింతసంగతి చెపుతావని చూస్తుంటే ఒకమాట చెప్పి వూరుకున్నావేం? కచేరీ కెందు కెళ్ళావు?" అని కదిలించాడు.

అక్కడున్నవారిలో నిరుత్సాహం వ్యాపిస్తోందని ఇలియా కనిపెట్టాడు. ఇక బాగుండదని నోరువిప్పాడు. తతిమ్మావారు కూడ బాతాఖాని ప్రారంభించారు.

"నే నొక పర్యాయం ఒక హత్యాభియోగంలో పనిచేయాల్సివచ్చింది" అన్నా డొక లాయరు.

"హత్యా రహస్యాలు చదవడానికి బలే మజాగా వుంటై" అంది శ్రీమతి ట్రాకిన్.

"నేను పనిచేసిన కేసులోని ముద్దాయి నా సహాధ్యాయే. అతను ఖజానాకు కాపలా వున్నాడు. ఆ సమీపంలోకి ఒక బాలుడొచ్చి నుంచున్నాడట! ఆ కుర్రాడితో వేళాకోళమాడుతూ నా సహపాఠి వాణ్ని కాల్చివేశాడు" అనిలాయరు చెప్పాడు.

"అయ్యో పాపం!" అంది లాసినా.

"నే నొకసారి సాక్షిగాను, మరొకప్పుడు చూద్దామనీ కోర్టు కెళ్ళాను. అక్కడొక తమాషా కేసు విచారణ జరుగుతోంది. ఆ కేసులో ముద్దాయిపైన నేర మేమిటో విన్నారూ! వా డింకొకడిని కొరికాడట!" అని గొప్ప వింత సంగతి చెప్పినట్టు ట్రాకిన్ సతి తతిమ్మావారి వంక చూచింది.

ఈ సంభాషణ విని కిరిక్ కిలకిలనవ్వాడు. అక్కడున్న వారిలో కొందరు హత్యలనుగూర్చి, మరికొందరు బందిపోటు వార్తలూ చెప్పుకుంటున్నారు. ఇలియా ధ్యాన మాక బుర్లమీద లేదు. వాడు రెప్పవాల్చకుండ లాసినా వంక చూస్తు

న్నాడు. వాని హృదయకుహరంలో అగ్నికణాలు రగుల్తున్నై; కాని, పైకిమాత్రం మంటలు లేవటంలా. లాసినా యిటూ అటూ చలాకీగా తిరుగుతోంది. సీతాకోకచిలుకలాగా అందరిదృష్టి నాకర్షిస్తూ, మెరిసిపోతోంది. ఒకటి రెండుసార్లు ప్రక్కగదిలోకెళ్లి యితరులు గమనించకుండా ఇలియాను రమ్మని సైగచేసింది; కాని, వాడు కూర్చున్నచోటునుంచి కదల్లా. అందువల్ల లాసినా చీకాకుపడుతోంది. ఇలియా ఉద్దేశపూర్వకంగానే ఆమె నలా వుడికిలించుతున్నాడు.

"మిత్రమా! మౌనంగా వున్నావేం? కబుర్లు చెప్పు, నిన్ను సేవించేవా రిక్కడ ఎవరూ లేరులే" అన్నాడు నికోడిమిచ్.

"ఇవాళ కోర్టులో ఒక వేశ్యకేసు విచారణజరిగింది. ఆమె చాలా మంచిస్వభావం కలది. నే నావిడను బాగా ఎరుగుదును" అని ఇలియా చెప్పాడు.

అందరిచూపు ఇ లి యా వే పు కు మళ్ళింది. వాడు స్వయంగా వేశ్యతో పరిచయమున్నట్టు చెప్పుకొంటున్నందుకు కొందరికి నవ్వొచ్చింది; కాని, వాడు చిన్నపోయి మరి మాట్లాడడేమోనని పైకరానీక ఇలియావంకే కుతూహలంగా చూస్తున్నారు.

ఇలియా వారిభావాన్ని కనిపెట్టి "ఎందుకు మీరు నవ్వుతారు? వేశ్యల్లో మంచివాళ్లెందరు లేరు?" అన్నాడు.

"నువ్వు చెప్పింది నిజమేలే. తర్వాత సంగతి చెప్పు" మన్నాడు కిరిక్.

"మీ రందరు పెద్దమనుషు లనిపించుకొంటున్నారు. నే నేదైనా పొరపాటు మాట్లాడితే గోరంతను కొండంత చెయ్యడం భావ్యమేనా? తర్వాత చెపుతా వినండి. ఆమె ఒక వర్తకునిసొమ్మపహరించిందని కేసుపెట్టారు."

"భేష్! తమాషాసంగతే" నన్నాడు మధ్యలో కిరిక్.

"కాని, వాస్తవాని కామె ఆ సొమ్మును దొంగిలించలా. ఆ వర్తకుడే ఆమెవ్యామోహంలో పడి ఆ సొమ్ము వగైరా నామె కిచ్చాడు."

ఒకప్రక్కగావున్న లా సి నా ను పిల్చి కిరిక్ అన్నాడు—"ఇటురా. ఎంత మజాగా వుందనుకున్నావు కథ!"

ఇలియాచెప్పింది విని లాసినా అదివరకె నవ్వుతోంది. ఆమె అతిథులవంక చూస్తూ "ఇందులో విశేషమేముంది? మీ రిలాంటివి వేనవేలు వినివుంటారు. ఇక్కడీకథ వినేందుకు పడుచుపిల్ల లెవరూ లేరు. ఇక భోజనం కానివ్వండి" అంది.

అందరి దృష్టి ఆహారపదార్థాలపైకి మళ్లింది. తన మాటల నాలకించుతున్నవారు లాసినావల్లనే విముఖులయ్యారని ఇలియా తెలుసుకున్నాడు. వానికి లాసినాపైన అమిత కోపంవచ్చింది. ఆ రోషంతో "ఇదివర కామెపొందు కూడినవాళ్లుకూడ విచారణచూడటానికి వచ్చారు. జూరీలో వున్నవాళ్ళు పరమనీచులు, దుర్మార్గులూను" అన్నాడు.

"మీరు గౌరవనీయుల నావిధంగా దూషించకూడదు. వారు జూరీసభ్యులు. నేనుకూడ......"అని క్రొ కి న్ అంటూవుంటే ఇలియా అందుకొని యిలా అన్నాడు—"వారు జూరీ సభ్యులే; కాని, వారు న్యాయం చెప్పగలరూ? ఒక వేళ......"

ఇలియాను ముగించనీకుండా క్రొకిన్ మొదలెట్టాడు-"రెండో అలెగ్జాండర్ చక్రవర్తి దేశకళ్యాణార్థం యీ జూరీ విధానాన్ని అమలుపర్చాడు. అట్టి జాతీయవిధానాన్ని నిందించటం ద్రోహం."

క్రొకిన్ కనుబొమలు పైకి క్రిందికి నాట్యమాడుతున్నై. అతనివాగ్ధోరణి ఇలియాను దబాయించుతూన్నట్టుంది. ఒకరిద్దరు లేచెళ్ళి క్రొకిన్ ప్రక్కన నుంచున్నారు. లాసినా కంగారుపడింది. ఆ చర్చ నక్కడితో విరమించమని చెప్పింది.

"అవన్నీ వేదాంతవిషయాలు, మనకెందుకు పోనిద్దురూ" అని కిరిక్ తన సతికి మద్దతిచ్చాడు.

"ఇందులో వేదాంత మేముంది? రాజనీతి. ప్రభుత్వ విధానాన్ని నిందించేవాడు రాజనీతినెరుగనివాడన్నమాట" అని క్రొకిన్ తనవాదాన్ని సమర్థించుకున్నాడు.

తన్నధిక్షేపించినా లాసినాదంపతుల కెదురాడినందుకు ఇలియా క్రొకిన్‌ను మనసులో మెచ్చుకున్నాడు. క్రొకిన్ ఆ దంపతుల నింకా యేడ్పిస్తే బాగుండు నను

కున్నాడు. అతిథుల కా దంపతులయందు గౌరవము లేకుండా పోవాలని ఇలియా కోరిక. ఎలాగైనా రసాభాస చెయ్యాలన్న తలంపుతో "మీరు విద్యావంతులు. ఏది మాట్లాడినా చెల్లిపోతుంది. నన్ను మీరు ఆక్షేపించినా సరేగాని, నేను చెప్పినది ముమ్మాటికీ నిజం. కడుపునిండిన వాడికి డొక్కమాడుకొనివున్న వాడిబాధ యేం తెలుస్తుంది? దరిద్రుడు చౌర్యం చేయడని చెప్పను; కాని, కలవాళ్లు కూడ తక్కువ దొంగలు కాదు" అన్నాడు.

"కిరిక్! ఏమిటీ గొడవ?" అన్నాడు క్రాకిన్. అతిథుల కానంద, వినోదాలు లేకుండా రసాభాస మవుతున్నందుకు లాసినా కలతచెందింది. క్రాకిన్ చేయిపట్టుకొని "కూర్చోండి. పదార్థాలన్నీ చల్లబడిపోతున్నాయి. ఇక భోజనం కానివ్వం" డని బిక్కమొగంతో బ్రతిమలాడింది.

శ్రీమతి క్రాకిన్ కూడా భర్త రెండోచేయి పట్టుకొని "మీరింత స్వల్పవిషయానికే ఆవేశపడుతా రెందుకు? ఇక కూర్చోం"డని ఇలియావంక మిరిమిరిచూడసాగింది.

"అబ్బాయ్! నువ్వింకా చిన్నవాడివి. నువ్వు చాలా సంగతులు తెలుసుకోవాలి. ఆ మూలాగ్రంగా తెలియనిదే నోరువిప్పరా"దన్నాడు క్రాకిన్ ఇలియాతో.

"నా కా లౌక్యం తెలియదులెండి. అందువల్లనే నోటికివచ్చినట్లు వాగుతున్నాను. పెట్రుహాలాంటి దుష్టులకు

యితరులనువిచారించేఅక్కర ఎక్కడిది చెప్పండి'' అని మరింత రెచ్చగొట్టాడు.

అతిథు లొకరొకరుగా భోజనమారంభించారు. ఇలియా మాటల నెవరూ చెవినిపెట్టలా. కిరిక్ మాత్రం వానిదగ్గర చేరి "నువ్వు అష్టగాడిదలాగున్నావే! ఏమిటీ రగడ?'' అన్నాడు మెల్లిగా.

ఈ మాటల్తో ఇలియా క్రోధాంధుడయ్యాడు. కిరిక్ వంక మిరిమిరి చూచాడు. ఆచూపు కాగలేక కిరిక్ నీళ్ళు నమిలాడు. లాసినా అతిథులను "ఇంకేం కావా'' లని అడుగుతోంది. ఆమెకంఠస్వర మాలకించుటతో ఇలియాకి ఒళ్లొళ్లై తెలియకుండాపోయింది. 'ఓసిలంజ! నీకు కావాల్సింది నేను పెడతాలే' అనుకొని టేబిలుమీది మధుపాత్ర తీసి "ప్రేయసీ! రా, మన మిద్దరం కలిసి జతగా తాగితేగాని మజాగావుండదు'' అన్నాడు లాసినాతో.

అందరూ నిర్ఘాంతపోయిచూస్తున్నారు. చేతుల్లోని పదార్థాలు అట్టె వుండిపోయాయి. ఎవరికీ నోట మాట రాలేదు. ప్రతివారికి వుక్కిరి బిక్కిరై నట్టుంది.

"కిరిక్! నాతో రెండుగుక్కలు తాగమని ప్రియ లాసినాతో చెపుదూ. ఇందులో తప్పేముంది? మేమిద్దరము మనసార ప్రేమించుకున్నప్పుడు దాపరిక మెందుకు? మేము ప్రేయసీప్రియులమని నలుగురకు తెలియటమే మంచి'' దని ఇలియా వున్మాదునివలె వాగాడు.

లాసినాకు మిన్నువిరిగి మీాద పడినట్టుంది. వెర్రిగా చూస్తూ "ఓరిదుష్టా!" అని బిగ్గరగా అరిచింది.

తర్వాత బల్లమీాది పళ్లెంతీసి ఇలియాపైకి విసిరింది. అది ముందే కనిపెట్టి ఇలియా వాటంగా దెబ్బ తప్పుకున్నాడు. పళ్లెం క్రిందపడి ఖంగ్‌మనిమోగింది. ఆ గంద్రగోళంతో అతిథులందరూ లేచి ప్రక్కప్రక్కలకు తప్పుకున్నారు. కిరిక్‌మతి మతిలోలేదు. తానేమి చెయ్యాలో కూడ తోచక గ్రుడ్లుమిణకరించి చూస్తున్నాడు.

లాసినా గడగడవణుకుతోంది. అవమానభారంచే పళ్ళు కదనొక్కుకొనిపోయి నోటమాటరాక దెబ్బతిన్న పాములాగా బుసకొడుతోంది. ఆమెముఖం లావణ్యాన్ని కోల్పోయింది. పెదాలు తడారిపోయినై. పాదాలు భూమిలోకి దిగబడిపోతున్నట్టుంది. "నువ్వు శుద్ధ అబద్ధాల కోరువు. నాపైన నిందవేస్తావెందుకు?" అన్నది మెల్లిట్టో.

ఇలియా తొణుకూబెణుకూ లేకుండా "ఓశ్, వుండవోయ్! నీ సంగతంతా చెప్పేస్తా. నువ్వే నాకీ దారిని చూపించావు. ఎప్పటిలాగుంటే నే నెందుకు బయటపెట్టేవాణ్ని? నేను నీ కిప్పుడు వెక్కసమయ్యానే?" అన్నాడు.

ఎవరో మెల్లిగానవ్వారు. లాసినా నిలువునానీరయింది. ఇక నుంచోలేక కుర్చీలోకూలబడి కళ్ళుమూసుకుంది.

ఒక అభ్యాగతుడు రక్షకభటులకు కబురంపమని సలహాయిచ్చాడు. కిరిక్ ఆ అతిథివైపొకసారిమీాది ఇలియామీాది కెళ్ళాడు.

“ఏమిటి! ఎక్కడికి? ఒక్కదెబ్బతో చచ్చిపోతావు. నోరుమూసుకొని నేనుచెప్పేది విను: నా మాదిరిగా నిజాన్ని నిప్పుచెప్పేవా డింకెవడూ వుండడు; తెలిసిందా?” అని ఇలియా అదలించాడు.

కిరిక్ ఆ బెదరింపుతో జంకలా. ఇలియామీది మీదికి వస్తూనేవున్నాడు. విందుకువచ్చినవాళ్ళు గప్ చిప్ గా నిలబడి ఆ తమాషా చూస్తున్నారు. కదలడానికి మెదలడానికి ఒక్కడికీ గుండెలేదు.

ఇలియా కిరిక్ ను గద్దించుతూ మళ్ళీ అన్నాడు—

“నిన్ను నామీదికి రావద్దని చెప్పినా వినకపోయావు. నీ కర్మ; నేనేం చేస్తాను? నిజానికి నువ్వు నాకేమీ అపకారం చేసినవాడివి కాదు. పైగా నువ్వు ఒట్టి శుంఠవు. అనవసరంగా నామీదికి రాక దూరంగా పో”

అని ఇలియా తనమీదికి వస్తున్న నికోడిమిచ్ ని పిడికిలితో పొడిచాడు. అప్పుడొక గోడప్రక్కకు చేరి దండలు చరుస్తూ నుంచున్నాడు. ఒకపర్యాయం అక్కడున్న వారందరినీ కలయచూచి తర్వాత కిరిక్ నుద్దేశించి “నీ పెళ్ళాం తనకు తానై వచ్చి నా మెడకు తగుల్కుంది. నువ్వు యెంత అమాయకుడివో ఆమె అంత జాణ. ఈమెను మించిన కామాంధను, జారిణిని నే నిదివర కెక్కడా చూడలేదు. అసలు ఆమేనన్న మాటేమిటి—మీరందరూ అలాంటి

వాళ్ళే. నే నివాళ కోర్టుకెళ్ళానని చెప్పానుకదూ? అక్కడే న్యాయమైనతీర్పు చెప్పడం నేర్చుకొచ్చాను'' అన్నాడు.

ఏ విషయాన్నిగాని ఒక వరుసలో చెప్పలేకుగాని ఎన్నోసంగతులు ఇలియాబుర్రలో చెలరేగుతున్నై. పిచ్చివానిలా వాగుతున్నాడు.

''ఇందులో దోషమంతా లాసినాదేననటానికూడా వీల్లేదు. పరిస్థితులు అలా కలిసివచ్చాయి. నా జీవితంలో జరిగినవన్నీ యిలాంటి అయాచిత ఆకస్మికసంఘటనలే. ఇట్లే నేనొకతడవ హత్యకూడా చేశాను. అప్పుడు నాకు చంపాలన్న తలంపే లేదు; అయినా వాడు నా చేతుల్లో చచ్చాడు. మా జాయింటువ్యాపారంలో నేను పెట్టుబడి పెట్టిన సొమ్మా హతునిదే'' అని చెప్పి ఇలియా ఆగాడు.

కిరిక్ బిగ్గరగా ''వీనికి మెదడు చెడింది. పిచ్చెత్తిందని ఇలియాతో ''మిత్రమా! నీ దుస్థితికి నాకమిత విచారంగా వుంది సుమా!'' అన్నాడు యెంతో సంతాపపడుతున్న వాడిలాగా.

ఇలియా పక్కుమనినవ్వాడు. వానికి హృదయభారం కొంత తగ్గినట్టుగావుంది. తన హత్యాపరాధాన్ని పదిమంది ముందు చెప్పివేశానన్న తృప్తి కలిగింది. అప్పుడు ఇలియాకి గాలిలో తేలిపోతున్నట్టుగా వుంది.

లాసినా మనఃస్థితి వర్ణింప నలవికాకుండావుంది. ఇలియామతి చెడిందన్న తన పెనిమిటిమాటలతో ఆమె

కోసం చూస్తున్నారు. ఇలియా ద్వారానికడ్డంగా నిలబడి వికటాట్టహాసం చేస్తున్నాడు. అతిథులు తనకు వ్యతిరేకంగా గాని, లాసినా కిరిక్‌లకు సానుభూతిసూచకంగాగాని ఒక్క మాటైనా అనకుండటం ఇలియాకు సంతోషాన్నే కల్గించింది. ఆహూతులను బెదిరించి కంగారుపెట్టడం యిష్టంలేకగాని, కానిచో ఇలియా తెల్లవార్లూ దారికడ్డంగా నిల్చుండి లాసినా యేడ్పుముఖం చూస్తూ ఆనందించేవాడే.

"నాకు పిచ్చెత్తిందని చెపుతూన్న మాటలు నమ్మకండి. నేను అన్నీ తెలిసే మాట్లాడుతున్నాను. నేనిక్కడి నుంచి కదలదలచలేదు. మీరుకూడ ముందుకు అడుగుపెట్టేందుకు సాహసించవద్దు. ఇదిగో నా కండపుష్టి చూచారా మీలో యెవరైనా నాపైకి రావటానికి ప్రయత్నించారో వాళ్ళు హూనంచెయ్యందే వదల్ను, జాగ్రత!" అని ఇలియా చొక్కాచేతులు పైకెగదోపి పిడికిలిచూపిస్తూ "మీ జీవితా లెందుకు, తగులబెట్టనా? దమ్మిడీకి అడ్డమైన గడ్డి కరుస్తున్నారు" అన్నాడు.

"ఏయ్! నోరుసంబాళించుకొని మాట్లాడు; నేనెవర్ననుకున్నావో!" నని కిరిక్ లేని ధైర్యం తెచ్చుకొని బుకాయించాడు.

"ఛీ, ఛీ! నోరు ముయ్యి. నువ్వా ఒక మగాడివే! (అతిథులతో) ఇక్కడికొచ్చి మీరందరూ ఆనందించారు కదూ? మజాగా వుందా? పొట్టలనిండా మెక్కారు. పరస్పర

నేను ప్రకటించమన్నాను; కాని, అందులో సారమేమైనా వుంది? మీ ప్రాణానికే ముప్పుకం! నేనిప్పటివరకు శాంతియుత సచిత్ర ప్రచారాన్నే చేస్తున్నాను; కాని, నాకట్టి జీవిత చిహ్నమేమీ కనబడలేదు. దాన్ని వెతుక్కుంటూ నేనెంత ముందుకు వెళ్ళినా అంతులోతుకు దిగబడిపోయాను. ఈ సమాజంలో సచ్చీలానికి ప్రవేశమే లేదు. వాడు కుళ్ళి, చీకి అంతరించి పోవాల్సిందే. నా మట్టుకు నేను పక్కా బద్మాష్‌ని. నే నిక్కడి నాగరికతా కారబంధురమైన యినుపబోనులో వేలాది దొంగలతో వున్న మార్జాలంలా పడివున్నాను. మీరు ప్రతిభావంతులమని విర్రవీగుతున్నారు. ఇతరులను విచారించగలవారమని మిడిసిపడుతున్నారు; కాని, నిజానికి మీరు పచ్చిరక్తం తాగే క్రూరమృగాలు! మీ సావాసానికి వచ్చినవారి ప్రాణాలు తీసిగాని తృప్తిచెందరు'' అన్నాడు ఇలియా.

అప్పుడు ఇలియా మోమాకస్మికంగా చింతాక్రాంతమైంది. ఇక తానేమి చెయ్యాలా అని యోచించ సాగాడు. వాని పరధ్యానాన్ననువుగాచూచి చల్లగా ఒకడు బయటికి జారాడు. ఇలియా వెంటనే తెప్పరిలి ''అదృష్టవంతుడివి, దాటిపోయావ్‌పులే, పో'' అన్నాడు.

''పడితేనాపుతే. ఇక చూడు, నిన్నేం చేస్తామో! పోలీసులకు పట్టిస్తానుండు''మన్నాడు బయటపడిన వ్యక్తి.

''మంచిదే; పోయి త్వరగా తీసుకురావోయ్ పంద!''

అని ఇలియా వాని వంక చూస్తుండగా లాసినా వానిప్రక్కగా బయటికి తుర్రుమంది. ఇలియా ఆమెపోక డను కన్నెట్టికూడ కన్నెత్తిచూడలా. "లంజెకి తగిన శిక్షే వేశాలే" అన్నాడు.

పోలీసులకు కబురెల్లిందిగదాఅన్నధీమాతో "నోరు ముయ్యరా వెధవ!" అన్నా డక్కడున్నవారిలో ఒకడు.

ఇలియా ప్రక్కనున్న కుర్చీలో తనాయించి కూచు న్నాడు. "గుడ్లగూబలాగా కూస్తా వెందుకు? నీ కీటక్క లాడి సంగతేమి తెలుసు? నేను వీళ్ళతో కలిసివుంటున్నాను. కండలుతిరిగిన నా శరీరాన్ని చూచి లాసినా నా వెంట పడింది. రహస్యంగా నన్ను మరిగింది. (కిరిక్ ను చూపుతూ) ఈ నపుంసకుడు బయటికిపోగానే తలుపు బిగించి నా పక్కలో చేరుతూండేది. బయటి కందరూ పత్తిత్తులే! నేను మాత్రం పవిత్రుడనని చెప్పుకుంటున్నానా? పోలటోవ్ నుహత్య చేసింది నేనే. నే నా పోలటోవ్ డబ్బు నపహరించివుండబట్టే వీళ్లతో పాటు నేనూ వ్యాపారంలో పెట్టుబడి పెట్టగలిగాను." అని యేక వరసని మైమరచి వాగుతున్నాడు ఇలియా.

ఒకసారి తలెత్తి నాలుగువైపులా చూచాడు. అం దరూ తెల్లమొహాలతో వానివంకే చూస్తున్నారు. వాగి వాగి ఇలియానోరు నొప్పిగావుంది. మనసులోవున్నదంతా వెళ్ళగ్రక్కటంవల్ల హృదయం శూన్యమయింది. కిటికీగుండా బయటికి చూచాడు. ఇక జరగబోయే దేమిటన్న ప్రశ్న

నచ్చింది. అలిషేసలవేపు తిరిగి "మీ ముందు నా నేరాన్ని అంగీకరించాను గదూ. నన్ను పట్టుకోండి......నేను మిస్టర్లల్ని వెర్రికుంకల్ని చేసివేశాను కదూ?" అన్నాడు.

కిరిక్ పిస్తోలు చేతబట్టి ముందుకొస్తూ "ఇంకెక్కడికి పోతావులే. దొంగవు దొరకనేదొరికావు. పోలటోవ్‌ను హత్య చేసింది నువ్వా?" అన్నాడు.

అక్కడున్న నారీమణులు కెవ్వుమని అరిచారు. క్రాకిన్ వారికి ధైర్యంచెప్పి "మనమిక ఇక్కడ వుండ కూడదు; ఇది వారి స్వవిషయం. మనకెందుకు? మనం పోదాం పదం" డన్నాడు.

కిరిక్ అతనిమాటలను విన్పించుకోలా. ఇలియాకి పిస్తోలు గురిపెట్టి "నీకు సైబీరియాకు దారి చూపిస్తా వుండు" మని బెదరించాడు.

"అనవసర హంగామా యెందుకోయ్? నే నెక్కడికీ వెళ్ళటంలేదే. అయినా నే నెందుకు పారిపోతాను? సైబీరియా పేరు చెప్పి నన్ను భయపెట్టాలనా? ఓస్. అది నాకో లెక్కా!" అన్నాడు ఇలియా నిర్లక్ష్యంగా.

క్రాకిన్ పత్నీసమేతంగా వెళ్ళిపోయాడు. లొసినా పక్కగదిలో మంచంమీదపడి కుమిలికుమిలి యేడుస్తోంది. ఇలియాను నిరాశ చుట్టుముట్టింది. వాని కంతా అయోమయంగా వుంది. "నే నధఃపతనమైపోయాను. నా యీ స్థితికి కారకులెవ" రని తన్నుతాను ప్రశ్నించుకున్నాడు.

కిరిక్ ఇలియా కెదురుగా నిలబడి వున్నాడు. "నీ జాలి చూపులకు నేను దయతలచనులే" అన్నాడు.

ఇలియా మళ్ళీ భగ్గుమన్నాడు. కుర్చీలో లేచి కూచున్నాడు.

"ఒరేయ్ చవట! నీ జాలికోసం యిప్పు డేడ్చిందెవర్రా? అయినదానికి కానిదానికి సాటిమానవుల కెగ్గు చేసే నీబోటి తుచ్ఛు డితరులపైన దయచూపటంకూడానా? మీమీద నాకూ జాలి లేదులే. నా దృష్టిలో మీరు కుక్కలతో సమానమే. నే నిన్నాళ్ళనుంచి మీవంటి నీచులు, పరమపాతకులతో కలసివున్నందుకే దుర్గంధంగావుంది. ఏ పశువుల కాపరిగానో వుండివుంటే నాకింతకంటె శాంతిగాను, సుఖంగాను వుండేది. ఏంరా నపుంసకుడ! పోలీసులింకా రాలేదేం? ఎంత సేపు? ఏయ్ కిరిక్! నా యెదుటినుంచి పోరా. నిన్ను చూచేకొద్దీ నాలో ద్వేషాగ్ని మరి రగుల్కొంటుంది" అని ఇలియా ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు.

అతిథులొకరొకరే నిష్క్రమించారు. వాళ్ళు నక్కుతూ తారుకుంటూ ప్రక్కగాపోతుంటే నల్లని వేవో దొర్లిపోతున్నట్టుంది ఇలియాకి. వానిహృదయం మరీ శూన్యమౌతోంది.

ఉన్నట్టుండి "కిరిక్! మనమిద్దరము కుస్తీ పడదాంరా" అని ఇలియా తొడచరిచాడు.

కిరిక్ కోపంతో పళ్ళునూరుతూ "పిస్తోలుగుండుతో నీ బుర్ర యెగరగొడ్తా. ఒళ్ళు దగ్గరుంచుకొని మాట్లాడు" మన్నాడు.

అలా అన్నాడులెండి. పాపం, దయతలచి వదిలిపెట్టండి''
అని వినయపూర్వకంగా అధికారికి మనవిచేశాడు.

ఇన్స్పెక్టరు తీక్షణంగాచూచి ''ఇంత జరిగిన తర్వాత వదిలిపెట్టడం అసంభవం. నేను డైరీలో రాసేశాను. పైగా నేను వచ్చేముందే మీరిపోర్టును కమీషనరుగారికి తెలియ పర్చాను. ఇక నే నేమి చేయటానికీ వీలుకాదు. వ్యవహారం నా చెయిదాటిపోయిం'' దన్నాడు.

కిరిక్ వుస్సురని నిట్టూర్చాడు.

ఇలియా తలాడించుతూ ''కిరిక్! నీకు నా యందెంత దయ! పాపం, బలే వుదారుడివి. దెబ్బతిన్న కుక్కకూడ యిలాగే యజమానిచెయ్యి నాకుతుంది. నీ యెత్తు నాకు తెలుసులే. నేను మిమ్మల్నికూడ కోర్టుకీడ్చి అందరియెదుట నీ పెళ్లానికీ నాకూ వున్న ప్రేమ సంబంధాన్నిగూర్చి చెప్పి వేస్తే సంఘంలో తలవంపులని నీభయం; కాని, నువ్వేమీ దిగులుపడకు. నే నిక ఆసంగతి ఎత్తనులే. ఆ సంగతి తలుచు కుంటే నాకే సిగ్గుగావుంది'' అన్నాడు.

తన ప్రసక్తి రాగానే లాసినా అక్కడినుంచి వెళ్ళి పోయింది. కిరిక్ కూడ సిగ్గుపడి తలొంచుకున్నాడు.

అధికారి రాత ముగించి ''ఈ కాయితంమీద వ్రాలు చేస్తావా?'' అని ఇలియా నడిగాడు.

''ఆ, చేస్తాను. నే నన్నిటికి సిద్ధంగానే వున్నా''నని ఇలియా ఆ కాయితం తీసుకొని చదువకుండానే సంతకం చేశాడు.

ఇన్స్పెక్టరు ఇలియాను వింతగా చూస్తూ "అపరాధ మంగీకరించమని నీ ఆత్మ ప్రేరేపించిందా?" అనడిగాడు.

"అసలు నాలో ఆత్మఅనేది వుంటేగా?" అన్నాడు ఇలియా.

"వానికి పిచ్చెత్తింది, పిచ్చి!" అన్నాడు కిరిక్ తడబడే స్వరంతో.

"నీకు అరదండాలు తగిలించబోవటంలేదు. అయితే నువ్వు పారిపోయేందుకు ప్రయత్నించకేం?" అన్నాడు అధికారి.

"నేనస లెందుకు పారిపోవాలి?" అన్నాడు ఇలియా.

"ఆ సంగతి నాకేం తెలుసు? నువ్వు పారిపోనని శపథం చెయ్యి."

"నాకు దేవునియందు విశ్వాసమే లేనప్పుడు ఒట్టుతో ప్రయోజనం?" అన్నాడు ఇలియా తీవ్రంగా.

బయట అంధకారబంధురంగా వుంది. ఇలియా నలువేపులా చూచాడు. ఏమీ కన్పించటంలేదు. భూమ్యాకాశాలు కలిసిపోతున్నట్టుంది. ఇలియా పెద్దగా నిట్టూర్చి పోలీసుల ననుసరించాడు.

అంతా చీకటిమయం. రోడ్డు కిరుప్రక్కల ఎత్తయిన మేడలు, మిద్దెలు వున్నై. చితికిపోయిన రోడ్డుమీద బాడిగా వుంది. అపుడపుడు కాలుజారుతోంది. 'ఇక ముందేమి జరుగుతుం'దన్న ప్రశ్న మాటిమాటికి ఇలియా హృదయంలో రేగుతోంది.

అప్పుడు ఇలియాకళ్ల ముందు న్యాయవిచారణ దృశ్యం కనపడింది. గ్రోమోవ్ యేదో ప్రశ్నించుతూండగా పెట్రుహా తన్ను చూచి మీసాలు మెలివేస్తున్నట్టు తోచింది.

చీకట్లో పరధ్యానంగా నడుస్తున్నందుకు ఇలియా పాదానికి యెదురుదెబ్బ తగిలింది. అందుచే వాని నడక మందగించింది. బుర్రలో యేవేవో భావాలు చెలరేగుతున్నై. పెట్రుహారూపం మరొకసారి కన్పించసాగింది. అప్పుడు ఇలియాకి అడుగు ముందుకు పడటంలేదు.

"త్వరగా నడువు"మని కానిస్టేబిలు అదలించాడు.

ఆ అదలింపు ఇలియాకు తేలుకాటులా చురుక్కుమంది. వాడికత్తి తన హృదయాన్ని దూసుకొనిపోయినట్టు వాడు వ్యధచెందాడు. వాని బుర్రలో యేమి పుట్టిందో హఠాత్తుగా పోలీసుల మధ్యనుంచి తప్పించుకొని పుడాయించాడు. రక్షకభటులు వెంటబడ్డారు. ఇలియా శక్తికొద్దీ పిక్కబలంచూపుతున్నాడు. "పట్టుకోండి, పట్టుకోండి; పోనివ్వకం"డని ఇన్స్పెక్టరు వెనకనుండి అరుస్తున్నాడు.

ఇలియా యేకబిగువున పరుగుతీస్తూనే వున్నాడు; కాని, వాని కలసట కలిగినట్టుగాని, సొలివచ్చినట్టుగాని లేదు. పట్టుబడితే పెట్రుహాయెదుట చేతులుకట్టుకొని నిలబడాలన్న తలంపు వాని శక్తి నినుమడింపజేసింది. ఇంకా ముందుకు వెడితే చౌరాస్తాతగుల్తుందనీ, అక్కడ జనం వుంటారు కాబట్టి పట్టుబడిపోతాననీ దౌడు తీస్తూనే ఆలో

చించుకున్నాడు. అప్పుడొక సందులోకి తిరిగి లగూతీస్తున్నాడు. చీకటిలో కన్నుపొడుచుకున్నా కన్పించటంలేదు. వెనక-ముందు లాలోచించడానికే అవకాశంలేదు. పరుగు వేగాన్ని మాత్రం తీవ్రంచేశాడు.

ఆ సందు కొంతదూరాన ఆగిపోయింది. ఎదురుగా పెద్ద రాతిగోడ వుంది. అక్కడ అకస్మాత్తుగా ఠాంగ్‌మన్న ధ్వని వినపడింది. అంతలోనే అది గాలిలో విలీనమై పోయింది.

తరువాత కాస్సేపటికి రక్షకభటు లక్కడికి చేరుకున్నారు. వాళ్ళు పరుగెత్తుకొని వచ్చిన దూకుడులో యెంత తమాయించుకున్నా గోడమీద పడక తప్పలా; కాని, వాళ్ళు రొప్పుతూ రోజుతూ నెమ్మదిగా రావటం వల్ల ప్రమాదం లేకపోయింది. వాళ్ళు గోడకు కొట్టుకొని తమాయించుకొనేప్పటికి కాళ్ళక్రింద మానవకళేబరం తగిలింది. క్రిందికి వంగి శవంమీద చేతులువేసి చూచారు.

"గోడకు కొట్టుకొని బుర్రపగిలి చచ్చినట్టున్నాడు" అన్నాడు యింకా రొప్పుతూన్న పోలీసుల్లో ఒకడు.

రెండోవాడు జేబులో నుంచి అగ్గిపెట్టె తీసి నిప్పుల్ల వెలిగించాడు. ఇద్దరూ వంగి చూచారు. ఇలియూ శిరస్సు రక్తసిక్తమై వుంది. వానిపిడికిలి యింకా బిగించేవుంది.

"తలపగిలి మెదడు పైకి వచ్చింది" అన్నాడు రెండోవాడు.

"దేవాంతకుడులాగున్నాడు. పట్టుబడకుండానే చచ్చా" డన్నాడు మొదటివాడు.

రెండో కానిస్టేబిలు హృదయంద్రవించి అన్నాడు—
"ఇప్పుడేమనుకుంటే ఏంలాభం? పాపం! చచ్చిపోయాడు. భగవంతు డీతని ఆత్మకు శాంతిని ప్రసాదించుగాక!"

సమాప్తం.